మహాకవి కాళిదాసు కృత

# ఉత్తర కాలామృతం














- శ్రీ మహాకవి కాళిదాసు

ఓమ్ పరబ్రహ్మణేనమః,

మహాకవి శ్రీ కాళిదాస విరచితమగు

# ఉత్తర కాలామృతము

ఆంధ్ర టీకా, తాత్పర్య సహితము.

ఈ గ్రంథము

కీర్తి శేషులగు నా తండ్రి

చల్లా లక్ష్మీనృసింహశాస్త్రిగారిచే వ్రాయబడి,

వారి జ్యేష్ఠ పుత్రుడగు

## సుబ్బరాయశాస్త్రి చే

ప్రకటింపబడియె.

చల్లా రామమూర్తిశాస్త్రిగారిచే పరిష్కరితము

చంద్రికా ప్రెస్ యందు ముద్రితము

రెండవ కూర్పు

బందరు.

రిజిస్టరు కాపీరైటు)

పోస్టుఖర్చులు ప్రత్యేకము.

దీనివెల 3-0-0

# పీఠిక.

అయ్యా !

జ్యోతిషమనఁగ జ్యోతిస్సులయొక్క శాస్త్రము, జ్యోతిఃఅనఁగ ఆకాశమునందు జ్యోతించెడివి, అనఁగా ప్రకాశించెడివి, వాటినిదెలిసినందున మనకుఁ గలిగెడు ఫలమేమన త్రుటిమొదలుకొని బ్రహ్మకల్పపర్యంతముగల కాలభేదములను కొలుచుటకు ఇంకనుప్రపంచములోనుండెడి జీవులకు వెలుఁగు మొదలగునవి కలుగఁజేయుట మొదలగు కార్యములకుఁగాను గ్రహనక్షత్రాది మండలము లీశ్వరునిచే నిర్మింపబడినవి, వీటిచేతను, అహో, రాత్ర, పక్ష, మాస, ఋతు, అయన, సంవత్సరాదులేర్పడినవి,వీటివలన వేదములో విధించిన గర్భాదానాది సమస్తకర్మలకును, తదుక్తకాలములను మనము దెలిసికొనవచ్చును. మఱియు వేదాంగత్వమనఁగా, దీనికి లగధమహాముని సూత్రకారుఁడు, ఈలగధసూత్రములకు భాష్యముగూడఁగలదు. మఱియు సోమ,సూర్య, ఆర్యభట, బ్రహ్మ, రోమక, వ్యాస, పైల,వాసిష్ఠములనెడి అష్టసిద్ధాంతములను వాటి భాష్యములనుబట్టి భాస్కరాచార్యులు, మొదలైనవారుచేసినవి, యనేకములుగలవు, ఈశాస్త్రములో ముఖ్యముఁగ నాలుగుప్రమేయములుగలవు. ౧ సిద్ధాంతభాగము, ౨ జాతకభాగము, ౩ ముహూర్తభాగము, ౪ ప్రశ్నభాగము అని చెప్పఁబడినవి. వానిలో జాతకవిషయమునకు జైమిని మహాముని నాలుగు అధ్యాయములు సూత్రములుచేసిరి. ఇంకను గలవని వినియుంటిని ఇదిగాక పారాశర్యము, కారికాగ్రంథము, ఇఁక కేరళము, జాతకాభరణము, జాతకసారావళి, పూర్వకాలామృతము, ఉత్తరకాలామృతము, జ్యోతిషరత్నావళి, గ్రిహలాఘవము, నృసింహము, కాశ్యపసంహిత, వృద్ధవాసిష్ఠము, బృహజ్జాతకము, దైవజ్ఞవిలాసము, కాలప్రకాశిక, ముహూర్తదర్పణము, ముహూర్తమార్తాండము, ముహూర్త చింతామణి, ముహూర్త ప్రదర్శిని, ముహూర్తచంద్రిక, మాధవీయము, నక్షత్రకళావిలాసము, దైవజ్ఞాభరణము, మల్లినాథీయము, గణకానందము, శిష్యధీతంత్రము, ప్రకాశిక, జ్యోతిషా

భరణము, జ్యోతిషసంహిత, జ్యోతిషసారవము; ప్రిభాకరీయము, సిద్ధాంతశేఖరము, కర్ణరత్నముతిథిచంద్రిక మొదలగు జ్యోతిషగ్రంథములనేకములుగలవు. వానిలో కొన్నిగ్రంథములు ముద్రించఁబడినవి ఈజ్యోతిష గ్రంథములు నాలుగులక్షల పరిమితిగలవని జెప్పఁబడినవి. మఱియు కాళిదాసాదిమహాకవులు ముహూర్తంశములలో జాతకాంశములలోను అనేకగ్రంథములు రచియించిరి. అవన్నియు మనకులభ్యముగావున్నవి. అథవా 1, 2, గ్రింథములు మనకు లభ్యమైనను దానిని మనము పరిశోధించి ప్రిచురించుటయేలేదు. అందువలన జ్యోతిషప్రిచారము తగు సాంప్రదాయములును, మనపూర్వులకుఁ దప్ప తదితరులకు తెలియకనే పోవుచున్నవి. ముహూర్తాంశమునందును, జాతకాంశమునందును, అర్థజ్ఞానంబులేనిచో జాతకముశుభకరమైనది లేక అశుభకరమైనది, ముందుగా నెఱుంగుటకువీలుండదు. అర్థజ్ఞానము సంస్కృతపండితులకుఁదప్ప తదితరులకు సాధ్యముగాదు గదా మఱియు నామిత్రిలతో కొందరు టీకాతాత్పర్యసహితముగా నుండునటుల ఉత్తరకాలామృత గ్రింథమును ముద్రింపించుఁడని పలుమారులుదెలియపఱిచిరి. ఈగ్రంథముయొక్క ప్రయోజనమునుగుఱించి చదువరులే గ్రిహింతురుగాత, గురుసహాయము విశేషముగా కోరనక్కరలేదు. ప్రితిశ్లోకమునకును కరతలామలకముగా నుండునటుల ముందు శ్లోకము పిమ్మట టీకయును, అటుపిమ్మట తాత్పర్యమును జేర్పఁబడినవి.

బచ్చుపేట,
మచిలీపట్టణము.

ఇట్లు,
చల్లా సుబ్బరాయశాస్త్రి

# విషయసూచిక

విషయములు.


1 గ్రంథారంభము
2 జన్మకాలాదిసాధనము
3 పాదచ్ఛాయలు పగటిప్రొద్దు నిశ్చయించు విధానము
4 రాత్రిప్రొద్దు నిర్ణయము
5 జాతకనక్షత్ర ఘటికల నిర్ణయము
6 మాందిగ్రహ గుళికగ్రహసాధనము
7 ప్రసవ గృహనిర్ణయము
8 పితృస్థితప్రదేశము
9 ప్రసూతిస్థిత ద్వారాదినిర్ణయము

ద్వితీయ బిందువు.

10 పుంస్త్రీభేదము అంగవిభాగము
11 గ్రహములకు మిత్రత్వ శత్రుత్వములు
12 మేషాదిరాశ్యధిపతుల వర్ణవిభాగము
13 షడ్బలసాధనము
14 హోరాది షడ్వర్గము
15 గ్రహబల పరిమాణము
16 సప్తమవర్గముల ఫలము
17 కేంద్రఫణ పరాపోక్లిబస్థితిబలము
18 స్థానబలము
19 సమరాసులు విషమరాసులు బలము
20 గ్రహములకు షడ్బల వ్యతిరిక్త దిగ్బలములు
21 చతుర్విధ కాలబలములు
22 నతోన్నతాది హోరాబలము
23 ... చేష్టాబలము
24 గ్రహములకు దృక్ బలము

| విషయములు. | పుట. |
|---|---|
| 25 వృష్టిస్ఫుటీ కరణము | 29 |
| 26 దశలకు శుభాశుభములు | 30 |

## తృతీయ బిందువు.

| | |
|---|---|
| 27 ఆయుర్దాయ సాధనము | 32 |
| 28 అంశాయుర్దాయము | 34 |
| 29 లగ్నాయుర్దాయము | 35 |
| 30 సుకృత దుష్కృతములు | 36 |
| 31 ద్రేక్కాణాధిపతులచే ఆయుర్దాయము | 37 |
| 32 గణితాగతాయుర్దాయము | 39 |
| 33 రాశిచక్రస్థ గ్రహశుభములు | ,, |
| 34 అల్పాయుర్దాయము | ,, |
| 35 కేవల అల్పాయుర్యోగము | 40 |

## చతుర్థ బిందువు.

| | |
|---|---|
| 36 గ్రహభావ ఫలము | 41 |
| 37 రాజయోగ భంగము | 42 |
| 38 విశేషరాజయోగ తద్భంగములు | 43 |
| 39 పునరపి రాజయోగము | ,, |
| 40 అవయోగము తదపవాదము | 46 |
| 41 చక్రవర్తి యోగము | ,, |
| 42 చంద్రయోగము | 47 |
| 43 గురుశుక్ర రాహుకేతువుల సంచారములవలన యోగము | 48 |
| 44 తన్వాదిద్వాదశ భావములు పాపత్వయోగము ఫలములు | 49 |
| 45 వృద్ధియోగము | 50 |
| 46 కారకగ్రహముల వలన అనిష్టఫలములు | ,, |
| 47 రాసులకును గ్రహములకును శుభత్వము | 51 |
| 48 గురు శని కుజ శుక్రులకు బలవిశేషము | 53 |

| | విషయములు. | పుట. |
|---|---|---|
| 49 | గ్రహములకు శుభత్వము | 54 |
| 50 | శుభత్వ పాపత్వ తారతమ్యములు | 55 |
| 51 | భావఫల కారక ఫలములు | 56 |
| 52 | ఆచ్ఛాదకత్వము | ,, |
| 53 | వేధకాది సంజ్ఞామారక నిర్ణయము | 57 |
| 54 | స్వాధీన పరాధీన వేధలు | 58 |
| 55 | షష్ఠమ అష్టమాధిపతులు | 59 |
| 56 | పాపగ్రహ దుర్బలము | 60 |
| 57 | కేంద్రాది స్థానములు | 61 |
| 58 | సూర్యచంద్రులకును కుజాది గ్రహములకును | |
| 59 | జగత్కారణము విభాగములు | 62 |
| 60 | చంద్రసంబంధ యోగము | 63 |
| 61 | మఱియొక యోగము | 64 |
| 62 | ధనాధిపతుల సంబంధము | 65 |
| 63 | మఱియొక యోగము | ,, |
| 64 | దివారాత్రి కాలభేదములు | 67 |
| 65 | చరస్థిర ద్విస్వభావ రాసులు | ,, |
| 66 | గ్రహములకు శుభయోగ అవయోగములు | 68 |
| 67 | చంద్రసంబంధము విశేషయోగము | 69 |
| 68 | అష్టారూఢములు | 70 |
| 69 | అరూఢ గ్రహమువలన శుభాశుభములు | 71 |
| 70 | పుత్రభావము | ,, |
| 71 | అపత్యదోషము | 72 |
| 72 | రెండు మూడు కళత్రయోగములు | 73 |
| 73 | కళత్రభావ విశేషము | 74 |
| 74 | నష్టకళత్రాది దోషములు | 75 |
| 75 | సోదరభావము | 76 |

విషయములు. | పుట

76 అధికభాగలు పొందిన గ్రహము 77

పంచమబిందువు.

77 తనుభావ గ్రహ కారకత్వ ఖండము 80
78 ... ధనభావకారకత్వము 81
79 ... తృతీయభావము 82
80 ... చతుర్థభావ కారకత్వము 83
81 .. పంచమభావ కారకత్వము 84
82 ... షష్ఠభావ కారకత్వము 85
83 .. సప్తమభావ కారకత్వము 85
84 ... అష్టమభావ కారకత్వము 87
85 — నవమభావ కారకత్వము ”
86 — దశమభావ కారకత్వము 88
87 — ఏకాదశభావ కారకత్వము 89
88 — ద్వాదశభావ కారకత్వము ”
89 — రవికారకత్వము 90
90 — చంద్రకారకత్వము ”
91 — కుజకారకత్వము 93
92 — బుధకారకత్వము 94
93 — గురుకారకత్వము 95
94 — శుక్రకారకత్వము 96
95 — శనికారకత్వము 98
96 — రాహుకారకత్వము 99
97 — కేతుకారకత్వము 100

షష్ఠబిందువు.

98 దశాఫలఖండము. 101
99 దశావిభాగము పూర్వజన్మకర్మలు 102

| | విషయములు. | పుట |
|---|---|---|
| 100 | నక్షత్రదశా సంవత్సరములు | 103 |
| 101 | జననకాల మహాదశాశేషము | 104 |
| 102 | అంతర్దశా నిర్ణయము | 105 |
| 103 | రవిమహాదశాఫలములు | 106 |
| 104 | చంద్రమహాదశాఫలములు | 107 |
| 105 | కుజమహాదశాఫలములు | 108 |
| 106 | బుధమహాదశాఫలములు | 108 |
| 107 | గురుమహాదశాఫలములు | 109 |
| 108 | శుక్రమహాదశాఫలములు | 109 |
| 109 | శనిమహాదశాఫలములు | 110 |
| 110 | రాహుమహాదశాఫలములు | ” |
| 111 | కేతుమహాదశాఫలములు | 111 |
| 112 | నవగ్రహములకు శుభత్వములు | ” |
| 113 | రాహుకేతుల విషయమై మఱియొక యోగము | 113 |
| 114 | ” విశేషములు | ” |
| 115 | ” దోషప్రదములు | 114 |
| 116 | రాహుకేతువులకు శుభగ్రహసంబంధము | 116 |
| 117 | మహాదశ - అంతర్దశఫలము | 117 |
| 118 | ఆధిపత్యములవలన శుభములు | 118 |
| 119 | మహాదశలు - గ్రహస్థితివలన ఫలములు | 119 |
| 120 | దశాభుక్తి సాధనము | 120 |
| 121 | మారకత్వము యోగకారకత్వము - దశాఫలములు | 121 |
| 122 | గ్రహములకు దశలకు - అంతర్దశలకు సమిష్టిఫలములు | 122 |
| 123 | శనిశుక్రులకు పరస్పరదశలు | 123 |
| 124 | రవిశని పరస్పర దశాంతర్దశలు | 125 |
| 125 | కుజగురువులవలన ఫలములు | 126 |
| 126 | బుధ గురువులవలన ఫలములు | ” |

| | విషయములు. | పుట |
|---|---|---|
| 127 | సౌరసంవత్సర దశాక్రమము | 127 |
| 128 | దశాప్రమాణము | 128 |
| 129 | వర్ష దశాఫలములు | 131 |
| 130 | గురుశుక్రులకు ఫలములు | 132 |
| 131 | శనిరాహువులకు ఫలములు | ,, |
| 132 | వార్షికలగ్న దశాఫలములు | 133 |

స ప్త మ బిం దు వు.

| | | |
|---|---|---|
| 133 | నష్టజాతక సాధనము | 133 |
| 134 | ,, తాంబూలాది ప్రశ్నధ్రువాంశములు | 134 |
| 135 | ప్రశ్న నవాంశసాధనము | 135 |
| 136 | ప్రశ్న కాలంబున బృహస్పతిసంచారము తెలిసికొనుట | 136 |
| 137 | ప్రశ్న చింతాజ్ఞానము | 137 |
| 138 | స్వక్షేత్రాది గ్రహసంచారము | 138 |
| 139 | ఉచ్చాదిస్థాన స్థితిఫలములు | 139 |
| 140 | ప్రశ్న కాల పరిమితి | 140 |
| 141 | దిక్కులనుగుఱించి ఆపాఢము | 141 |
| 142 | పుష్పఫలాది ప్రశ్న ఫలము | 142 |
| 143 | చంద్రుని తెలిసికొనువిషయము | ,, |
| 144 | పృచ్ఛక చింతాజ్ఞానము | 143 |
| 145 | పిడికిటిలోనుండు వస్తువును తెలిసికొను విషయము | 145 |
| 146 | ప్రశ్న కాల పరిమితిఫలము | 147 |
| 147 | లగ్నాధిపతి కార్యాధిపతులు | 148 |

అ ష్ట మ బిం దు వు

| | | |
|---|---|---|
| 148 | గర్భాధాన కాలము | 149 |
| 149 | నిషేక కాలనిర్ణయము | 150 |
| 150 | ప్రతినిధి రజోదర్శనము | 151 |

విషయములు — పుట.

151 జననమునకు గండనక్షత్రములు-శాంతులు మొదలగునవి 152
152 త్యాజ్యకాలంబున రజోదర్శనము- జననము- తదుక్త శాంతిక్రియము 154
153 అమృతఘడియలు ఫలము 155
154 దత్తపుత్రి స్వీకారము ,,
155 వివాహమునకుముందు పందిళ్ళు వగయరాలు 156
156 శుభలేఖ వ్రాయుటనుగురించి ,,
15. శంకుస్థాపనము కూర్మచక్రి ఫలము 157
158 గృహకర్ణికా చక్రఫలము ,,
159 వృషభకలశ చక్రిఫలములు 158
160 దాసదాసీ చక్రిఫలములు 159
161 గోవృషభమహిష్యాది చక్రిశుద్ధి 160
162 అశ్వచక్రిఫలము ,,
163 గజచక్రిఫలము 161
164 శిబికా రోహిణీచక్రిఫలము ,,
165 ఛత్రిచక్రిఫలము 162
166 మంచాకార చక్రిఫలము 163
167 ధనుశ్చక్రిఫలము 164
168 రథచక్రిఫలము ,,
169 గానుగ చక్రిఫలము 165
170 చెరుకుగానుగ ,,
171 హాలచక్రిము ,, 166
172 (నౌక) ఓడచక్రిఫలము ,,
173 దీపస్తంభము-చక్రిఫలము 167
174 దిగుడుబావులు నూతులు ,,
175 స్తంభప్రతిష్ఠయొక్క ఫలము 168
176 ద్వారచక్రిఫలము ,,

| | విషయములు. | పుట |
|---|---|---|
| 177 | అగ్నిచక్రఫలము | 169 |
| 178 | పేటికా చక్రఫలము | 170 |
| 179 | గ్రామార్జ్వణము | ” |
| 180 | ఉపనయన చక్రశుద్ధి | 171 |
| 181 | భూమిలో దనశల్యాదులు తెలిసికొనుట | ” |
| 182 | నక్షత్రవిన్యాస క్రమము | 172 |
| 183 | తత్కాల రవిచంద్రసాధనము | 173 |
| 184 | రవ్యాది గ్రహదృష్టి వశాత్ఫలము | ” |
| 185 | భూమిలోనుండు భాండములు తెలిసికొనువిషయములు | 174 |
| 186 | వివాహచక్రశుద్ధి | 175 |
| 187 | వివాహమునకు యోగ్యాయోగ్య సంబంధనిర్ణయము | 176 |

గ్రంథస్థ-విషయము సమాప్తము.





గ్రంథకర్త:
చల్లా లక్ష్మీనృసింహశాస్త్రి.



ఓం పరబ్రహ్మణే నమః.

# ఉత్తర కాలామృతము.

శ్లో॥ శ్రీగౌరీప్రియనందనం సురవరం భక్తార్తినిఘ్నోద్ధతం ।
నాకేశాదిమరుద్గణార్చిత పదం నాగైకదంతోజ్వలం ।
కార్యారంభవిధౌసదా సుమనసస్సందోహ సంపూజితం ।
విఘ్నధ్యాంత సహస్రభానుమనిశంధ్యాయేకుమారాగ్రజమ్॥

శ్లో॥ వాణీసింధుకుమారికా గిరిసుతామూర్తిత్రయోద్భాసినీం ।
కేయూరాదివిభూషణోజ్వలవపుశ్శృంగార వేషోజ్వలాం ।
శ్రీచక్రాంబుజపీఠమధ్య విలసల్లీలాసురూపాన్వితాం ।
భక్తాభీష్టవరప్రదాం హృదిసదా ధ్యాయామ్యహంకాళికాం॥

శ్లో॥ ప్రాగేవాద్యదళేసమస్తముదితం సంజ్ఞాదికంవిస్తరాత్ ।
జ్ఞేయంజాతకపద్ధతిం బుధముదే౽థప్రాశ్నికంచక్రమాత్ ।
స్పష్టంసూక్ష్మతరం త్రికాలఫలదం శార్దూలవృత్తాంచితం ।
సంపద్వశ్యకరంప్రవచ్మి బహుధాకాలామృతేతూత్తరే ॥౧॥

అ॥ ప్రాగేవ= పూర్వమందే, ఆద్యదళే= మొదటి భాగమగు పూర్వకాలామృతమునందు, సంజ్ఞాదికం= నక్షత్రాదులయొక్క సంజ్ఞలు మొదలగు, సమస్తం= సర్వము, విస్తరాత్= విపులముగ, ఉదితం = చెప్పఁబడినది, అథ = అనంతరము, జ్ఞేయం= తెలిసికొనఁదగినదియు, సూక్ష్మతరం= విశేషజ్ఞానముచే గ్రహింపఁదగినదియు సంపద్వశ్యకరం= ఐశ్వర్యమును కలుగఁజేయునట్టియు, జాతకపద్ధతిం= జాతకవిధానమును, ప్రాశ్నికంచ = ప్రశ్నవిధానమును, త్రికాలఫలదం = భూతభవిష్యద్వర్తమాన కాలములయందు ఫలమునిచ్చునదిగాను, క్రమాత్ = వరుసగ, స్పష్టం = అందఱకు తెలియునట్లుగాను, బహుధా = అనేకవిధములుగ, బుధముదే = విద్వాంసుల ప్రీతికొఱకు, శార్దూలవృత్తాంచితం= శార్దూలవృత్తములతో గూడియుండునట్లుగా ఉత్తరేకాలామృతే = రెండవభాగమగు నుత్తరకాలామృతమునందు, ప్రవచ్మి = చెప్పుచున్నాను.

తా॥ మొదటిభాగమగు పూర్వకాలామృతమునందు నక్షత్రములు రాసులు గ్రహములు మొదలగువానిని గురించి సంజ్ఞాదికములన్నియు సవిస్తరముగ పూర్వమే చెప్పఁబడినవి. మరియు వివాహోపనయనాది ముహూర్తముల గురించియు చెప్పబడెను గాన యిప్పుడు సర్వజనులకు శుభాశుభఫలంబులను దెలిసికొనుట యావశ్యకమై యున్నందున దానిని తెలియజేయునట్టిదియు సూక్ష్మబుద్ధితో గ్రహింపఁదగినదియు భూతభవిష్యద్వర్తమాన కాలముల ఫలమును దెలుపునట్టియు నైశ్వర్యాది ఫలమును జనవశీకరణమును కలిగించునట్టిదియునగు జాతకభాగమును ప్రశ్నభాగమును క్రమముగ నందఱికిని సులభముగ దెలియునట్లుగాను విద్వాంసులు సంతోషించునట్లుగాను అనేకవిధములుగ రెండవభాగమగు నీయుత్తర కాలామృతమునందు శార్దూల వృత్తములతో జెప్పుచున్నానని భావము.

## జన్మకాలాది సాధన విధాన మాహ.

శ్లో॥ నాడ్యాద్యోజనుషిస్ఫుటశ్చ సమయశ్శంకోశ్చయంత్రాదిభిః। సాధ్యోహర్నిశమత్రసాయన రవేస్స్యాదిష్టకాలాదపి। ఖేటాన్ దృగ్గణితైకజాన్ స్ఫుటతరాన్ రాశ్యాదికాన్ సాధయేద్భావాన్ సంధియుతాన్ గురోస్తుకృపయా సాహ్లాదచిత్తస్సుధీః॥ ౧॥

అ॥ అహర్నిశం = రాత్రియందుగాని పగలుగాని, జనుషి = జననమందు నాడ్యాద్యః= ఘడియలు మొదలగు, స్ఫుటః= స్పష్టమగు, సమయః=కాలము, శంకోః= శంకువువల్లగాని, యంత్రాదిభిః = యంత్రములు మొదలగు వానిచేతగాని, సాధ్యః= సాధించతగినది, స్యాత్ = అగును, అత్ర= ఈవిషయమై, సుధీః=విద్వాంసుఁడు, సాహ్లాదచిత్తః= సంతోషమనస్కుడై, గురోః=గురువుయొక్క, కృపయా= దయచేత, దృగ్గణితైక్యజాన్= దృగ్గణితమువల్ల నిర్ణయింపఁబడినవియు, ఖేటాన్= గ్రహములను, స్ఫుటతరాన్ = స్పష్టమైన, రాశ్యాదికాన్ = రాసులు మొదలగు వానిని, సంధియుతాన్ = సంధులతోగూడిన, భావాన్ = భావములను, సాయన రవేః = అయనాంశలతోగూడిన సూర్యునివల్లగాని, ఇష్టకాలాదపి= తనకునిష్టమైన కాలమువల్లగాని, సాధయేత్ = నిర్ణయింపవలయును.

తా॥ రాత్రిగాని పగలుగాని జననకాలమునకు నిశ్చయమైన ఘడియ విఘడియాదులను పండ్రెండు అంగుళములు ప్రమాణముగల శంకువువల్లగాని ఘడియారాది యంత్రములచేతగాని నిర్ధారణచేయవలయును. అనంతరము అయనాంశలతోగూడిన సూర్యునివల్లగాని యిష్టకాలమువల్లగాని దృగ్గణితశాస్త్రముచే నేర్పడియున్న సూర్యాదిగ్రహములను స్పష్టమగు రాశ్యాదులను సంధులతోగూడిన భావములను విద్వాం

సుండు సంతోషచిత్తుడగుచు గురువుయొక్క దయవలన నిర్ధారణ చేయవలయును. దీనిని గురించి యిక్కడ యుదాహరణ సహితముగ మూలములో నొక చక్రము లిఖింపబడినది. దానిని మూలగ్రంథమునందు చూచుకొనవలయును.

## పాదచ్ఛాయలచే పగలు విఘడియలను నిశ్చయించు విధానము

శ్లో॥ పూర్ణాపూర్ణదినాంతరేణ గుణితంస్యాద్వాసరార్ధంగణః। సద్యోహఃపరమేదినేవిరహితోమధ్యాహ్నపాదాభవేత్॥ తాన్ పాదాన్స్వపదే విశోధ్యవరహీనాహాంతరేణాన్వితం। ఛేదాభాజితరాశి లబ్ధమథతన్నాడ్యో వినాడ్యఃక్రమాత్ ॥ 3 ॥

తా॥ పూర్ణాపూర్ణదినాంతరేణ= పూర్ణఅహఃప్రమాణమునకు, హీనఅహః ప్రమాణమునకు మధ్యనుండు భేదఘడియలచేత, వాసరార్ధకం= తత్కాలదిన ప్రమాణములో సగముగు ఘడియలను, గుణితం= హెచ్చింపగ, గణః= భాగింపc బడురాశి, స్యాత్=అగును, సద్యోహః= తత్కాలదిన ప్రమాణము, పరమేదినే= పూర్ణదినప్రమాణములో, విరహితః=తీసివేయబడగ, మధ్యాహ్నపాదాః=మధ్యాహ్న పాదచ్ఛాయలనcబడును, తాన్ పాదాన్=ఆపాదములను, స్వపదే= తన పాదచ్ఛాయ లలో విశోధ్య=తీసివేసి, వరహీనాహాంతరేణ = పూర్ణప్రమాణ అల్పప్రమాణ భేదముతో, అన్వితం=కూడ, తత్=ఆరాశిచే, అథ=అనంతరము, ఛేదాభాజితరాశి లబ్ధం = వెనుకనుంచబడిన రాశిని భాగించగ వచ్చిన లబ్ధము, క్రమాత్=క్రమముగ, నాడ్యః = ఘడియలు, వినాడ్యః = విఘడియలు, భవేయుః = అగుచున్నవి.

తా॥ అహఃప్రమాణమెంతవరకు వృద్ధియగునో యా చివరదినము పూర్ణ దినము, అహఃప్రమాణ మెంతవరకు తగ్గునో ఆ చివర దినము అపూర్ణదినము, అని చెప్పcబడెను. కాcబట్టి యీ రెండు దినములకు గల భేదము అయిదు ఘడియ లుండును. ఎట్లనగా పూర్ణదినప్రమాణము 32-30 విఘడియలు అల్పదినప్రమాణము 27-30 లు కాcబట్టి యీరెండు దినములకుగల అంతరము ౫ ఘడియలు. అందు వలన పూర్ణదిన అల్పదిన ప్రమాణఘడియలకుగల అంతరమగు ౫ ఘడియలచే తత్కాలదిన ప్రమాణఘడియలలో సగమును హెచ్చించి యొకరాశిగా నుంచవల యును. అనంతరము తత్కాలదినప్రమాణమును పూర్ణదినప్రమాణ ఘడియలలో తీసివేయగా మిగిలినవి మధ్యాహ్నపాదచ్ఛాయలని చెప్పcబడినవి. ఆమధ్యాహ్న పాదములను అప్పుడు తానువేసిన పాదచ్ఛాయలలో తీశివేసి మిగిలివ సంఖ్యలో పూర్ణా పూర్ణదివములకుగల భేదమగు ౫ ఘడియలను కలిపి యాసంఖ్యచే పూర్వమురాశిగా నుంచబడిన సంఖ్యను భాగహరించగా వచ్చిన లబ్ధము ఘడియలు విఘడియలుగా

నెఱుంగవలయును. ఇట్లు పాదచ్ఛాయలవలన పగలు జననకాల సమయమును గుర్తించవలయును. సూర్యోదయము మొదలు రెండుజాములకు లోపుగానైన యింతప్రొద్దు యెక్కినదనియు మధ్యాహ్నము మొదలు సాయంకాలము వరకునైన యెడల నింతప్రొద్దు యున్నదనియు తెలిసికొనవలయును, అదియెట్లనగా. రాత్రుల యందు నక్షత్రములవలన ప్రొద్దును తెలిసికొనవలయును అదియెట్లనగా-

శ్లో॥ ఇనభాదిశిరోభాంతం శిరోభాదినభాంతకం । సప్తోనితం ద్విగుణితం రాత్రౌతుఘటికాదికం ॥

తా॥ తాను ఏదినమందు రాత్రిప్రమాణమును ఏసమయమునందు జూడదలచునో సూర్యుడున్న నక్షత్రము మొదలు అప్పటి శిరోనక్షత్రమువఱకు లెక్కింపగా వచ్చిన సంఖ్యలో 2 తీసివేసి మిగిలిన సంఖ్యను రెండుచే హెచ్చింపగావచ్చిన సంఖ్య ఘడియలగును ఇట్లు రాత్రి రెండుయామములకులోపుగా తెలిసికొనవలయును రెండు యామములకు పిమ్మట తెల్లవారువరకు నెట్లనగా - శిరోనక్షత్రము మొదలు సూర్యుడున్న నక్షత్రమువరకు లెక్కపెట్టి పూర్వమువలెనే 2 తీసివేసి ౨ చే గుణించగా వచ్చిన సంఖ్య యిన్ని ఘడియలప్రొద్దు యున్నదని గ్రహించవలయును. ఇట్లు పగలును రాత్రియందు తెలిసికొనకొనవలెను.

## ఇతరులు చెప్పిన ఘడియల ననుసరించి వ్రాయబడిన జాతక నక్షత్ర ఘడియలను నిశ్చయించు విధము.

శ్లో॥ నాడ్యశ్చవినాడికాః కృత (౪) గుణాస్సూర్యోదయా న్నంద(౯)హృచ్ఛిష్టందస్రమఘాను రాత్రిసవకేస్యాజ్జన్మభందస్రతః। యద్వాయిష్టఘటీ స్తథా విఘటికాస్తత్త్వాశ్వి (౨౨౫) హృచ్ఛేషతో బాణేలాః (౧౫) ఖగుణాచ్చ (౩౦) బాణనిగమా (౪౫) ష్షష్టిశ్చ (౬౦) బాణాద్రయః ॥ ౨౫ ॥

అ॥ సూర్యోదయాత్ = సూర్యోదయము మొదలుకొని, నాడ్యః=ఘడియలు వినాడికాః= విఘడియలు, కృతగుణాః= నాలిగింటిచేత హెచ్చింపబడినవై, నంద హృత్= తొమ్మిదిచే భాగింపగ, శిష్టం= మిగిలినవి, దస్రమఘానురాత్ = అశ్విని మఖ మూల అనువట్టి, త్రినవకే = మూడునవకములయందును నొకదానియందు, జన్మ భం= జన్మనక్షత్రమగును, దస్రతః= అశ్విని మొదలుగా, స్యాత్ =అగును, యద్వా= అలాగుకానియెడల, ఇష్టఘటీః= తత్కాలఘడియలను, తథా= ఆప్రకారముగానే, విఘటికాః= విఘడియలను, తత్వాశ్విహృత్ - ౨౨౫ చే భాగింపగ, శేషతః= మిగి

లివవి ఘడియలలో (బాణేలాః- ౧౫ గాని, ఖగుణాశ్చ- ౩౦ గాని, బాణనిగమాః= ౪౫ గాని, షష్టిశ్చ ౬౦ గాని, బాణాద్రియః= ౭౫ గాని తీసివేయవలయును.

శ్లో॥ శుద్ధాస్తావిఘటీః క్రమాన్నరవధూ పుంస్త్ర్యాదిభేదస్స్మృతో । మాందీరాశినవాంశయోర్జన నభాచ్చంద్రక్షన్తో వావదేత్ । తత్తద్రాశివశాచ్చ సప్తమగృహాత్తత్తత్త్రికోణాచ్చవా । జన్మస్యా న్నవమాంశరాశి పవశాద్వీర్యాధికాత్తద్వదేత్ ॥ ౬ ॥

అ॥ శుద్ధాః= శేషించిన, తాః= ఆ, విఘటికాః = విఘడియలు, క్రమాత్= క్రమముగ, నరవధూపుంస్త్ర్యాదిభేదః=పురుషుఁడు, స్త్రీ= పురుషుఁడు, స్త్రీ=అను నట్టిభేదముగ, స్మృతః = చెప్పఁబడినది, మాందీరాశినవాంశయోః = మాందిగ్రహ నవాంశలయందైనను, జననభాత్ = జన్మనక్షత్రమువల్లనైనను, చంద్రర్క్షతః=చంద్ర నక్షత్రమువల్లనైనను, తత్తద్రాశివశాచ్చ= ఆయారాసులవల్లనుగాని, సప్తమగృహాత్= ఏడవరాశివల్లనుగాని, తత్తత్త్రికోణాచ్చవా = ఆయారాసులకు త్రికోణరాసులవల్లను గాని, నవమాంశరాశిపవశాత్ = నవమాంశాధిపతివల్లనుగాని, వీర్యాధికాత్ = బలముగలదానివల్ల, జన్మ= జన్మకాలము, స్యాత్= అగును, తత్ = దానిని, వదేత్ = నిర్ధారణచేసి చెప్పవలయును.

తా॥ సూర్యోదయము మొదలుకొని జన్మసమయము వరకునైన ఘడియలను విఘడియలను విఘడియలలోనికి మార్చి ఆవిఘడియలను ౪ చే గుణించి ౯ చే భాగింపఁగవచ్చిన శేషమును ౨౭ నక్షత్రములలో 3 నవకములుండును కాఁబట్టి అశ్విని గాని మఘగాని మూలగాని అనునట్టి మూడు నవకములలో నేవకమందు జన్మనక్షత్రముకలదో చూచుకొనవలయును. అదియును అశ్విని మొదలుగా లెక్కపెట్టవలయును. మఱియు ౧౫ విఘడియలకు ఒక్కొక్కనక్షత్రము వంతున నితరులుచెప్పిన సమయము వరకునుండు ఘడియలలో కలుపుటగాని తీసివేయుటగాని చేసినయెడల జన్మనక్షత్రము సరిపోవునో చూచుకొనవలయును. దీనివలన జననకాల ఘడియలను నిర్ణయించుకొనవచ్చునని యొకరి మతముకలదు. ఇదియునుగాక నింకొక విధము కలదు ఇతరులు చెప్పిన ఘడియలను విఘడియలను విఘడియలలోనికిమార్చి వాటిని ౨౨౫ చే భాగహారింపగావచ్చిన శేషమగు విఘడియలలోను ౧౫-౩౦-౪౫-౬౦ ౭౫- అనునట్టి సంఖ్యలలో సరిపోవునట్టి సంఖ్యను తీసివేసి పురుషస్త్రీ విచక్షత తెలిసికొనవలయును. అదియెట్లనగా పైన చెప్పబడిన అయిదు సంఖ్యలలో మొదటిది పురుషుడు, రెండవది స్త్రీ, మూడవది పురుషుడు, నాల్గవది స్త్రీ, ఆయిదవది పురుషుడు, అని జాతకవిషయమై నిర్ణయించవలయును. ఆవిధముగాను సరిపోనియెడల వెనుక సంఖ్యలోనికిగాని ముందుసంఖ్యలోనికిగాని జరిపి జన్మకాలమును సరిపుచ్చుకొనవలయును. మాందీగ్రహముండునట్టి రాశివల్లగాని నవాంశవల్లనుగాని జన్మరాశివల్లను

గాని చంద్రుడున్న రాశివల్లగాని మరియు నితరరాసులవల్లగాని సప్తమరాశి వల్లగాని ఆయామూల త్రికోణరాసులవల్లగాని నవమాంశాధిపతియొక్క రాశివల్లగాని యేది బలాధిక్యముగా నుండునో విచారించి లగ్న నిశ్చయము చేయవలయును.

## మాందీగ్రహానయనం గుళికగ్రహానయనంచాహ.

శ్లో॥ చారుః (౨౬) ఖారి (౨౨) జటా (౧౮) వయో (౧౪) నట (౧౦) తనూ (౬) రూపం (౨) దుమానాహతం । ఖాంగా (30) ప్తం రవివాసరాదిఘటికా స్తత్కాలభేమందజః। రాత్రేర్మానమహః ప్రమాణమహి (౮) హృత్ఖండప్రమాణం భవేదర్కాద్యశనివాస రాంతదివసే వారేశ్వరాత్ఖండపాః ॥౭॥ అంత్యాంశోహినిరీశ్వరస్తు గుళికశ్శన్యంశక స్తన్నిశో। వారేశాదిహపంచమాదిత ఆయంఖండాంతభేంశేభవేత్ । స్యాతాంమందసుతావుభౌ వతిఖలావిత్యేవమూచేముని ర్మాండవ్యః కిలయత్రతౌనివసతౌ తత్రైవహానిప్రదౌ ॥ ౮ ॥

అ॥ చారుః= ౨౬, ఖారి= ౨౨, జటా= ౧౮, వయో= ౧౪, నట= ౧౦, తనూ= ౬, రూపం= ౨, అని, రవివాసరాదిఘటికాః= ఆదివారము మొదలుకొని ఘడియలు చెప్పబడినవి. ఈచెప్పబడిన సంఖ్యలచేత, ద్యుమానాహతం= తత్కాలాహఃప్రమాణము హెచ్చింపబడినదై, ఖాంగాప్తం= ముప్పదిచేత భాగింపబడగా, తత్కాలభే = ఆలగ్నము ననుసరించిన లగ్నమునందు, మందజః = శనికుమారుడగు మాందీగ్రహముండును, రాత్రేః= రాత్రియొక్క, మానం= ప్రమాణము, అహః ప్రమాణం = పగటిప్రమాణము, అహిహృత్= ౮ చేత భాగింపబడగ, ఖండప్రమాణం= ఒక్కొక్కభాగముయొక్క ప్రమాణము, భవేత్= అగును, అర్కాద్యాశనివాసరాంతదివసే = ఆదివారము మొదలు శనివారము పర్యంతము పగటియందు, వారేశ్వరాత్ = ఆయావారాధిపతి మొదలు, ఖండపాః = భాగాధిపతులగుదురు, అంత్యాంశోహి= ఎనిమిదవ అంశమైతే, నిరీశ్వరః= అధిపతిలేనిది, గుళికస్తు= గుళికగ్రహమైతే, శన్యంశకః = శనియొక్క అంశము, తన్నిశస్తు = ఆరాత్రియందైతే, వారేశాత్= వారాధిపతి మొదలు, పంచమాదితః= అయిదవగ్రహము మొదలుగా, అయం = ఈగుళికగ్రహము, ఖండాంతభేంశః= ఖండాధిపతియై, భవేత్= అగును, మందసుతౌ= శనికుమారులగు, ఉభౌ= మాందీగుళికలిద్దరును, అతిఖలౌ= మిక్కిలి క్రూరులై, స్యాతాం= అగుదురు. తౌ= వారిరువురు, యత్ర= ఎచ్చట, నివసతౌ= ఉందురో, తత్రైవ= అచ్చటను, హానిప్రదౌ= కీడునిచ్చువారు, స్యాతాంకిల+అగుచున్నారుగదా, ఇత్యేవం= ఈప్రకారముగ, మాండవ్యః= మాండవ్యుడను, మునిః= మునీశ్వరుడు, ఊచే= చెప్పెను.

మాందీగుళిక గ్రహానయనము చెప్పుచున్నాడు. రాత్రింబవలును సమ కాల ప్రమాణముగల దినములయందు ఆదివారమునాడుదయము మొదలు ౨౬ ఘడియలకును, సోమవారమున ౨౨ను, మంగళవారమున ౧౮ న్ను, బుధవారమున ౧౪ను, గురువారమున ౧౦ ను, శుక్రవారమున ౬ న్ను, శనివారమున ౨ ను, శనిసుమారు డగు మాందిగ్రహముండును. మరియూ పగటి ప్రమాణము హెచ్చుతగ్గులుగానున్నప్పుడు అప్పటి అహఃప్రమాణముచే పైన చెప్పబడిన సంఖ్యలను హెచ్చించి 30 దిచే భాగింపవలయును. ఇట్లు త్రైరాశిక విధానముచే ఆయాకాలములయందు నిర్ణయింపవలయును. ఇకను గుళికగ్రహము నిర్ణయించుట యెట్లనగా— పగటిప్రమాణమును గాని రాత్రి ప్రమాణమునుగాని ౮ భాగములు చేయవలయును. పగటియందు గళిక గ్రహోలయనమును విచారించునప్పుడు ఆదివారము మొదలు శనివారము పర్యంతము వారాధిపతుల క్రమముగ ౭ భాగములకు ౭ గ్రహము లధిపతులగుదురు. శనిభాగమే గుళికగ్రహానయనమని చెప్పబడును. ఎనిమిదవ భాగమునకు నేగ్రహాధిపత్యములేదు కాబట్టి యాభాగము శూన్యమనుకోనవలయును. రాత్రియందు విచారించునప్పుడు ఆవారాధిపతికి నైదవగ్రహము మొదలిడి ౭ భాగములకు నేడుగ్రహము లధిపతులగుదురు. పూర్వము వలెనే శన్యంశమే గుళికయనబడును. ఇట్లు మాందీ గుళికలిరువురు శనియంశము కలవారు కాబట్టి మిక్కిలి పాపులనియును వారేభావము నందుండెదరో యాభావమునకు కీడు చేయుదురనియును మాండవ్యమహాముని చెప్పెను.

## జన్మలగ్నాత్పూతిగా గ్రహనిర్ణయ మాహ.

శ్లో॥ కర్కాజాళివణిఘ్ఘటేషు జననంచేత్ప్రాగ్గ్రహేస్యాచ్ఛిశోః సింహేవామకరేపివాయది భవేద్యామ్యేవృషేపశ్చిమే। కన్యాచాపనృయుఘ్ఘషేషు జననంచేత్స్యాదుదీచ్యాందిశి। త్యేవంలగ్ననవాంశ యోర్బలవశాత్తత్తద్గ్రహంత్వాదిశేత్ ॥ ౯ ॥

అ॥ కర్కాజాళివణిఘ్ఘటేషు = కర్కాటకము మేషము తుల వృశ్చిక కుంభ రాసులయందు, శిశోః = శిశువుయొక్క జననం = పుట్టుక, స్యాచ్చేత్ = ఆయిన యెడల, ప్రాగ్గృహే = తూర్పుగానుండు గృహమునందు, భవేత్ = అగును, సింహేవా = సింహమునందైనను, మకరేపివా = మకరమునందైనను, భవేద్య = జననమైన యెడల, యామ్యే = దక్షిణగృహమునందగును, వృషే = వృషభమునందైన యెడల, పశ్చిమే = పడమటి గృహమునందగును, కన్యాచాపనృయుఘ్ఘషేషు = కన్యధనస్సు మిధున మీనరాసులయందు, జననంచేత్ = జననమైనయెడల ఉదీచ్యాందిశి = ఉత్తర దిక్కునందు గృహంబున, స్యాత్ = ప్రసవమగును, ఇత్యేవం = ఈప్రకారముగ లగ్ననవాంశయోః = లగ్నముయొక్క నవాంశముయొక్క, బలవశాత్ = బలాధిక్యము వల్ల తత్తద్గృహంతు = ఆయాగృహమును, ఆదిశేత్ = నిర్ణయింపవలయును.

తా॥ జనన లగ్నమువలన నేదిక్కునుండెడి గృహమునందు ప్రసవించినదీ చెప్పుచున్నాడు. శిశువుయొక్క జననము కర్కటకము మేషము వృశ్చిక కుంభ రాశులయందైన యెడల తూర్పుయింటియందనియు, సింహ మకరరాశులైన యెడల దక్షిణగృహమనియు, వృషభమైనయెడల పశ్చిమగృహమనియు, కన్యధనుస్సుమిథున మీనరాశులైన యెడల నుత్తరగృహమనియు, లగ్నముయొక్కగాని దానినవాంశము యొక్కగాని బలాధికమువలన నేదిక్కునుండెడి గృహమందు ప్రసవించినది నిర్ణయించవలెను

{జన్మసమయే పితృస్థితప్రదేశం మాతు
స్సుఖాసుఖ ప్రసవంచాహ.}

శ్లో॥ లగ్నంశీతకరేనపశ్యతి చరేగ్రామాంతరేచస్థిరే। స్వగ్రామేద్వితనూదయేయదితదామార్గేపితుస్స్యాత్స్థితిః। అర్కేభాగ్యగతే ఽథవాష్టమగతేత్వేతద్భవేదన్యథా । చేన్నైవంసహితేఖలైర్యది విధౌమాతుః ప్రసూతిశ్శ్రమాత్ ॥ ౧౦ ॥

తా॥ శీతకరే= చంద్రుడు, లగ్నం= లగ్నమును, నపశ్యతి= చూడనివాడగుచుండగా, చరే= చరరాశియగుచుండగాను, పితుః=తండ్రియొక్క, స్థితిః=నివాసము, గ్రామాంతరే=అన్యగ్రామమందును, స్థిరే=స్థిరలగ్నమగుచుండగా, స్వగ్రామే=తనయొక్క గ్రామమందును, ద్వితనూదయేయది = ద్విస్వభావరాశియైనయెడల, మార్గే = మార్గమందును, స్యాత్=అగును, అర్కే=సూర్యుడు, భాగ్యగతే= నవమరాశియందును, అథవా=అలాగుకాని పక్షమందు, అష్టమగతే+అష్టమరాశిని పొందినవాడగుచుండగ, ఏతత్=పైనచెప్పబడినది, భవేత్= అగును, అన్యథాచేత్= మరియొక విధముగ నున్నయెడల, ఏవం=ఈప్రకారముగ, నభవతి=కాదు, విధౌ = చంద్రుడు, ఖలైః = క్రూరగ్రహములతో, సహితేయది = కూడియుండిన యెడల, శ్రమాత్= ఆయాసమువలన, మాతుః=తల్లియొక్క, ప్రసూతిః=ప్రసవము, స్యాత్ = అగును.

తా॥ లగ్నము చరరాశియై చంద్రుని వీక్షణము లేకున్నయెడల జననకాలమునకు తండ్రి యితరగ్రామమందుండును. స్థిరరాశియైనయెడల స్వగ్రామమందుండును. ద్విస్వభావరాశియైన యెడల మార్గమధ్యమందుండును. ఈపైన చెప్పబడిన విషయము సూర్యుడు నవమరాశియందుగాని యష్టమరాశియందుగాని యున్నయెడల జరుగును. లేని పక్షమందు జరుగదు. మరియు చంద్రుడు క్రూరగ్రహములతో కూడి యుండిన యెడల తల్లి కష్టముగా ప్రసవించును.

## { ప్రసూతి గృహస్థిత మనుష్యదీపతైల వర్తిద్వారాది నిర్ణయమాహ }

శ్లో॥ లగ్నేంద్వంతరగాః ప్రసూతి గృహగా బాహ్యేతు బాహ్యం గతా । శ్చంద్రాత్తైలమథోదయాదపి భవేద్వర్తీచ దీపో రవేః । అర్కశ్శుక్రకుజాగుమందశశి విజ్జీవాదిగీశాః క్రమాత్కేంద్రస్థాధిక వీర్యవత్ఖగదిశో ద్వారం భవేదగ్రతః ॥ ౧౧ ॥

అ॥ లగ్నేంద్వంతరగాః = లగ్నమునకు చంద్రునకు మధ్యనుండు గ్రహముల సంఖ్యాప్రకారము, ప్రసూతిగృహగాః = సూతికాగృహమందు అందరు మనుష్యులుందురు, బాహ్యంగతాః=చంద్రలగ్నములమధ్యనుండు సంఖ్యానుసారము, బాహ్యేతు=సూతికాగృహమునకు వెలుపలనుందురు, చంద్రాత్ = చంద్రునివల్ల, తైలం = చమురును, ఉదయాత్=లగ్నమువలన, వర్తీచ=వత్తియును, అథ = అనంతరము, రవేః = సూర్యునివలన, దీపః=దీపము, భవేత్ = తెలియదగినదియగును, అర్కః = సూర్యుడు, శుక్రి=కుజాః, శుక్ర=శుక్రుడు, కుజ=అంగారకుడు, ఆగు=రాహువు, మంద=శని, శశి=చంద్రుడు, విట్=బుధుడు, జీవాః= బృహస్పతి, క్రమాత్= తూర్పు మొదలు వరుసగా, దిగీశాః = దిక్పతులగుదురు, కేంద్రస్థాధిక వీర్యవత్ఖగదిశః, కేంద్రస్థ=కేంద్రస్థానమందున్న, అధికవీర్య=మిక్కిలి బలముగల, ఖగదిశః=గ్రహముయొక్క దిక్కునకు, అగ్రతః=ముందు, ద్వారం=ద్వారము, భవేత్=అగును.

తా॥ ప్రసూతి సమయమందు సూతికాగృహములో నెందరు మనుష్యులుండినదియు చమురు వత్తిదీపము మొదలగువానియొక్క వివరమును చెప్పుచున్నాడు. లగ్నము మొదలు చంద్రుడున్న రాశివరకు నెందరు గ్రహములుందురో అందరు మనుష్యులు సూతికాగృహములోనుందురు. చంద్రుడు మొదలు లగ్నమువరకు నెందరు గ్రహములుందురో అందరు మనుష్యులు సూతికాగృహమునకు వెలుపలుందురు. శుభగ్రహములనుబట్టి సువాసినీ స్త్రీలను పాపగ్రహములనుబట్టి విధవాస్త్రీలను నిర్ణయించవలయును. గ్రహముల జాతిననుసరించి స్త్రీలయొక్క జాతినికూడ చెప్పదగును. చంద్రుడు రాశిలో ప్రారంభమందేయున్న యెడల విశేషముగ చమురు కలదనియు మధ్యభాగములో నున్న యెడల సగము చమురు కలదనియు అంత్యభాగములోనున్న యెడల స్వల్పముగ చమురు కలదనియు నీప్రకారము రాశిలో భుక్తమగు భాగము ననుసరించి చమురునుకూడ తెలిసికొనవలయును. వత్తినికూడ లగ్నముయొక్క భుక్త ప్రకారము అధికము సమానము స్వల్పము అనునట్టివిషయము గ్రహించవలయును.

సూర్యుడు చరరాశియందుండెనేని దీపమును ఇటు అటుతీసుకుని వెళ్ళుచున్నారనియు, స్థిరరాశియందున్న యెడల ఒక్కచోట నేయుంచిరనియు ద్విస్వభావరాశియందున్న యెడల దీపము కదలుచున్నదనియు చెప్పవలయును. సూర్యుడు, శుక్రుడు, అంగారకుడు, రాహువు- శని- చంద్రుడు- బుధుడు- బృహస్పతి- అనునీయెనిమిదిగ్రహము లును తూర్పు మొదలగు నెనిమిదిదిక్కులకు నధిపతులగుదురు. కాబట్టి వీరిలోబలము గల గ్రహములయొక్క కేంద్రస్థానస్థితి ననుసరించి యాదిక్కునందు సూతికాగృహము నకు ద్వారము కలదని తెలిసికొనవలయును. ఇందులో కొన్ని విషయము లీగ్రంథమందులేకున్నను ఇతర జ్యోతిషగ్రంథముల ననుసరించి చెప్పబడినవి.

ఇతి కాళిదాస విరచితే ఉత్తరకాలామృతే
జన్మకాల లక్షణ విశదీకరణం నామప్రథమబిందు స్సమాప్తః.

---

## అథ ద్వితీయబిందు ప్రారంభః.

### ద్వాదశరాశ్యాత్మకచక్రస్య పురుష స్త్రీభేదేనాంగ విభాగమాహ.

శ్లో॥ సర్వేద్వాదశరాశయస్సముదితా లగ్నాదిషట్కాంతనోః। ర్యామ్యాంగంశతనో స్త్రియ స్తదిత రేషట్పో త్తరాంగంభవేత్ ।లగ్నం ప్రాణమయం శశిస్థభవనందేహస్థయో స్తత్ఫలం । భావాద్భావపతేశ్చ కారకవశా త్తత్తత్ఫలం యోజయేత్ ॥ ౧ ॥

అ॥ సర్వే= సమస్తమైన, ద్వాదశరాశయః= పండ్రెండురాసులు, సముదితాః= చక్రమునందు చెప్పబడినవి. లగ్నాదిషట్క= లగ్నము మొదలు ఆరురాసులు, తనోః= శరీరమునకు, యామ్యాంగం= పూర్వాంగముగాను, తదితరే=ఆరాసులకంటె నితరరాసులు, స్త్రియః= స్త్రీస్వరూపమగు, తనోః = శరీరమునకు, ఉత్తరాంగం= ఉత్తరాంగముగాను, భవేత్ = అగును, లగ్నం=లగ్నము, ప్రాణమయం= ప్రాణస్వరూపము, శశిస్థభవనం= చంద్రుడున్న రాశి, దేహః= శరీరము. తయోః= ఆరెండురాసులవల్లను, తత్ఫలం= ఆఫలమును చెప్పవలయును, భావాత్ = భావము వల్లను, భావపతేశ్చ = భావాధిపతివల్లను, కారకవశాత్ = కారకునివల్లను, తత్తత్ఫలం= ఆయాఫలములను, యోజయేత్= యోచింపవలెను.

తా॥ పండ్రెండురాసులుగల యీచక్రమునందు పూర్వోత్తరాంగవిభాగమును పురుష స్త్రీభేదమును చెప్పుచున్నాడు. మేషము మొదలు మీనమువరకునుంకు పం

డ్రెండురాసులును ఒకచక్రముగ జెప్పబడినది. దానిలో లగ్నము మొదలు ఆరురాసులు జాతకునకు కుడిభాగమనియు మిగిలిన యారురాసులు స్త్రీస్వరూపమైన యెడమభాగమనియు చెప్పఁబడెను. మరియు లగ్నము ప్రాణమనియు చంద్రుడున్నరాశి దేహమనియు చెప్పబడెనుగాన వాట్లవల్లను భావములవల్లను భావాధిపతివల్లను భావకారకునివల్లను ఆయాఫలములను తెలిసికొనవలెను.

{ఇక్కడ కొంత గ్రంథము వదలివేయబడినది మూలములో చూచుకొనవలయును.}

అథ గ్రహాణాం మిత్రశత్రుత్వాదికం బలసాధనత్వోపయోగిత్వేనాహ

శ్లో॥ చంద్రేజ్యావనిజాదివాకర బుధౌసూర్యేందు జీవాస్తత। శుక్రార్కారవిచంద్రభూమి తనయాజ్ఞార్కీజ్ఞశుక్రాక్రమాత్। మిత్రాణ్యుష్ణకరాత్తతస్తు రిపవోమందాసురేజ్యౌతత। శ్శూన్యంజ్ఞోవిధురేవ భార్గవబుధావాదిత్యచంద్రౌతత। స్సూర్యాదిత్రితయంక్రమాద్దినకరాదన్యేసమాస్స్యుస్తత। స్తత్కాలాచ్చనిసర్గతశ్చ ఖచరాః కల్ప్యాస్స్వధీష్టాదయః ॥ ౨ ॥

అ॥ చంద్రేజ్యావనిజాః= చంద్రగురుకుజులును, దివాకరబుధౌ=సూర్యబుధులును, సూర్యేందుజీవాః= సూర్యచంద్ర బృహస్పతులును। తతః=అనంతరము।శుక్రార్కౌ=శుక్రసూర్యులును।రవిచంద్రభూమితనయాః=సూర్యచంద్రకుజులును। జ్ఞార్కీ= బుధశనులును। జ్ఞశుక్రౌ= బుధశుక్రులును। ఉష్ణకరాత్= సూర్యుడు మొదలుకొని। క్రమాత్= క్రమముగ। మిత్రాణి= మిత్రులగుదురు। తతస్తు = అటుపిమ్మటనైతే। మందాసురేజ్యౌ= శనిశుక్రులును, తతః= అనంతరము। శూన్యం= లేదు। (అనగా చంద్రునకు శత్రువులేడు) జ్ఞః= బుధుడు। విధురేవ=చంద్రుడును।భార్గవబుధౌ=శుక్రబుధులును। ఆదిత్యచంద్రౌ= సూర్యచంద్రులును। తతః= అనంతరము। సూర్యాదిత్రితయం= సూర్యచంద్రకుజులును। దినకరాత్= సూర్యుడు మొదలుకొని। క్రమాత్= వరుసగా। రిపవః= శత్రువులు। అన్యే= ఇతరమగునవి। సమాః=సములై। స్యుః= అగుదురు। తతః= అటుపిమ్మట। తత్కాలాచ్చ = ఆయా కాలములనుబట్టి। నిసర్గతశ్చ= స్వభావమువల్లను। ఖచరాః=గ్రహములు। అధీష్టాదయః=అధిమిత్రాదులు। కల్ప్యాః= కల్పించతగినవారై। స్యుః= అగుదురు.

తా॥ బలమును సాధించుటకు నుపయోగకరమైనందువల్ల గ్రహములకు మిత్రత్వ శత్రుత్వాదికమును జెప్పుచున్నాడు. పూర్వకాలామృతలో ఒక్కొక్కగ్రహము

నకు ప్రత్యేక ప్రత్యేకముగ మిత్రులను శత్రులను సములను చెప్పియున్నాడు. ఇక్కడ సూర్యుడు మొదలు శనివరకునుండు 7 గ్రహములకు ముందుమిత్రులనుపిమ్మట శత్రువులను మిగిలినవారిని సములనియు వరుసగచెప్పియున్నాడు. అది నిర్ణయించుట యెట్లనగా- ఏకవచనముగాగాని ద్వివచనముగా గాని బహువచనముగా గాని పదము ఎంతవరకు నిలిచియుండునో అంతవరకునుండు గ్రహములనుగ్రహించవలెను. ఆనిర్ణయ ప్రకారము సూర్యునకు చంద్రగురుకుజులు, చంద్రునకు సూర్యబుధులు అంగారకు నకు రవిచంద్రగురులు, బుధునకు శుక్రసూర్యులు, గురునకు సూర్యచంద్రాంగారకులు శుక్రునకు బుధశనులు, శనికి బుధ శుక్రులు, ఇట్లు వరుసగా ముందు మిత్రులనుజెప్పి పిమ్మట శనిశుక్రులు, చంద్రునకు శత్రువులులేరు, బుధుడు, చంద్రుడు, శుక్రబుధులు సూర్యచంద్రులు, సూర్యచంద్రాంగారకులు ఇట్లు వరుసగా శత్రువులను చెప్పియు న్నాడు. ఆయాగ్రహములకు మిత్రులను శత్రువులను చెప్పగా మిగిలిన గ్రహము లను సమగ్రహములనుగా దెలిసికొనవలయును. అదియు నెట్లనగా సూర్యునకు చంద్ర గురుకుజులు మిత్రులనియు శనిశుక్రులు శత్రువులనియు చెప్పుటచే మిగిలినగ్రహము బుధుడు కాబట్టి బుధుడు సముడు. చంద్రునకు సూర్యబుధులు మిత్రులనియు శత్రు వులు లేరనియు చెప్పినందున మిగిలిన కుజగురుశుక్రశనులు సములని తెలిసికొనవల యును అంగారకునకు రవిచంద్రగురులు మిత్రులనియు బుధుడు శత్రువనియు చెప్పి యున్నందున మిగిలిన శుక్రశనులు సములని తెలిసికొనవలయును. ఈప్రకారమే మిగి లిన గ్రహములకు గ్రహించవలయును. ఇక నధిమిత్రత్వాదికము నిర్ణయించుట యెట్లనగా- తత్కాలమువల్లను నైసర్గికమువల్లను రెంటిచేతను మిత్రుడగువాడు అధి మిత్రుడనియు ఈరెంటిచేత శత్రుడగువాడు అధిశత్రువనియు నొకదానిచే మిత్రత్వము నొకదానిచే శత్రుత్వమునుగలిగియున్నవాడు సముడనియుగ్రహింపవలయును మరియు నొకదానిచే మిత్రుడు నొకదానిచేసముడునగువాడు మిత్రుడనియునొకదానిచే సముడు నొకదానిచే శత్రువునగువాడు శత్రువనియు గ్రహింపవలయును. ఇట్లు నిసర్గమిత్ర త్వాదిబలమును అధిమిత్రత్వాదిబలమును విచారించి ఫలములను చెప్పవలయును. ఈగ్రంథములో నిసర్గమిత్రత్వాదికమును జెప్పి దీనివల్లను తత్కాలమువల్లను అధిమిత్ర త్వాదికమును కల్పించవలయునని చెప్పియుండెను. అందునుగురించి యితరగ్రంథప్రమా ణము ననుసరింపవలసియున్నది. కాబట్టి వరాహమిహిరుడు దీనిని గురించి చెప్పిన దేమనగా- శ్లో॥ అన్యోన్యస్యాథనవ్యయాయ సహజవ్యాపారబంధుస్థితా । తత్కా లేసుహృదస్స్వతుంగ భవనేప్యేకేరయస్త్వన్యథా॥ అనగా ప్రతిగ్రహమునకుతత్కాల మందున్న రాశికి ౨-౧౨-౧౧- ౩- ౧౦- ౪ స్థానములయందును వాటియుచ్చస్థాన ములయందున్నవారు తత్కాల మిత్రులనియు మిగిలిన స్థానముల యందున్నవారు తత్కాల శత్రువులనియు చెప్పియున్నది. ఇందుకు నుదాహరణము సూర్యునకునంగా

శరక శుక్రులు చతుర్థస్థానమందుండిన యెడల చతుర్థస్థానమందున్నవారు తత్కాలమిత్రులని పూర్వము చెప్పబడియుండుటచే అంగారకుడు స్వభావముచేతను తత్కాలము చేతను రెండువిధములచేత మిత్రిత్వము సంభవించుటచే సూర్యునకు నధిమిత్రుడనియును శుక్రుడు స్వభావముచే శత్రువు తత్కాలముచే మిత్రుడు నగుటచే సముడనియును గ్రహింపవలయును. ఈవిధముగానే తక్కిన గ్రహములకు నధిమిత్రత్వ శత్రుత్వాదిక మును నిర్ణయించి ఫలములను విచారించి చెప్పవలయును.

## అథమేషాది రాశ్యధిపతినిర్ణయం వర్ణభాగంచాహ.

శ్లో॥ భౌమశ్శుక్రబుధేందుసూర్య శశిజాశ్శుక్రారజీవైనయో। మందేజ్యాఃక్రమశః క్రియాదిగృహపాస్స్యా దాద్యవర్గోగృహం। హోరాతస్యదళం త్రిభాగమితం ద్రేక్కాణమిత్యూచిరే। సప్తాంశోనవమస్తథార విలవస్త్రింశాంశకోవర్గజాః ॥ 3 ॥

అ॥ భౌమః=అంగారకుడు, శుక్ర=శశిజాః, శుక్ర=శుక్రుడు, బుధ=బుధుడు, ఇందు=చంద్రుడు, సూర్య = సూర్యుడు, శశిజాః=బుధుడు, శుక్రారజీవైనయః= శుక్ర=శుక్రుడు, ఆర=అంగారకుడు, జీవ=బృహస్పతి, ఐనయః=శని, ఇనుడనగా సూర్యుడు వాని కుమారుడు ఐనుడని చెప్పబడును. మందేజ్యాః మంద = శని, ఇజ్యాః=బృహస్పతి, ఈ గ్రహములు, క్రమశః=వరుసగా, క్రియాదిగృహపాః = మేషము మొదలు పండ్రెండు రాసులకును అధిపతులై, భవంతి=అగుచున్నారు, ఆద్యవర్గః= మొదటివర్గమగురాశి, గృహం= ఆయాగ్రహమునకు గృహమై, స్యాత్= అగును, తస్య= ఆరాశిలో, దళం = సగము, హోరా= హోరయని చెప్పబడును, త్రిభాగకమితం= రాశిలో మూడవ వంతును, ద్రేక్కాణమితి= ద్రేక్కాణమని, ఊచిరే= చెప్పిరి, సప్తాంశః= ఏడవభాగము సప్తాంశమనబడును, నవమః= తొమ్మిదవపాలు నవమాంశమనబడెను, తథా= ఆప్రకారముగానే, రవిలవః= పండ్రెండవ భాగము ద్వాదశాంశమనబడెను, త్రింశాంశకః= ముప్పదియవభాగము, త్రింశాంశమనబడెను, వర్గజాః= ఈయేడు నామధేయములు ఏడువర్గములవల్లను కలిగినవి.

తా॥ మేషాది పండ్రెండు రాసులకు నధిపతులను సప్తవర్గములను చెప్పుచున్నాడు. మూలములో చెప్పబడిన గ్రహముల వరుసను సూర్యుడు సింహరాశికిని, చంద్రుడు కర్కటరాశికిని, అంగారకుడు మేషవృశ్చికములకును, బుధుడు మిథున కన్యారాసులకును, బృహస్పతి ధనుర్మీనరాసులకును, శుక్రుడు వృషభ తులారాసులకును శనిమకర కుంభరాసులకును, అధిపతులు. మరియు రాశి 30 భాగములుకలది. కాబట్టి ఆరాశియంతకును ఆధిపత్యము కలిగియున్నప్పుడు వానికి గృహమని చెప్పబడును. మరియు రాశిలో సగభాగము హోరయనియు, మూడవభాగము ద్రేక్కా-

ణమనియు, నేడవభాగము సప్తాంశమనియు, తొమ్మిదవభాగము నవమాంశమనియు పండ్రెండవభాగము ద్వాదశాంశమనియు, ముప్పదియవభాగము త్రింశాంశమనియు, చెప్పబడెను. ఈయేడుపేర్లను ఏడువర్గములవల్లను కలిగినవని చెప్పబడెను.

{ అథ గ్రహాణాం స్థానాదిషడ్బలసాధనం తత్ర మాదౌ మూలత్రికోణాదీనాహ. }

శ్లో॥ సింహోక్షాజవధూ ధనుర్ధరఘటామూలత్రికోణాభిధాః। కుంభశ్చక్రమశోరవేః క్రియవృషౌనక్రాంగనాకర్కటాః। మీనస్త్రౌలి గృహంచతుంగభవనం తత్రస్థితేఖేచరే। వీర్యంరూపమితంత్వథోత్రిచరణామూలత్రికోణేబలం ॥౮॥ స్వక్షేత్రేర్ధబలం స్వమిత్రభవనేపాదం త్వధీష్టేర్ధయుః। కృచ్ఛ్రాతావష్టిమితం తదర్ధమధిశత్రావష్టమాంశస్యమే। వక్రేస్వోచ్చబలస్సవక్రసహితో మధ్యంబలంతుంగభే। వక్రేనీచబలస్స్వనీచభవనే వక్రీబలంతుంగజం ॥౯॥ ఉచ్చస్థేనయుతోర్థవీర్య మితిచేన్నీచేతుశూన్యంబలం। మిత్రైఃపాపఖగైశ్శుభై రిపుఖగైర్యుక్తోపిచార్ధం బలం। ఆశాగ్న్యష్టకరాస్తిధీషుభ నఖాస్సూర్యాల్లవాస్తుంగజా। స్తజ్జామిత్రగృహేలవా అపితథావీర్యం త్విదంరాశిజం ॥ ౬ ॥

ఆ॥ సింహో= ధటాః, సింహ= సింహము, ఉక్ష= వృషభము, అజ= మేషము, వధూ=మిథునము, ధనుర్ధర = ధనుస్సు, ఘటా = తుల, కుంభశ్చ= కుంభము, ఈయేడురాసులు, రవేః= సూర్యుడు మొదలు, క్రమశః = వరుసగ శనిపర్యంతము మూలత్రికోణాభిధాః = మూలత్రికోణరాసులని చెప్పబడుచున్నవి, క్రియవృషా= క్రియ=మేషము, వృషో=వృషభము, నక్రాంగనాకర్కటాః నక్ర=మకరము, అంగనా=మిథునము, కర్కాటాః=కర్కాటకము, మీనః=మీనము, తౌలిగృహం=తుల, ఈయేడురాసులు, రవేః=సూర్యుడు మొదలు, క్రమశః=వరుసగ యేడు గ్రహములకును, తుంగభవనం=ఉచ్చగృహములు, రవేః అనుపదము రెండు ప్రదేశములయందును చెప్పుకొనవలయును, ఖేచరే=గ్రహము, తత్ర=ఆయుచ్చస్థానమందు, స్థితే= ఉన్నదగుచుండగ, వీర్యం=బలము, రూపమితిం=సంపూర్ణముగానుండును, అథః= అనంతరము, మూలత్రికోణే=మూలత్రికోణరాసులయందుండగ, బలం=బలము, త్రిచరణాః=మూడుపాదములుగలది యగును, స్వక్షేత్రే=స్వక్షేత్రమందుండగ, అర్ధబలం= రెండువంతులుగలది, స్వమిత్రభవనే= తనమిత్రరాశియందుండగ, పాదం = నాల్గవ

వంతు బలము కలిగియుండును, అధిష్టే = అధిమిత్రక్షేత్రమందుండగ, అర్థయున్ = మరియు సగము బలము కలియుండును. అనగా 6 వీసములు బలముః శత్రౌ=శత్రు రాశియందుండగ, అష్టిమితం=పదియారవవంతుబలము, అధిశత్రౌ = అధిశత్రుస్థాన మందుండగ, తదర్థం=ముప్పదియారవపాలు, సమే=సమస్థానమందుండగ, అష్టాంశః=ఎనిమిదవవంతు బలము, వక్రీ=వక్రించిన గ్రహము, స్వోచ్చబలః = తనయొక్క యుచ్చస్థానబలము కలవాడగును, సవక్రసహితః = సవక్ర = వక్రించిన గ్రహము తోటి, సహితః=కూడినవాడు, మధ్యం=సగము, బలం=బలము, తుంగభే = ఉచ్చ రాశియందు, వక్రీ=వక్రించిన గ్రహము. నీచబలః=బలము లేనివాడగును, నీచభవనే= నీచరాశియందు, వక్రీ=వక్రించియున్న గ్రహము, తుంగజం=ఉచ్చరాశియందు కలిగిన, బలం = బలముకలవాడగును, ఉచ్చస్థేన = ఉచ్చరాశియందుండినట్టి గ్రహము తోటి, యుతః=కూడినవాడు, అర్థవీర్యం = సగము బలము కలవాడు, ఇతిచేత్= ఈలాగుచెప్పినయెడల, నీచేతు=నీచరాశియందుండగ, శూన్యంబలం= బలమేమియు లేదు, మిత్రైః=మిత్రులైన, పాపఖగైః=పాపగ్రహములతోటినిన్ని, శుభైః = శుభులను, రిపుఖగైః=శత్రుగ్రహములతోటినిన్ని. యుక్తోపి=కూడినవాడును, అర్థంబలం= సగముబలము కలవాడు, ఆశాగ్న్యష్టకరాః, ఆశ = పది, అగ్ని = మూడు, అష్టకరాః=ఇరువదియెనిమిది, తిథీషుభనఖాః, తిథి=పదిహేను, ఇషు=ఐదు, భ=ఇరువదేడు, నఖాః=ఇరువై, లవాః = భాగలు, సూర్యాత్ = సూర్యుడు మొదలు, తుంగజాః = ఉచ్చభాగలు, తజ్జామిత్రగృహే = ఆరాసులకు నేడవరాశియందు, లవాః=ఆయాభాగములు, తథా=ఆప్రకారముగ నీచభాగలగును; ఇదం=ఇది, రాశిజం=రాశివల్ల కలిగిన, వీర్యం=బలమని చెప్పబడియున్నది.

తా॥ గ్రహములకు స్థానాది షడ్బలములను జెప్పదలచి ముందు మూలత్రికోణ యుచ్చ తత్తత్స్థానబలాబలములను జెప్పుచున్నాడు. సింహము, వృషభము, మేషము మిథునము, ధనుస్సు తుల, కుంభము, ఈయేడురాసులు సూర్యుడు మొదలు వరుసగ శని పర్యంతము యేడు గ్రహములకు మూలత్రికోణకాసులై యున్నవి. మేషము, వృషభము, మకరము, మిథునము, కర్కాటకము, మీనము, తుల, ఈ యేడురాసులును, పూర్వము చెప్పినట్లు సూర్యాది యేడుగ్రహములకు నుచ్చరాసులై యున్నవి. మరియు నేగ్రహమైనను తనయుచ్చరాశియందుండగ సంపూర్ణబలము కలవాడగును, (అనగా 16వీసములు బలముకలవాడు) మూలత్రికోణరాశి యందుండిన గ్రహము 12 వీసములు బలముకలవాడగును. స్వక్షేత్రమందుండిన గ్రహము 8 వీసములు బలము కలవాడగును. మిత్రరాశియందున్న గ్రహము 4 వీసములు బలముకలవాడు, అధి మిత్రస్థానమందున్న గ్రహము 6 వీసములు బలముకలవాడు. శత్రుక్షేత్రమందున్న వాడు 1 వీసము బలముకలవాడు. అధిశత్రుస్థానమందున్నవాడు అరవీసము బలము కలవాడు. సమక్షేత్రమందున్నవాడు 2 వీసములు బలముకలవాడు. వక్రించినగ్రహ

మునకు నుచ్చరాశియందుండినట్టి సంపూర్ణబలమును, వక్రించిన గ్రహముతోగూడిన వానికి 8 వీసముల బలమును, కలిగియుండును. ఉచ్చరాశియందుండి వక్రించియున్న గ్రహమునకు బలమేమియులేదు. నీచరాశియందుండి వక్రించియున్న గ్రహమునకు 16 వీసములు సంపూర్ణబలముండును. ఉచ్చరాశియందుండిన గ్రహముతో కూడియున్న గ్రహమునకు 8 వీసములు బలముండును. నీచరాశియందున్నవానికి బలమేమియు లేదు. పాపులగు మిత్రగ్రహములతోటి శత్రులైన శుభగ్రహములతోటి కూడినవానికి 8 వీసములు బలముండును. 10-3-28-15-5-27-20 ఈ చెప్పబడిన సంఖ్యలేవికలవో సూర్యుడు మొదలు ఆయాగ్రహములకు జెప్పబడిన యుచ్చరాసులలో అన్నిభాగము పరమోచ్చభాగముగ చెప్పబడెను. మరియు, ఆయుచ్చరాశికి నేడవరాశి నీచరాశియనియు ఆనీచరాసులలో నాయాగ్రహములకైన చెప్పబడినభాగల ప్రకారము పరమనీచ భాగలనియు జెప్పబడెను. కాబట్టి యీప్రకారము ఆయాగ్రహమునకు రాశిని సంబంధించియున్నట్టి బలాబలములు మిత్రశత్రుత్వాది స్థానములవల్ల జెప్పబడినవి.

ఇత్థంరాశిబలముక్త్వా హోరాదిషడ్వర్గం తత్తదధిపతీంశ్చవక్ష్యతే.

శ్లో॥ అర్కేందోర్విషమేఽన్యథా సమగృహేహోరేఽథద్రేక్కాణకే। లగ్నేష్వంకగృహేశ్వరాశ్చర గృహేభాగ్యేశ్వరాత్స్యాస్థిరే। పుత్రేశాచ్చతఏవతు ద్వితనుభేసప్తాంశకాస్త్వోజభే। లగ్నేశాత్సమభేతు సప్తమగృహాన్నాథోనవాంశాఃక్రమాత్ ॥౭॥ మేషేసింహాగృహే ధనుష్యజనవాంశస్త్వాదిమస్తత్క్రిమా। స్త్రీనాంతంభవనాదిద్రివిలవేశా త్రింశదంశాస్త్వధో। బాణేష్వష్టనగేషవోవిషమభే భౌమార్కిసూరీందుజా। స్యుర్వ్యత్యయతస్తఏవ సమభేస్యాత్సప్తవర్గస్త్వయం। ౮ ॥

అ॥ విషమే=బేసిరాశియందు, అర్కేందోః= సూర్యచంద్రులకును, సమగృహే=సమరాశియందు, అన్యథా – దానికి వ్యతిరేకముగాను, అనగా చంద్రసూర్యులకును హోరే= హోరలగును అథ=అనంతరము, ద్రేక్కాణకే=ద్రేక్కాణవిషయమై, చరగృహే=చరరాశియందు,లగ్నేష్వంకగృహేశ్వరాః లగ్న=లగ్నాధిపతియు,ఇషు=పంచమాధిపతియు, అంకగృహేశ్వరాః=నవమాధిపతియు, స్థిరే=స్థిరరాశియందు, భాగ్యేశ్వరాత్=నవమాధిపతి మొదలుకొనియు, ద్వితనుభే=ద్విస్వభావరాశియందు, తఏవ=వారే, పుత్రేశాచ్చ = పంచ

మాధిపతి మొదలుకొనియు, స్యుః=ద్రేక్కాణాధిపతులగుదురు, ఓజ
భే= బేసిరాశియందు, లగ్నేశాత్ = లగ్నాధిపతి మొదలుకొనియు,
సమభేతు= సమరాశియందైతే । సప్తమగృహాచ్చ = సప్తమరాశ్యధి
పతి మొదలుకొనియు, సప్తాంశకాః= సప్తాంశాధిపతులగుదురు. అథ= అనంతరము,
నవాంశాః= నవాంశలు, క్రమాత్= క్రమముగ చెప్పబడును, మేషే= మేషమందును
సింహగృహే= సింహరాశియందును, ధనుషి=ధనుస్సునందును, అజనవాంశః= మేష
నవాంశము, ఆదిమః= మొదటిదియగును, తత్క్రమాత్= ఆది మొదలుకొని, మీనాం
తం= మీనరాశి పర్యంతము, భవనాధిపాః = రాశ్యధిపతులగుదురు. రవిలవేశాః=
ద్వాదశాంశాధిపతులు, భవనాదిపాత్ =లగ్నాధిపతి మొదలుకొని, స్యుః=అగుదురు,
అథ= అనంతరము, త్రింశదంశాః= త్రింశాంశలెట్లనగా విషమభే= బేసిరాశియందు,
బాణేష్వష్టనగేషవః, బాణ= అయిదు, ఇషు= అయిదు అష్ట=ఎనిమిది, నగ=ఏడు,
ఇషవః= అయిదు, ఈభాగములు, భౌమార్కిసూరీందుజాః= భౌమ=అంగారకుడు,
ఆర్కి= శని, సూరి= బృహస్పతి, ఇందుజాః= బుధుడు, శుక్రః=శుక్రుడు, ఈయైదు
గ్రహములు పైన చెప్పబడిన భాగములకు నధిపతులగుదురు. సమభే=సమరాశియందు
తఏవ=ఆగ్రహములే, వ్యత్యయతః=వ్యతిరేకముగ, స్యుః=అధిపతులగుదురు, అయం=
ఇదియే, సప్తవర్గః=సప్తవర్గమై స్యాత్ =అగును, ఇతి=ఈప్రకారము, ఆహుః=చెప్పిరి.

తా॥ వెనుక రాశి విషయమై చెప్పి యిప్పుడు హోర మొదలుకొని త్రింశాం
శము పర్యంతముగల షడ్వర్గమును వాని యధిపతులను గురించియు జెప్పుచున్నాడు.
ప్రతిరాశియును 30 భాగలుగలదిగా జెప్పబడియున్నది. కాబట్టి రాశికి రెండుహోర
లగుటచే బేసిరాశియందు మొదటి 15 భాగలకును సూర్యుడును తర్వాత 15 భాగలకు
చంద్రుడు నధిపతులగుదురు. అందువలన మొదటిది సూర్యహోర రెండవది చంద్ర
హోరయనబడును. సమరాశియం దీవిధముగానే మొదటిది చంద్రహోరయనియు
రెండవది సూర్యహోరయనియు చెప్పబడును. ద్రేక్కాణాధిపతుల విషయమెట్లన
గా- రాశిని మూడు భాగలుచేయగా చరరాశియందు మొదటిభాగమునకు లగ్నాధి
పతియు, రెండవభాగమునకు పంచమాధిపతియు మూడవభాగమునకు నవమాధిపతియు
నధిపతులగుదురు. స్థిరరాశియందు మూడుభాగలకును వరుసగా నవమలగ్న పంచమాధి
పతులును ద్విస్వభావరాశియందు మూడుభాగలకును వరుసగా పంచమ నవమలగ్నా
ధిపతులును అధిపతులగుచున్నారు. సప్తాంశల విషయమెట్లనగా- రాశినియేడుభాగలు
చేయగా బేసిరాశియందు నేడుభాగలకును లగ్నాధిపతి మొదలు వరుసగానధిపతులగు
దురు. సమరాశియందు సప్తమరాశ్యధిపతి మొదలుఏడు గ్రహములు నేడు భాగలకు
నధిపతులగుదురు. ఇక నవాంశవిధ మెట్లనగా- మేషరాశికి మేషమే మొదటినవాంశ

మగుటచే అది మొదలు ధనుస్సు పర్యంతము తొమ్మిది నవాంశములగును, పిమ్మట వృషభరాశికి మకరము మొదలు తొమ్మిది నవాంశములను లెక్కపెట్టగా కన్యారాశితో సరిపోవును. అటుపిమ్మట మిథునరాశికి నవాంశములను తులారాశి మొదలిడి లెక్కపెట్టగా మిథునముతో తొమ్మిది నవాంశములు పూర్తియగును. అనంతరము కర్కటరాశికి నవాంశప్రారంభము కర్కటరాశియే యగుటచే నదిమొదలు తొమ్మిదవనవాంశము మీనమైయుండుటచే నవాంశమునుగురించి మీనాంతమని మూలములో జెప్పబడియున్నది. అటుపిమ్మట సింహరాశికి మొదటినవాంశము తిరిగి మేషమే యైనది. ఇట్లు 4 రాసుల కొకపర్యాయము మీనాంతమగును. ఈనవాంశములను గురించి యీలెక్కననుసరించియే యితరగ్రంథములలో జెప్పబడిన విధమెట్లనగా- మేష సింహధనుస్సులకు మేషమే మొదటినవాంశముగాను, వృషభకన్యా మకరరాసులకు మకరరాశియే మొదటినవాంశముగాను, తులాకుంభమిథునరాసులకు తులయే మొదటి నవాంశముగాను, కర్కాటక వృశ్చిక మీనరాసులకు కర్కటమే మొదటినవాంశముగాను, మొదలిడి తొమ్మిదినవాంశములను లెక్కపెట్టవలయునని చెప్పిరి. ద్వాదశాంశల విధానమెట్లనగా- రాశిని పండ్రెండు భాగలుచేయగా ద్వాదశాంశలని చెప్పబడును. ఏరాశిని గురించి ద్వాదశాంశవిషయమై విచారించెదరో యారాశియధిపతియే మొదటియంశాధిపతి యగును. కాబట్టి యదిమొదలు వరుసగా పండ్రెండురాసుల యధిపతులును పండ్రెండు భాగలకు నధిపతులగుదురు. త్రింశాంశవిధ మెట్లనగా- రాశిని 30 భాగలుచేసి బేసిరాశియందు మొదటి 5 భాగలకు అంగారకుడును, అనంతరము 5 భాగలకు శనియును, అటుపిమ్మట 8 భాగలకు బృహస్పతియు, తర్వాత 7 భాగలకు బుధుడును, పిమ్మట 5 భాగలకు శుక్రుడును, త్రింశాధిపతులగుదురు. సమరాశియందైతే పైన చెప్పబడిన భాగలును గ్రహములును వ్యతిరేకముగా జూచుకొనవలయును. అనగా- 5-7-8-5-5- యీభాగలకు వరుసగా శుక్ర- బుధ- గురు- శని- కుజులు- త్రింశాంశాధిపతులగుదురు. ఈప్రకారము గృహ, హోరా, ద్రేక్కాణ, సప్తాంశ, నవాంశ, ద్వాదశాంశ, త్రింశాంశ, అనిచెప్పబడుయేడింటిని సప్తవర్గముగ జెప్పిరి. ఈసప్తవర్గములకు వర్గాధిపతులకు ముఖ్యముగ విచారించవలయును.

{ పూర్వంసప్తవర్గమధ్యే గృహబలముక్త్వాఇదానీం
హోరాదిషడ్వర్గ బలపరిమాణమాహ. }

శ్లో॥ రూపాద్యంభవనోదితం శుభబలం ప్రాగ్వద్విలిఖ్యాథత । ద్ధోరాదిష్వపిషట్సు తత్పతివశాద్దేహోక్తవీర్యార్థకం । సంలిఖ్యాథసమస్తవర్గజబలైక్యం సప్తవర్గోద్భవం । రూపాద్యంత్విదమేవవీర్యముదితంశేషేషుసప్తస్వపి ॥ ౭ ॥

అ॥ భవనోదితం = గృహమునందు జెప్పబడిన, రూపాద్యం=రూపము మొదలగు, శుభబలం = శుభబలమును, ప్రాగ్వత్ = పూర్వమువలెనే, విలిఖ్య = వ్రాసి అథ = అనంతరము, తద్ధోరాదిషు=వాటియొక్క హోరాదులగు, షట్స్వపి=ఆరింటియందును, తత్పతివశాత్ = వాటియధిపతులగు గ్రహములవలన, గేహోక్తవీర్యార్థకం, గేహ = గృహమునకు, ఉక్త = చెప్పబడిన, వీర్యార్థకం = సగము బలమును, సంలిఖ్య = లిఖించి, అథ = అనంతరము, సప్తవర్గోద్భవం = ఏడువర్గములవల్లను కలిగిన, సమస్తవర్గజబలైక్యం = అన్ని వర్గములవల్లను పుట్టినబలసముదాయమే, రూపాద్యం=రూపము మొదలగునవియని చెప్పబడును. ఇదమేవ=ఇదియే, సప్తసు= ఏడైన, ఖేటేష్వపి =గ్రహములయందును, వీర్యం = బలముగ, ఉదితం=చెప్పబడినది.

తా॥ సప్తవర్గములలో రాశిబలము పూర్వము చెప్పబడినది. యిప్పుడు హోర మొదలగు వారింటియొక్క బలపరిమాణమును సప్తవర్గబలయోగమును చెప్పుచున్నాడు. హోర మొదలగు నారువర్గములయొక్క యధిపతు లేగృహమందుందురో యాగృహమునకు పూర్వము జెప్పబడిన విధముగ నెంత బలము చెప్పబడినదో దానిలో సగమును హోరాది షడ్వర్గములయందును వాటి యధిపతులను రాసుల ననుసరించి వేరువేరుగ ప్రతిరాశికి వ్రాసికొనవలయును. ఇట్లు ప్రతిగృహమునకు గృహహోరదేక్కాణ సప్తాంశనవాంశ ద్వాదశాంశ త్రింశాంశబలములను యెవరికివారిని వేరువేరుగ వ్రాసి మొత్తము చేయగా సూర్యుడు మొదలేడుగ్రహములకును సప్తవర్గసంబంధమగు రూపాదిబలము సిద్ధించును. దీనినే యేడు గ్రహములయందును రూపాదిబలముగా జెప్పిరి. రూపాదియనగా- రూపము- విరూపము- ప్రరూపము.

{ఇక్కడ సప్తవర్గముల గురించి యుదాహరణముగ కొంత గ్రంథము మూలములో వ్రాయబడినది. అది బాహుళ్యముగనున్నందున వ్రాయలేదు దానిని మీరు చూచుకొనవలెను.}

{ ఇత్థం స్థానబలోపయోగిత్వేన సప్తవర్గబలముక్త్వా
తద్భిన్నముచ్చాది బలంవక్ష్యతే. }

శ్లో॥ నీచాత్తుంగలవాంత ముచ్చలవతో నీచాంశపర్యంతగా ।
యేంశాస్తైఖగజేందు (౧౮౦) భిఃపరిహృతారూపాదికం యత్ఫలం ।
ఆరోహేతుతదేవ భూచ్యుతమిదం ఖేటేవరోహేభవే । దావ్చంరూపదళాంఘ్రియోయది ఖగే కేంద్రాదిషుత్రిష్వపి॥ ౧౦ ॥

అ॥ నీచాత్= నీచభాగము మొదలు, తుంగలవాంతః=ఉచ్చభాగపర్యంతము, ఉచ్చలవతః = ఉచ్చభాగము మొదలు, నీచాంశపర్యంతగాః = నీచభాగము వరకు

నందునట్టి, యే= ఏ, అంశాః= భాగలుకలవో, తే= ఆభాగలు, ఖగ దేంయుభిః= నూటయెనభైచేత, పరిహృతాః = భాగహరింపబడినవై, రూపాదికం = రూపము మొదలగు, యత్ఫలం = ఏలబ్దమువచ్చునో, తదేవ=అదియే, ఆరోహే= ఆరోహణ మందు, భవేత్= అగును. ఖేటే=గ్రహము, అవరోహే = అవరోహముగ నున్న దగుచుండగ, ఇదం=ఈరాబడిన రూపాధిలబ్ధము, భూమ్యుతం=ఒకరూపములోనుంచి తీసివేయబడగ, ఔచ్చం = ఉచ్చసంబంధమగు బలము, భవేత్ = అగును, ఖగే= గ్రహము, కేంద్రానిషు= కేంద్రము మొదలగు, త్రిష్వపి=మూడురాసులయందును, రూపదళాంఘ్రియః= రూప= ఒకరూపము, దళ= దానిలోసగము, అంఘ్రియః= నాల్గవవంతు, బలముగనుండునని చెప్పిరి.

తా॥ స్థానబలమునకు నుపయోగమగుటచే సప్తవర్గబలమునుజెప్పి దానికంటె వేరుగానుండు ఉచ్చ మొదలగు బలములను జెప్పుచున్నాడు. గ్రహము పరమ నీచ భాగము నతిక్రమించినది మొదలు పరమోచ్చభాగమునొందువరకు నుండు 6రాసులు ఉచ్చసంబంధమైనవి. దీనినే యారోహణఖండమనిరి పరమోచ్చభాగము మొదలు పరమనీచభాగమును గ్రహమునొందువరకునుండు 6 రాసులు నీచస్థితిలోచేరినవి కాబట్టి అవరోహణఖండమనిరి. ఇట్లు ఆరోహణమందుగాని యవరోహణమందుగాని గ్రహ మెన్ని రాసులు యెన్ని భాగలు లిప్తలు భుక్తమగునో యారాసులకు భాగలుచేసి యాభాగలలో క్రిందిభాగలుకూడి యామొత్తమగు భాగలను ౧౮౦ చేత భాగింపగ వచ్చినలబ్ధము రూపముగ నుంచుకొని మిగిలిన శేషమును ౬౦ చే హెచ్చించి క్రింది లిప్తలతోగూడి తిరిగి ౧౮౦ చే భాగింపగవచ్చిన లబ్ధమును విరూపముగ నుంచుకొని మిగిలినశేషమును పూర్వమువలెనేచేసి ప్రరూపాదులను తీసికొనిరావలయును. ఈరూ పాదికము గ్రహమునకు ఆరోహణస్థితియందుచ్చబలమని చెప్పబడును. అవరోహణ మందు ఈవిధముగానే రాబడిన రూపాదిలబ్ధమును ఒకరూపాదిలో తీసివేయగా మిగి లిన శేషమును రూపాదియుచ్చ స్థానబలమని తెలిసికొనవలయును. (దీనియుదాహరణ మునుగురించి మూలములో కొంతవ్రాయబడినది. దానిని చూచుకొనవలయును) కేంద్రాదిస్థాన బలమెట్లనగా- గ్రహము కేంద్రస్థానమందుండగా రూపబలము. అనగా పూర్ణబలము. పణపరస్థానమందుండగా దానిలో సగబలము ఆపోక్లిబస్థాన మందుండెనేని నాల్గవవంతు బలమనియుడిరి. కాబట్టి యీవిధముగ ఉచ్చనీచాదిబల మును ఆపోక్లిబపణ పరస్థానాది స్థితిబలములను విచారించి నిర్ధారణచేసికొనవలయును.

## సమ విషమరాశ్యాది బలాన్యాహ.

శ్లో॥ యుగ్మర్క్షాంశగయోస్సితాంబుధిభువోపాదం బలంవ్యత్యయా। దన్యేషాంప్రథమేన్నృణాంహి ఖగయోస్త్రీక్లీబయోర్మధ్యమే।

అంతేపాదమితం వధూఖచరయో ర్ద్రేక్కాణకేస్యాద్బలం । పంచా
నామపియోగత స్సముదితంచాద్యం ద్విదంస్థానజం ॥ ౧౧ ॥

అ॥ యుగ్మగ్రాంశగయోః= సమరాసులయందును సమరాశియంశల యందు నున్నట్టి సితాంబుధిభువోః= సిత= శుక్రునకు, అంబుధిభువోః= చంద్రునకును, వ్యత్యయాత్= వ్యతిరేకమువల్లను, అనగా బేసిరాశి బేసిరాశియంశలయందునున్నట్టి, అన్యేషాం=ఇతరగ్రహములకును, పాదం=నాల్గవవంతు, బలం=బలము, స్యాత్ = అగును. ప్రథమే = మొదటిదియగు, ద్రేక్కాణకే = ద్రేక్కాణమునందు, నృణాం = పురుషగ్రహములకును, మధ్యమే= నడిమిదియగు, ద్రేక్కాణకే= ద్రేక్కాణమునందు, తత్క్లీబయోః ఖగయోః= వాటిలో నపుంసకగ్రహములకును, అంతే= చివరిదియగు, ద్రేక్కాణకే=ద్రేక్కాణమునందు। వధూఖచరయోః= స్త్రీగ్రహములకును, పాదమితం= నాల్గవవంతు, బలం=బలము, స్యాత్ = అగును, ఆద్యం = మొదటిదగు, ఇదం=ఈ, స్థానజం=స్థానమువల్ల కలిగిన, బలం=బలము, పంచానామపి = అయిదింటియొక్క యోగతః= కూటమివల్లను, సముదితం= చెప్పబడినది.

తా॥ సమబేసి రాసులయందును వాటిని వాంశలయందును ద్రేక్కాణముల యందున్నట్టి గ్రహములయొక్క బలమును జెప్పుచున్నాడు. శుక్రుడు చంద్రుడు సమరాసులయందును సరివాంశలయందు నున్నప్పుడు నాల్గవవంతు బలమునిచ్చెదరు. వీరుభయులున్నట్టి రాశియు అంశయు సరిసంఖ్యగలవియే యైనయెడల రెండుపాతికలు సగమగును కాబట్టి అర్థబలము నిచ్చెదరు. మిగిలినవారనగా సూర్యఅంగారక బుధ బృహస్పతి శనులు బేసిరాసులయందును బేసినవాంశలయందు నుండిరేని వేరువేరుగా నాల్గవవంతు చొప్పున బలమునిచ్చెదరు. ఇట్లు రాశ్యంశల బలము చెప్పబడినది. ఇక ద్రేక్కాణబల మేతీరుననగా- ప్రతిరాశికిని మూడు ద్రేక్కాణములు కలవు. కాబట్టి మొదటిద్రేక్కాణమునందు పురుషగ్రహములు అనగా సూర్య అంగారక బృహస్పతులు ముగ్గురు నున్నయెడల నొక్కొకరికి పాతికవంతున బలమును చూచుకొనవలయును. ఈవిధముగానే రెండవ ద్రేక్కాణమునందు నపుంసకగ్రహములగు బుధ శని లిరువురును మూడవద్రేక్కాణమునందు స్త్రీగ్రహములగు శుక్ర చంద్రు లిరువురుండిరేని వారికి వేరువేరుగా పాతికబలమువంతును చూచుకొనవలయును ఈవిధముగ ద్రేక్కాణబలము చెప్పబడెను. ఇట్లు యిదివరలో జెప్పబడిన సప్తవర్గబలము ఒకటి ఉచ్చబలము రాశ్యంశబలము కేంద్రాదిబలము ద్రేక్కాణబలము ఈయైదింటియొక్క కూటమిగలబలమే రూపాదిస్థానబలమగును. ఇదియే మొదటిదియగు స్థానబలమని చెప్పబడెను.

అథ గ్రహాణాం షడ్బలవ్యతిరిక్తం ద్వితీయమేకవిధం దిగ్బలమాహ.

శ్లో॥ జేజ్యౌలగ్నగతౌనిశాకర భృగూబంధౌస్మరేత్వర్కజో॥

భౌమార్కౌదశమేతు దిగ్బలమిదంప్రాగాది దిక్షుస్మృతం। తత్తత్స
ప్తమగే ఖగేనకిమపి త్రైరాశికాదంతరే। తత్తద్వీర్యఫలం స్వదిక్షు
ఖచరస్తాదృగ్విధంకారయేత్ ॥ ౧౨ ॥

అ॥ జ్ఞేజ్యౌ—బుధబృహస్పతులు, లగ్నగతౌ = లగ్నమందుండిరేని, నిశాకర భృగూ=చంద్రశుక్రులు, బంధౌ=నాల్గవస్థానమందున్నను, అర్కజః—శని, స్మరే= సప్తమస్థానమందున్నను, భౌమార్కౌ=అంగారకసూర్యులు, దశమే = దశమమందున్నను, దిగ్బలం = దిగ్బలమని చెప్పబడుచున్నది. ఇదం=ఈదిగ్బలము, ప్రాగాది దిక్షు=తూర్పు మొదలగు నాలుగు దిక్కులయందు, స్మృతం=చెప్పబడినది, ఖగే = గ్రహము, తత్తత్సప్తమగే=ఆయాస్థానములకు యేడవస్థానమందుండగా, కిమపి = ఏమియును, న= లేదు, అంతరే = ఈరెండుస్థానములకు మధ్యనుండగ, త్రైరాశికాత్=త్రైరాశికమువలన బలమును నిర్ణయించవలయును, ఖచరః = గ్రహము, తత్తద్వీర్యఫలం=ఆయాదిక్కుల సంబంధమగు ఫలమును, స్వదిక్షు = తమదిక్కులయందు, తాదృగ్విధం=ఆ బలానుసారముగ, కారయేత్=చేయును.

తా॥ గ్రహములకు దిగ్బలమును నిర్ణయించుట యేతీరుననగా-జన్మలగ్నమందైనను ప్రశ్నలగ్నమందైనను బుధుడుగాని బృహస్పతిగాని యుండిరేని వారు దిగ్బలము వలన సంపూర్ణబలము గలవారగుదురు. ఈప్రకారముగానే శుక్రచంద్రులు చతుర్థస్థానమందున్నను, శనిసప్తమస్థానమందున్నను, సూర్యాంగారకులు దశమస్థానమందున్నను, దిగ్బలమువందు సంపూర్ణబలము గలవారగుదురు. ఏభావమందేగ్రహము దిగ్బలమునందు సంపూర్ణబలము గలవాడని చెప్పబడెనో ఆగ్రహము ఆభావమున కేడవస్థానమందున్న యెడల దిగ్బలములేనివాడగును. లేక పూర్ణబల శూన్యబలస్థానములకు మధ్య నాగ్రహముండెనేని పూర్వముచ్చస్థాన బలమును సాధించుటకు చెప్పినట్లుగా త్రైరాశికవిధానముచే దిగ్బలమును రూపాదిగా సాధించవలెను. ఈ విధముగా నన్ని గ్రహములకు రూపాది దిగ్బలమును సాధించవలయును (ఇందును గురించి గ్రంథములో నుదహరణము వ్రాయబడినది దానిని మీరు చూచుకొనవలయును. దానిని నేను వ్రాయక వదలివేసినాను.)

{అథ షడ్బలభేదః తృతీయం క్రమాత్పక్షజాహోరాత్రి
జనతోన్నత పక్షేశాదిబలాఖ్యం చతుర్విధంకాలబలమాహ.}

శ్లో॥ శుక్లేయాతదినేషుసౌమ్య ఖచరాస్స్యుర్వీర్యవంతోశుభా
శ్చైషేసుద్విగుణంవిధో రసితకేచేదన్యథాపక్షజం। మధ్యాహ్నేరవి
రేవచాస్తసమయే మందోనిశానాయకః। ప్రాగ్రాత్రౌబలవాన్నిశా
ర్ధసమయే శుక్రోనిశాంతేకుజః ॥ 3 ॥

శ్లో॥ జ్ఞఃప్రాతస్సతతంబలీ సురగురు స్త్వేత త్తహోరాత్రిజం।
నాడ్యాద్యంద్విగుణం నతంఖరసహృద్రూపాద్యమోజోభవేత్ ।తద్రూ
పచ్యుతమున్నతో ద్ధితబలంచంద్రారమందానతే। సూర్యజ్ఞామరపూ
జ్యదైత్య గురవోవీర్యాన్వితాశ్చోన్నతే॥ ౧౮॥

అ॥ శుక్లే=శుక్లపక్షమునందు, యాతదినేషు=గడచిన దినములయందు, సౌమ్యఖచరాః = సౌమ్యగ్రహములు, శేషేషు = మిగిలిన దినములయందు, అశుభాః = పాపగ్రహములును, వీర్యవంతః=బలముగలవై, స్యుః=అగుచున్నవి, అసితకేచిత్ = బహుళపక్షమునందైతే, అన్యథా = చెప్పినదానికి వ్యతిరిక్తముగ, పక్షజం=పక్షమువల్ల కలిగిన బలముండును, విధోః = చంద్రునకు, ద్విగుణం= ఆపక్షబలము రెట్టింపుగానుండును, రవిః=సూర్యుడు, మధ్యాహ్నే=మధ్యాహ్నసమయమందును, అస్తమయే=సాయంకాలమునందు, మందః=శనియును, ప్రాగ్రాత్రౌ = పూర్వరాత్రియందు, నిశానాయకః=చంద్రుడును, నిశార్ధసమయే = అర్ధరాత్రియందు, శుక్రః=శుక్రుడును, నిశాంతే=తెల్లవారుజామున, కుజః=అంగారకుడును, ప్రాతః=ఉదయకాలమునందు, జ్ఞః = బుధుడును, బలవాన్ = బలముకలవాడగును, సురగురుః=బృహస్పతి, సతతం=ఎల్లప్పుడును, బలీ=బలముకలవాడగును, ఏతత్=ఇది, అహోరాత్రిజం=పగటియందు రాత్రియందు కలిగిన బలము, నాడ్యాద్యం=గడియలు మొదలైన, నతం=నతమును, ద్విగుణం=రెట్టింపుచేసి, ఖరసహృత్ 60 చేత భాగింపబడినదగుచు, రూపాద్యం = రూపము మొదలగు, ఓజః=బలము, భవేత్ = అగును, తత్=ఆనతబలము, రూపచ్యుతం=రూపమునుండి తీసివేయబడినదై, ఉన్నతోద్ధితబలం ఉన్నత = ఉన్నతి వలన, ఉద్ధిత = పుట్టినటువంటి, బలం = బలమగును, నతే=నతమునందు, చంద్రారమందాః=చంద్ర=చంద్రుడు, ఆర=అంగారకుడు, మందాః=శనియును, ఉన్నతే=ఉన్నతమందు, సూర్యజ్ఞాసుర పూజ్యదైత్య గురవః, సూర్య=సూర్యుడును, జ్ఞః=బుధుడును, అసురపూజ్య=బృహస్పతియును, దైత్యగురవః=శుక్రుడును, వీర్యాన్వితాః=బలముకలవారలై, భవంతి=అగుచున్నారు.

తా॥ గ్రహములకు కాలబలమును నాలుగువిధములుగా జెప్పుచు దానికి నుపయోగకరమగు నతోన్నతాది కాలబలమును జెప్పుచున్నాడు. జననకాల సమయము శుక్లపక్షములోనైన యెడల గడచిన దినములయందు శుభగ్రహములును మిగిలియున్న దినములయందు పాపగ్రహములును బలముకలవారలగుదురు. బహుళ పక్షములో జననమైన యెడల దీనికి వ్యతిరిక్తముగ జూచుకొనవలయును. అనగా శుక్లపక్షములో జనన సమయమునకు పాడ్యమి మొదలు గతించిన తిథులు గడియలు మొదలగు వాటియందు శుభులైన బృహస్పతి శుక్రుడు పూర్ణచంద్రుడు పాపగ్రహముతో కలియని బుధుడు బలముకలవారలగుదురు. పౌర్ణమి పర్యంతము మిగిలి

యున్న శుక్లపక్ష తిథులందు పాపులగు క్షీణచంద్రుడు పాపులతో కలిసియున్న బుధుడు శని సూర్యుడు అంగారకుడును బలము కలవారలగుదురు. బహుళపక్షములో బహుళ పాడ్యమి మొదలు జనన కాలసమయము వరకు పూర్వము జెప్పబడిన పాపగ్రహములును జననకాల తిథిమొదలు అమావాస్య పర్యంతము మిగిలియున్న తిథులయందు శుభగ్రహములును బలముకలవారలగుదురు. శుక్లపక్షములో గడిచిన తిథ్యాదులను 15 చే భాగింపగ రూపాదిలబ్ధమగును. అదియే శుభగ్రహములకు పక్షబలమగును. ఆప్రకారముగానే మిగిలిన తిథులను 15 చే భాగింపగ రూపాదికమువచ్చును. అదియే పాపగ్రహములకు పక్షబలము. బహుళములో జననకాల తిథికి పూర్వతిథులయందు పాపగ్రహములకును మిగిలియున్న తిథులయందు శుభగ్రహములకును రూపాదికము పక్షబలమగును. చంద్రునకు రాబడిన రూపాదిబలమును రెట్టింపు చేయవలయును. ఎందువల్లననగా- చేష్టాబలము చంద్రునకు పక్షబలముతో సమానమైనదిగానేయుండును. కాబట్టి యిచ్చట రెట్టింపుచేయుమనిచెప్పెను. అందువల్ల ముందు చేష్టాబలముచంద్రుని విషయమై విచారింపనక్కరలేదు. మరియు శుభులకుగాని పాపులకుగాని మొదట తీసికొనిరాబడిన రూపాదిబలమును ౧ రూపములో తీసివేయగా రాబడినది రెండవతరగతివారియొక్క బలమగును. ఇకను అహోరాత్రిబలమెట్లననగా పగటి ప్రమాణమును మూడుభాగములుచేయగా మొదటి భాగమందు బుధుడును రెండవభాగమునందు సూర్యుడును, మధ్యాహ్నము పిమ్మట మూడవభాగమందు శనియును, బలముకలవారలగుదురు. ఆప్రకారముగానే రాత్రిప్రమాణమును మూడు భాగములు చేయగా మొదటిభాగమగు పూర్వరాత్రియందు చంద్రుడును, అర్థరాత్రియగు రెండవ భాగమునందు శుక్రుడును, మూడవభాగమగు తెల్లవారుజామున కుజుడును, బలముకలవారలగుదురు. బృహస్పతిమాత్రము పగటియందును రాత్రియందు నెల్లప్పుడును బలముకలవాడే యగును. ఇది అహోరాత్రి సంబంధమగు బలము. ఘడియలు మొదలగు నతమును రెట్టించి 60 చే భాగింపగ రాబడిన లబ్ధము రూపాదినతబలమగును. ఆనతబలమును ఒకరూపములో నుండి తీసివేయబడినది యున్నతమువల్ల కలిగిన బలముగానగును. నతమునందు చంద్రుడు అంగారకుడు శనియును ఉన్నతమునందు సూర్యుడు బృహస్పతి బుధుడు శుక్రుడును బలముకలవారలగుదురు.

నతోన్నతాది బలవివేచనంచ హోరాదిబలం విశదీకృత్యవక్ష్యతి.

శ్లో॥ నాడ్యస్స్యుర్నతసంజ్ఞికా దినదళాన్నిశ్యర్థపర్యంతగా ।
స్తద్వద్రాత్రిదళాత్తదాదినదళం నాడ్యాదికంచోన్నతం । త్రింశచ్ఛిద్ధ
నతోన్నతేచ భవతస్తేన్యేక్రమాత్కాలజే । వీర్యేయంత్రిలవాదికేచ
గదితం త్వాద్యేదళేవిస్తరాత్ ॥ ౧౫ ॥ వర్షేశశ్చసమాసపోదినపతిస్త
త్కాలహోరేశ్వరో । వీర్యాఢ్యాశ్చరణోత్తరం సమయజంయోగశ్చ

తుర్ణాంబలం। స్వేష్టాస్తాఘటికాః కరై ర్వినిహతా బాణైరవాప్తా గతా ।
వారేశాద్రవిశుక్రవిద్విధుశనీజ్యారాస్తు హోరాధిపాః ॥ ౧౬ ॥

అ॥ దినదళాత్ = పగలు రెండుజాములనుండి, నిశ్యర్థపర్యంతగాః = రాత్రి రెండుజాముల పర్యంతమునుండు, నాడ్యః = ఘడియలు, నతసంజ్ఞికాః = నతమనెడు పేరుగలవి యగును, తద్వత్ = ఆప్రకారముగానే, రాత్రిదళాత్ = రాత్రి రెండు జాములనుండి, ఆదినదళం = పగలు రెండుజాములవరకునుండు, తత్ = ఆ, నాడ్యాదికం = ఘడియలు మొదలగునవి, ఉన్నతం = ఉన్నతసంజ్ఞకలవియని చెప్పబడును, త్రింశచ్ఛుద్ధనతోన్నతే, త్రింశత్ = ముప్పదిలో, శుద్ధ = తీసివేయబడిన, నతోన్నతే = నతిఉన్నతములు, అన్యేచ = ఇతరములైనవియు, క్రమాత్ = వరుసగా, కాలజే = కాలమువలన పుట్టిన, వీర్యే = బలములు, భవతః = అగుచున్నవి, ఆద్యేదళే = గ్రంథముయొక్క మొదటిభాగమునందు, యంత్రిలవాదికేచ = యంత్రిలవాదికములు, విస్తరాత్ = విపులముగ, గదితం = చెప్పబడినది. సః = ఆప్రసిద్ధుడగు, వర్షేశశ్చ-వర్షాధిపతియును, మాసపః = మాసాధిపతియు, దినపతిః = దినాధిపతియు, తత్కాలహోరేశ్వరః = అప్పటికాల సంబంధమగు హోరాధిపతియు, చరణోత్తరం = పాతికవంతు వృద్ధిచొప్పున, వీర్యాఢ్యాః = బలముకలవారలగుదురు, చతుర్ణాం = నాలిగింటియొక్క యోగః = కూడిక, సమయజం = సమయమువల్ల బుట్టిన, బలం = బలమగును, తాః = అపూర్వోక్తములయిన, స్వేష్టాః = తాను నిర్ణయించుకొనిన కాలసంబంధమగు, ఘటికాః = ఘడియలు, కరైః = రెండింటిచేత. వినిహతాః = హెచ్చింపబడినవియై, బాణైః = అయిదింటిచేత, అవాప్తాః = భాగింపగా రాబడినవి, గతాః = గడచిన హోరలగును, వారేశాత్ = వారాధిపతి మొదలుకొని, రవిశుక్ర విద్విధుశనీజ్యారాః = సూర్యుడు, శుక్రుడు, బుధుడు, చంద్రుడు, శని, బృహస్పతి, అంగారకుడు, వీరు క్రమముగా, హోరాధిపాః = హోరలకు నధిపతులగుచున్నారు.

తా॥ పూర్వశ్లోకములో నతమనియు ఉన్నతమనియు చెప్పబడెను. వాటిని స్పష్టముగా వివరించుచు సంవత్సరమాస దినహోరాధిపతులను వివరించుచున్నాడు. పగలు రెండుజాములనుండి రాత్రి రెండుజాముల పర్యంతముండు ఘడియలు విఘడియలు మొదలగునవి నతమని చెప్పబడును. రాత్రి రెండుజాములనుండి పగలు రెండు జాముల పర్యంతముండునట్టి ఘడియలు మొదలగునవి ఉన్నత సంజ్ఞ కలవియగును. ౩౦ సంఖ్యలో తీసివేయబడిన నతోన్నతములును, వీనికంటె నితరమైనవి వరుసగా అప్పటికాల సంబంధమగు బలములగుచున్నవి. యంత్రిభాగలు శంకుచ్ఛాయలు మొదలైనవాటిని గురించి గ్రంథముయొక్క పూర్వభాగములో విశదముగా జెప్పబడినది.

మరియు నతమును ౩౦ సంఖ్యలో తీసివేయగా ఉన్నతసంజ్ఞగల ఘడియలగును. ఉన్న తమును ౩౦ సంఖ్యలో తీసివేయగా నతసంజ్ఞగల ఘడియలగును. కాబట్టి నతమును రెట్టించి ౬౦ చే భాగింపగ రాబడిన రూపము మొదలగు లబ్ధము నతబలమనబడును. ఈనతమును ౧ రూపములో దీసివేయగామిగిలినది యున్నతబలమని చెప్పబడును ఇట్లు నిర్ణయింపబడిన నతబలము చంద్ర అంగారక శనులదనియు ఉన్నతబలము సూర్య బుధ బృహస్పతి శుక్రులనియు గ్రహింపవలయును. ఇకను వర్షాధిపతులు మొదలగు వారియొక్క బలమెట్లనగా తాను ఏసంవత్సరమునందు జననాద కాలమును గురించి విచారించుచున్నాడో ఆసంవత్సరమునందు చైత్ర శుద్ధ పాడ్యమియం దేవారమగునో అవారాధిపతియే సంవత్సరాధిపతియగును. ఏమాసములో జననమగునో ఆమాస ప్రారంభదినాధిపతియే అమాసాధిపతియగును. ఏదినమువందు జననమగునో ఆదినము నందుండు వారాధిపతియే ఆదినాధిపతియగును. హోరాధిపతిని నిర్ణయించుట యెట్లనగా- ఉదయాది జననకాలము వరకునుండు ఘడియలను రెట్టించి అయిదింటిచేత భాగింపగ వచ్చిన లబ్ధము గతహోరలగును. ఇందుకు నుదాహరణము ఉదయాది జనన కాలమువరకు ౨౫ ఘడియలైనవి యని తలచెదము. వాటిని రెట్టించగా ౫౦ అగును. వాటిని ౫ చే భాగింపగా ౧౦ లబ్ధము గనుక పదిహోరలు గతించి ౧౧ వ హోర జరుగుచున్నది యని చెప్పబడును. కాబట్టి ఆదినమందు బుధవారమని అనుకొనెదము వెనుక చెప్పబడిన ౧౧ వ సంఖ్యలో ౭ తీసివేయగా ౪ మిగులును. బుధుడుఆనాడు వారాధిపతి యగుటచే అతను మొదలు వెనుక చెప్పబడిన హోరాధిపతి గ్రహముల వరుస ప్రకారము తత్కాలహోరాధిపతి బృహస్పతియగును. ఇట్లు వర్షాధిపతి మొదలగువారిని నిర్ణయించి వెనుక చెప్పబడిన పాదవృద్ధిప్రకారము సంవత్సరాధిపతికి పాదికబలమనియు, మాసాధిపతి పతికి అర్థబలమనియు, దినాధిపతికి ముప్పాతిక బలమనియు హోరాధిపతికి నాల్గువంతులును బలమనియు దీనినే పూర్ణబలమనియు రూప బలమనియు చెప్పెదరు. ఇట్లు నాల్గువిధములగు కాలబలమును మొత్తము చేయవలయునని చెప్పియున్నది కాబట్టి ఆయాగ్రహములకు వేరువేరుగా చతుర్విధ బలములను మొత్తముజేసి కాలబల చక్రమువందు రూపాద్ది కాలబలమును లిఖించవలయును ఇట్లు కాలబలమును గురించి చెప్పితి. (ఇందులో శ్రీపతి భట్టాచార్యులవారి మతమును గురించియు కేశవాచార్యులవారి మతమును గురించియు వారి వారి యభిప్రాయమై వ్రాయబడినది. అది నేను వ్రాయక వదలివేసినాను. దానిని మీరుచూచి అవసర మనితోచిన యెడల అచ్చులోనికి తీసికొనవలయును. కాబట్టి తెలియగలందులకు వ్రాసితిని)

## అథ చతుర్థం చేష్టాబలముచ్యతే.

శ్లో॥ యామ్యేచంద్రశనీ బుధస్తుసతతం శేషాస్తుసౌమ్యాయనే
పూర్వోక్తైశ్చలకేంద్రజై రిహాలవై ర్వక్రీయదిస్యాద్బలం। చేష్టాఖ్యం

రుధిరాద్ద్వయో ర్యదియుతి స్స్వేకాంశకే చైకభే । చోదగ్యామ్యగయో ర్జయాపవిజయౌ స్యాదేవ జేతా బలీ ॥ ౧౭ ॥

అ॥ చంద్రశనీ= చంద్రుడు శనియును, యామ్యే= దక్షిణాయనమందును, బుధస్తు= బుధుడైతే; సతతం= ఎల్లప్పుడును, శేషాస్తు=ఇతరగ్రహములు, సౌమ్యాయనే= ఉత్తరాయణమందును, బలినః= బలము కలవారలై, భవంతి అగుచున్నారు పూర్వోక్తైః= పూర్వమందు చెప్పబడిన, చలకేంద్రజైః= అంత్యశీఘ్రకేంద్రములవల్ల కలిగిన, లవైః= భాగలచేత, వక్రీ= వక్రముగలవాడు, స్యాద్యది= అయినట్లాయెనా, చేష్టాఖ్యం= చేష్టయను పేరుగల బలముకలవాడు, రుధిరాత్ = అంగారకుడు మొదలు, ద్వయోః= రెండుగ్రహములకు, ఏకభే= ఏకరాశియందైనను, ఏకాంశకేచ=ఒక్కయంశయందైనను, యుతిర్యది=కూటమికలిగెనేని, ఉదగ్యామ్యగయోః= ఉత్తర దక్షిణ దిక్కులను పొందిన యాయిద్దరికిని, జయాపవిజయౌ= జయపరాజయములు, స్యాతాం=అగును, జేతా=జయించినవాడు,బలీ=బలవంతుడై,స్యాత్ =అగును.

తా॥ ఆయనబలమనియు కేంద్రజ బలమనియు రెండు విధములుగా చేష్టాబలము చెప్పబడినది గాన యాచేష్టాబలమును వివరింపుచున్నాడు. చంద్రుడు శనియును దక్షిణాయనమందును బుధుడెల్లప్పుడును మిగిలిన వారగు సూర్య అంగారక గురుశుక్రులు ఉత్తరాయణమందును బలము కలవారలగుదురు. సూక్ష్మప్రకారముగ స్ఫుటము జేయదలచిన యెడల సాయన స్ఫుటగ్రహము వలన క్రాంతిని సాధించి దానిని శరసంస్కారమువలన స్ఫుటముజేసి యట్టి స్పష్టమగు క్రాంతివలన నయనబలమును సాధించవలయును. సర్వజనులకు సులభముగ దెలియగలందులకు గ్రంథకర్త మొదటిదియగు ఆయన బలమును స్థూలదృష్టితో జెప్పినాడు. అయినను విశేషోపయోగము కలిగినప్పుడు స్వల్పతారతమ్యము కలిగినను అది వ్యత్యాసముగనుండదు. కాబట్టి యెక్కువ ప్రయాసలేక సులభమగు మార్గము నాశ్రయించుటయే మంచిదని కేశవాచార్యులు మొదలగు వారును చెప్పియున్నారు. ఇకను కేంద్రచేష్టాబలమును యుద్ధచేష్టాబలమును స్థూలదృష్టితోనే చెప్పుచున్నాడు. పూర్వము చెప్పిన ప్రకారము అంత్యశీఘ్రకేంద్రసంబంధమగు భాగలచేత వక్రించియున్నట్టి గ్రహము బలము కలవాడగును. ఈబలమును చేష్టాబలమని చెప్పిరి. అనగా గ్రహస్ఫుటమును జేయునప్పుడు చివరవిదైన శీఘ్రకేంద్రభాగలవలన గ్రహమునకు వక్రము సంభవించెనేని యాగ్రహమునకు వక్రచేష్టాబలము సంభవించును. పూర్వమునందు జెప్పబడినవియనుటచేత ఈశీఘ్రకేంద్రసాధన మిదివరలో పూర్వభాగమునందు జెప్పియున్నట్లు తెలియబడుచున్నది. లేనియడల అప్పటి సంవత్సర పంచాంగమును జూచుకొనవలయును. ఈచెప్పబడినది కేంద్రబలమైయున్నది. ఇకనుయుద్ధచేష్టాబలమును వివరించుచున్నాడు అంగారకుడు మొదలు శని పర్యంతమునుండు అయిదు గ్రహములలోనే రెండు

గ్రహముత్తైనను ఒక్కరాశిలో నొక్కయంశయందుండి వెళ్లుచుండెనేని అప్పుడా యుత్తరకును యుద్ధమనిచెప్పిరి. అప్పుడుత్తరదిక్కుగా వెళ్ళినవాడుజయించినవాడని యుదక్షిణదిక్కుగా వెళ్ళినవాడు అపజయమునొందినవాడనియు చెప్పిరి. కాబట్టిజయిం చినవాడు బలముకలవాడనియు ఓడినవాడు బలములేనివాడనియు తెలిసికొనవలయును ఈచేష్టాబలములను సాధించుటనుగురించి యుపాయములు సిద్ధాంతభాగములో విశేషముగ జెప్పబడినవు అందును గురించి విశేషముగ కష్టపడవలసియున్నది. కాబట్టి యీచేష్టాబలమును గురించి కూడ స్థూలదృష్టితోనే గ్రంథకర్త చెప్పియున్నాడు.

## అథ దృగ్బలసాధన మాహ.

శ్లో॥ పూర్ణంపశ్యతిభానుజస్త్రి దశమేచేత్పాదదృష్ట్యేతరే। జీవోధీనవమేర్ధయా తదితరేభౌమశ్చతుర్థాష్టమే। సర్వేపాదవిహీనయాఖిలదృశాపశ్యంతిసర్వేస్తభం। విత్తాయవ్యయవైరిణో నదదృశుఃఖేటస్థితస్థానతః॥ ౧౮॥

అ॥ భానుజః=శని, త్రిదశమే=తృతీయ దశమస్థానములను, పూర్ణం= సంపూర్ణముగ, పశ్యతి=చూచుచున్నాడు, ఇతరేచేత్=ఇతరగ్రహములైతే, పాద దృష్ట్యా=పాతికదృష్టిచే, పశ్యంతి=చూచుచున్నారు, జీవః=బృహస్పతి, ధీనవమే= పంచమ నవమస్థానములను, పూర్ణం = సంపూర్ణముగ, పశ్యతి = చూచుచు న్నాడు, తదితరే=వానికంటెనితరగ్రహములు, అర్ధయా=సగముదృష్టిచేత, పశ్యంతి= చూచుచున్నారు, భౌమః=అంగారకుడు, చతురష్టమే=చతుర్థ అష్టమస్థానములను, పూర్ణం=సంపూర్ణముగ, పశ్యతి=చూచుచున్నాడు, సర్వే = వానికంటె నితర ములు వారందరును, పాదవిహీనయా=పాతికతక్కువ అనగా ముప్పాతిక దృష్టిచేత పశ్యంతి=చూచుచున్నారు, సర్వే=అన్నిగ్రహములును, అస్తభం = సప్తమస్థాన మును, అఖిలదృశా = సంపూర్ణదృష్టిచేత, పశ్యంతి = చూచుచున్నారు, విత్తాయ వ్యయవైరిణః=విత్త = ద్వితీయస్థానమును, ఆయ = ఏకాదశస్థానమును, వ్యయ = ద్వాదశస్థానమును, వైరిణః=షష్ఠస్థానమును, నదదృశుః = చూడరు, ఖేటస్థితస్థాన తః= ఖేట=గ్రహములు, స్థిత = తామున్నట్టి, స్థానతః = రాశినుండి, దదృశుః= చూచెదరు.

తా॥ అయిదవదియు నొక్కవిధమైనదియునైన దృగ్బలసాధనమును చెప్పు చున్నాడు. తృతీయ దశమస్థానములను శనిపూర్ణదృష్టితోను ఇతర గ్రహములు పాతిక దృష్టితోను చూచెదరు. పంచమ నవమస్థానములను బృహస్పతి సంపూర్ణ దృష్టితోను ఇతరగ్రహములు అర్ధదృష్టితోను చూచెదరు. చతుర్థ అష్టమ స్థానములను అంగారకుడు పూర్ణదృష్టితోను ఇతర గ్రహములు ముప్పాతిక దృష్టితోను చూచె

దరు, అన్నిగ్రహములును సప్తమస్థానమును సంపూర్ణదృష్టితో చూచెదరు. ద్వితీయ షష్ఠఏకాదశ ద్వాదశస్థానములను ఏగ్రహములును చూడవు. పూర్వము చెప్పబడిన చూచుటయనునది ప్రతిగ్రహము తానున్నట్టి స్థానమునుండి యాయా సంఖ్యాగలస్థానములను చూచెదరని తెలిసికొనవలయును.

## అథ దృష్టి స్ఫుటీకరణ విషయమాహ.

శ్లో॥ ద్రష్ట్రాశోధితదృశ్య కేంద్ర భవశాత్తద్వత్ఫలంస్యాదధో॥ । భాగేభ్యస్త్వనుపాతలబ్ధకలికా స్స్వర్ణంకృతందృగ్భవేత్ । ఏవంకూ్రరశుభేక్షణేచగణితాత్సంలిఖ్యకోష్టద్వయే । రూపాద్యాహిపృథక్పృథగ్యుతి భువోస్స్యాదంతరందృగ్బలం ॥౧౯॥

అ॥ ద్రష్ట్రా= చూచేగ్రహముచేత, శోధితదృశ్యకేంద్రభవశాత్= శోధిత = తీసివేయబడిన, దృశ్య = చూడబడునట్టి, కేంద్రభవశాత్= కేంద్రరాశివల్లను, తద్వత్ =పూర్వముచెప్పబడిన, ఫలం=ఫలము, స్యాత్= అగును. అధోభాగేభ్యః= ఆరాశియొక్క క్రిందిభాగలవల్ల, అనుపాతలబ్ధకలికాః = అనుపాత= త్రైరాశికము చేత, లబ్ధ=రాబడిన, కలికాః=లిప్తలను, స్వర్ణం=ధనరుణములనుగా, కృతం = చేయబడినవగుచు, దృగ్=దృష్టి, భవేత్ =అగును, ఏవం=ఈప్రకారముగ, కూ్రరశుభేక్షణేచ=పాపశుభగ్రహదృష్టులను, గణితాత్ =గణితమువలన, కోష్టద్వయే = రెండుచక్రములయందును, రూపాద్యః=రూపాదులను, సంలిఖ్య=లిఖించి, అథ= అటుపిమ్మట, పృథక్పృథక్ = వేరువేరుగ,యుతిభువోః = యోగమువల్ల కలిగిన యారెండు కోష్ఠములయొక్క, అంతరం = భేదము, దృగ్బలం = దృష్టిబలము, స్యాత్ = అగును.

తా॥ పూర్వము ఆయాస్థానములయందుగల దృష్టిమొత్తమును జెప్పినాడుగాని యాయాస్థానముల నడుమనుండు భాగలకు న్యూనాధికములను గురించి చెప్పియుండ లేదు. కాబట్టి వెనుక చెప్పబడిన దృష్టిఖండములను స్పష్టముజేసి చెప్పుచున్నాడు. రిమార్కు—(గ్రంథములో వ్రాసియున్న తాత్పర్యమే వ్రాయవలసియున్నది కాబట్టి దానిని వ్రాయక వదలివేయడమైనది. మరియు చక్రమునుకూడ నొకటివేసినాడు అది యంతయు క్రమగ్రముగ చూచుకొని యేవిధముగా లిఖించుకొనవలయునో యావిధముగ జేసికొనుడు (చూచేగ్రహము ద్రష్టయనియు చూడబడువాడుదృశ్యుడనియు జెప్పబడును) అని తాత్పర్యములో మొదట వ్రాసినవాడుగావ అది మొదలుకొని మీరు చూచుకొనవలయును.

అథషణ్ణాంయోగం దశాదీనాం శుభాశుభత్వంచాహ.

శ్లో॥ అర్కేంద్వాసురపూజితా స్సురగురుర్జ్ఞారార్కజాః ఖేచ
రా। స్తేస్యుర్న్యూనబలా యథోత్తరమిదంనైసర్గికంస్యాద్బలం। రూ
పంస్యాద్ద్యుమణేరిలాధరలవోనంస్యాత్పరేషాంక్రమాత్। స్థానాశా
సమయస్వభావజబలైక్యం చైష్టికేనాన్వితం ॥౨౦॥ దృగ్వీర్యేణసుసం
స్కృతం యదిజయీ ఖేటశ్చరూపాన్వితం। భంగశ్చేద్రహితంరణే స్ఫు
టతరంఖేటస్యవీర్యంభవేత్ । ఏవంప్రోక్తబలైక్యమత్రనిఖిలం రూపా
ధ్యమత్స్వాల్పకం। చేద్దీనంహిబలంతతో దశమితాత్స్వాన్మధ్యమంతద్బ
లం ॥౨౧॥ తత్పశ్చాత్తుసుపూర్ణవీర్య మిహతద్వీర్యాధికస్స్యాచ్ఛు
భః। ఖేటస్తస్యదశాప్యతీవ శుభదారోహాఖిలేష్టార్థదా। సాస్యాన్మధ్య
మవీర్యఖేచర దశారోహాపిసౌఖ్యాయతే। హీనాసాత్వవరోహిణీవ్యస
నదావీర్యో నఖేటస్యవా ॥ ౨౨॥

అ॥ అర్కేంద్వాసురపూజితాః = అర్క = సూర్యుడు, ఇందు=చంద్రుడు, అసురపూజితాః = రాక్షసులకు గురువైన శుక్రుడు, సురగురుః = దేవతలకు గురువగు బృహస్పతి, జ్ఞారార్కజాః=జ్ఞ=బుధుడు, ఆర=అంగారకుడు, అర్కజాః = శని, తే=ఆప్రసిద్ధులగు, ఖేచరాః = గ్రహములు, యథోత్తరం = ఒకరి తర్వాత నొకరు, న్యూనబలాః=తక్కువబలముగలవారలై, స్యుః = అగుచున్నారు, ఇదం= ఈచెప్పబడినది, నైసర్గికం = స్వభావసిద్ధమగు, బలం=బలమై, స్యాత్ = అగును, ద్యుమణేః=సూర్యునకు, రూపం=సంపూర్ణబలము, స్యాత్=అగును, పరేషాం = ఇతరగ్రహములకు, క్రమాత్=వరుసగా, ఇలాధరలవోనం=ఇలాధర = పర్వతసంఖ్యయనగా నేడగు లవ=భాగములచేత, ఊనం=తక్కువైనబలము, స్యాత్ = అగును, స్థానాశాసమయస్వభావజబలైక్యం=స్థాన= రాశిబలము, ఆశ=దిగ్బలము, సమయ= కాలబలము, స్వభావజబల=స్వతస్సిద్ధమగుబలము, ఐక్యం = పైచెప్పబడిన బలములతో కూడియున్నదియూ, చైష్టికేన=చేష్టాసంబంధమగు బలముతో, అన్వితం=కూడినదై, దృగ్వీర్యేణ = దృష్టిబలముచేత, సుసంస్కృతం = సంస్కారము చేయబడినదై ఖేటః=గ్రహము, రణే = యుద్ధమునందు జయీ యది = జయము గలవాడగునేని, రూపాన్వితం = ఒకరూపముతో కూడిన బలమగును, రణే = యుద్ధమునందు, భంగశ్చేత్=ఓడిపోయెనట్లాయెనా, రహితం=ఒకరూపము తీసివేయబడిన, స్ఫుటతరం= మిక్కిలి స్ఫుటమగు, ఖేటస్య=గ్రహముయొక్క, వీర్యం=బలము, భవేత్=అగును, అత్ర=ఇక్కడ, ఏవం=ఈప్రకారము, ప్రోక్తబలైక్యం = ప్రోక్త = చెప్పబడిన, బల=షడ్బలములతోటి, ఐక్యం = కూడిన, నిఖిలం = సమస్తమైన, రూపాద్య =

రూపము మొదలగులవి, అష్టాల్పకంచేత్=అయిదింటికంటె తక్కువయగునేని, హీనబలంహి=హీనబలమగునుగదా, తతః=అది మొదలు, దశమితాత్ = పదిరూపముల పర్యంతము, తద్బలం=ఆబలము, మధ్యమం = రెండవవిధమగుబలము, స్యాత్ = అగును, తత్పశ్చాత్తు=అటుతర్వాతనైతే, సుపూర్ణవీర్యం=మిక్కిలి సంపూర్ణమైన బలము, స్యాత్=అగును, ఇహ=ఈవిషయమందు. తద్వీర్యాధికః = ఆబలములచేత నధికమైన, ఖేటః=గ్రహము, శుభః=శుభుడై, స్యాత్ = అగును, తస్య=ఆగ్రహముయొక్క, దశాపి=దశయును, ఆరోహా=ఆరోహణమయినది యగునేని, అతీవ=మిక్కిలి, శుభదా=శుభముల నిచ్చునదియగుచు, అఖిలేష్టార్థదా = అఖిల=సమస్తమైన, ఇష్టార్థదా=కోరిన ఫలముల నిచ్చునదియై, స్యాత్=అగును, సా=ఆదశ, మధ్యమవీర్య ఖేచరదశా = మధ్యమవీర్య=మధ్యమబలముగల, ఖేచర=గ్రహముయొక్క, దశా=దశయై, ఆరోహాపి=ఆరోహణమయినదైనను, సౌఖ్యాయతే=సౌఖ్యము నొసగును, వీర్యోనఖేటస్య=బలములేని గ్రహముయొక్క. సాతు = ఆదయైతే, అవరోహిణీ=అవరోహణము గలదియగునేని, వ్యసనదా = కష్టముల నొసగునది, స్యాత్=అగును.

తా॥ ఆరవదియగు స్వభావబలమును నిర్ణయించుటయు షడ్బలములను మొత్తముజేసి దశలు మొదలగువానియొక్క శుభాశుభత్వమునుచెప్పుచున్నాడు. సూర్యుడు చంద్రుడు, శుక్రుడు, బృహస్పతి, బుధుడు, అంగారకుడు, శని, యీచెప్పబడిన యేడు గ్రహములును పైన చెప్పిన వరుస ప్రకారము ఒకరి తర్వాత నొకరు తక్కువ బలము కలవారలగుదురు. ఇది స్వభావసిద్ధమగు బలమని చెప్పిరి. కాబట్టి, యిందువలన సూర్యునకు 7 పాళ్లు బలము, చంద్రునకు 6 పాళ్లు, శుక్రునకు 5 పాళ్లు, బృహస్పతికి 4 పాళ్లు, బుధునకు 3 పాళ్లు, అంగారకునకు 2 పాళ్లు, శనికి 1 పాలు బలమని నిశ్చయింపబడుచున్నది. యిందులో అందరికన్న సూర్యునకు అధికమగు 7 పాళ్లు బలముకలిగి యున్నది కాబట్టి దానినే రూపమనే పేరుగల సంపూర్ణబలమని చెప్పుదురు. ఇట్లు 6 బలములు నిర్ణయింపబడినవి కాబట్టి ప్రతిగ్రహమునకు స్థానదిక్కాలచేష్టనిసర్గము అను పేరుగల అయిదు బలములను వేరు వేరుగా మొత్తముచేసి ప్రతిగ్రహమునకు వచ్చిన మొత్తములో దృగ్బలములను సంస్కరించవలయును. అనగా ధనమగునేని కూడవలయును. ఋణమగువేని తీసివేయవలయును. ఇట్లు చేయగా రాబడిన మొత్తములో అంగారకుడు మొదలగు నయిదు గ్రహములలోనే యిద్దరికైనను యుద్ధము సంభవించిన యెడల వారిరువురులో జయించినవానియొక్క బలము మొత్తములో నొకరూపము కలిపి యోడిపోయినవాని బలము మొత్తములో నొక రూపమును తీసివేయవలయును. ఈప్రకారము చేసినందువలన షడ్బలములు స్పష్టమగును, ఈప్రకారము సాధింపబడిన షడ్బలకూటమిలో అయిదు రూపములకు తక్కువ బలము గలవాడు హీనబలుడనియు, అయిదు రూపములు మొదలు పది రూపముల పర్యంతము బలముగలవాడు మధ్యమబలుడనియు, ఆపదిరూపములకంటె

కెన్ని రూపములు హెచ్చువచ్చిన ఒక్కొక్కటంతు చొప్పున నొకరికంటె నొకరు సంపూర్ణబలుడనియు చెప్పిరి. కాబట్టి అట్టి సంపూర్ణబలముగల గ్రహము సమర్థుడు కాబట్టి వానిదశలో సమస్త శుభములను సమమగు కోరబడిన కోరికలును సిద్ధించును. యీపూర్ణబలముగల గ్రహము ఆరోహణ స్థితియందుండిన యెడల విశేషఫలమునిచ్చును. మరియు మధ్యమ బలుడగు గ్రహముయొక్కయు దశ ఆరోహణస్థితియందుండెనేని ఆదశయందును సౌఖ్యములు కలుగును. లేక మధ్యమబలముగల గ్రహముయొక్క దశ అవరోహణస్థితియందగునేని కష్టములను కలిగించునదగును. హీనబలుని దశ యారోహణస్థితిలోనున్నను కష్టములను కలిగించుచు నుండునుగాని యొకానొకప్పు డెప్పుడైనను కొంచెము మేలుచేయును. ఆరోహణావరోహణ స్వరూపమెట్లనగా తనయొక్క పరమ నీచభాగనుదాటి తన యుచ్చభాగలకు నభిముఖమైనవాడు ఆరోహణము కలవాడనియు, తన యుచ్చభాగలనుదాటి నీచభాగలకు నభిముఖమైనవాడు అవరోహణము కలవాడనియు చెప్పబడెను.

ఇట్లు మహాకవీశ్వరుడగు కాళిదాసునిచే రచింపబడిన యుత్తర కాలా
మృతములో జాతకపద్ధతియందు షడ్బలసాధనములను వివరించుట
యను పేరుగల ద్వితీయ బిందువ సమాప్తమయ్యెను.

---

## ఉత్తరకాలామృతే తృతీయబిందు ప్రారంభః.
## జాతక పద్ధతౌ ఆయుర్దాయ విషయః.

{ సతికుద్యేచిత్రికర్మేతి న్యాయేనేదానీంతావదా-
యుర్దాయ విషయ ముచ్యతే }

శ్లో॥ దస్రాత్ఖేచరభుక్తభం త్రివిహృతం త్యాజ్యం ఫలం శేషకం
వేదఘ్నంఖగభుక్తపాద సహితంచాంశాయుషోవత్సరాః । ఖేటస్థైష్య
పదాంతరా ద్దినఘటీమాసాత్తమాసాదికం । హ్యేనియ్యాఖిలఖేచరై
శ్చతనుత స్సర్వైక్యమబ్దాదికం ॥ ౧ ॥

అ॥ దస్రాత్ = అశ్వని మొదలు, ఖేచరభుక్తభం= ఖేచర= గ్రహముచేత, భుక్తభం= అనుభవింపబడిన నక్షత్రము, త్రివిహృతం= త్రి= మూడింటిచేత, విహృతం= భాగహరింపబడినదగుచు, ఫలం= రాబడిన లబ్ధము, త్యాజ్యం=విడిచిపెట్టవలయును, శేషకం=మిగిలినసంఖ్య, వేదఘ్నం= నాలుగింటిచేత గుణింపబడినదగుచు, ఖగభుక్తపాదసహితంచ= ఖగ= గ్రహముచేత, భుక్త= అనుభవింపబడిన, పాద=

పాదముతోటి, సహితం=కూడినదగుచు, అంశాయుషః=అంశాయుర్దాయముయొక్క వత్సరాః= సంవత్సరములగును, ఖేటస్థైవ్యపదాంతరాత్= ఖేటస్థ= గ్రహమున్నట్టియు, ఏవ్య=మిగిలినట్టియు, పద=పాదములయొక్క, అంతరాత్= మధ్యనుండునట్టి, దినఘటీమానాత్= దినములు ఘడియలు మొదలగు ప్రమాణమువల్ల, మాసాదికం= మాసములు మొదలగువానిని, ఆనీయ=తీసికొనివచ్చి, అఖిలఖేచరైః= అఖిల= సమస్తమగు, ఖేచరైః= గ్రహములచేతను, తనతశ్చ = లగ్నమువల్లను రాబడిన= సర్వైక్యం= సకలాయుర్దాయములతో నైక్యముజేయగా, అబ్దాదికం= సంవత్సరమాస దినఘటికాదులు రాబడును.

తా॥ తత్కాల స్ఫుటగ్రహ లగ్నరాశ్యాదులచే పూర్వము నిర్ణయింపబడిన యాయుర్దాయము ప్రయాసయగుటచే నిప్పుడు పంచాంగములో వ్రాయబడునట్టినక్షత్రగ్రహాదులవల్ల సులభముగా నంశాయుర్దాయమును సాధించుపద్ధతినిచెప్పుచున్నాను. అది యేతీరుననగా- పంచాంగములో నేగ్రహము ఏనక్షత్రములో నేపాదమందుండునోచూచి యాగ్రహమున్న నక్షత్రమునకు వెనుకటి నక్షత్రములను అశ్విని మొదలుగా లెక్కపెట్టి యాసంఖ్యను మూడింటిచేత భాగించగా వచ్చిన లబ్ధమును విడిచిపెట్టి శేషమువచ్చిన సంఖ్యను నాలుగింటిచేత హెచ్చించి యాసంఖ్యలో నప్పుడు గ్రహమున్న నక్షత్రములో గడిచిన పాదముల సంఖ్యనుగూడినయెడల వచ్చినసంఖ్య ఆగ్రహసంబంధమగు అంశాయుర్దాయ సంవత్సరములగును. మాసాదులను నిర్ణయించుట యేతీరుననగా-ఏగ్రహసంబంధమగు నాయుర్దాయమును నిర్ణయింపదలచెనో యాగ్రహము ఏపాదమందు నెప్పుడు ప్రవేశించియుండునో పంచాంగములోజూచి ప్రవేశించినది మొదలు ముందు పాదములో తిరిగి ప్రవేశించు పర్యంతము ఎన్నిదినములు ఎన్నిఘడియలు ఎన్ని విఘడియలగునో దానిని ప్రమాణమని చెప్పబడు నొకసంఖ్య నొకచోట నుంచుకొనవలయును. తర్వాత గ్రహము ప్రవేశించిన యుండినపాదము ఎప్పుడు మొదలైయున్నదో అది మొదలు తాను నిశ్చయించుకొనునట్టిజననకాల పర్యంత మెన్నిదినములు ఎన్నిఘడియలు ఎన్నివిఘడియలగునో ఆసంఖ్యను ఇచ్ఛయని చెప్పుదురు. అట్టిసంఖ్య నొకచోట నుంచుకొని యీసంఖ్యను పైన చెప్పబడిన ప్రమాణమును సంఖ్యను విఘడియలనుగా మార్చవలయును, ఇట్లు మార్చిన పిమ్మట ఇచ్ఛయొక్క విఘడియలను 12 చేత హెచ్చించి దానిని ప్రమాణమను దానిలో నుండునట్టి ఘడియలచే భాగింపగావచ్చినలబ్ధము మాసములగును. శేషమును 30 చే గుణించి వెనుక చెప్పబడిన ప్రమాణమను దానిలోనున్నట్టి విఘడియలచే భాగింపగా వచ్చిన లబ్ధము దినములగును. మిగిలిన శేషమును 60 చే హెచ్చించి మునుపటి హారముచేత భాగింపగా వచ్చిన లబ్ధము ఘడియలగును. మిగిలిన శేషమును మునుపటివలెనే చేయగా విఘడియలగును. ఇట్లు అంశాయుర్దాయముయొక్క మధ్యమ

సంవత్సరాదులగును. ఇట్లు ప్రతిగ్రహమునకుజేసి గ్రహముయొక్క యుచ్చనీచాది స్థితులనుబట్టి మధ్యమ సంవత్సరాదులను హరణ భరణాది సంస్కారాదులను జేయగా స్ఫుటాయుర్దాయ సంవత్సరాదులగును.

## అథాంశస్యాయుషో హరణ విధాన మాహ.

శ్లో॥ స్వాయుస్స్వేందు (౧) కరా (౨) గ్ని (౩) వేద (౪) శర (౫) ష (౬) డ్భాగోనితంరిష్ఫభా । ద్వామంషట్సుఖలే శుభే యదిదళో నంపాపలగ్నే ఖిలం । నీచారాతిగృహే ఖగే స్తమయగే ద్విత్రిద్విభాగోనితం। ద్వ్యంశోనంహిపరాభవే పునరపిస్యాదంశజాయుస్త్విదం ॥౨॥

అ॥ స్వాయుః=తనఆయుర్దాయము, రిష్ఫభాత్=ద్వాదశరాశి మొదలుకొని వామం=ఎడమప్రక్కగా, షట్సు = ఆరురాసులయందు, ఖలే= పాపగ్రహమున్న దగుచుండగ, స్వేందుకరాగ్ని వేదరషడ్భాగోనితం= స్వ = తన ఆయుర్దాయములో, ఇందు=ఒకటవభాగము, కర=రెండవభాగము, అగ్ని = మూడవభాగము, వేద = నాల్గవభాగము, శర=అయిదవభాగము, షట్= ఆరవదియగు, భాగ = భాగముల చేత, ఊనితం= తీసివేయబడినదియగును, శుభేయది = శుభగ్రహముండిన యెడల, దళోనం=పైనచెప్పబడిన భాగములలో సగము తీసివేయవలయును, పాపలగ్నే = లగ్నమందు పాపగ్రహమున్నయెడల, అఖిలం=సమస్తము హరింపబడును, ఖగే= గ్రహము, నీచారాతిగృహే= నీచ=నీచస్థానమందును, ఆరాతిగృహే = శత్రుక్షేత్రమునందు నున్నను, అస్తమయగే=అస్తమించినను, ద్విత్రిద్విభగోనితం = రెండు మూడు రెండు భాగముల ప్రకారము తీసివేయవలయును, పరాభవే = యుద్ధములో నోడినయెడల, పునరపి=తిరిగి, ద్వ్యంశోనం = రెండవభాగము హరింపవలయును, ఇదం=ఇది, అంశజాయుః=అంశవల్లపుట్టినటువంటి, ఆయుర్దాయము,స్యాత్=అగును.

తా॥ అంశాయుర్దాయమునకు హరణ సంస్కారము చేయునట్టి విధానమును జెప్పుచున్నారు. ద్వాదశస్థానము మొదలుకొని తలక్రిందుగా అనగా ద్వాదశస్థానమందు పాపగ్రహమున్నయెడల ౧ వ భాగమును, ఏకాదశస్థానమందు పాపగ్రహమున్నయెడల ౨ వ భాగమును, దశమస్థానమందుండిన యెడల ౩ వ భాగమును, నవమస్థానమందుండిన యెడల ౪ వ భాగమును, అష్టమస్థానమునందుండినయెడల ౫వ భాగమును, సప్తమస్థానమందుండిన యెడల ౬ వ భాగమును, ఆయాగ్రహములకు రాబడిన యాయుర్దాయములో పైన చెప్పబడిన భాగముల ప్రకారముగ ఆయాస్థానముల ననుసరించి ఆయుర్దాయమును హరించవలయును. శుభగ్రహముండిన యెడల పైన చెప్పబడిన భాగములలో సగము సగమునే తీసివేయవలయును. అనగా ౧-౨-

౩-౮-౫-౬-౭వ భాగములనిచెప్పబడెను. గాన వాటికి వరుసగా ౨-౪-౬-౮-౧౦-౧౨ వ భాగములని తెలిసికొనవలయును. మరియు లగ్నమునందు పాపగ్రహమున్న యెడల ఆలగ్న సంబంధమగు నాయుర్దాయమునంతయు హరింపవలయును. ఇదియును గాక గ్రహము నీచస్థానమందున్న యెడల వాని యాయుర్దాయములో రెండవవంతునను శత్రుక్షేత్రమందుండిన యెడల మూడవవంతునను అస్తమానమునొందిన సగభాగమును యుద్ధములో నోడిపోయిన సగభాగమును తీసివేయవలయును. నీచస్థాన శత్రుక్షేత్రస్థిత అస్తంగతత్వ యుద్ధపరాజితత్వాదిగుణము లొక్కనికి నొక్కసారియేసంభవించిన యెడల అన్నిహరణ సంస్కారములను జేయనవసరములేదనియు సగభాగమునే తీసివేయవలయుననియు మరికొన్ని జ్యోతిషగ్రంథములయందు కలదు కాబట్టి యాతీరునసే చేయవలయును. అయితే లగ్నమందు పాపగ్రహమున్న యెడల లగ్నాయుర్దాయమునంతయు దీసివేయవలయును. ఇట్లు సూర్యాది గ్రహములకు లగ్నాంతము వరకును ప్రత్యేక ప్రత్యేకముగా హరణ సంస్కారముజేయగా రాబడినయాయుర్దాయముల నన్నియు మొత్తము జేయవలయును. దీనినే యంశాయుర్దాయమని చెప్పిరి.

## అథ లగ్నాయుర్దాయ సాధన మాహ.

శ్లో॥ లగ్నేభుక్తవినాడికానవగుణాస్తన్మానభక్తాఃఫలం । వర్షాణిస్వగుణైర్హరై రపితథాతన్మాసఘస్రాదికం । లగ్నేశోభనఖేచరేక్షితయుతే స్వస్వామియుక్తేక్షితే। తుంగేస్వామినిరాశి సంమితసమాశ్చేత్యూచిరేకేబుధాః ॥ 3 ॥

అ॥ లగ్నే= లగ్నమునందు, భుక్తవినాడికాః= భుక్త= గతించిన, వినాడికాః= విఘడియలు, నవగుణాః= తొమ్మిదిచేత గణింపబడినవై, తన్మానభక్తాః= తన్మాన= ఆలగ్నప్రమాణ విఘడియలచేత, భక్తాః= భాగింపబడినవగుచు, ఫలం= లబ్ధము, వర్షాణి= సంవత్సరములగును, తథా= ఆప్రకారముగ, స్వగుణైః= తమ ప్రమాణ ఘడియలచే హెచ్చించుటచేతను, హరైరపి= భాగహారములచేతను, తన్మాసఘస్రాదికం= తత్= ఆయాలగ్నములయొక్క, మాస= నెలలు, ఘస్రాదికం= దినములు మొదలగునవి వచ్చును, లగ్నే= లగ్నము, శోభనఖేచరేక్షితయుతే= శోభనఖేచర= శుభగ్రహముచేత, ఈక్షిత=చూడబడినను, యుతే=కూడినను, స్వస్వామియుక్తేక్షితే= స్వస్వామి= తనయధిపతిచేత, యుక్త=కూడినను, ఈక్షితే= చూడబడినను, స్వామిని=లగ్నాధిపతి, తుంగే= ఉచ్చస్థానమందుండినను, రాశిసంమ్మితసమాః= రాశి= రాశితోటి, సంమిత = సమానములైన, సమాః = సంవత్సరములు కూడ కలుపవలయును, ఇతి = ఈలాగునని, ఏకేబుధాః = కొందరు విద్వాంసులు, ఊచిరే= చెప్పిరి.

తా॥ లగ్నాయుర్దాయమును సాధించువిధానము చెప్పుచున్నాను. లగ్నమునందుగతించిన ఘడియలను విఘడియలను విఘడియలలోనికిమార్చి తొమ్మిదిచేగుణించి

లగ్న ప్రమాణ ఘడియలను విఘడియలలోనికి మార్చి యీసంఖ్యచే వెనుకటి సంఖ్యను భాగింపగా వచ్చినలబ్ధము సంవత్సరములగును. పిమ్మట మిగిలిన శేషమును 12 చే గుణించి విఘడియలలోనికి మార్చినట్టి లగ్న ప్రమాణముచే భాగింపగావచ్చిన లబ్ధము మాసము లగును. ఆశేషమును 30 చేత గుణించి వెనుకటి సంఖ్యచే భాగింపగా దిన ములగును. ౬౦ చేత గుణించి యావిధముగానే ఘడియలు మొదలగునవియేర్పడును. ఇట్లు చేసినందున సంవత్సరములు మాసములు దినములు ఘడియలు మొదలగునవి యేర్పడును. ఆలగ్నము శుభగ్రహముతోకూడియున్నను లేక చూడబడిననుయుండియు లగ్నము లగ్నాధిపతితోగూడినను చూడబడినను లగ్నాధిపతి యుచ్ఛస్థానమందు న్నను మేషము మొదలు ఆలగ్నము పర్యంతము ఎన్నిరాసులు వెనుకగతించియుండునో అన్ని సంవత్సరములు అంశాయుర్దాయ సంవత్సరములలో కలపవలయునని కొందరు జ్యోతిష్కులు చెప్పిరి గాని యీమతము యీకాళిదాసుగారియొక్క యభి ప్రాయమై యుండదు.

{ ఇదానీం ప్రాగ్జన్మ సుకృత దుష్కృతాన్యస్మిన్
జన్మన్యాగత ఫలానిచ వక్ష్యతి }

శ్లో॥ ప్రాక్ప్రత్యక్తనుభాగత స్త్రిభిరపి ద్రేక్కాణకై స్తద్భ పైః। ప్రాగ్వద్వర్గజవీర్యమబ్ధి విహృతంపుణ్యంహిరూపాదికం। తద్వే దచ్యుతమత్రపాపమితి తల్లేఖ్యంతయోరంతరం। పుణ్యంరూపచతుష్ట యం యదిభవేన్ముక్తిర్భవేదసత్ ॥

టీ॥ తనుభాగతః= లగ్నస్థానమునుండి, ప్రాక్ప్రత్యక్= వెనుకముందునుండు త్రిభిః = మూడైన, ద్రేక్కాణకైః = ద్రేక్కాణములచేతను, తద్భపైః = ఆద్రే క్కాణరాశ్యధిపతులచేతను, ప్రాగ్వత్= పూర్వమువలెనే, వర్గజవీర్యం= సప్తవర్గ ములవలన రాబడినబలము, అబ్ధివిహృతం= నాలిగింటిచేత భాగింపబడినదై, రూపా దికం= వచ్చినట్టి రూపము మొదలగునవి, పుణ్యంహి = పుణ్యమగునుగదా, తత్= అపుణ్యమైనట్టి రూపాదికము, వేదచ్యుతం=నాలుగులో తీసివేయబడినదగుచు,అత్ర= ఇచ్చట, పాపమితి= పాపమని, తత్= ఆసంఖ్య, లేఖ్యం= వ్రాయతగినది,తయోః= పుణ్యపాప రూపములుగా చెప్పబడిన ఆరెండుసంఖ్యలయొక్క, అంతరం= మధ్య నుండుభేదము, రూపచతుష్టయమపి = నాలుగురూపములును, పుణ్యంయది = పుణ్య మగునేని, ముక్తిః= మోక్షము, భవేత్= అగును, అసచ్చేత్=ఆనాలుగురూపములు పాపములగునేని, అసత్= దుర్గతియగును.

తా॥ పూర్వము సాధింపబడిన ద్వాదశభావ సాధనములో తనుభావరాశ్యాది యొక్క భాగస్థానమే తనుస్థానమని చెప్పబడును. ఆభాగము ననుసరించి వెనుకకు ౧౫ భాగలు ముందుకు ౧౫ భాగలును మొత్తము 30 భాగలు. ఇవి తనుభావమని చెప్పబడును. భావభాగస్థానమే యాభావమువకు మధ్యస్థానమనబడును. 30 భాగ

ములగల అట్టి తనుభావమునకు 3 ద్రేక్కాణములుండును. ఒకానొకప్పుడు రాశ్యంత మందుకూడ భావమధ్యము కావచ్చును. ఏవిధముగానైనను భావమధ్యమునుండియే గణించినవియు జరుగుచున్నవియు రాగలవియునగు ద్రేక్కాణములను భావించియా యాస్థానముల యందుండిన రాశ్యధిపతులను ద్రేక్కాణాధిపతులనుగా దెలిసికొని యాద్రేక్కాణాధిపతులు ముగ్గురికిని పూర్వము చెప్పబడిన విధానముగ సప్తవర్గములను ఆయాయధిపతులను వారివలన కలుగు శుభవర్గపాపవర్గములను నిర్ణయించి సప్తవర్గబలమును తీసికొనివచ్చి యాబలమును నాలిగింటిచేత భాగింపగా వచ్చునట్టిరూపాదికము పుణ్యమగును. దానిని ౮లో తీసివేయగా మిగిలినది పాపమనియు చెప్పబడును, ఇట్లు చేయబడిన పుణ్యపాపరూపాదుల రెంటికిని తారతమ్యముచూడగా పాపరూపాదిక మేమియులేక పుణ్యరూపాదికము అవయవశూన్యమై సరిగా ౮ వచ్చిన యెడల నీజన్మమునందే నిశ్చయముగా మోక్షము కలుగునని నిర్ణయించవలయును. లేక నాలుగు రూపములు శేషములేకుండా సరిగా పాపరూపములే వచ్చినయెడల దుర్గతి కలుగునని చెప్పబడెను. అనగా పుణ్యపాపములు రెండును మిశ్రముగా నుండిన మనుష్యజన్మము సంభవించుననియు కేవలము పుణ్యమగునేని జన్మలేదనియు కేవలము పాపమగునేని క్రిమికీటకాది హీనజన్మము కలుగుననియు తెలిసికొనవలయును. ఇది యంతయు నాయాగ్రహ సప్తవర్గములవల్ల కలిగిన శుభాశుభవర్గములవలన ఆయా గ్రహదశలయందు త్రైరాశిక గణితముచే ఇంతభాగము సుకృతమనియు నింతభాగము దుష్కృతమనియు విశేషములను విద్వాంసులైనవారు పరిశీలించి తెలిసికొనవలయును.

## అథ లఘుతః ఆయుర్దాయాంతర సాధనమాహ.

శ్లో॥ ప్రాగుక్తాచ్ఛుభపాపవర్గగణితా ద్రేక్కాణపైస్సాధితా।
సంఖ్యాక్రూరభవాఖనేత్ర విధుభిర్గుణ్యానగాప్తాసమాః। శుద్ధాఃఖాశ్వి
సుధాకరై రపిభవేదాయుర్హి జన్మత్రయే। సంవాచ్యార్థమిహైవతల్లఘు
తరం ప్రోక్తం నవాంశాయుషః ॥ ౫౬ ॥

అ॥ ప్రాగుక్తాత్= పూర్వమందు జెప్పబడిన, శుభపాపవర్గగణితాత్=శుభ= శుభులయొక్కయు, పాప = పాపులయొక్కయు, వర్గ = సప్తవర్గములయొక్క, గణితాత్= గణితమువల్లను, ద్రేక్కాణపైః=ద్రేక్కాణాధిపతులచేతను, సాధితా=సాధింపబడినట్టియు, క్రూరభవా=క్రూరగ్రహసంబంధమైన, సంఖ్యా= సంఖ్య, ఖనేత్రవిధుభిః= నూటయిరువైచేత, గుణ్యా= హెచ్చింపబడినదై, నగాప్తా= ఏడింటిచేత భాగింపబడినదగుచు, సమాః= సంవత్సరములు వచ్చును, తాః= ఆసంవత్సరములు, ఖాశ్విసుధాకరైః= నూటయిరువైచేత, శుద్ధాః= తీసివేయబడినవై, జన్మత్రయేపి= మూడు జన్మములయందును, ఆయుః = ఆయుర్దాయము, భవేత్= అగునుగదా, ఇహ= ఇక్కడను, తత్= అది, నవాంశాయుషః=నవాంశాయుర్దాయముయొక్క

సంవాదార్థం = సంవాదముకొఱకు, లఘుతరం = మిక్కిలి సులభముగ, ప్రోక్తం = చెప్పబడినది.

తా॥ పూర్వము జెప్పబడిన నవాంశాయుర్దాయమును చులకనైన మరియొక యుపాయముచే జెప్పుచున్నాను. పూర్వము చెప్పబడిన రీతిగా తనుస్థాన ద్రేక్కాణాధిపతుల వలన శుభగ్రహసంబంధమగునట్టి పాపగ్రహసంబంధమగునట్టియు సప్తవర్గముల సంబంధమగు సంఖ్య యేర్పడును, అందులో శుభగ్రహ సంబంధమగు సప్తవర్గసంఖ్యను విడిచి పాపసప్తవర్గపంక్తి మాత్రమునే తీసికొని దానిని౧౨౦చే గుణించి ౭ చే భాగహారింపగా వచ్చిన లబ్ధము సంవత్సరములగును. శేషమును ౧౨చే గుణించి ౭ చే భాగింపగా వచ్చిన లబ్ధము మాసములగును. అటు పిమ్మట శేషమును 3౦ చే గుణించి ౭ భాగింపగా దినములగును. ఇట్లు గణితముచే రాబడిన సంవత్సరమాన దినాదులను ౧౨౦ సంవత్సరములలో దీసివేయగా మిగిలిన సంవత్సరాదులు పైన జెప్పబడిన మూడు జన్మలలో నేజన్మసంబంధమైన వర్గమును బట్టి సాధింపబడెనో యాజన్మసంబంధమగు ఆయుర్దాయమని తెలిసికొనవలయును. ఇది పూర్వము జెప్పబడిన యాయుర్దాయముయొక్క సంవాదము నిమిత్తమిచ్చుట జెప్పబడెను. ఇందుకు నుదాహరణ మెట్లనగా- తనుస్థానము అనగా లగ్నరాశ్యాది ౮-౧౫-౧౫-౨౫ ఇది ధనుర్లగ్నము. రెండవద్రేక్కాణమైనది. తనుభావాధిపతి బృహస్పతియు ద్రేక్కాణాధిపతి సూర్యుడు నగును. కాబట్టి యీసూర్యునకు సప్తవర్గ వివరము పూర్వము చూపింపబడెను. ఆప్రకారము పూర్వజన్మవృత్తాంతము కావలసిన యెడల మొదటి ద్రేక్కాణాధిపతి వలన దెలిసికొనవలయును. ఇప్పుడీ జన్మవృత్తాంతమును దెలిసికొనదలచిన యెడల రెండవద్రేక్కాణాధిపతియగు సూర్యుని వలన దెలిసికొనవలయును. ఇందుకు నుదాహరణ మెట్లనగా సూర్యుడు స్వక్షేత్రమందుండెను కాబట్టి స్వవర్గు ఒకటి శుభము. రెండవది చంద్రహోర, చంద్రు డధిమిత్రుడుగావున శుభము, మూడవది గురుద్రేక్కాణము. బృహస్పతియు అధిమిత్రుడే కాబట్టి శుభము. సప్తాంశయును బృహస్పతియే కాబట్టి శుభము. నవాంశము శుక్రునిదైయున్నది. తులానవాంశ నీచాంశయు శత్రుంశయును కాబట్టి మిక్కిలి పాపము. ద్వాదశాంశ అంగారకుడు కాబట్టి పాపము. త్రింశాంశ బుధునిదై యున్నది. శత్రుత్రింశాంశము పాపము. ఈప్రకారము తేలిన సప్తవర్గములలో శుభవర్గసంఖ్య ౪, పాపవర్గ సంఖ్య 3 అయెను కాబట్టి పాపవర్గ సంఖ్యయగు 3 చే ౧౨౦ ను గుణించగా 3౬౦ అగును. దానిని ౭చే భాగింపగా ౫౧ సంవత్సరములు ౫ నెలలు ౪ దినములు వచ్చును. యీ సంవత్సరాదులను ౧౨౦ సంవత్సరములలో డసివేయగా ౬౮ సంవత్సరములు ౬ నెలలు ౨౬ దినములు మిగిలి యుండెను కాబట్టి యిది యీజన్మాయుర్దాయమని తెలియబడు చున్నది.

{ ఇత్థంగణితాగతాయుర్దాయ ముక్త్వారాశిచక్రస్థ గ్రహ
శుభాశుభత్వ వశాత్పునరాయుర్యోగాంతరాణ్యాహ. }

శ్లో॥ కేంద్రేత్రికోణగృహేస్థితాః కవిగురుజ్ఞాః పూర్ణమాయుశ్చ
వేన్మధ్యాయుష్యమథోధనేచసహజే లాభేదిశంతిస్థితాః । షష్ఠేచాష్టమభేవ్యయాఖ్యభవనే స్వల్పాయురన్యేఖలాః । కేంద్రాష్టవ్యయకోణగానశుభదా జాతస్యపుంసస్సదా॥౬॥

టీ॥ కేంద్రే = కేంద్రస్థానములయందును, కోణగృహే = త్రికోణస్థానముల యందును, స్థితాః= ఉన్నట్టి, కవిగురుజ్ఞాః= శుక్రబృహస్పతి బుధులు, పూర్ణం= సంపూర్ణమైన, ఆయుః= ఆయుర్దాయమును, భవేత్= ఇచ్చువారగుదురు, అథ= అనంతరము, ధనేచ= ద్వితీయమందును, సహజే= తృతీయమందును, లాభే= ఏకాదశస్థానమందును, స్థితాః= ఉన్నవారగుచు, మధ్యాయుష్యం= మధ్యమాయుర్దాయమును, దిశంతి= ఇచ్చుచున్నారు, షష్ఠే= ఆరింటియందును, అష్టమభే= ఎనిమిదింటియందును, వ్యయాఖ్యభవనే= ద్వాదశస్థానమందును, స్థితాః= ఉన్నవారగుచు, స్వల్పాయుః= అల్పాయుర్దాయమిత్తురు, అన్యే= ఇతరులగు, ఖలాః= పాపులు, కేంద్రాష్టవ్యయకోణగాః= కేంద్ర= కేంద్రములయందును, అష్ట = అష్టమమందును, వ్యయ= ద్వాదశమందును, కోణగాః= త్రికోణస్థానములయందు నున్నవారగుచు, జాతస్య= పుట్టినట్టి, పుంసః= పురుషునకు, సదా = ఎల్లప్పుడు, నశుభదాః = శుభము నివ్వరు.

తా॥ రాశిచక్రము నందుండునట్టి శుభాశుభగ్రహముల వలన మరియొక ఆయుర్దాయ యోగమును జెప్పుచున్నాను కేంద్రస్థానములగు ౧-౪-౭-౧౦స్థానములయందును త్రికోణస్థానములైన ౫-౯ స్థానములయందును శుభులగు శుక్ర బృహస్పతి బుధులుండిరేని పూర్ణాయుర్దాయము నిత్తురు. ద్వితీయ తృతీయ ఏకాదశ స్థానములయందుండిన యెడల మధ్యమాయుర్దాయము నొసగుదురు. ౬-౮-౧౨ యీస్థానములయందుండిన యెడల అల్పాయుర్దాయము నిత్తురు. పాపగ్రహములైతే ౧-౪-౭-౧౦-౮-౧౨-౫-౯ స్థానములయందుండిన యెడల శుభఫలము నివ్వరు. ఈపాపులు శుభఫలము నిచ్చుస్థానము లెవ్వియనగా 3-౬-౧౧ స్థానములని యిచ్చట జెప్పకపోయినను ఇతర గ్రంథానుసారముగానిశ్చయించుకొనవలయును. మరియు పాపులనుగురించి అన్నిస్థానములనుజెప్పి ద్వితీయ స్థానమును జెప్పకపోవుటవలన ద్వితీయస్థానము శుభాశుభులకు నుభయులకు నుపయోగించుకొనుటకు సందర్భపడదని తోచుచున్నది కాబట్టి నిష్ప్రయోజనమని పాపగ్రహగణనలో జెప్పక విడిచెనని తెలిసికొనవలెను.

అథాల్పాయుర్దాయ యోగం తదపవాదంచాహ.

శ్లో॥ లగ్నేశేననిరీక్షితేసతితథా కేంద్రత్రికోణస్థితై । ర్లగ్నేశ

స్థితిరాశినేతరి పునర్లగ్నే నదృష్టేశుభైః ౹ అల్పాయుస్సుతదారబుద్ధిరహితో జాతోభవేదన్యథా ౹ దీర్ఘాయుర్బహుభాగ్యవాన్ ఘనమతిర్నిత్యం భవేత్కీర్తిమాన్ ॥ ౭ ॥

టీ॥ లగ్నేశే= లగ్నాధిపతియు, లగ్నేశస్థితిరాశినేతరి= లగ్నాధిపతియుండిన రాశ్యధిపతియు, కేంద్రత్రికోణస్థితైః= కేంద్రస్థానములయందు కోణస్థానములయందు నున్నట్టి గ్రహములచేత, వనిరీక్షితేసతి=చూడబడకుండినవారగుచుండగ, పునః=తిరిగి శుభైః=శుభులచేత, లగ్నే= లగ్నము. నదృష్టే= చూడబడకుండినదగుచుండగాను జాతః= పుట్టినవాడు, అల్పాయుః= అల్పాయుర్దాయము కలవాడును, సుతదారబుద్ధిరహితః= పుత్రులు భార్యయు బుద్ధియులేనివాడను, భవేత్= అగును. అన్యథా= దీనికి వ్యతిరేకముగనున్నయెడల, దీర్ఘాయుః =దీర్ఘాయుర్దాయము కలవాడును, బహుభాగ్యవాన్= మిక్కిలి భాగ్యముకలవాడును, నిత్యం= ఎల్లప్పుడు, ఘనమతిః= విశేషబుద్ధికలవాడును, కీర్తిమాన్= కీర్తికలవాడును, భవేత్ =అగును.

తా॥ ఇప్పుడు అల్పాయుర్దాయ యోగమును దానికి భంగకరమగు యోగమును జెప్పుచున్నాను. లగ్నాధిపతిగాని లగ్నాధిపతియుండిన రాశ్యధిపతిగాని కేంద్రస్థానములయందును కోణములయందు నున్నట్టి శుభగ్రహములచే జూడబడకుండినను మఱియు లగ్నము శుభగ్రహములచే జూడబడకుండినను జాతకుడు అల్పాయుర్దాయము కలవాడును, పుత్రులు, భార్య, మంచిబుద్ధియు, లేనివాడునగును. దీనికివ్యతిరేకముగా అనగా లగ్నము, లగ్నాధిపతి, లగ్నాధిపతియుండిన రాశ్యధిపతి, శుభగ్రహములచే జూడబడుచుండిన యెడల దీర్ఘాయుః కలవాడును. విశేషభాగ్యవంతుడును, కుశాగ్రబుద్ధికలవాడును, మంచికీర్తి కలవాడునగునని తెలిసికొనవలయును.

## అథ కేవలాల్పాయుర్యోగమాహ.

శ్లో॥ రంధ్రాధీశనిరీక్షితేస్ఫుటతరే లగ్నేబ్జలగ్నేథవా౹ జన్మేందృష్టమలగ్నపేరవిభువా భూజేనవానీక్షితే౹ లగ్నేశాదినవీక్షితేశుభకరైః ఖేటైర్భవేజ్జాతకో ౹ మార్కండేయసమాయురవ్యతితరామల్పాయుషశ్చాస్పదః ॥ ౮ ॥

టీ॥ స్ఫుటతరే=కాలనిర్ణయముచే స్పష్టమైన, లగ్నే = జన్మలగ్నముగాని, అథవా=మరియు, అబ్జలగ్నే=చంద్రలగ్నముగాని, జన్మేందృష్టమలగ్నపే= జన్మ= జన్మలగ్నమునకుగాని, ఇందు =చంద్రలగ్నమునకుగాని, అష్టమలగ్నపే = అష్టమలగ్నాధిపతియైనను, రంధ్రాధీశనిరీక్షితే=అష్టమాధిపతిచే జూడబడుచు, రవిభూవా= శనిచేతనైనను, భూజేనవా=అంగారకునిచేతనైనను, వీక్షితే = చూడబడుచుండగాను లగ్నేశాది=లగ్నాధిపతి మొదలగు, శుభకరైః = శ్రేయస్సుజేయునట్టి, ఖేటైః =

గ్రహములచేత, నవీక్షితే= చూడబడని దగుచుండగ, జాతకః=పుట్టినవాడుమార్కం
డేయ సమాయురపి= మార్కండేయ మునీశ్వరునియొక్క యాయుర్దాయముతో సమా
నాయుర్దాయము కలవాడైనను, అతితరాం= మిక్కిలి, అల్పాయుషః= అల్పాయు
ర్దాయమునకు, ఆస్పదః= స్థానమైనవాడు, భవేత్ అగుచున్నాడు.

తా॥ ముఖ్యముగా అల్పాయుర్యోగమును చెప్పుచున్నాను. జన్మకాలలగ్నము
చంద్రలగ్నము లేక జన్మలగ్నమునకు నష్టమాధిపతిగాని చంద్రలగ్నమునకు నష్టమాధి
పతిగాని ఈచెప్పబడినవి అష్టమాధిపతిచేతను శనిచేతను అంగారకునిచేతను చూడబడు
చుండగాను లగ్నాధిపతి మొదలగు శుభగ్రహములచేత చూడబడకుండినయెడల పుట్టిన
జాతకుడు మార్కండేయ మునీశ్వరునితో సమానమైన దీర్ఘాయుష్మంతుడైనను
అల్పాయువు కలవాడగునని జ్యోతిశ్శాస్త్రవేత్తలు చెప్పిరి.

ఇట్లు మహాకవియగు శ్రీ కాళిదాసునిచే రచియింపబడిన యుత్తర
కాలామృతమునందు ఆయుర్దాయ నిరూపణ చేయునట్టి
తృతీయ బిందువు సమాప్తము.

---

## అథగ్రహభావఫల నిరూపణం నామచతుర్థబిందు ప్రారంభః.

శ్లో॥ స్వోచ్చస్వర్క్షసుహృత్త్రికోణగృహగాః కేంద్రోత్తమాం
శాన్వితా । సౌమ్యైరీక్షితయుక్తమధ్యమగతామూలత్రికోణాశ్రితాః
భావారోహణఖేచరాశ్శుభకరాః కేంద్రత్రికోణాధిపా । స్సంబంధేన
పరస్పరం సుయశసంకుర్వంతి రాజోత్తమం ॥ ౧ ॥

అ॥ స్వోచ్చ=గృహాగాః స్వోచ్చ= తనయుచ్చస్థానమందును, స్వర్క్ష= తన
రాశియందును, సుహృత్ = మిత్రక్షేత్రమందును, త్రికోణగృహాగాః = త్రికోణ
రాసులయందునున్నట్టి గ్రహములును, కేంద్రోత్తమాంశాన్వితాః= కేంద్ర= కేంద్ర
స్థానములయందును, ఉత్తమాంశ= ఉత్తమాంశలయందును, అన్వితాః= కూడియు
న్న గ్రహములును, సౌమ్యైః = శుభగ్రహములచేత, ఈక్షితయుక్త మధ్యమగతాః=
ఈక్షిత= చూడబడిన గ్రహములును, యుక్త=కూడియున్న గ్రహములును, మధ్యమ
గతాః = మధ్యమున్న గ్రహములును, మూలత్రికోణాశ్రితాః = మూలత్రికోణరాసుల
యందున్న గ్రహములును, భావారోహణఖేచరాః= భావములను ఆరోహించియున్న
గ్రహములును, శుభకరాః= శుభగ్రహములును, కేంద్రత్రికోణాధిపాః= కేంద్రత్రికో
ణరాసులకు నధిపతులగు గ్రహములును, పరస్పరం= ఒకరితోనొకరు, సంబంధము

చేతను, సుయశసం= మంచికీర్తిగలవానిగను, రాజోత్తమం= గొప్పరాజునుగాను కుర్వంతి= చేయుదురు.

తా॥ శుభగ్రహములయొక్కయు శుభస్థానముల నున్నట్టి గ్రహములయొక్కయు ఫలితమును జెప్పుచున్నాను. తనయుచ్చరాసులయందును స్వకీయరాసులయందును మిత్రక్షేత్రములయందును త్రికోణరాసులగు పంచమ నవమ స్థానములయందునున్నట్టి గ్రహములును, కేంద్రఉత్తమాంశల నొందియున్న గ్రహములును, శుభులచే జూడబడినవారును అశుభులతో కూడినవారును, అశుభగ్రహముల నడుమనున్నవారును, మూలత్రికోణ రాసులయందున్నవారును, శుభభావములకు నభిముఖులైనవారును, స్వతస్సిద్ధముగా శుభులైనవారును, కేంద్రస్థానములకు త్రికోణస్థానములకు నధిపతులైనవారును, ఈచెప్పబడిన గ్రహములు ఒకరితో నొకరు సంబంధము చేతనున్నా జాతకుని మంచికీర్తిగల గొప్పరాజునిగా జేయగలశక్తి గలవారగుదురు.

## అథ రాజయోగస్య భంగమాహ.

శ్లో॥ నీచస్థాశ్చ పరాజితా స్త్వరిగతాః పాపేక్షితాక్రాంతయు
జ్మధ్యస్థానగతాశ్చ వక్రవికలస్వర్భానుసంసర్గగాః। భావాంతస్థితఖేచ
రాశ్చవిబలా షష్ఠాష్టరిఫాధిపాః। కేంద్రాధీశ్వరకోణపేశ్వరయుతా
స్తద్యోగభంగప్రదాః ॥ ౨ ॥

టీ॥ నీచస్థాశ్చ = తమకు నీచరాశియందునున్నట్టి గ్రహములును, పరాజితాః= యుద్ధములోనోడిన గ్రహములును- అరిగతాః= శత్రుక్షేత్రములనున్నట్టి గ్రహములును, పాపేక్షితా=గతాః=పాప= పాపగ్రహముల చేత, ఈక్షిత= చూడబడినగ్రహములును, ఆక్రాంత=ఆక్రమింపబడినవారును, యుక్= కూడినవారును, మధ్యస్థానగతాః= పాపులనడుమనున్నవారును, వక్ర= సంసర్గగాః=వక్రవికల= వక్రవికలములను గతులతోటి, స్వర్భాను= రాహువుతోటి, సంసర్గగాః= సంబంధముగల గ్రహములును, భావాంతస్థితఖేచరాః= భావములయొక్క తుదయందుండెడి గ్రహములును, విబలాః= బలములేని గ్రహములును, షష్ఠాష్టరిఫాధిపాః= షష్ఠ అష్టద్వాదశ స్థానాధిపులును, కేంద్రాధీశ్వర=యుతాః= కేంద్రాధీశ్వర= కేంద్రస్థానాధిపతులతోటి, కోణపేశ్వర= కోణాధిపతులతోటి, యుతాః= కూడినవారును తద్యోగభంగప్రదాః= తద్యోగ= ఆరాజయోగమునకు, భంగప్రదాః= భంగమునిత్తురు.

తా॥ పూర్వము జెప్పబడిన రాజయోగమునకు భంగకరమైనయోగములనిచ్చట జెప్పుచున్నాను. నీచస్థానమందున్నవారును గ్రహయుద్ధములో నోడిన గ్రహములును, శత్రుక్షేత్రముల నున్నవారును, పాపగ్రహములచే చూడబడినవారును పాపులతో గూడినవారును, పాపులనడుమ నున్నవారును, వక్రగతి వికలగతిగలవారును,

రాహువుతో గూడినవారును, భావములయొక్క చివరభాగములో నున్నవారును, బలములేనివారును, ఆరు యెనిమిది పండ్రెండు స్థానములయందునున్నవారును కేంద్ర స్థానములకు త్రికోణములకు నధిపతులైన పాపులతోకూడినవారును, పూర్వముజెప్ప బడిన రాజయోగమునకు భంగమును జేయుదురు.

అథాన్యం రాజయోగవిశేషం తద్భంగంచాహ.

శ్లో॥ భాగ్యేకర్మణితత్పతీ నివసతావేకత్రవావ్యత్యయే।నాన్యోన్యర్క్షగతౌనిరీక్షణయుతౌ తౌరాజయోగప్రదౌ। ధీజాయోదయబంధుపైశ్చ సహితౌతత్తద్గృహేవాస్థితౌ । సంపత్సౌఖ్యకరౌ తయోర్నిధనకృల్లాభాధిపత్యంవినా ॥ 3 ॥

టీ॥ భాగ్యే= నవమరాశియందును, కర్మణి= దశమస్థానమందును, తత్పతీ= ఆనవమ దశమాధిపతులు, నివసతౌ= ఉన్నవారును, తౌ= ఆనవమ దశమాధిపతులు ఏకత్రవా= ఒక్కచోటగాని, వ్యత్యయేన= వ్యతిరేకముచేతను, అన్యోన్యర్క్షగతౌ = ఒకరిరాశియందు మరియొకరుండగాను, తౌ= వారు, నిరీక్షణయుతౌ= ఒకరినొకరు చూచుటగాని యిద్దరుకలసి యుండినగాని, తౌ= వారు, ధీజాయోదయ బంధుపైః= ౫-౭-౧-౪ యీగృహములకు నధిపతులతోటి, సహితౌ=కూడినవారును, తత్తద్గృహేవా= పైన చెప్పబడిన ఆరాసులయందు స్థితౌ= ఉన్నవారగుచుండగాను, రాజయోగప్రదౌ = రాజయోగము నిచ్చువారును, సంపత్సౌఖ్యకరౌ = సంపత్తును సౌఖ్యమును జేరువారు, భవేతాం= అగుచున్నారు. తయోః = ఆనవమదశమాధిపతులకు, నిధనకృల్లాభాధిపత్యంవినా = నిధనకృత్= అష్టమరాశియొక్కయు, లాభ= ఏకాదశముయొక్కయు, అధిపత్యంవినా = ఆధిపత్యము లేనియెడల యోగము నిత్తురు.

తా॥ మరియొక రాజయోగ విశేషమును దానికి భంగస్వరూపమునుజెప్పుచున్నాను. నవమ దశమాధిపతులు నవమ దశమముల యందున్నను మరియు వారుభయులు ఒక్కరాశియందుగాని యొకరి రాశియందు మరియొకరుగాని అనగా నవమమందు దశమాధిపతియు దశమమందు నవమాధిపతియు నున్నను రాజయోగము నిత్తురు. మరియు ౫-౭-౧-౪ ఈలగ్నాధిపతులతో నవమ దశమాధిపతులుకూడినను చూడబడినను ౫-౭-౧-౪ గృహములయందు నవమ దశమాధిపతులున్ననుసంపత్తును సౌఖ్యమును కలుగజేయుదురు. అయితే నవమాధిపతికిగాని దశమాధిపతికిగాని అష్టమాధిపత్యమున్నను ఏకాదశాధిపత్యమున్నను రాజయోగమును కలుగజేయ సమర్థులు కారు. కాబట్టి నవమ దశమాధిపతులకు అష్టమాధిపత్యముగాని యేకాదశాధిపత్యముగాని యుండగూడదు.

పునరపి యోగాంతర మాహ.

శ్లో॥ లగ్నాద్భాగ్యపకర్మపౌ యదితథాతద్భాగ్యకర్మాధిపౌ।

మానాద్భాగ్యపకర్మపౌ వరసమస్వల్పాధికారాః క్రమాత్। సంబంధత్రియసంస్థితౌచ సబలావన్యోన్య కేంద్రాశ్రితౌ। లగ్నాధీశ్వరరాశి నాయకయుతౌ జాతోధనీభూపతిః ॥ ౮ ॥

టీ॥ లగ్నాత్ = లగ్నము మొదలు, భాగ్యపకర్మపౌ = నవమదశమాధిపతులును, తథా = ఆప్రకారముగానే, తద్భాగ్యకర్మాధిపౌ = తత్ = ఆలగ్నమునకు నవమ స్థానమేదికలదో, భాగ్యకర్మాధిపౌ = దానికి నవమ దశమాధిపతులును, మానాత్ = దశమస్థానమునుండి, భాగ్యపకర్మపౌ = నవమ దశమాధిపతులును, క్రమాత్ = వరుసగా, వరసమస్వల్పాధికారాః = వర = అధికమైనట్టియు, సమ = సమానమైనట్టియు స్వల్ప = అల్పమైనట్టియు, అధికారాః = అధికారముకలవారు, భవేయుః = అగుదురు, సంబంధత్రియసంస్థితౌ = సంబంధత్రియ = మూడు సంబంధములయందును, సంస్థితౌ = ఉన్నవారును, సబలౌ = స్థానాది షడ్బలములతో గూడినవారును, అన్యోన్యకేంద్రాశ్రితౌ = అన్యోన్య = పరస్పరము, కేంద్రాశ్రితౌ = కేంద్రరాసులయందున్నవారును, లగ్నాధీశ్వర రాశి నాయకయుతౌచ = లగ్నాధీశ్వర = లగ్నాధిపతియుండెడి రాశినాయక = రాశ్యధిపతితోటి, యుతౌచ = కూడినవారును, భవేయుర్యది = అయియుండగా, జాతః = పుట్టినవాడు, ధనీ = ధనవంతుడును, భూపతిః = రాజును, స్యాత్ = అగును.

తా॥ తిరిగి మరియొక రాజయోగమును జెప్పుచున్నాను. లగ్నము మొదలుకొని యుండెడి నవమాధిపతియు దశమాధిపతియు ఉత్తమాధికారము కలవారును, నవమ స్థానమునకు యేనవమ దశమాధిపతులుకలరో వారు మధ్యమాధికారము కలవారును, దశమమునకు యేనవమ దశమాధిపతులుకలరో వారు అల్పాధికారము కలవారును అని చెప్పబడును. పైనచెప్పబడిన మూడురకములవారును ఒక్కరాశియందుండుట ఒకరాశిలో నొకరుండుట ఒకరినొకరు చూచుచుండుట అనెడి మూడు సంబంధములలో నేదైన నొకసంబంధముకలవారును, లగ్నమునకు షడ్బలముకలవారును, ఒకరికి నొకరు కేంద్రరాసులయందు నుండినవారును, లగ్నాధిపతియుండెడి రాశి నాథునితో గూడినవారునైయుండగ జనియించినవాడు విశేషధనవంతుడుగాగాని గొప్పరాజుగా గాని యగును. అనగా పూర్వము చెప్పబడిన యుత్తమమధ్యమ అల్పాధికారముల ప్రకారముగానే లగ్నాద్భాగ్యరాజ్యాధిపతు లుత్తమ యోగమును భాగ్యాద్భాగ్య రాజ్యాధిపతులు మధ్యమ యోగమును కర్మాద్భాగ్యరాజ్యాధిపతులు అధమ యోగమును చేయుదురు. ఈ గ్రంథములో నుదహరించబడిన జాతకములో జన్మలగ్నమగు ధనుస్సునకు భాగ్యరాజ్యాధిపతులు భాగ్యమునందే యుండిరి. అందువలన యీ ధనుస్సునకు భాగ్యరాజ్యాధిపతులు రవి బుధులు వీరుత్తమాధికారులు. భాగ్యమగు సింహరాశి కాబట్టి యాసింహమునకు భాగ్యరాజ్యాధిపతులు కుజ శుక్రులు వీరు మధ్య

స్వాధికారము గలవారు. లగ్నము నకు రాజ్యమము కన్యయగును, ఈ కన్యారాశికి భాగ్యరాజ్యాధిపతులు శుక్రబుధులగుదురు వీరుభయులలో శుక్రుడు కన్యారాశి యందును బుధుడు సింహరాశియందునుండిరి. కాబట్టి వీరు స్వల్పాధికారముకలవారు.

పునరపి యోగాంతరం వక్ష్యతి.

శ్లో॥ రాశ్యంశోదయపాశ్చరాజ్య శుభపౌధీభాతృ బంధ్వస్త పాః శ్చార్థాయర్క్ష పతీచతే ఖగవరాశ్చైకత్రవాన్యోన్యభే। ఉక్తర్క్షేషు సుహృత్స్వభోచ్చ భవనేష్వన్యోన్యయుక్తేక్షితా। వృద్ధింవాజిగజాది కాన్ సుఖసుతాన్ ద్రవ్యంచదద్యుఃక్రమాత్ ॥ ౫౩॥

టీ॥ రాశ్యంశోదయపాః= రాశి= గ్రహముండెడి రాశియొక్కయు, అంశ = అగ్రహముండెడి నవాంశయొక్కయు, ఉదయపాః =జన్మలగ్నము యొక్కయు నధిపతులును, రాజ్యశుభపా = రాజ్యభాగ్యాధిపతులును, ధీభాతృబంధ స్తపాః= ధీ= అయిదవ రాశి యొక్కయు, భాతృ = తృతీయము యొక్కయు బంధు = చతుర్థము యొక్కయు, అస్తపాః = అస్తమము యొక్కయు నధిపతులును, అర్థాయర్క్ష పతీచ = అర్థ = ద్వితీయము యొక్కయు, ఆయర్క్షపతీచ = ఏకాదశము యొక్కయు నధిపతులును, తే = ఆ, ఖగవరాః = గ్రహములు, ఏకత్రవా = ఒకచోటగాని, అన్యోన్యభే=ఒక రాశియందు మరియొకరు గాని, ఉక్తర్క్షేషు = పైన చెప్పబడిన రాసులలో, సుహృత్స్వభోచ్చభవనేషు = సుహృత్ = మిత్రక్షేత్రమందును, స్వభ= స్వక్షేత్రమందును, ఉచ్చభవనేషు= ఉచ్చలగ్నములయందును, అన్యోన్యయుక్తేక్షితా - అన్యోన్య = పరస్పరముగా, యుక్త=కూడియున్నట్టియు, ఈక్షితా = చూడబడియున్నట్టియు నగునేని, బుద్ధిం=వృద్ధిని, వాజిగజాదికాన్ =వాజి= గుఱ్ఱములను, గజాదికాన్ = ఏనుగులు మొదలగు వానిని, సుఖసుతాన్ = సుఖమును పుత్రులను, ద్రవ్యంచ=ధనమును, క్రమాత్=వరుసగా, దద్యుః=ఇవ్వగలరు.

తా॥ తిరిగి మరియొక యోగమును జెప్పుచున్నాను. గ్రహమున్నరాశి నాధుడును నవాంశాధిపతియును లగ్నాధిపతియు దశమ నవమాధిపతులును పంచమతృతీయ చతుర్థ సప్తమాధిపతులును ద్వితీయ ఏకాదశ స్థానాధిపతులును అగు గ్రహములు ఒకచోటగాని లేక యొకరాశియందు మరియొక రుండినను పైన చెప్పబడిన లగ్నములు తమకు మిత్రక్షేత్రస్వక్షేత్ర ఉచ్చలగ్నములుగానుండి యాలగ్నములలో నొకరితో నొకరు కూడియుండుటగాని యొకరి నొకరి చూచుటగాని కలిగిన యెడల యా సమయమునందు జనియించిన మనుష్యుడు విశేషసంపద్వృద్ధిని గుఱ్ఱము యేనుగులు మొదలగు సంపత్తును సుఖమును పుత్రులను ధనమును మొదలగు నైశ్వర్యముల నొసంగుదురు.

## అథ అపయోగముక్త్వా తదపవాద మాహ.

శ్లో॥ నాశస్థానగతోదివాకరకరైర్లుప్తస్తుయద్రాశిపో । నీచారాతిగతోథవా యదిభవేత్సౌమ్యైరయుక్తేక్షితః । తద్భావస్యవినాశనం మునిగణాశ్శంసంతిసౌమ్యైర్యుతశ్చేత్తత్రాపిఫలప్రదోనహితథా తన్వాదిభావాంక్రమాత్ ॥ ౬ ॥

టీ॥ యద్రాశిపః= ఏరాశ్యధిపతి, నాశస్థానగతః = అష్టమరాశియందున్నవాడై, దివాకరకరైః = సూర్యకిరణములచేత, లుప్తః = లోపింప బడినవాడును, అథవా= అలాగుకానియెడల, నీచారాతిగతః=నీచ= నీచలగ్నమును, అరాతిగతః= శత్రుక్షేత్రమును పొందినవాడునై, సౌమ్యైః = శుభగ్రహములచేత, అయుక్తేక్షితః = కూడియుండనివాడును చూడబడనివాడును, భవేద్యది= అయినట్లాయెనా, తద్భావస్య= ఆభావముయొక్క, వినాశనం= నష్టమును, మునిగణాః= మునీశ్వరులు, శంసంతి= చెప్పుచున్నారు, తత్రాపి=అచ్చటనున్నా, సౌమ్యైః= శుభగ్రహములతోటియుతశ్చేత్ = కూడుకొనినట్లాయెనా, తన్వాదిభావాం= లగ్నాది సమస్తభావములకును = తథా = పూర్వము చెప్పబడిన ప్రకారము, నహి = కాదుగదా.

తా॥ ఇప్పుడు అపయోగమునుజెప్పి తిరిగి దానికి అపవాదమునుజెప్పుచున్నాను ఏభావాధిపతియైనను అష్టమస్థానమందుండి సూర్యునితోడి అస్తంగతుడై యాగ్రహమున్నట్టి రాశి నీచరాశిగాని శత్రుక్షేత్రముగానియై శుభగ్రహములతో కూడకను శుభగ్రహములచేజూడబడకయున్న యెడలఆభావమునకు నష్టముకలుగునని మునీశ్వరులు చెప్పిరి. అయితే పైజెప్పబడిన అపయోగలక్షణములను పొందియున్ననుఆగ్రహమునకు పాపగ్రహ సంబంధముగాని వీక్షణముగాని లేక శుభగ్రహసంబంధముగాని వీక్షణముగాని కలిగియున్నయెడల ఆయాభావములకు నష్టము కలుగదని తెలిసికొనవలయును.

## లగ్నద్రేక్కాణస్థిత లగ్నాధిప వశాద్యోగాంతర మాహ.

### చక్రవర్తి యోగః.

శ్లో॥ లగ్నస్యాది మమధ్యమాంతిమయుతో లగ్నాధినాథఃక్రమా । త్కుర్యాద్దండతించ మండలపతిం గ్రామాధిపంతచ్ఛిశుం । శుక్రార్కేందుజవీక్షితశ్చ సహితశ్చేత్సౌమ్యవర్గస్థిత । స్స్వేచ్ఛావాఖిల భూమిపాలకమముం భూపాలవంద్యంనరం ॥ ౭ ॥

టీ॥ లగ్నాధినాథః= లగ్నాధిపతి, క్రమాత్ = క్రమముగ, లగ్నస్య=లగ్నముయొక్క ఆదిమధ్యమమాంతి మయుతః= ఆది= మొదటిదియగు మధ్యమ= రెండవదియగు, అంతిమ= మూడవదియగు ద్రేక్కాణములయందుగూడి యుండగ, తచ్ఛిశుం=

ఆపుట్టిన జాతకుని, దండపతిం=శిక్షాధికారినిగాను, మండలపతిం= రాష్ట్రాధిపతినిగాను గ్రామాధిపం=గ్రామాధిపతినిగాను, కుర్యాత్=చేయును, శుక్రార్యేందుజవీక్షితశ్చ= శుక్రగురు బుధులచేత జూడబడినను, సహితశ్చ=కూడినను, సౌమ్యవర్గస్థితః= సౌమ్య వర్గ= శుభగ్రహవర్గమందు, స్థితః = ఉన్నట్టివాడును, స్వోచ్చేవా = తనయుచ్చ స్థానమందు, స్థితః= ఉన్నట్టివాడును, అముంనరం= ఈపుట్టినజాతకుని, భూపాలవంద్యం= రాజులచేత నమస్కరింపదగిన అఖిలభూమిపాలకం= సమస్తభూమిని పరిపాలింప దగినవానిగా, కుర్యాత్ = చేయును.

తా॥ లగ్నద్రేక్కాణముల యందుండెడి లగ్నాధినాథునివల్ల కలిగెడి చక్రవర్తియోగమును జెప్పుచున్నాను. లగ్నాధిపతి లగ్నముయొక్క మొదటిద్రేక్కాణమందుండెనేని న్యాయాన్యాయ విచారణజేసి శిక్షలనొసంగునట్టి యధికారియగును ద్వితీయ ద్రేక్కాణమందుండిన యెడల మండలాధిపతియగును తృతీయ ద్రేక్కాణమందుండినయెడల ఒక్కగ్రామమునకు నధిపతియగును. మరియు ఆలగ్నాధిపతిశుక్ర బృహస్పతి బుధులలో నొకరితోగాని యిద్దరితోగాని కూడినను లేక వారిచే జూడబడినను లేక శుభగ్రహవర్గములయందున్నను లేక తనయుచ్చరాశియందున్నను అట్టి గ్రహము జాతకుని సమస్తసామంతరాజులచే నమస్కరింపదగిన చతుస్సముద్రపర్యంతము నేలునట్టి చక్రవర్తినిగా జేయునని జ్యోతిశ్శాస్త్రజ్ఞులు చెప్పిరి. ఇట్లుచెప్పుటచే యెంతమాత్రము పాపగ్రహ సంబంధములేక కేవలము శుభగ్రహసంబంధమే లగ్నాధిపతికి కలిగియున్నయెడల చక్రవర్తియోగము సంభవించునని తోచబడుచున్నది.

## అథ చాంద్రయోగమాహ.

శ్లో॥ స్వోచ్చస్వర్క్షసుహృద్భగః పితృగృహేబంధౌఖభేసప్తమే। వీర్యాఢ్యోగురుశుక్రవీక్షణయుతః పూర్ణోవిధుశ్చేత్తదా। లగ్నాత్స్వాస్పదగౌ కుజార్కతనయౌచైవంస్థితౌ భోగవాన్ । సర్వజ్ఞస్సుగుణాకరో జననుతస్స్యాద్వ్యదాన్యోమహాన్ ॥ ౮ ॥

టీ॥ స్వోచ్చస్వర్క్షసుహృద్భగః=స్వోచ్చ=తనకు నుచ్చరాశియైనను స్వర్క్ష= స్వక్షేత్రమైనను, సుహృద్భగః = మిత్రక్షేత్రమైనదగుచు, పితృగృహే = నవమస్థానమందుగాని, బంధౌ = చతుర్థస్థానమందుగాని, దశమమందుగాని సప్తమే= సప్తమమందుగాని, స్థితః= ఉన్నవాడై, వీర్యాఢ్యః= బలముకలవాడై, గురుశుక్రవీక్షణయుతః= గురుశుక్ర=బృహస్పతి శుక్రులయొక్క, వీక్షణయుతః= దృష్టితో కూడినవాడగుచు, విధుః= చంద్రుడు, పూర్ణశ్చేత్ = పూర్ణుడైనయెడల, తదా=

అప్పుడు, లగ్నాత్= లగ్నమునుండి, కుజార్కితనయౌ= అంగారకశనులు, స్వాస్పదగౌ= స్వ= ద్వితీయమందును, ఆస్పదగౌ= దశమమందునున్నవారై, ఏవంస్థితే= ఇట్లుండగా, సః= వాడు, సర్వజ్ఞః= సమస్తము నెరింగినవాడును, సుగుణాకరః= మంచిగుణములు కలవాడును, జనసుతః=సర్వజనులచే పొగడదగినవాడును, మహాన్= విశేషమగు, వదాన్యః= దాతృత్వము కలవాడును, స్యాత్= అగును.

తా॥ చంద్రుని సంబంధమగు శుభయోగమును జెప్పుచున్నాను. చంద్రుడు పూర్ణుడై బలముకలవాడగుచు 9-4-10-7 యీస్థానములలో నుండగాను పైన చెప్పబడిన స్థానములు వానికి స్వక్షేత్రముగాగాని యుచ్చరాశిగాగాని మిత్రక్షేత్రముగాగాని యుండి గురుశుక్రులయొక్క సంబంధమైనను వీక్షణమైనను గలిగియుండగాను మరియు లగ్నమునకు ద్వితీయమందు అంగారకుడును దశమమందు శనియు నుండగాను పుట్టినవాడు సమస్తసుఖముల ననుభవించువాడును సమస్తమును తెలిసినవాడును సర్వజనులచే గొనియాడతగినవాడును విశేషదాతృత్వము కలవాడునగును.

## అథ గురుశుక్ర రాహుకేతునాం స్థితివశాద్యోగమాహ.

శ్లో॥ దేవాధీశపురోహితస్యసహజాం త్యాధీశతాసంతతం రంధ్రాధీశ్వరతాష్టమ స్థితిరపిస్యాద్యోగకృద్దేహినాం । షష్ఠస్థశ్శుభకృత్కవిస్మరగృహజ్ఞానాయమానస్థితో । రాహుర్యోగకర స్తృతీయ నిలయే కేతుస్తుయోగప్రదః ॥ ౯ ॥

టీ॥ దేవాధీశపురోహితస్య = దేవాధీశ= దేవేంద్రునియొక్క, పురోహితస్య= పురోహితుడగు బృహస్పతియొక్క, సహజాంత్యాధీశతా= సహజ= తృతీయస్థానమునకును, అంత్య= పండ్రెండవస్థానమునకును, ఆధీశతా = ఆధిపత్యమును సంతతం= ఎల్లప్పుడు, రంధ్రాధీశ్వరతా= అష్టమాధిపత్యమును, అష్టమస్థితిరపి= అష్టమస్థానమందు నుండుటయు, దేహినాం= మనుష్యులకు, యోగకృత్= యోగమును జేయుటకు, స్యాత్= అగును, షష్ఠస్థః= ఆరవస్థానమందున్న, కవిః= శుక్రుడు=శుభకృత్= శుభమును జేయును. స్మరగృహజ్ఞానాయమానస్థితః= స్మరగృహ= ఏడింటియందు జ్ఞాన= తొమ్మిదింటియందు, ఆయ=పదకొండవలగ్నమందు, మాన=దశమస్థానమందు, స్థితః= ఉన్నట్టి, రాహుః = రాహువు, యోగకరః = యోగమును జేయును. తృతీయనిలయే= తృతీయలగ్నమందుండిన, కేతుస్తు= కేతువైతే, యోగప్రదః= యోగమునిచ్చును.

తా॥ గురుశుక్ర రాహుకేతువులయొక్క స్థితివల్ల కలిగెడియోగమును జెప్పుచున్నాను. బృహస్పతికి తృతీయాధిపత్యము వ్యయాధిపత్యము నొక్కసమయము నందే కలిగియున్నను మరియు నెల్లప్పుడు అష్టమస్థానాధిపత్య ముండుటయు నష్టమస్థాన

మందుండుటయు నశులకు యోగమును జేయును. ఆరవస్థానమందున్న శుక్రుడు శుభమును జేయును. సప్తమ నవమ దశమ ఏకాదశస్థానములయందున్న రాహువు యోగ కారకుడగును. తృతీయస్థానమందున్న కేతువును యోగకారకుడగును.

## అథ తన్వాదిభావానాం పాపత్వయోగాత్పాపఫలమాహ.

శ్లో॥ దుస్థానాన్నిగతోరినీచ గృహగశ్చాస్తం గతో వాపియః। ద్భావేశశ్శుభయోగదృష్టిరహితః క్రూరారియుక్తేక్షితః। నీచార్యంశగతఃపరాజయ హతశ్చేత్పాపిభిర్నిద్యుతిః । తద్భావస్యవినాశనంనిగదితం లగ్నాదిభానాంక్రమాత్ ॥ ౧౦ ॥

టీ॥ దుస్థానాత్= దుష్టస్థానమునుండి, నిగతః= బయలుదేరినవాడు, అరినీచగృహగః= అరి= శత్రుక్షేత్రమందును, నీచగృహగః=నీచరాశి యందున్నవాడును, అస్తంగతోవాపి= అస్తమయమును పొందినవాడును, శుభయోగదృష్టిరహితః= శుభయోగ= శుభగ్రహములతో కూడియుండుటయు, దృష్టిరహితః=వీక్షణము లేకపోవుటయు, క్రూరారియుక్తేక్షితః= క్రూర= క్రూరగ్రహములతోటి, అరి= శత్రుగ్రహములతోటి, యుక్తేక్షితః=కూడియుండుటయు చూడబడుటయు, నీచార్యాంశగతః= నీచస్థానాంశను శత్రుస్థానాంశను పొందినవాడును, పరాజయహతః = అపజయమును పొందినవాడు కొట్టబడినివాడు, పాపిభిః= పాపగ్రహములచేత । నిద్యుతిః= కాంతిరహితుడైనవాడు, ఎవడుకలడో, తద్భావస్య = ఆభావమునకు, వినాశనం = నాశమును, నిగదితం= చెప్పబడినది. ఇతి = ఈప్రకారము, తన్వాదిభానాం = లగ్నము మొదలు పండ్రెండు భావములకు, క్రమాత్ = వరుసగా, నిగదితం= చెప్పబడినది.

తా॥ లగ్నము మొదలు పండ్రెండు స్థానములలో నేభావమును విచారింతురో ఆభావాధిపతి పూర్వము దుష్టస్థానమందుండి వచ్చినవాడును, నీచరాశియందు శత్రుక్షేత్రమందు నున్నవాడు, అస్తంగతుడైనవాడు, శుభగ్రహములతో కూడికయు వీక్షణము లేక పాపగ్రహములతో సంబంధము వీక్షణము మొదలగునవి కలవాడు, నీచాంశను శత్రుక్షేత్రాంశను పొందినవాడును, యుద్ధములో నోడినవాడు కొట్టబడినవాడు, పాపగ్రహములతోగూడి యుండుటచే కాంతి రహితుడగునట్టి యేభావాధిపతికలడో ఆభావమునకు నాశనము కలుగునని లగ్నము మొదలు పండ్రెండు భావములకును వరుసగా జెప్పబడెను. పూర్వము ఉచ్చస్వక్షేత్రాది స్థానస్థితులవలన శుభగుణములను నీచపరాజయాది దోషములచే నశుభగుణములను జెప్పబడినప్పటికి తిరిగి చెప్పుటకు కారణమేమనగా పూర్వము సామాన్యముగ జెప్పబడినను యిప్పుడు విమర్శించి చెప్పెనని తాత్పర్యము.

{అథ భావాధిపతి బలానుసారేణ భావానాం వృద్ధియోగమాహ.}

శ్లో॥ యద్భావపతి స్త్రికోణగృహగః కేంద్రత్రికోణాత్రికో మిత్రోచ్చస్వగృహాంశగో బలవతోరేత్యస్థితస్సౌమ్యయో । ర్మధ్యే తత్పతిషూచ్చగేషుచ శుభైర్యుక్తేక్షితోవాగ్రహ । స్తత్తద్భావఫల స్యవృద్ధిమతులాం శీఘ్రంకరోతిక్రమాత్ ॥ ౧౦ ॥

టీ॥ యద్భావపతిః= ఏయేభావాధిపతి, త్రికోణగృహగః = త్రికోణము లగు పంచమ నవమముల యందుండునో, కేంద్రత్రిలాభాశ్రితః= కేంద్ర=కేంద్రముల యందు, త్రి=మూడింటియందు, లాభ, ఏకాదశమందు, ఆశ్రితః= నివసించియుండు నో, మిత్రోచ్చస్వగృహాంశగో= మిత్ర= మిత్రక్షేత్రమందును, స్వగృహాంశగః=స్వ క్షేత్రాంశను పొందినవాడును, బలవతోః = బలవంతులకు, సౌమ్యయోః = శుభ గ్రహములయొక్క, మధ్యే= నడుమను, స్థితః= ఉన్నవాడును, తత్పతిషు= ఆ భావా ధిపతులు, ఉచ్చగేషు = ఉచ్చమములయందుండగ, శుభైః = శుభగ్రహములచే, యుక్తేక్షితోవా = కూడియుండినవాడు చూడబడినవాడునగు, గ్రహః= ఏగ్రహ ముకలదో, తత్తద్భావఫలస్య=ఆయాభావఫలమును, అతులాం=విశేషమును,వృద్ధిం= వృద్ధిని, శీఘ్రం= శీఘ్రముగ, క్రమాత్= క్రమముగ, కరోతి = చేయుచున్నాడు.

తా॥ ఏభావాధిపతియైనను త్రికోణము కేంద్రము తృతీయము లాభము ఈ స్థాన ములలో నెచ్చటనైన నుండగాను ఆస్థానములు అతనికి మిత్రక్షేత్రస్వక్షేత్ర ఉచ్చ మములు వానియంశలలో నేదైన నగుచుండగాను మరియు బలవంతులగు రెండు శుభగ్రహముల నడుమ నుండగాను ఆరెండు గ్రహము లుచ్చమమునందుండగానులేక శుభుల సంబంధముగాని చూపుగాని కలిగియున్నను అట్టి సమయమందు జనియించిన వానికి నాయాభావాధిపతి నాయాభావసంబంధమగు నైశ్వర్యాది వృద్ధులను శీఘ్ర ముగ కలుగజేయును.

{అథ భావభావేశ కారకాది గ్రహాణాం పాపత్వ వశాద్ధనిష్ట ఫలమాహ.}

శ్లో॥ భావోభావపతిశ్చకారక ఖగస్తేపాపమధ్యస్థితాః । పాపై శ్శక్తిభిరన్వితాశ్చ విబలాస్సౌమ్యైరయుగ్వీక్షితాః । తేషాంభాగ్యసు ఖాష్టధీవ్యయగతాః పాపాస్తదంశక్షపా । స్తద్భావేరిపునీచమూఢ విజితాశ్చే ద్భావహానింవదేత్ ॥ ౧౧ ॥

టీ॥ భావః= భావము, భావపతిశ్చ=ఆభావమునకు నధిపతియు, కారకఖగః= కారకుడగు గ్రహము, తే= ఆమూడు గ్రహములును, పాపమధ్యస్థితాః= పాపగ్రహముల నడుమనున్నను, శక్తిభిః= బలవంతులగు, పాపైః= పాపగ్రహములతో, అన్వితాశ్చ= కూడియున్నను, విబలాః= బలములేనివారైనను, సౌమ్యైః= శుభగ్రహముతో, అయుగ్వీక్షితాః= కూడుకొనినవారు చూడబడినవారుగాకుండినను తేషాం= పూర్వము జెప్పబడిన భావభావాధిప కారకగ్రహములకు, భాగ్యసుఖాష్టధీ వ్యయగతాః= భాగ్య= తొమ్మిది, సుఖ= నాలుగు, అష్ట=ఎనిమిది, ధీ=అయిదు, వ్యయ= పండ్రెండు, గతాః=ఈపైన జెప్పబడిన స్థానములయందున్నవారు, పాపాః= పాపులైనను, తదంశర్క్షపాః = ఆభావభావాధిపకారక గ్రహముల నవాంశ రాశ్యధిపతులు, తద్భావే=అప్పుడు విచారింపబడెడు భావమునందున్నవారలై, రిపునీచమూఢజితాశ్చేత్= శత్రుత్వము నీచత్వము అస్తమయము పరాజితత్వము మొదలగు దోషములు కలవారలగుచేని, భావహానిం= ఆవిచారింపబడు భావమునకు హానిని, వదేత్= చెప్పవలయునని.

తా॥ భావభావాధిపకారక గ్రహములకు పాపత్వము కలిగినయెడల సంభవించునష్టమును జెప్పుచున్నాను. విచారింపబడు భావముగాని ఆభావాధిపతిగానికారకుడుగాని పాపగ్రహముల నడుమనున్నను, బలవంతులగు పాపగ్రహములతో గూడుకొనినను, బలములేనివారైనను, శుభగ్రహములచే జూడబడకుండినను లేక వారితో గూడి యుండకపోయినను,మరియుఆభావభావాధిపకారక గ్రహములకు 9-4-8-5-12 వ స్థానములయందున్నవారు పాపులైనను, మరియు భావభావాధిపకారక గ్రహముల యొక్క నవాంశ రాశ్యధిపతులు విచారింపబడు భావమునందున్న వారగుచుండగ ఆస్థానము శత్రుక్షేత్రము నీచస్థానము అయియుండుటగాని లేక అస్తమయము యుద్ధములో నోడిపోవుట మొదలగు దోషములు సంభవించిన ఏభావమునుగురించి విచారింతురో ఆభావమునకు నాశనముగ నెరుంగవలయునని చెప్పిరి.

## అథ గ్రహాణాముపాధి వశాచ్ఛుభత్వమాహ.

శ్లో॥ స్వర్క్షోచ్చాదిసుహృత్త్రికోణసహితే రాశ్యంశవర్గోత్తమే।
సౌమ్యస్సౌఖ్యకరోథపాప ఖచరోప్యేవంవిధశ్చేచ్ఛుభః । యద్భేశ
స్థితభాంశపా బలయుతాశ్చేత్తద్భపోలాభకృ । ద్యస్యాంశర్క్షగతో
బలీహిత ఖగస్సౌమ్యోపితస్యార్థదః ॥ ౧౩ ॥

టీ॥ సౌమ్యః= శుభగ్రహము, స్వర్క్షోచ్చా= సహితే, స్వర్క్ష స్వక్షేత్రము ఉచ్చాది= ఉచ్చస్థానము మొదలగునదియు, సుహృత్= మిత్రక్షేత్రము, త్రికోణ

సహితే= త్రికోణము మొదలగువానితో గూడినట్టి, రాశ్యంశవర్గోత్తమే= రాశి నవాంశల వర్గోత్తమాంశలయందున్నవాడైన యెడల, సౌఖ్యకరః = సౌఖ్యముజేయు వాడగును, పాపఖచరోపి = పాపగ్రహమైనను, ఏవంవిధశ్చేత్ = పైనజెప్పబడిన శుభలక్షణములు కలిగిన వాడగునేని, శుభః=శుభుడగును, యద్భేశస్థితభాంశపాః= యద్భేశస్థిత= ఏభావాధిపతియుండు, భాంశపాః= రాశ్యంశాధిపతులు, బలయుతా శ్చేత్= బలముతోగూడినవారగునేని, తద్నృపః = ఆరాశ్యంశాధిపతి, లాభకృత్ = లాభముజేయు వాడగును, యస్య= ఏగ్రహముయొక్క, అంశర్క్షగతః = రాశ్యంశ యందున్నవాడు, బలీ= బలవంతుడును, హితఖగః= మిత్రగ్రహమును, సోమ్యోపి= శుభగ్రహమునగునేని, తస్య=అజాతునకు, అర్థదః= ఐశ్వర్యము నిచ్చువాడగును.

తా॥ గ్రహములకు నప్పుడుండెడు స్థానసంబంధముచే శుభత్వము కలుగుటను గురించి చెప్పుచున్నాను. స్వభావముచే శుభగ్రహము స్వక్షేత్రము ఉచ్ఛత్వముమిత్ర క్షేత్రము త్రికోణములతో గూడినట్టి రాశ్యంశ వర్గోత్తమాది యంశలయందున్న వాడగునేని సౌఖ్యముజేయువాడగును. పైన జెప్పబడిన శుభలక్షణములు కలిగియున్న యెడల పాపగ్రహమైనను శుభుడే యగును. ఏభావాధిపతియైనను తనయున్న రాశ్యం శాధిపతికి శుభగ్రహ సంబంధమున్నయెడల బలము కలవాడగును. కాబట్టి ఆభావా ధిపతి లాభముజేయువాడగును. ఏరాశ్యంశను పొందినగ్రహము బలముగలవాడును మిత్రగ్రహమును సౌమ్యగ్రహమునగునో ఆగ్రహము ఆజాతునకు ధనము నొసగు వాడగును.

## { అథ రాశీనాం గ్రహాణాంచ సంబంధాది వశా చ్ఛుభాశుభ ఫలమాహ. }

శ్లో॥ రిష్ఫాష్టారిగతస్య రాశిర శుభ స్తద్భేశయుగ్దృష్టభం। భ్రష్టంస్యాత్క్రమశ స్సితజ్ఞగురవస్స్యు స్తేషుసౌఖ్యప్రదాః । మిత్రోచ్చస్వభగా ష్షడంత్యమృతిగావా సౌమ్యదృష్టాశ్శుభా । స్తన్నాథా రిపునీచమూఢవిజితా శ్చేత్తద్గృహాస్థాశ్శుభాః ॥ ౧౮ ॥

టీ॥ రిష్ఫాష్టారిగతస్య= రిష్ఫ= ద్వాదశమందును, అష్ట= ఎనిమిదవరాశియం దును, అరి= ఆరింటయందును, గతస్య= పొందినగ్రహముయొక్క, రాశిః= రాశి, అశుభః= మేలుచేయునదికాదు, తద్భేశయుగ్దృష్టభం = తద్భేశ= ఆరాశినాథులతో యుక్= యుక్= కూడినట్టియు, దృష్టభం= చూడబడినట్టిరాశి, భ్రష్టం=చెడిపోవు నది, స్యాత్ = అగును, తేషు= ఆస్థానములయందు, క్రమశః= క్రమముగ సితజ్ఞ

గురవః= శుక్ర బుధ బృహస్పతులు, సౌఖ్యప్రదాః= సౌఖ్యమునిచ్చువారు,స్యుః= అగుదురు. షడంత్యాష్టగాః=షట్=ఆరు, అంత్యా= పండ్రెండు, ష్టగాః=ఎని మిది యీస్థానములను పొందినవారు, మిత్రోచ్చస్వభగాః = మిత్ర క్షేత్ర ఉచ్చస్వ క్షేత్రములనుండిన వారుగాని, సౌమ్యదృష్టావా= శుభగ్రహములచే జూడబడినవారు గాని యగుదురేని, శుభాః= శుభులగుదురు, తస్నాధాః= అనష్టాష్టమ ద్వాదశాధి పతులు, రిపునీచమూఢవిజితాశ్చేత్ =రిపు=శత్రుక్షేత్రమందుండుట, నీచ= నీచయం దుండుట, మూఢ= అస్తమయమును పొందుట, విజితాశ్చేత్ =యుద్ధములోడిపోవుట మొదలగు గుణములు కలవారగుదురేని, తద్గృహస్థాః = ఆరాసులయందున్నవారు, శుభాః= శుభులగుదురు.

తా॥ రాసులకు గ్రహములకు సంబంధమువలన శుభాశుభఫలములను జెప్పు చున్నాను. పండ్రెండు యెనిమిది ఆరుస్థానములయందున్నవానియొక్క రాశిమంచిది కాదు. కాబట్టి 6-8-12 స్థానములు శ్రేష్ఠములు కావని యభిప్రాయము. 6-8-12 స్థానాధిపతులచే జూడబడినరాశిగాని కూడియున్నరాశిగాని శ్రేయస్కరమైనదికాదు 12-8-6 గృహములయందు శుక్ర బుధ బృహస్పతులు వరుసగా నుండిరేని సౌఖ్యము నిచ్చువారగుదురు. 6-8-12 గృహములయందున్నవారికి ఆగృహములు మిత్రక్షేత్ర ఉచ్చస్వక్షేత్రములైన యెడలను లేక శుభగ్రహములచే జూడబడినను 6-8-12 గృహ ములనుండువారు శుభులగుదురు. 6-8-12 గృహపతులు శత్రుక్షేత్రమందు నీచ మందుండినను అస్తమయము పరాజితత్వము సంభవించినను 6-8-12 గృహములయం దుండినవారు శుభులగుదురు.

{ అథ గ్రహాణాం దృగ్బలక్షణ్యాం గురు శని కుజ శుక్రాణాం బలవిశేషంచాహ. }

శ్లో॥ బాలోవృద్ధఖగోస్తగశ్చవిజితః పశ్యన్నపశ్యత్యసౌ।శుక్లా శుక్లదినైశ్శుభాశుభఖగాః పూర్వాముఖాద్యుత్క్రమాత్ । పశ్చా ద్దృష్టియుతో దృఢస్సురగురుర్మందో బుజుశ్శక్తిమాన్। మూఢస్థోపి భృగుశ్శనిశ్చబలవాన్ బౌమోరిగోవాబలీ ॥ ౧౫ ॥

టీ॥ బాలః= బాలత్వము కలిగిన గ్రహమును, వృద్ధఖగః= వార్ధక్యము కలిగిన గ్రహమును, అస్తగశ్చ= అస్తమయము పొందిన గ్రహమును, విజితః = ఓడిపోయిన వాడును, అసౌ= ఈగ్రహము, పశ్యన్= చూచుచున్నను నపశ్యతి = చూచువాడు కాడు, శుభాశుభఖగాః= శుభ= శుభగ్రహములు, అశుభఖగాః = పాపగ్రహములు శుక్లాశుక్లదినైః = శుక్ల = శుక్లపక్షదినములచేతను, అశుక్లదినైః = బహుళపక్షదిన

ములచేత, పూర్వాముఖాద్వ్యత్క్రిమాత్ = పూర్వాముఖాత్ = పూర్వముఖముగాను వ్యత్క్రిమాత్ = పశ్చిమ ముఖముగాను జూచుచు, శుభాః = శుభులగుదురు. సుర గురుః = బృహస్పతి, ప్రత్యగ్దృష్టియుతః = పశ్చిమాభిముఖ దృష్టిగలవాడైనయెడల, దృఢః = బలముకలవాడు, మందః = శని, ఋజుః = ఋజుగతిగలవాడగు నేని, శక్తిమాన్ = బలముకలవాడు, భృగుశ్చ = శుక్రుడును, శనిశ్చ = శనియును, మూఢస్తోపి = అస్తమయమును పొందిన, బలవాన్ = బలముకలవాడు, భౌమః = అంగారకుడు, అరిగోవా = శత్రుక్షేత్రమందుండెనేని, బలీ = బలముకలవాడగును.

తా॥ గ్రహములకు దృష్టివిషయమై పరస్పరమువిలక్షణము సంభవించుటయు గురు శని కుజ శుక్రులకు బలవిశేషమును జెప్పుచున్నాను. బాలత్వవృద్ధత్వ అస్తమయత్వ పరాజితత్వము మొదలగు గుణములు కలిగిన గ్రహము చూచుచున్నవాడైనను చూడనివాడేయగును. శుభగ్రహములు శుక్లపక్షమునందు పూర్వముఖముగ జూచువారై శుభమునిత్తురు. పాపగ్రహములు బహుళపక్షమునందు పశ్చిమ ముఖముగా జూచువారలై శుభము నిత్తురు. బృహస్పతి పశ్చిమముఖ దృష్టిగలవాడగునేనిబలము కలవాడగును. శని ఋజుగతి కలవాడగునేని బలముకలవాడు. శుక్రుడు శనియును అస్తమయమును పొందినవారగుదురేని బలము కలవారగుదురు. అంగారకుడు శత్రుక్షేత్రమును పొందినయెడల బలముకలవాడు.

## అథ గ్రహాణాం శుభత్వ విశేషమాహ.

శ్లో॥ కేంద్రే భ్రాతృధనాయధీ నవమగాష్షష్ఠేపి సౌమ్యాశ్శుభాః। క్రూరాశ్చోపచయస్థితా రవిశనీధర్మస్థితౌ జ్ఞోష్టమే। స్వోచ్చస్వర్క్షసురేజ్యభస్థ రవిజో లగ్నస్థితోపీష్టకృ। చ్ఛుక్రో ద్వాదశ సంస్థితోపి శుభదో మందాంశరాశీవినా॥ ౧౬॥

టీ॥ సౌమ్యాః = శుభగ్రహములు, కేంద్రే = కేంద్రములయందును, భ్రాతృ = మూడింటియందును, ధన = రెండింటియందును, ఆయ = పదకొండింటి యందును, ధీ = పంచమమందును, నవమగాః = తొమ్మిదింట నున్నవారై యుండగా, షష్ఠేపి = ఆరవమందున్నను, శుభాః = మేలుచేయుదురు. క్రూరాః = పాపులు, ఉపచయస్థితాః = మూడు ఆరు పది పదకొండు గృహములయందున్నవారై, శుభాః = శుభులగుదురు, ధర్మస్థితౌ = నవమగృహమందున్నట్టి, రవి శనీ = సూర్యశనులు, అష్టమే = ఎనిమిదవ గృహమందున్న, జ్ఞః = బుధుడు, శుభులగుదురు, స్వోచ్చ = రవిజః, స్వోచ్చ = తనయుచ్చమమందును, స్వర్క్ష = స్వక్షేత్రమందును, సురేజ్యభస్థ = బృహస్పతియొక్క రాశియందునున్నట్టి, రవిజః = శనియును, లగ్నస్థితోపి = లగ్నమందున్నవాడైనను, ఇష్టకృత్ = చేయువాడగును, శుక్రః = శుక్రుడు, మందాంశ

రాశివినా=శనియొక్క రాశిగాని అంశగానివిడిచి, ద్వాదశసంస్థితోపి= పండ్రెండవ గృహమందున్నవాడైనను, శుభదః= శుభమును చేయువాడగునని చెప్పుచున్నారు.

తా॥ అన్నిగ్రహములకును శుభత్వము కలుగునట్టి కారణమును జెప్పుచున్నాను. శుభగ్రహములు కేంద్రములగు ౧-౪-౭-౧౦ గృహములయందును, 3-౫-౧౧-౫-౯-౬ గృహములయందు నున్నవారై శుభులగుదురు. 3-౬-౧౦-౧౧ గృహములయందు నున్న పాపగ్రహములు మేలుచేయుదురు. తొమ్మిదింటనున్న సూర్యశనులును ఎని మిదింటనున్న బుధుడును శుభులేయగుదురు. ఉచ్చరాశియందును స్వక్షేత్రమందును బృహస్పతియొక్క రాశియందైనను శనియుండునప్పుడు అట్టి సమయమందు లగ్నమం దున్నను శని మంచివాడేయగును. శుక్రుడు పండ్రెండవరాశియందున్నను శనియొక్క రాశిగాని యంశగాని కానియెడల మేలుచేయువాడే యగును.

{ అథ శుభానాం పాపానాంచ పాదవృద్ధ్యా శుభత్వ
పాపత్వ తారతమ్య మాహ, }

శ్లో॥ క్షీణేందుశ్చసుధాంశుజశ్చ భృగుజః పూర్ణేందుజీవౌక్రమా। దేకద్విత్రిచతుష్పదాత్మక శుభాశ్చాథేజ్యశుక్రౌతథా। సౌమ్యస్థాయదినాయకేనశుభదౌ క్షీణేందుపాపేందుజౌ । సూర్యోరాహుకుజౌచకేతు రవిజౌపాదాధికాత్పాపదాః ॥ ౧౭ ॥

టీ॥ క్షీణేందుజశ్చ= క్షీణచంద్రుడును, సుధాంశుజశ్చ= బుధుడును, భృగుజః= శుక్రుడును, పూర్ణేందుజీవౌ= పూర్ణచంద్రబృహస్పతులును, క్రమాత్=వరుసగా, ఏక= శుభాః ఒకటి రెండు మూడు నాలుగు పాదములయందుండినను శుభులగుదురు. అథ= అనంతరమందు, ఇజ్యశుక్రౌ= బృహస్పతి శుక్రులు, న్నాయకేన= రాశినాధునితో గూడినను, సౌమ్యస్థాయది= శుభక్షేత్రమందున్నయెడల, తథా = అప్రకారమే, శుభదౌ= మేలుచేయుదురు. క్షీణేందు= క్షీణచంద్రుడును, పాపేందుజౌ= పాపులతో గూడిన బుధుడును, సూర్యః=సూర్యుడును, రాహుకుజౌచ = రాహువు అంగారకులును, కేతురవిజౌ= కేతువు శనియును, పాదాధికాత్= పాద వృద్ధిచే, పాపదాః= పాపఫలము నిచ్చువారగుదురు.

తా॥ పాదవృద్ధిచే శుభగ్రహములకు శుభత్వమును పాపగ్రహములకు పాపత్వమును తారతమ్యముగా జెప్పుచున్నాను. క్షీణచంద్రుడు నాల్గవవంతుశుభుడు బుధుడు రెండువంతులు శుభుడు. శుక్రుడు మూడువంతులు శుభుడు. పూర్ణచంద్ర బృహస్పతులు నాల్గుపాదములును శుభులేయగుదురు. మరియు గురుశుక్రులు శుభక్షేత్రమందుండినవారై ఆరాశినాధునితో గూడినవారై శుభమునిచ్చువారగుదురు. ఇక పాపుల విషయమెట్లనగా- క్షీణచంద్రుడు పాపులతో గూడిన బుధుడును ఒకవంతుపాపులు. సూర్యుడు రెండువంతులును రాహు కుజులు మూడువంతులును కేతు శనులు సంపూ

ణకముగాను పాపఫలగుదురు. ఈప్రకారము శుభగ్రహములు శుభత్వమును గురించి యు పాపగ్రహము లు పాపత్వమును గురించియు నొక్కొక్కపాదము వృద్ధిచెప్పిన ఫలము నిత్తురు.

## అథ భావకారకాదీనాం ఫలవిచారః.

శ్లో॥ భావానాంఫలకారకాశ్చ విముఖానైసర్గికశ్చాధయ । ద్భావేశాన్వితభాంశపావపి తథాతద్భావతత్కారకౌ । యద్యత్కారకరాశిగో శుభఖగస్తత్తత్ఫలధ్వంసక । స్తత్తత్కారకభావయోగ వశతస్స్వల్పం ఫలంకారయేత్ ॥ ౧౨ ॥

టీ॥ భావానాం= భావములయొక్క, ఫలకారకాశ్చ= ఫలమునిచ్చు గ్రహములు, విముఖాః= ప్రతికూలమైనవారై యుండగాను, నైసర్గికశ్చ=స్వభావసిద్ధముగా ఫలమునిచ్చువాడు విముఖుడైయుండగాను, అథ= అనంతరము, యద్భా= పావపి= యద్భావేశ=ఏభావాధిపతితో, అన్విత = కూడినట్టి, భాంశపావపి= రాశియొక్క యంశాధిపతులును, తథా = ఆప్రకారముగానే, తద్భావతత్కారకౌ = ఆభావము యొక్క కారకగ్రహములును, యద్యత్కారకరాశిగః = యద్యత్కారక=ఏయే కారకునియొక్క, రాశిగః= రాశియందుండినవాడు, అశుభఖగః= పాపగ్రహమైయుండగా, తత్తత్ఫలధ్వంసకః= ఆయాభావములయొక్క ఫలములను చెడగొట్టువాడును, తత్తత్కారక=వశతః, తత్తత్కారక = ఆయాకారకునియొక్క, రాశియోగవశతః= ఉండునట్టిరాశి సంబంధమువలన, స్వల్పం= కొంచమైన, ఫలం= ఫలమును, కారయేత్= చేయును.

తా॥ భావములు కారకులు మొదలగువారియొక్క ఫలము విచారించబడును. పూర్వము చెప్పబడిన ప్రకారము భావములకు ఫలకారకులైనవారును, స్వతస్సిద్ధముగ కారకగ్రహమును, ఆయాభావాధిపతియున్నట్టి రాశియొక్క యంశాధిపతులును ఆయాభావ కారకగ్రహములును, ప్రతికూలముగా నుండగాను ఏకారకునియొక్క రాశియందు పాపగ్రహముండునో అట్టికారకుడు ఆయాభావఫలమును చెడగొట్టును. మరియు ఆయాభావకారకు డాయాభావముల యందుండెనేని స్వల్పమగు ఫలము నిచ్చును.

## అథ ఛాదకత్వాది సంజ్ఞామాహ.

శ్లో॥ పూర్ణేంద్విజ్యశసిధ్వజా స్స్వయుతభాద్వి ర్వ్యాదశచ్ఛాదకా। దుష్టశ్చేద్విపణోపిరిప్ఫభవనే శేషాః పరశ్చాదకాః। దృష్ట్యాప్తేత్రియుతేనవా సహాయుజాన్యోన్యక్ష యుక్తేనవా।సద్వ్యోభానపభావకారక ఖగాశ్శక్తాఃక్రిమాద్యోగదాః ॥ ౧౯ ॥

టీ॥ పూర్ణేంద్విజ్యశనిధ్వజాః= పూర్ణేందు= నిండుచంద్రుడు, ఇజ్య= బృహస్పతి, శని = శనియు, ధ్వజాః= కేతువు, స్వయుతభాత్= తాముండురాశిమొదలు ద్విర్ద్వాదశచ్ఛాదకాః= రెండు పండ్రెండురాసుల నాచ్ఛాదించువారగుదురు. ఆచ్ఛాదనమనగా కప్పుట, ధిషణః=బృహస్పతి, దుష్టశ్చేత్=పాపుడగునేని, రిష్ఫభవనే= పండ్రెండవరాశియందు నాచ్ఛాదకుడగును, శేషాః=మిగిలిన గ్రహములు, పురచ్ఛాదకాః= ముందుండు రాసుల నాచ్ఛాదింతురు. దృష్ట్యా= చూచుటచేతను, క్షేత్రయుతేనవా= రాశియందుండుటచేతనుగాని, సహాయుజా= కూడుకొని యుండుటచేతను గాని, అన్యోన్యర్క్షయుక్తేనవా = ఒకరి రాశియందొకరుండుటచేతనుగాని, సర్వే= సమస్తమైన, భావపభావకారకఖగాః= భావప= భావాధిపతులును, భావకారకఖగాః= భావముయొక్క కారకగ్రహములును, క్రమాత్ = వరుసగా, శక్తాః= సమర్థులై, యోగదాః= యోగమునిచ్చువారగుచున్నారు.

తా॥ ఆచ్ఛాదకత్వము మొదలగు సంజ్ఞలను చెప్పుచున్నారు. సంపూర్ణ చంద్రుడు బృహస్పతి శని కేతువు అగు నలుగురు తమయుండెడిరాశికి రెండవరాశిని పండ్రెండవరాశిని ఆచ్ఛాదింతురు. బృహస్పతి దోషలక్షణములు కలవాడగునేని పండ్రెండవరాశి నాచ్ఛాదించును. మిగిలిన సూర్యకుజబుధ శుక్రరాహువులుతామున్న రాశికి ముందురాసుల నాచ్ఛాదించువారగుదురు. సమస్తమైన భావాధిపతులును భావకారకులును క్రమముగ చూచుటచేతగాని తమరున్నరాశి విశేషము చేతనుగాని ఇతరగ్రహములతోగూడి యుండుటచేతనుగాని యొకరాశియందొక రుండుటచేతను గాని బలముగలవారలై యోగము నిచ్చువారగుదురు.

### {అథ భావస్థగ్రహవశాచ్ఛాదక వేధకాదిసంజ్ఞాం మారక నిరూపణంచాహ.}

శ్లో॥ యద్యద్భావధనర్క్షసంస్థిత ఖగ స్తచ్ఛాదకాఖ్యస్స్మృతః। స్థభాత్రిత్వస్థఖగోపి వేధక ఖగస్తద్బంధుగోబంధకః । తద్రంధ్రే ప్రతిబంధకోత్రిసహితా త్తద్బంధువృద్ధిక్షయా । స్యాతాంభావధనాస్తభద్వ్యయ పతీ తన్మారకాఖ్యౌ క్రమాత్ ॥ ౨౦ ॥

టీ॥ యద్య= ఖగః, యద్యద్భావ = ఏయేభావమునకు, ధనర్క్ష= ద్వితీయ రాశియందు, సంస్థితఖగః= ఉండునట్టి గ్రహము, తచ్ఛాదకాఖ్యః= ఆభావమునకు ఛాదకుడైన గ్రహమగును. తద్భాత్రిత్వస్థఖగోపి = ఆభావమునకు మూడవరాశియందుండిన గ్రహము, వేధకఖగః= వేధకమనెడు గ్రహమగును. తద్బంధుగః=ఆభావమునకు నాల్గవస్థానమందుండు గ్రహము, బంధకః=బంధకమనెడు గ్రహము, తద్రం

ధే) ఆభావమునకు నష్టమరాశియందుండువాడు, ప్రతిబంధకః= ప్రతిబంధకుడను గ్రహము, అత్ర= ఈయష్టమస్థానమందు, సహితాత్ =కూడియున్నట్టిగ్రహములవల్ల తద్దంధవృద్ధిక్షయా= తదభిధ= ఆభిదములయొక్క, వృద్ధిక్షయా= వృద్ధిక్షయములు, స్యాతాం= అగుచున్నవి. భావ=పతీభావ= భావమునకు, ధన= ద్వితీయ స్థానముయొక్కయు అస్తభ= సప్తమస్థానముయొక్కయు, పతీ=అధిపతులు, క్రమాత్= వరుసగ, తన్మారకాఖ్యౌ= ఆద్వితీయ సప్తమస్థానములకు మారకులు.

తా॥ భావమందున్న గ్రహసంబంధముచే బాధకము వేధకము మొదలగు సంజ్ఞలను మారకస్థానమును నిరూపించుటయును జెప్పుచున్నాను. ఏభావమునకైనను రెండవస్థానమందుండినట్టి గ్రహము ఆభావమునకు బాధకుడనియు తృతీయస్థాన మందున్న గ్రహము వేధకుడనియు చతుర్థమందున్న గ్రహము బంధకుడనియు అష్టమమందున్న గ్రహము ప్రతిబంధకుడనియు జెప్పబడును. అష్టమమందున్న గ్రహమువల్ల సమస్త విషయములయొక్క వృద్ధిక్షయములను దెలిసికొనవలయును. అనగా నష్టమమందున్న గ్రహమునకు శుభలక్షణములున్నయెడల వృద్ధియును పాపలక్షణములున్నయడల హానియును కలుగును. లగ్నమునకు ద్వితీయ సప్తమరాశ్యధిపతులు ఆభావమునకుమారక గ్రహములగుదురు. ఆప్రకారముగానే ప్రతి భావమునకును దెలిసికొనవలయును అనగా లగ్నము తనుస్థానమగుటవల్ల ద్వితీయ సప్తమాధిపతులు జాతకునకు మారకులై నట్లుగానే సోదరస్థానమగు తృతీయమునకు ద్వితీయ సప్తమాధిపతులు సోదరభావమునకును, మాతృపుత్ర కళత్ర పితాదిస్థానములకు ద్వితీయ సప్తమాధి పతులు మాతృపుత్రకళత్ర పితాది భావములకును మారకగ్రహము లగుదురని తెలిసికొనవలయును.

## అథ స్వాధీనవేధా దీ నుచ్యతే.

శ్లో॥ మిత్రక్రూరఖగస్యదృష్టిరనఘైః స్వాధీనవేధాస్మృతా శత్రుక్రూరనిరీక్షితేనచ పరాధీనాఖ్యవేధాభవేత్ । పాపైఃపూర్వ ఫలం తతోంతిమఫలంసౌమ్యైఃఖలైస్తాదృశం । సౌమ్యాసౌమ్యఖ[illegible] ర్బలాధికతమై స్స్యాద్భాగ్యమాయుః క్రమాత్ ॥ ౨౧ ॥

టీ॥ మిత్రక్రూరఖగస్య= మిత్రుడగు క్రూరగ్రహముయొక్క, దృష్టిః= చూ[illegible] అనఘైః= శుభులచేత, స్వాధీనవేధా= స్వాధీనవేధయని, స్మృతా= చెప్పబడిన[illegible] శత్రుక్రూరనిరీక్షితేనచ= శత్రువైన క్రూరగ్రహముయొక్క చూపుచేత, పాపైః= పాపులచేత, పరాధీనవేధా= పరాధీనవేధ=, భవేత్=అగును, సౌమ్యైః=శుభులచే[illegible] పూర్వఫలం= మొదటిఫలమును, తతః= అనంతరము, ఖలైః= పాపులచేత, అంతి[illegible]

ఫలం= చివరఫలమును చెప్పబడును, బలాధికతమైః = మిక్కిలి బలముగల, సౌమ్యా సౌమ్యఖగైః=శుభపాపగ్రహములచేత, క్రమాత్= వరుసగా, తాదృశం = అటువంటి ఫలమగు, భాగ్యం=ఐశ్వర్యము, ఆయుః=ఆయుర్దాయము, స్యాత్=అగును.

తా॥ స్వాధీన పరాధీన వేధలను గురించి చెప్పుచున్నాను. క్రూరగ్రహము మిత్రుడైన యెడల వానిదృష్టి తగిలినచో మిత్రత్వకారణమున శుభత్వములోజేరి స్వాధీన వేధయని చెప్పబడును. అప్రకారముగానే క్రూరగ్రహము తనకు శత్రువైన యెడల వానిదృష్టి శత్రుత్వకారణముచే పాపత్వములోజేరి పరాధీనవేధయని చెప్పబడును. అందువల్ల శుభత్వము సంభవించుటచే పూర్వఫలము పాపత్వము సంభవించుటచే చివరఫలముకలుగునని చెప్పబడెను. శుభగ్రహములుగాని పాపగ్రహములుగాని వాని వాని బలాధికముచే వానికి తగినట్లు భాగ్యము ఆయుర్దాయము మొదలగునవి వరుసగా కలుగుచుండునని జ్యోతిశ్శాస్త్రవేత్తలు వేదము వలన చెప్పియున్నారు.

{ అథ కేవలషష్ఠాష్టమవ్యయేశానాం సంబంధా ద్విపరీతాఖ్యం రాజయోగమాహ. }

శ్లో॥ రంధ్రేశోవ్యయషష్ఠగోరిపుపతౌ రంధ్రేవ్యయేవాస్థితే। రిష్ఫేశోపితథైవరంధ్రరిపుభేయస్యాస్తితస్మిన్వదేత్। అన్యోన్యర్క్షగతానిరీక్షణ యుతాశ్చాన్యైరయుగ్వీక్షితా। జాతోసౌనృపతిఃప్రశస్తవిభవో రాజాధిరాజేశ్వరః ॥ ౨౨ ॥

అ॥ రంధ్రేశః= అష్టమాధిపతి, వ్యయషష్ఠగః = పండ్రెండు ఆరుస్థానములందుండగాను, రిపుపతౌ= షష్ఠాధిపతి, రంధ్రే= అష్టమమందుగాని, వ్యయే= పండ్రెండవమందుగాని, స్థితే=ఉన్నవాడగుచుండగాను, తథైవ = అప్రకారముగానే, రిష్ఫేశోపి= ద్వాదశాధిపతియు, రంధ్రరిపుభే=అష్టమషష్ఠములయందుండినను, యస్య= ఏజాతకునకు, ఇదం=ఈయోగము, అస్తి=కలదో, తస్మిన్=వానివిషయమై, ఇత్థం= ఈప్రకారము, వదేత్= చెప్పవలయును. అన్యోన్యర్క్షగతాః = పైన చెప్పబడిన స్థానాధిపతులు ఒకరిరాశియందు నొకరుండగాను, నిరీక్షణయుతాః=ఒకరితో నొకరు కలసియుండుటగాని పరస్పర వీక్షణము సంభవించినవారై యుండగాను, అన్యైః=ఇతరులచేత, అయుగ్వీక్షితాః = చూపుకలిసియుండుటలేనివారై యుండగాను, జాతః= పుట్టినట్టి, అసౌ=ఈజాతకుడు, ప్రశస్తవిభవః= విశేషమైనైశ్వర్యము కలవాడుగాని, నృపతిః= రాజుగాగాని, రాజాధిరాజేశ్వరః=రాజాధిరాజుగాగాని, భవేత్ =అగును.

తా॥ ఇప్పుడు ఇతరస్థానాధిపతుల సంబంధములేక కేవలము షష్ఠాష్టమవ్యయాధిపతుల సంబంధముచే సంభవించెడి విపరీతరాజయోగమును జెప్పుచున్నాను. అష్టమ షష్ఠ ద్వాదశాధిపతులు ముగ్గురుగాని వారిలో నిద్దరుగాని అషష్ఠాష్టమద్వాదశమముల

లో నెక్కడైనను గూడియున్నను లేక యొకరియింట నొకరున్నను ఒకరినొకరుచూచు చుండినను పైన చెప్పబడిన మష్ఠాష్టమ ద్వాదశాధిపతులుగాక మరియితర గ్రహముల యొక్క యేవిధమగుసంబంధము లేకయుండగా పుట్టినజాతకుడు విశేషధనసంపన్నుడు గాగాని రాజుగాగాని రాజాధిరాజుగాగాని యగునని చెప్పిరి. ఇది కేంద్రకోణాధి పతుల సంబంధముచే కలిగిన రాజయోగమువలెనే మష్టాష్టమ వ్యయాధిపతులవలన కలి గిన విపరీతమగు రాజయోగమనిరి.

## { అథ దుర్బలపాపినాం బలవచ్ఛుభానాంచ శుభస్థాన స్థితివశాద్యోగ విశేషమాహ. }

శ్లో॥ పాపానీచగతాశ్శుభాబలయుతాః కేంద్రత్రికోణస్థితాః ఖేటాస్సూర్యాదికర్మభాగ్య గృహపాభాగ్యేథవాకర్మణి । రాజాస్యా న్మతిమాన్మహా ధనయుతఃఖ్యాతఃప్రతాపాన్వితో । దీర్ఘాయుఃపరభూ పవందిత పదస్సర్వజ్ఞతుల్యస్సుధీః ॥ ౨౩ ॥

టీ॥ పాపాః= పాపులగు, ఖేటాః= గ్రహములు, నీచగతాః=నీచమందున్నను బలయుతాః= బలముతో గూడియున్న, శుభాః శుభగ్రహములు, కేంద్రత్రికోణ స్థితాః= కేంద్రత్రికోణముల యందుండినను, కర్మభాగ్యగృహపాః= దశమ నవమ లగ్నాధిపతులు, భాగ్యే=నవమమందుగాని, అథవా= ఆలాగుకానియెడల, కర్మణి= దశమమందుగాని, స్యుః=ఉండినయెడల, మతిమాన్= విశేషబుద్ధిగలవాడును, మహాధనయుతః= విశేషధనముగల కోటీశ్వరుడును, ఖ్యాతః= లోకమునందు ప్రసిద్ధి గలవాడును, ప్రతాపాన్వితః= పరాక్రమవంతుడును, దీర్ఘాయుః= దీర్ఘాయుర్దా యము గలవాడును, పరభూపవందితపదః = ఇతరరాజులచే నమస్కరింపబడునట్టి పాదములు గలవాడును, సర్వజ్ఞతుల్యః= విశేషజ్ఞానముగల బుద్ధునితో సమానుడు గాను, సుధీః= విశేషవిద్వాంసుడుగాగాను, భవేత్ = అగును.

తా॥ పాపగ్రహములు దుర్బలులై యుండగాను శుభగ్రహములు బలవంతు లైయుండగాను అట్టిగ్రహములు శుభస్థానమందుండినయెడల కలుగునట్టి యోగవిశే షమును జెప్పుచున్నాను. నీచస్థితిచే బలహీనులైనట్టి పాపులును బలవంతులగు శుభు లును కేంద్రములయందుగాని త్రికోణములయందుగాని యుండినయెడల నొకరాజ యోగమగును. లగ్నాధిప నవమాధిప దశమాధిపతులు నవమమందుగాని దశమమందు గాని గూడియుండినయెడల నిదియొక రాజయోగమగును. ఇట్టియోగములలో జని యించినవాడు బుద్ధిమంతుడును విశేషధనముగల కోటీశ్వరుడును లోకప్రసిద్ధిగలకీర్తి మంతుడును విశేషపరాక్రమవంతుడును దీర్ఘాయుర్దాయముగలవాడును సమస్తరాజు

లచే నమస్కరింపబడువాడును విశేషజ్ఞానవంతుడగు బుధునితో సమానుడగువిద్వాంసుడునగును. ఈవిషయమందు కొందరు చెప్పినదేమనగా- లగ్న నవమ దశమాధిపతులు పాపులైనీచమందుండగాను రాజయోగమనియు ఆలగ్న నవమ దశమాధిపతులు శుభులై బలవంతులగుచు నవమమందుగాని దశమమందుగాని యుండినయెడల రాజాధిరాజయోగమనియు జెప్పిరి. పూర్వము ఫల గంధము మొదలగు వానియందు కేంద్రాధిప త్రికోణాధిపతులకే పరస్పరము సంబంధము కలిగియున్నయెడల యోగమునిచ్చునని చెప్పబడియున్నది. ఇక్కడనైతే బలహీనులగు పాపగ్రహములకు బలవంతులగు శుభగ్రహములకు కేంద్రకోణస్థాన స్థితివలన గ్రహసామాన్యముగ యోగము చెప్పబడెను. ఇది రాజయోగలక్షణము. ఇకను రాజాధిరాజయోగపక్షములో నవమాధిప దశమాధిపతులకే సంబంధము కలిగినయెడల యోగము నిచ్చునని యనేకులు చెప్పిరి. ఇక్కడనైతే లగ్నాధిప నవమాధిప దశమాధిపతులు ముగ్గురును నవమమందుగాని దశమమందుగాని యుండినయెడల రాజాధిరాజయోగమని చెప్పబడినది. ఇవియే పూర్వముకంటె విశేషమైయున్నది. ఇగిగాక మరియొక విశేషముకలదు. మరియు లగ్నమునకు కేంద్రసంజ్ఞయు కోణత్వసంజ్ఞయుకూడ కలదు. దశమాధిప నవమాధిపతులకు ప్రబలులగు కేంద్రాధిప కోణాధిపతులతో సంబంధము కలిగినయెడలకోణత్వ ధర్మముకల లగ్నాధిపతితో సమానాధికరణ్యముగ రాజాధియోగము అవి చెప్పుటకు తగియున్నది. అందువల్లనే బుద్ధిమంతుడు కోటీశ్వరుడు మొదలగు బహు లక్షణములు చెప్పబడినవి.

## అథ కేంద్రాదిసంజ్ఞాం ఉపచయస్థానానిచాహ.

శ్లో॥ లగ్నాస్తాంబుఖభంచతుష్టయమిదం కేంద్రాభిదంకంటకం। తత్కేంద్రాత్పరభంభవేత్పణపరం చాపోక్లిమంతత్పరం। భాగ్యం పంచమభం త్రికోణమితి తద్భ్రాత్రాయకర్మారిభం। నామ్నాచోపచయం జనీంసుభవనం లగ్నంచజన్మోదయః ॥ ౨౮ ॥

టీ॥ లగ్నాస్తాంబుఖభం= లగ్న= లగ్నము, అస్త= ఏడవరాశి, అంబు=నాల్గవ రాశి, ఖం= పదియవరాశి, ఇదం= ఈ, చతుష్టయం= నాలుగురాసులు, కేంద్రాభిదం= కేంద్రములనియు, కంటకం=కంటకమనెడు పేరుగలవియునగును, తత్కేంద్రాత్= ఆకేంద్రమునకు, పరభం= తర్వాతరాశి, పణపరం= పణఫరమనిచెప్పబడును, తత్పరం = ఆపణఫరమునకు తర్వాతిరాశి, ఆపోక్లిమం = ఆపోక్లిమమని చెప్పబడును, భాగ్యం= నవమరాశియు, పంచమభం= అయిదవరాశియు, త్రికోణమితి= త్రికోణములని చెప్పబడును. తద్భ్రాత్రాయకర్మారిభం= తద్భ్రాతృ=దానికి మూడవరాశియు, ఆయ= పదకొండవరాశియు, కర్మ= పదియవరాశియు, అరిభం=

ఆరవరాశియు, నామ్నా=పేరుచేత, ఉపచయం= ఉపచయమనబడును, జనీందు భవనం= జని= జన్మకాలమునకు, ఇందుభవనం=చంద్రుడున్న రాశియు, లగ్నంచ= లగ్నము, జన్మాదయః= జన్మము అనే మొదలగు పేరుగలవియగును.

తా॥ కేంద్రము మొదలగు సంజ్ఞలను ఉపచయస్థానములను జెప్పుచున్నాను. 1-4-7-10 ఈనాలుగు స్థానములను కేంద్రములనియు కంటకస్థానమనియు చెప్పబడును. ఆకేంద్రమునకు తర్వాత స్థానములగు 2-5-8-11 ఈస్థానములను పణఫరమని చెప్పుదురు. ఆపణఫరస్థానములకు తర్వాత రాసులగు 3-6-9-12 గృహములు ఆపోక్లిమము అని చెప్పబడును. 5-9 ఈరాసులను త్రికోణములని చెప్పదురు. వాటికి 3-6-10-11 గృహములు ఉపజయ గృహములని చెప్పబడును. జననకాలమున చంద్రుడున్న రాశియు జననలగ్నమును జన్మ అను మొదలగు పేరులచే జెప్పుదురు.

{ అథ రవీంద్వోర్జగద్వోనిత్వం కుజాదీనాం సత్వాదిగుణ విభాగం చాహ. }

శ్లో॥ రుద్రాత్మాసవితాపితాచ జననీశక్త్యాత్మకశ్చంద్రమాః। భౌమేందూద్భవజీవశుక్రరవిజా స్తత్వంచభూతోద్భవాః । సత్వాజ్జీవ శవీందుజాశ్చ రజసోభౌమ స్తమోజశ్శని। న్సూర్యేందూనతుమారకా వహితపౌ రంధ్రాధిపావార్తిదౌ ॥ ౨౫ ॥

టీ॥ సవితా= సూర్యుడు, రుద్రాత్మా= రుద్రస్వరూపుడు, పితాచ = పితృకారకుడునగును. చంద్రమాః=చంద్రుడు, శక్త్యాత్మకః= శక్తిస్వరూపుడును, జననీ= మాతృకారకుడునగును, భౌమేందూద్భవ జీవశుక్రరవిజాః= భౌమ = అంగారకుడు, ఇందూద్భవ= బుధుడు, జీవ=బృహస్పతి, శుక్ర = శుక్రుడు, రవిజాః = శనియు, తత్వంచభూతోద్భవాః= అపంచభూతములవలన బుట్టినవారు, జీవశవీందుజాః=బృహస్పతి శుక్రబుధులు, సత్వాత్= సత్వగుణమువల్లను భౌమః=అంగారకుడు, రజసః= రజోగుణమువల్లను బుట్టినారు, శనిః= శని, తమోజః= తమోగుణమువల్ల సంభవుడు, సూర్యేందూ= సూర్యచంద్రులు, అహితపౌ=అష్టమాధిపత్యముకలవారై, రంధ్రాదిపౌ= అష్టమాధిపత్యము కలవారయ్యును, ఆర్తిదౌ= పీడపెట్టువారగుదురు, మారకా=మారకమును జేయువారు, నతు = కారు.

తా॥ సూర్యచంద్రులకు జగత్కారణత్వమును అంగారకాది గ్రహములకు సత్వాదిగుణస్వభావమును జెప్పుచున్నాను. సాంబమూర్తి యష్టమూర్తిస్వరూపుడగుటవలనను సూర్యచంద్రులా యీశ్వరునకు దేహస్వరూపులగుటవల్లను సూర్యచంద్రు

లకు జగత్కారణత్వము చెప్పబడినది. అందువల్ల సూర్యుడు రుద్రస్వరూపుడనియు పితృకారకుడనియు చెప్పబడెను. చంద్రుడు శక్తిస్వరూపుడనియు మాతృకారకుడని యు జెప్పబడును. కుజ బుధ బృహస్పతి శుక్ర శనులు ఆకాశము మొదలగు పంచ భూతములవల్ల బుట్టినవారగుదురు. బృహస్పతి శుక్ర బుధులు సత్వగుణముకలవారు. అంగారకుడు రజోగుణము కలవాడు. శని తమోగుణము కలవాడు. సూర్యచంద్రులు షష్ఠస్థానమునకు నష్టమస్థానమునకు నాధిపత్యము కలవారైనయెడలపీడనుజేయుదురు గాని మారకమును జేయువారు కారు.

## అథ చాంద్రయోగ మాహ.

శ్లో॥ షట్సప్తాష్టమభేషుసౌమ్య ఖచరాస్త్విందోస్థితానోఖిలా। రాజాస్యాదథవాసమోయది తదాజాతో మహాసౌఖ్యవాన్।దీర్ఘాయు ర్విజయాన్వితోఖిల యశోవిద్యావినోదాన్వితో । దారాపుత్రసుహృ ద్గృహాది వివిధానందాస్పదోయానవాన్ ॥ ౨౮ ॥

టీ॥ ఇందోః= చంద్రుడున్న రాశినుండి, షట్సప్తాష్టమభేషు। ఆరుయేడుయెని మిదిరాసులయందు, సౌమ్యఖచరాః= శుభగ్రహములు, స్థితాః= ఉన్నవారగుచుండ గాను, నోఖిలాః= పాపులులేకుండగాను, తదా=అప్పుడు, జాతః= పుట్టినవాడు, రాజాస్యాత్= రాజుఅగును, అథవా= ఆలాగుకానియెడల, సమోవా = రాజుతో సమానుడుగాగాని, స్యాత్ = అగును, మహాసౌఖ్యవాన్ = విశేషసౌఖ్యముగల వాడును, దీర్ఘాయుః= దీర్ఘాయుర్దాయము కలవాడును, విజయాన్వితః= విజయముగల వాడును, అఖిలయశః = విశేషకీర్తికలవాడును, విద్యావినోదాన్వితః = విద్య లతో సంతోషించుచుండువాడును, దార= భార్య, పుత్ర= కుమాళ్ళు, సుహృత్= స్నేహితులు, గృహాది= గృహములు మొదలగు, వివిధ= అనేకవిధములగు ఆనంద= సంతోషములకు, ఆస్పదః= స్థానభూతమైనవాడును, యానవాన్ = వాహనములు కలవాడును, స్యాత్ = అగును.

తా॥ చంద్ర సంబంధమగు యోగము జెప్పుచున్నాను. చంద్రుడున్న రాశికి 6-7-8 గృహములయందు శుభగ్రహములుండి పాపగ్రహములు లేకుండినయెడల ఆట్టి సమయమునందు పుట్టినవాడు రాజుగాగాని రాజుతోసమానమైనవాడుగాని యగును. లేదా విశేషసౌఖ్యము కలవాడును, దీర్ఘాయువు కలవాడును, సమస్తదిక్కులయందు జయించుచున్నట్టి శక్తికలవాడును, విశేషకీర్తికలవాడును. సమస్తవిద్యలనేర్చి యానం దించువాడును, భార్యపుత్రులు మిత్రులు మేడలు మొదలగు సమస్తసంపత్తులుకలిగి యానందించువాడును, యేనుగులు గుఱ్ఱములు మొదలగు వాహనముల సౌఖ్యము కలవాడు నగును.

## అథ పునరపి విశేష చాంద్రయోగ మాహ.

శ్లో॥ అర్కాన్నాగచతుస్తనుర్జననటః ఖేటాయనం స్యుస్తనో ।
శ్చంద్రాద్భాగ్యపయోః కలైక్యమినహృచ్ఛిష్టం విధోర్యద్గృహం ।
తద్రాశౌతువిపాపశోభనఖగే కోటీశ్వరంతన్వతే । చేత్ పాపేతుసహా
స్రికః ఖలఖగేతుంగేతు కోటీశ్వరమ్ ॥ ౨౮ ॥

టీ॥ అర్కాత్= సూర్యుడు మొదలు, నాగ=ముప్పై, చతుః= పదహారు, తనుః= ఆరు, జన= ఎనిమిది, నటః= పది, ఖేట= పండ్రెండు ఆయనం=ఒకటి, స్యుః= అగుచున్నవి, తనోః= లగ్నము మొదలుకొనియు, చంద్రాత్= చంద్రుడు మొదలుకొనియు, భాగ్యపయోః = నవమాధిపతులయొక్క, కలైక్యం= కళలయొక్క కూడికను, ఇనహృత్= పండ్రెండుచే భాగింపగా, శిష్టం=మిగిలినసంఖ్య విధోః= చంద్రుడున్నరాశి మొదలుకొని లెక్కపెట్టగా, యద్గృహం = ఏరాశియగునో, తద్రాశౌతు= ఆరాశి, విపాపశోభనఖగే= పాపులులేని శుభగ్రహములు మాత్రము కలదియగునేని, కోటీశ్వరం= కోటీశ్వరునిగా, తన్వతే= చేయుచున్నది. పాపేతు = పాపగ్రహములున్నయెడల, సహాస్రికః = వేలాధికారినిగా జేయును, ఖలఖగేపి = పాపగ్రహమైనను, తుంగేపి= ఉచ్ఛస్థానమందుండిన యెడల, కోటీశ్వరం= కోటీశ్వరునిగా జేయును.

తా॥ తిరిగి చంద్రుని సంబంధమగు మరియొకవిశేషయోగమును జెప్పుచున్నాను. సూర్యుడు మొదలు శనివరకు నేడుగ్రహములకు నక్షరసంఖ్యచే కళాపరిమాణమును జెప్పుచున్నాను. ఏవిధమనగా- సూర్యునకు 30 చంద్రునకు ౧౬ అంగారకునకు ౬ బుధునకు ౮ బృహస్పతికి ౧౦ శుక్రునకు ౧౨ శనికి 1 ఇట్లు యేడుగ్రహములకు కళలు చెప్పబడెను. లగ్నము మొదలుకొనియు చంద్రుడున్న లగ్నము మొదలుకొనియు తొమ్మిదవరాసు లేవికలవో ఆరెండురాసులకు నధిపతులగు గ్రహములయొక్క కళల సంఖ్యను కూడగా వచ్చినమొత్తమును 12 చే భాగింపగా మిగిలినసంఖ్యయేదియగునో ఆసంఖ్యప్రకారము చంద్రుడున్నరాశి మొదలుకొని లెక్కపెట్టగా వచ్చినరాశిచంద్రలగ్నమగును. అట్టి చంద్రలగ్నమందు పాపులులేక కేవలము శుభులుమాత్రముండిన యెడల నాజాతకుని కోటీశ్వరునిగా జేయును కేవలము పాపగ్రహము లున్నయెడల వేలాధికారిగ జేయును. పాపగ్రహమైనను ఉచ్ఛస్థానమందుండిన యెడల కోటీశ్వరునిగా జేయును. అయితే కేవలము శుభగ్రహములున్నను పాపగ్రహము లుచ్ఛస్థానమందుండగను కోటీశ్వరుడగుననియు కేవల పాపగ్రహములుండినయెడల వేలాధికారియనియు జెప్పుటచే శుభులు పాపులు కలిసియుండినయెడల లక్షాధికారియగునని తోచుచున్నది.

## అథ ధనేశాదీనాం సంబంధాద్యోగ విశేషమాహ.

శ్లో॥ ద్విష్వాయాంకగృహేశ్వరాః కతిపయాస్సర్వేపి వాఖేచరా। స్సంబంధత్రయగాబలేన సహితాలక్షాధిపంకుర్వతే।షష్ఠాష్టవ్యయభావపైర్యది భవేత్త తత్క్షయర్ణప్రదా। స్తత్తత్ఖేటదశావిపాకసమయే శత్రోర్భయంవాదిశేత్ ॥ ౨౮ ॥

టీ॥ ద్విష్వాయాంకగృహేశ్వరాః=ద్వి=రెండు, ఇషు=అయిదు,ఆయ=పదకొండు అంక = తొమ్మిది గృహేశ్వరాః = ఈస్థానములయొక్క అధిపతులగు ఖేచరాః = గ్రహములు కతిపయాః= కొందరుగాని సర్వేపివా= అందరుగాని సంబంధత్రయగాః మూడుసంబంధముకలవారలై బలేన=బలముతోటి, సహితాః=కూడుకొనినవారలైరేని లక్షాధిపం= లక్షాధికారినిగా, కుర్వతే= చేయుచున్నారు. షష్ఠాష్టవ్యయభావపైః= ఆరు ఎనిమిది పండ్రెండు ఈస్థానములకు నధిపతులతో, భవేద్యది= సంబంధముకలిగి యున్నయెడల, తత్= ఆజాతకునకు, క్షయర్ణప్రదా = నాశమును, రుణమునిచ్చువారగుదురు. తత్తత్ఖేట=సమయే, తత్తత్ఖేట=ఆయాగ్రహములయొక్క దశావిపాకసమయే = దశాంతర్దశాసమయములయందు, శత్రోః= శత్రువులవల్లను, భయం=భయమును, ఆదిశేత్ = చెప్పవలయును.

తా॥ ఇప్పుడు ధనాధిపతి మొదలగువారియొక్క సంబంధమువలన కలిగెడి యోగవిశేషమును జెప్పుచున్నాను. 2-5-9-11 ఈస్థానాధిపతులలో కొందరుగాని యందరుగాని మూడుసంబంధముకలవారైబలముతో కూడియుండినయెడల లక్షాధికారినిగాజేయును. మూడుసంబంధములనగా, అందరుయొక్కచోటగూడియుండుట ఒకరియింట నొకరుండుట ఒకరినొకరు చూచుచుండుట, ఇట్టి మూడుసంబంధములు కలిగి షడ్బలపూర్ణులై యుండిరేని లక్షాధికారినిగాజేయును. మరియు 6-8-12 ఈస్థానాధిపతుల సంబంధము కలిగినయెడల నాశనమునుగాని రుణముకలవానిగాగానిచేయుదురు. మరియు వారివారి దశాంతర్దశా కాలములయందు శత్రువులవల్ల భయముకలుగునని చెప్పవలయును.

## అథ యోగాంతర మాహ.

శ్లో॥ చేల్లగ్నాదిచతుష్టయే ఘణఫరేసర్వేపిఖేటాస్థితా। శ్చాపోక్షీబగృహేనచేదిహ భవేజ్జాతోనరోభూపతిః । చేన్నకూరయుతేక్షితా శ్శుభఖగాశ్చందోపిపూర్ణస్తథా। స శ్రీమాన్మనుజనేడితోబలయుతాః పూర్ణాంనచేదూనతా ॥ ౨౯ ॥

టీ॥ సర్వేపి ఖేటాః= సర్వగ్రహములు, లగ్నాదిచతుష్టయే=లగ్నము మొదలగు నాలుగు కేంద్రస్థానములయందును, పణఫరే= పణపరస్థానములయందును, స్థితాః= ఉన్నవారై, ఆపోక్లిబగ్రహే= ఆపోక్లిబస్థానములందు, నచేత్= లేకుండినయెడల, ఇహ= ఈయోగమందు, జాతః= పుట్టిన, నరః= మనుష్యుడు, భూపతిః= స్యాత్= అగును, శుభఖగాః= సౌమ్యగ్రహములు, పూర్ణః= సంపూర్ణుడగు, చంద్రోపి=చంద్రుడును, క్రూరయుతేక్షితాః= క్రూరగ్రహములతో కూడికొనినవారును, చూడబడినవారును, నచేత్= కానియెడల, సః= అపుట్టినవాడు, శ్రీమాన్=సంపత్తుకలవాడును, సుజనేడితః= సుజన= సత్పురుషులచే, ఈడితః=స్తోత్రము చేయబడువాడును, భవేత్= అగును, బలయుతాః= బలముకలవారైనయెడల, పూర్ణం= సంపూర్ణమగు ఫలముగలుగును, నచేత్= బలములేనివారగునేని, ఊనతా= తక్కువఫలముకలుగును.

తా॥ మరియొకయోగమును జెప్పుచున్నాను. అన్నిగ్రహములును లగ్నము మొదలు నాలుగుకేంద్రములయందును పణఫరస్థానములయందు నుండి యేగ్రహమైననాపోక్లిబస్థానములయందు లేకుండినయెడల అసమయమునందు జనియించినవాడు రాజగును. ఇదియొక రాజయోగము మరియు శుభగ్రహములైన బుధ బృహస్పతి శుక్రులును సంపూర్ణ చంద్రుడును క్రూరగ్రహములతో గూడియుండుటగాని వారిచే చూడబడుటగాని యేవిధమగు సంబంధములేనియెడల అట్టిసమయమందు పుట్టినట్టి జాతకుడు అఖిలైశ్వర్యముకలవాడును సజ్జనులతో పొగడుబడువాడునగును, సంపూర్ణ బలముకలవారైనయెడల సంపూర్ణ ఫలమునిత్తురు. బలము తక్కువైనకొలదియు తక్కువ ఫలమునిత్తురని శాస్త్రములందు చెప్పబడినది.

## అథ దివారాత్ర్యోః కాలభేదేన యోగాంతరమాహ.

శ్లో॥ రాత్ర్యర్థాద్ద్యుదళాత్పరం యదిభవేజ్జాతో ద్వినాడ్యాత్మకే। కాలేస్యాన్నృపతిర్జి తారిరనిశం స్వాచారవిద్యాన్వితః। విత్తేతూచ్చఖగేస్వతుంగగఖగా ద్రుష్టేపికోటీశ్వర । స్వర్క్షస్థేనయదీక్షితే సహింభవేల్లక్షాధికారీసుఖీ॥ 30॥

ఆ॥ రాత్ర్యర్ధాత్= రాత్రి రెండుజాములకును, ద్యుదళాత్= పగలు రెండు జాములకును, పరం=అనంతరము, ద్వినాడ్యాత్మకే=రెండుగడియలు పరమితిగల, కాలే= కాలమునందు, జాతః= పుట్టినవాడై, భవేద్యది= ఆయినట్లాయెనాః జితారిః=శత్రువులను, జయించువాడును, అనిశం= ఎల్లప్పుడు, స్వాచాలవిద్యాన్వితః= స్వకులాచారబంధమగు విద్యయు, నాచారములుగలవాడునగు, నృపతిః= రాజు, స్యాత్= అగును ఉచ్చఖగే= ఉచ్చరాశియందుండు గ్రహము, విత్తేతు= ద్వితీయస్థానమందుండగ,

స్వతుంగగఖరాత్= ఉచ్చయందుండు గ్రహమువల్ల, దృష్టేపి = చూడబడుచుండగ కోటీశ్వరః= కోటీశ్వరుడు భవేత్=అగును, సహి= ఆగ్రహము, స్వక్షేత్రే= స్వక్షేత్రమందుండిన గ్రహముచే, ఈక్షితేయది= చూడబడినయెడల, లక్షాధికారీ = లక్షాధికారియు, సుఖీ= భోగియు, భవేత్ = అగును.

తా॥ పగలుగాని రాత్రిగాని కాలభేదముచే కలిగెడి యోగవిశేషమును జెప్పుచున్నాను. పగలు రెండుజాములను రాత్రి రెండుజాములను తర్వాత రెండు గడియలలో జనియించినవాడు సమస్తశత్రువులను జయించువాడును ఎల్లప్పుడు స్వకులాచార సంబంధమగు విద్యయు ఆచారములు కలవాడునగును. ద్వితీయమందున్న గ్రహము తాను యుచ్చరాశియందుండినవాడై ఉచ్చయందుండిన మరియొక గ్రహముచే జూడబడినయెడల కోటీశ్వరుడగును. తనకు నుచ్చరాశియగుచు ఆద్వితీయ మందున్న గ్రహము స్వక్షేత్రమందుండిన మరియొక గ్రహముచే జూడబడినయెడల లక్షాధికారియు సుఖముల నొందువాడునగును.

## అథ చరాదిరాశిషు ఛాదకవేధకాది సంబంధాత్ఫలమాహ.

శ్లో॥ ప్రాబల్యంచరభాత్థిరం స్థిరగృహాత్స్యా ద్విస్వభావం తథా । దృష్టిశ్ఛాదకవేధకస్థితభవా త్తద్వచ్ఛరాశిత్రయే । ఆద్యాద్ద్వాత్రిషుమధ్యమాత్రిషు తతస్స్యాత్త్యాత్త్రిషూక్త క్రమాద్ద్రేక్కాణే ష్వపి పూర్ణమధ్యమకృశం దద్యుఃఫలంఖేచరాః ॥ ౩౧ ॥

టీ॥ చరభాత్ = చరరాశికంటె స్థిరం=స్థిరరాశియు, స్థిరగృహాత్= స్థిరరాశికంటె, ద్విస్వభావం=ద్విస్వభావరాశియు, ప్రాబల్యం బలముగలవి స్యాత్ =అగును తథా = అప్రకారముగానే రాశిత్రయే = మూడురాసులయందును, ఛాదకవేధకస్థితభవాత్= ఛాదకవేధకస్థితములను, ప్రకారముగ, దృష్టిః= దృష్టియు, తద్వత్= ఆ ప్రకారముగానేయగును. ద్రేక్కాణేష్వపి= ద్రేక్కాణములయందును, త్రిషు= మూడురాసులయందును, ఆద్యాత్ = మొదటిద్రేక్కాణమునుండి, ద్వా = రెండును, త్రిషు=మూడురాసులయందును, మధ్యమాత్ =మధ్యద్రేక్కాణమునుండియు త్రిషు= మూడింటియందును, స్యాంత్యాత్= తనకు చివరద్రేక్కాణమునుండియు, ఉక్తక్రమాత్= చెప్పబడిన, వరుసగా, పూర్ణమధ్యమకృశం= సంపూర్ణము మధ్యమము అధమము, అనెడు, ఫలం= ఫలమును, ఖేచరాః= గ్రహములు, దద్యుః= ఇత్తురు.

తా॥ చరస్థిరద్విస్వభావరాసులయందు ఛాదకవేధక స్థితిమొదలగుసంబంధమువలన ఫలమును జెప్పుచున్నాను. చరరాశికంటె స్థిరరాశియు స్థిరరాశికంటె ద్విస్వభావరాశియు బలవత్తరమైనది. అప్రకారమురాచే మూడురాసులయందును ఛాదకవేధకస్థితులనెడు దృష్టియొకలదు. చరరాసులయందు 1-2-3 ద్రేక్కాణములును,

స్థిరరాసులయందు 2-3-1 ద్రేక్కాణములును, ద్విస్వభావరాసులయందు 3-1-2 ద్రేక్కాణములును వరుసగా నగును. అందువలన గ్రహములు ద్రేక్కాణముల యందు సంపూర్ణమధ్యమ హీనఫలములను వరుసగా నిత్తురు.

## { అథ సకలయోగానాం గ్రహభాగానుసారేణ ఫలకాల మాహ. }

శ్లో॥ యోగస్యాప్యవయోగజస్యవివృతౌ తద్యోగకర్త్రోర్ద్వ
యో। ర్మందో(గ్రేప్యథపృష్ఠతశ్చలఖగ స్తద్ద్వాదశాంశాంతరే। రూపం
శూన్యలవేథభవేద్రవిలవే ఖంచానుపాతాత్ఫలం। సూర్యాంశైశ్చల
ఖేచరేగ్రలవగే తత్రేష్టవిధ్వంసకః ॥ 3_౧ ॥

టీ॥ యోగస్యాపి=యోగముయొక్కయు, అవయోగజస్యాపి= అవయోగము యొక్కయు, వివృతౌ = ప్రకటనయందు, తద్యోగకర్త్రోః = ఆయోగములనిచ్చెడు ద్వయోః = రెండుగ్రహములలోను, మంద = మందగమనముగలగ్రహము, అగ్రే = ముందుభాగమందును, అథ= అనంతరము, చలఖగః = తీవ్రగమనముగల గ్రహము, పృష్ఠతః = వెనుకభాగమందునుండి, తద్ద్వాదశాంశాంతరే= తత్ = ఆయోగమునిచ్చు గ్రహములిరువురికిని ద్వాదశాంశాంతరే= పండ్రెండు భాగలదూరములో శూన్యలవే= శూన్యలవమునందు, రూపం= ఒకరూపము భవేత్=అగును, రవిలవే= రవిభాగమందు ఖంచ= ఫలము శూన్యమగును, సూర్యాంశైః= పండ్రెండుభాగలచేత అనుపాతాత్= భాగించుటవల్ల, ఫలం=ఫలము, భవేత్ =అగును, చలఖేచరే = శీఘ్రగతిగలగ్రహము నందు అగ్రలవగే=ముందుభాగమందుండెనేని తత్ర=ఆయోగమందు ఇష్టవిధ్వంసకః= కోరికను భంగము చేయువాడగును.

తా॥ అన్నియోగములకును గ్రహముల సంబంధమైన భాగముల ననుసరించి ఫలమును జెప్పుచున్నాను. పూర్వము సుయోగములగురించియు నవయోగముల గురించియు చెప్పబడును. అట్టి సుయోగావయోగకర్త లిరువురిలో మందగతిగల గ్రహము ముందుభాగమందును శీఘ్రగతిగల గ్రహము వెనుకభాగమందు నుండవల యును. వారిరువురకును ౧౨ భాగలకు లోపుగా నెడముండవలయును. అందువలన మందగతిగల గ్రహభాగలలో శీఘ్రగతిగల గ్రహభాగలను తీసివేయగా శేషము శూన్యమగునేని ఒకరూపమనియు నాయోగఫలము సంపూర్ణఫలమనియు నాయంత రము ౧౨ భాగలుగా నుండునపుడు ఫలము శూన్యమనియు జెప్పబడెను. కనుక యంతరము ౧౨ భాగలకు ఒకరూపమైనచో తాను నిర్ణయించుకొనెడి భాగల కెం తయని త్రైరాశిక విధిచేసాధించిన ఫలము రూపాదిగా సాధింపవలయును. అట్టి

యోగమునందా యోగకర్తలంతభాగము ఫలమునిత్తురు. ఒకవేళ శీఘ్రగ్రహభాగాది లోనే మందగ్రహభాగాది పోయినయెడల నాయోగఫలమును ఆయోగకర్తలు నశింపజేయుదురని తెలిసికొనవలయును.

అథ తస్యైవయోగస్య చంద్రసంబంధా ద్విశేషమాహ.

శ్లో॥ తద్యోగప్రదయోర్యదైకమపివా చంద్రఃప్రపశ్యేద్బలీ। స్థానాత్ప్రోక్తలవైర్విశేష ఫలకృత్ షష్ఠాష్టరిఃఫ్యాన్వినా। పశ్యంత్యేవఖగాస్సమస్తభవనా న్యుచ్చేస్వభేచోత్తమా స్తత్రాధిమిత్రగృహేసమా ఇతరథాహీనాఃఫలప్రాపణే ॥ 33 ॥

టీ॥ తద్యోగప్రదయోః= ఆయోగకర్తలగు నిద్దరిలో యదా=ఎప్పుడు, ఏకమపివా=ఒక్కనినైనను, బలీ=బలవంతుడగు,చంద్రః=చంద్రుడు, ప్రపశ్యేత్=చూచినట్లాయెనా స్థానాత్=స్థానమువల్ల, ప్రోక్తనవైః=చెప్పబడిన, భాగములచేత విశేషఫలకృత్=విశేషఫలమును కేయును, ఖగాః=గ్రహములు, షష్ఠాష్టరిఃఫ్యాన్వినా=ఆరు యెనిమిది పండ్రెండు ఈస్థానములనుగాక, సమస్తభవనాని= సకలరాసులను, పశ్యంత్యేవ=చూచుచున్నారు, ఫలప్రాపణే=ఫలమునిచ్చు విషయములో, ఉచ్చే=ఉచ్చస్థానమందును, స్వభేచ= స్వక్షేత్రమునందు, నున్నవారు, ఉత్తమాః=శ్రేష్ఠులు తత్ర= అచ్చట, అధిమిత్రగృహే=అధిమిత్రక్షేత్రమందున్నవారు, సమాః=మధ్యమాధికారులు, ఇతరథా= ఇతరమైనవారు, హీనాః= తక్కువైనవారు.

తా॥ పూర్వము చెప్పబడిన యోగమునకు చంద్ర సంబంధమువలన కలిగెడు విశేషమును జెప్పుచున్నాను. ఎవరైన నిద్దరు రాజయోగకర్తలుపూర్వము చెప్పబడిన ప్రకారము మూడు సంబంధములలో నేదైన నొక సంబంధముగలవారై పూర్వము చెప్పబడిన స్థానదృష్టిగలిగి మందగ్రహము ముందుండి శీఘ్రగ్రహము వెనుకగానుండి వారిద్దరకుగల మధ్యప్రదేశము ౧౨ భాగలకు లోపుగా నున్నయెడల వారిరువురు యోగఫలమునిత్తురు. వారిరువురు మధ్యభాగమెంత తక్కువగానుండిన నంతఫలమధికము గానుండును. ఆయోగకర్తల నిరువురనుగాని యొకరినిగాని చంద్రుడు స్థానదృష్టి మొదలగు బలముగలిగి వారి భాగములకు ౧౨ భాగల లోపుగానుండి చూచినయెడల విశేషఫలము నిచ్చును. ఇది యుత్తమయోగమని చెప్పబడినది. గ్రహములు 6-8-12 స్థానములుగాక మిగిలిన స్థానములనన్నింటిని చూచెదరు. ఫలమునిచ్చు విషయములో నుచ్చయందు స్వక్షేత్రమునందు నున్నవారు ఉత్తమాధికారము కలవారు. అధిమిత్రక్షేత్రమందున్నవారు మధ్యమాధికారము కలవారు. అంతకంటె నితరక్షేత్రములందు నున్నవారు అధమాధికారము కలవారు.

## అథ అష్టారూఢ పదాన్యాహ.

శ్లో॥ భావేశోభవనాచ్చయావతి గృహేతిష్ఠేత్పదంతావతీ । త్యుక్తం తత్పదతశ్శుభాశుభవశాత్తద్ధ్రాసవృద్ధీవదేత్ । ఏవంలగ్న ధనాంబుధీ స్మరగురుక్ష్మేశైశ్చరిప్ఫాత్పదా । న్యష్టౌరిప్ఫగృహాద్భవే దుపపదం దారాపదం సప్తమాత్ ॥ ౩౮ ॥

టీ॥ భావేశః= భావాధిపతి, భవనాత్= రాశినుండి, యావతిగృహే= ఎంత సంఖ్యాగల రాశియందు, తిష్ఠేత్= ఉండునో, తావతీ=అంత సంఖ్యాగల, పదమితి= పదమని ఉక్తం= చెప్పబడినది, తత్పదతః=ఆయారూఢపదమువల్ల శుభాశుభవశాత్= శుభపాపగ్రహ సంబంధమువలన, తద్ధ్రాసవృద్ధీ = దానియొక్క, వృద్ధిక్షయములను వదేత్ =చెప్పవలయును,ఏవం=ఈప్రకారము,లగ్న =క్ష్మేశై లగ్న=లగ్నము ధన= ద్వితీయము, అంబు=చతుర్థము, ధీ= పంచమముః స్మర=సప్తమము,గురు= నవమము క్ష్మ=రాజ్యము ఈశైః ఈస్థానములయొక్క యధిపతులచేత. రిప్ఫాత్ =పండ్రెండవ స్థానమువల్లను అష్టౌ=ఎనిమిదియగు,పదాని=స్థానములు చెప్పబడినవి. రిప్ఫగృహాత్= వ్యయస్థానమువల్ల, ఉపపదం=ఉపపదమని, భవేత్= అగును, సప్తమాత్= సప్తమ స్థానమువల్ల దారాపదం కళత్రమని ఉక్తం= చెప్పబడినది, స్యాత్= అగును.

తా॥ ఇకను ఎనిమిది యారూఢపదములను జెప్పుచున్నాను. ఏభావమునకు నారూఢస్థానమును నిర్ణయింతురో ఆ భావమునకు నధిపతియగు గ్రహము ఆ భావమునకు నెంతసంఖ్యాగల రాశియందుండునో ఆగ్రహమున కన్నవరాశి యారూఢ పదమని చెప్పబడును. ఈవిధముగానే లగ్న, ధన, వాహన, పుత్ర, దార, భాగ్య, రాజ్యవ్యయములనెడు భావాధిపతులు ఆయాభావములకు నెంత సంఖ్యలో నుం దురో వారుండెడిరాశికి అన్నవరాశి ఆరూఢస్థానమని చెప్పబడును. ఇందుకు నుదా హరణమెట్లనగా లగ్నము సింహము అయినయెడల ఆ లగ్నాధిపతియగు సూర్యుడు వృశ్చికమందుండెనేని లగ్నమునకు వృశ్చికము నాల్గవరాశియగును. కాబట్టి వృశ్చిక మునకు నాల్గవరాశి కుంభమగును. అందువల్ల లగ్నారూఢపదము కుంభమగును. మరియు సింహలగ్నమునకు ధనస్థానము కన్యయగును. ఆరాశి యధిపతియగుబుధుడు మేషమందుండె ననుకొనెదము కన్యారాశికి మేషము యెనిమిదవ రాశియగును అందు వల్ల మేషమునకు నెనిమిదవరాశి వృశ్చికమగును కాబట్టి ధనస్థానారూఢపదము వృశ్చి కమగును. ఈవిధముగానే యన్ని భావములకును విచారించుకొనవలయును. ఇట్లు ఆరూఢస్థానముల నెనిమిది విధములుగా జెప్పిరి. ఆయారూఢస్థానములకుగల శుభ పాపగ్రహ సంబంధవలన అధికఫలమునుగాని తక్కువ ఫలమునుగాని విచారించి చెప్పవలయును. మరియు ద్వాదశస్థానమువలన ఉపపదమనియు సప్తమ స్థానమా

వలన కళత్రపథమనియు చెప్పబడెను. ఇట్లు యెనిమిది స్థానములను విచారించి తెలిసికొనవలయుననిరి.

## అథారూఢ పదగ్రహవశాచ్ఛుభాశుభ ఫలమాహ.

శ్లో॥ సస్యాల్లగ్నపదే శుభేశుభయు తేచేద్భోగ భాగ్యైర్యుత । స్తస్మాత్కోణ చతుష్టయే శుభఖగే రాజా మహాపండితః । క్రూరస్త త్రవిపర్యయోయది పునష్షష్టాష్ట రిఃష్ఫేషువా । ప్యేవంసర్వపదై శ్శుభాశుభఫలం సమ్యగ్విచార్యాది శేత్ ॥ 32॥

టీ॥ లగ్న పదే=లగ్నారూఢపదము, శుభే= శుభక్షేత్రమై, శుభయుతే= శుభగ్రహములతో గూడినదియగునేని, సః= ఆ పుట్టిన జాతకుడు, భోగభాగ్యైః భోగము భాగ్యములతోటి యుతః=కూడినవాడగును, తస్మాత్ =ఆయా రూఢపదమువల్ల కోణ చతుష్టయే= కోణ= త్రికోణములయందును, చతుష్టయే= కేంద్రస్థానములయందును, శుభఖగే= శుభగ్రహముండగ, మహాపండితః= గొప్పవిద్వాంసుడగు, రాజా=రాజు స్యాత్= అగును తత్ర= పైన చెప్పబడిన కోణకేంద్రములయందు, క్రూరః= పాప గ్రహముండెనేని విపర్యయః=వ్యతిరేకఫలము, కలుగును పునః= మరియు షష్టాష్టరిఃష్ఫే, షువాపి ఆరు యెనిమిది పండ్రెండుస్థానములయందు పాపగ్రహమున్నను ఆప్రకార ముగానే యగును, ఏవం= ఈ ప్రకారముగానే, సర్వపదైః = సమస్తారూఢస్థానముల చేతను, శుభాశుభఫలం= మంచిఫలమును చెడ్డఫలమును, సమ్యక్ =బాగా విచార్య= ఆలోచించి ఆదిశేత్= చెప్పవలయును.

తా॥ ఆరూఢస్థానమునకు నున్నట్టి శుభపాప గ్రహసంబంధము ననుసరించి శుభఫలమును. చెడ్డఫలమును చెప్పుచున్నాను. ఆరూఢలగ్నము శుభక్షేత్రమై శుభ గ్రహములతో గూడినది యగునేని యట్టి సమయమునందు బుట్టినవాడు భోగభాగ్య ముల నొందువాడగును. ఆయా రూఢస్థానమునకు కోణములయందును కేంద్రములం దును శుభగ్రహము లుండినయెడల మహాపండితుడగు రాజగును. ఆ కేంద్రకోణము లందు పాపగ్రహము లుండినయెడల దుష్టఫలము కలుగును. 6-8-12 స్థానముల యందు పాపగ్రహము లుండిన దుష్టఫలమే కలుగును మరియు సన్ని యారూఢముల కును శుభపాప గ్రహ సంబంధమువలన శుభఫలమునుగాని దుష్టఫలమునుగాని విచా రించి చెప్పవలయును.

## అథారూఢవశాదేవ పుత్రభావ విచారమాహ.

శ్లో॥ తద్వత్పుత్రకుటుంబ భాగ్యబదతో భావైస్తురోర్లగ్నపా । త్తస్మాచ్చోప పదాద్వదేచ్ఛు భఖగైర్యోగేక్షణాత్పుత్రతాం । నోచే

త్పాపయుతేక్షణాదికమిహస్యా త్పుత్రబాహుళ్యతా । తత్రోధిక ఖేచరై రనుమియా త్పుత్రీశ్చపుత్రానపి ॥ ౩౬ ॥

టీ॥ తద్వత్ = పూర్వము చెప్పినట్లుగా పుత్రకుటుంబ భాగ్యపదతః పుత్ర = అయిదు = కుటుంబ = రెండు భాగ్య = తొమ్మిది, పదతః = ఈశబ్దాములవల్ల భావైశ్చ = ఆ భావములచేతను గురోః = బృహస్పతివల్లను, లగ్నపాత్ లగ్నాధిపతివల్లను, తస్మాదు పపదాశ్చ = ఆ యుపపదమువల్లను, శుభఖగై = శుభగ్రహములచేతనుయోగే క్షణాత్ = కూడుట, చూచుట, మొదలగు సంబంధములవల్లను, పుత్రతాం-పుత్రులు కలుగుటను, వదేత్ = చెప్పవలయును. పాపయుతేక్షణాదికం = పాపులతో గూడుట చూడబడుట మొదలగునవి, నోచేత్ = లేకుండినయెడల, పుత్రబాహుళ్యతా = అనేక పుత్రులు కలుగుట, స్యాత్ = అగును. తత్ర = ఆ పుత్రభావ విచారణయందు ఓజోధిక ఖేచరైః = అధికబలముగల గ్రహములచేత పుత్రిచ్చ కుమార్తెలను, పుత్రానపి = కొమాళ్ళను, అనుమియాత్ = ఊహించవలెను.

తా॥ ఆరూఢస్థానమువల్ల పుత్రులుకలుగుటయు లేకుండుట యును గురించిన విచారణను జెప్పుచున్నాను. పూర్వము చెప్పిన ప్రకారము పుత్రారూఢస్థానము కుటుంబారూఢము భాగ్యారూఢము లవల్లను ఆభావాధిపతులవల్లను బృహస్పతివల్లను లగ్నలగ్నాధిపతు లవల్లను ఆయుపపదమువల్లను శుభగ్రహములచేతను అశుభగ్రహ కూడిక వీక్షణములచేతను పాపగ్రహములయొక్క యేవిధసంబంధము లేకపోవుటచేతను పుత్రులుకలుగుట విశేషపుత్రులు కలుగుటయును విచారించవలయును. మరియు ఆపుత్రారూఢస్థానమందు బలవంతు లగు గ్రహము లెందరుందురో అందరు సంతానము కలుగుదురనియు నెందరు స్త్రీగ్రహములుందురో అందరు స్త్రీసంతానమనియు నెందరు పురుషగ్రహములుండునో యందరు పుత్రసంతానమనియు ఈశుభగ్ర హములకు పాపగ్రహసంబంధముగల సంఖ్యాప్రకారముగ సంతాన ములో నందరు నష్టమైరనియు జెప్పవలయును. మరియు నెన్నిగ్రహ ములకు నుచ్చస్థానస్థితియుండిన కలిగెడు ద్విగుణముగ గ్రహించవల యునని కొందరు చెప్పిరి.

## అథ అపత్యదోష మాహ.

శ్లో॥ పూర్వోక్తేష్వపదాదికేష్వపి బుధారాఢ్యారాస్తదీశైర్యుతా।

స్తే ఖేటాశ్చ మిథోగృహాంశకయుతా వైకత్రమందేజ్యయోః। యోగాద్వా మృతపుత్రకః ఖభతదీశావార్కియుక్తేక్షితౌ । చేత్స్యాత్స్వీకృతపుత్రకస్త్వితి జగుశ్చానేకధైవంబుధాః ॥ 32 ॥

టీ॥ బుధార్క్యారాః = బుధ శని కుజులు, పూర్వోక్తేషు = పూర్వమందు జెప్పబడిన, పదములు భావములు మొదలగువానియందున్నవారై, తదీశైః = వాని యధిపతులతో, యుతాః = కూడినట్టి, తే = అపూర్వోక్తమగు, ఖేటాః = గ్రహములు, మిథోగృహాంశకయుతాః = పరస్పరము నొకరిరాశ్యంశముల నొకరు పొందిన వారైనను, ఏకత్ర = ఒక్కచోట, మందేజ్యయోః = శని బృహస్పతులయొక్క, యోగాద్వా = కూడివల్లనైనా, మృతపుత్రకః = పుత్రులు నశించుననియు ఖభతదీశౌ = కర్మస్థానము కర్మాధిపతియు, ఆర్కియుక్తేక్షితౌచేత్ = శనితో కూడుకొనుట చూడబడుట కలిగినయెడల, స్వీకృతపుత్రకః = దత్తతచేసుకొనబడిన పుత్రులుగలవాడుగ, స్యాదితి = అగుననియు, ఏవం = ఈప్రకారముగ, బహుధా = అనేకవిధములుగాను, బుధాః = పెద్దలు, జగుః = చెప్పిరి.

తా॥ సంతానమునుగురించిన దోషములను చెప్పుచున్నాను. పూర్వము చెప్పబడిన పుత్ర కుటుంబభాగ్యపదములందు బుధ శని కుజులుండుటగాని ఆస్థానాధిపతులతో కూడియుండుటగాని సంభవించినను ఆబుధ శని కుజులు ఒకరి రాశ్యంశములయందు నొకరుండుటగాని శని గురులొక్కచోట గూడియుండుటగాని సంభవించినయెడల కలిగిన సంతానము నశించును. కర్మస్థానముగాని కర్మాధిపతిగాని శని చేత చూడబడుట కూడియుండుట మొదలగు సంబంధములు కలిగినయెడల సంతానము లేక దత్తత చేసుకొనబడునని చెప్పబడెను. ఈప్రకారముగా సంతానాభావ విషయమై యనేకవిధములుగ జెప్పిరి.

## అథ ద్విత్ర్యాది కళత్రయోగం తద్భేదంచాహ.

శ్లో॥ ఆదౌ సప్తమభావతస్తనుగృహాద్భార్యాంతతస్త్వష్టమాత్। ద్వితీయాంచతథాపునః పునరనీత్యేవం మృతాస్స్యుఃఖలైః । లగ్నాత్సప్తమగైశ్శుభైర్నహితథా జీవస్యయోగేక్షణా । తేస్మైర్జీవయుతాస్తదీయతనయార్ణ వృత్తం గుణాద్యందిశేత్ ॥ 33 ॥

టీ॥ ఆదౌ = ముందుగ, తనుగృహాత్ = లగ్నము మొదలుకొని, సప్తమభావతః = సప్తమ స్థానమువల్ల, భార్యాం = భార్యనుగురించి, ఆదిశేత్ = చెప్పవలయును, తతః = అటుపిమ్మట, అష్టమాత్ = అష్టమస్థానమువల్ల, ద్వితీయాం = రెండవ భార్యనుగురించి, వదేత్ = చెప్పవలయును, తథా = ఆప్రకారముగ, పునః పునరపి =

మాటిమాటికి, ఏవం = ఈప్రకారము, ఖలైః = పాపగ్రహములచేత, మృతాః = మృతినొందిన భార్యలు, స్యుః = అగుదురు, లగ్నాత్ = లగ్నము మొదలుకొని, అష్టమగైః= అష్టమమందున్న, శుభైః = శుభగ్రహములచేత, తథా = ఆప్రకారముగ, నహి= కాదు. జీవస్య= బృహస్పతియొక్క, యోగేక్షణాత్ = కూడియుండుట చూచుటవల్లను, సౌమ్యైః = శుభులచేత, సంబంధముకలిగియున్నను, జీవయుతాః=జీవించియున్న భార్యలు, స్యుః=అగుదురు, తదీయతనయాన్ = ఆయాభార్యల సంబంధమగు పుత్రులను, వృత్తం= వారివారి నడవడిని, గుణాద్యం= గుణాదులను, వదేత్= చెప్పవలయును.

తా॥ ఇద్దరు ముగ్గురు భార్యలు కలుగుటనుగురించి వానిభేదమును చెప్పుచున్నాను. కళత్రస్థానమును విచారించునప్పుడు ముందుగ లగ్నాత్సప్తమస్థానమును విచారించవలయును. ద్వితీయకళత్రమునుగురించి లగ్నాదష్టమభావమును విచారించవలయును. దాని సప్తమస్థానమువల్ల తృతీయకళత్రమును ఈప్రకారము ఈ యష్టమములకు పాపగ్రహ సంబంధమువల్ల కళత్రములయొక్క నష్టమునుగురించి విచారించవలయును. శుభగ్రహసంబంధముచే నేకకళత్రమును తెలిసికొనవలయును. మరియు నాయష్టమభావమునకు విశేషముగ శుభగ్రహసంబంధముండి బృహస్పతియొక్క సంబంధముతో కూడగలిగియున్నయెడల జీవించియుండు బహుకళత్రములుండుననియు ఆయాకళత్రములయొక్క పుత్రభావములకు శుభాశుభ సంబంధమువల్ల ఆయా భార్యల సంబంధమైన పుత్రులయొక్క యోగ్యతాయోగ్యతలను గుణాదులను విచారించవలయును.

## పునః కళత్రభావవిశేషమాహ.

శ్లో॥ ఏవం రిప్ఫగృహాద్భవేదుపపదంతత్రైవ సౌమ్యేతదా ।
తజ్జాయాహిసురూపిణీ గుణవతీసాస్యాచ్చిరంజీవినీ । క్రూరేనీచగతే
కళత్రయుగళం నష్టం స్వతుంగేఖలే । బహ్వ్యోజీవయుతాశ్శుభేక్షణ
యుతే నోచేన్నయోగః పునః ॥ ౩౯ ॥

టీ॥ ఏవం=ఈప్రకారముగ, రిప్ఫగృహాత్= ద్వాదశభావమువల్ల, ఉపపదం= ఉపపదమనెడు ఆరూఢస్థానము, భవేత్= అగును, తత్రైవ=అచ్చటనే, సౌమ్యే= శుభగ్రహముండగ, తదా=అప్పుడు, తజ్జాయా= వానిభార్య, సురూపిణీ=అందము కలదియు, గుణవతీ=సుగుణములుకలదియు, సా = ఆచిన్నది, చిరంజీవినీ= చిరకాలము జీవించునదియు, స్యాత్= అగును, క్రూరే= పాపగ్రహము, నీచగతే= నీచమందుండగా, కళత్రయుగళం = ఇద్దరుభార్యలు, నష్టం నశించినవారు, అగుదురు.

ఖలే= పాపగ్రహము, స్వతుంగే = తనయుచ్చయందుండగాను; శుభేక్షణయుతే = శుభగ్రహముయొక్క ఈక్షణము కూడికఅనెడు సంబంధముకలిగియుండగాను, జీవయుతాః = జీవించియుండెడి, బహ్వ్యః = అనేకభార్యలుంఘురు, నోచేత్ = లేనియెడల, పునః= తిరిగి, యోగః= వివాహయోగము, న= కలుగదు.

తా॥ తిరిగి కళత్రభావమునుగురించి చెప్పుచున్నాను. పూర్వము చెప్పిన ప్రకారము వ్యయభావమువల్ల కలిగిన యుపపదమునందు శుభగ్రహమున్నయెడల వానిభార్య యందముకలదియు సుగుణములుకలదియు చిరకాలము జీవించునదియు నగును. పాపగ్రహము నీచయందుండిన యిద్దరుభార్యలు నశింతురు. అపాపగ్రహమున్న యుపపదమువానికి నుచ్చలగ్నమైయుండి శుభగ్రహములకూడిక ఈక్షణము మొదలగు సంబంధము కలిగినయెడల జీవించియుండు అనేకభార్యలు కలవాడగును. అట్టిశుభగ్రహ సంబంధములేనియెడల తిరిగి వివాహముకాదు.

## అథనష్టకళత్రదోషవిభాగం తచ్ఛాంతి నిరూపణంచాహ.

శ్లో॥ దారారూఢ వశాద్వదేదుపపదాత్తామాదిభార్యాంతతః
స్తత్తన్నైధనభాత్స్మరాఖ్యపదతో యావచ్ఛపాపాధికం । తావ
న్నాశ ఇతిబ్రువంతిమునయో యత్రాధికం శోభనం । తత్రస్యా
త్కులవర్ధనీచ సుఖదాచాయుష్మతీ భోగదా ॥ ౪౦ ॥

టీ॥ దారస్థానా రూఢపదమువల్ల, ఉపపదాచ్ఛ = ఉపపదమువల్లను, తాం= ఆపూర్వోక్తమును, ఆదిభార్యాం = మొదటిభార్యను గురించి, వదేత్ = చెప్పవలయును, తతః = అనంతరము, తత్తన్నైధనభాత్ =వానివానికి ౮ వ గృహములవల్ల, యావత్= ఎంతవరకు, పాపాధికం= పాపగ్రహము లధికముగనుండునో, తావత్= అంతవరకు, నాశయితి = నాశనమని, మునయః = మునీశ్వరులు, బ్రువంతి = చెప్పుచున్నారు. యత్ర= ఎచ్చటను, శోభనం= శుభలక్షణములు, అధికం = విశేషముగనుండునో, తత్ర= ఆస్థలమందు, కులవర్ధనీ= వంశము నుద్ధరించునదియు, సుఖదా= సుఖములనిచ్చునదియు, ఆయుష్మతీ= దీర్ఘాయుర్దాయము కలదియు, భోగదా=భోగములనిచ్చునదియు, భార్యా=భార్య, భవేత్ = అగుచున్నది.

తా॥ నష్టకళత్రాది దోషములనుగురించి చెప్పుచున్నాను పూర్వము చెప్పబడిన ప్రకారము దారపద ఉపపదములనుబట్టి కళత్రభావమును విచారించినయెడల శుభగ్రహ సంబంధ మధికముగానుండినయెడల వానికి నొక్క వివాహమేయగునని చెప్పవలెను. పాపగ్రహ సంబంధము కలిగినయెడల నప్పుడు లగ్నాదష్టమ స్థానమును పరిశీలించి యచ్చట శుభగ్రహసంబంధము కలిగియుండినయెడల కళత్ర నాశ

వములేదని గ్రహింపవలయును. అష్టమస్థానమందును సప్తమస్థానమునకు నష్టమ స్థానము అనగా లగ్నమునకు ద్వితీయస్థానమందును విశేష పాపగ్రహము లుండిన యెడల అప్పుడు పత్నీకళత్రమునకు భంగము చెప్పవలయును. పిమ్మట ఈ చెప్పబడిన స్థానములకు శుభగ్రహ సంబంధముగూడ నున్నయెడల తిరిగి ద్వితీయ వివాహము గును. శుభలక్షణములులేక కేవలము పాపగ్రహసంబంధమే యెక్కువగా నున్నయెడల తిరిగి వివాహముకాదని తెలిసికొనవలయును. ఈప్రకారము ద్వితీయ వివాహకారణమున్నయెడల తిరిగి ఆద్వితీయకళత్రస్థానమైన లగ్నా ద్వితీయస్థానము వలన శుభగ్రహలక్షణములను పాపగ్రహలక్షణములను పూర్వమువలెనే విచారించి ద్వితీయకళత్ర విచారణచేయవలెను. ఈవిధముగానే తిరిగి ద్వికళత్రస్థానమై లగ్నా ద్వితీయమునకు అష్టమస్థానము అనగా లగ్నా న్నవమస్థానమును తృతీయ కళత్రస్థాన ముగ తెలిసికొనవలెను. ఈవిధముగ మాటిమాటికి వాటివాటి అష్టమస్థానములను పరిశీలించి వాటికిగల శుభత్వపాపత్వ సంబంధములను విచారించి యేయేకళత్రస్థానము లకు పాపత్వమధికమని తోచునో ఆకళత్రమునకు భంగమని తెలిసికొనవలయును. ఏకళత్రస్థానమునకు శుభగ్రహ సంబంధ మధికముగ కనుపించునో ఆకళత్రమునకు భంగములేక దీర్ఘాయుష్మంతురాలై కులవృద్ధి కారణురాలగును. భర్తకు సుఖముల నిచ్చునదియు సమస్త అయిశ్వర్యములకు నాధారభూతమైనదియు పుత్రపౌత్రాభి వృద్ధిగలదియు నగును.

## అథ సోదరస్థాన నిరూపణమాహ.

శ్లో॥ లగ్నాద్వ్యుత్క్రమత స్తృతీయభవనే భావాంశకా త్సోదరాన్ । జ్యేష్ఠాం స్తత్క్రమశ స్తృతీయ గృహత స్తద్వత్క నిష్ఠాన్వదేత్ । స్వస్వాద్భావనవాంశకాద్గతనవాంశేభ్యః క్రమా దేష్యకైః । పుంస్త్రీ భేదవిధి శ్శుభాశుభ బలాద్వృద్ధి క్షయౌ సంఖ్యయా ॥ ౪౧ ॥

టీ॥ లగ్నాత్ = లగ్నము మొదలుకొని, వ్యుత్క్రమతః = వ్యతిరేకముగ, తృతీయభవనే = మూడవభావమందు, అనగా పదకొండవదియందు భావాంశకాత్ = ఆభావముయొక్క అంశవలన, జ్యేష్ఠాన్ = పెద్దవారగు, సోదరాన్ = సోదరులను, అనగా అన్నగార్లను, తత్క్రమశః = ఆలగ్నము మొదలుకొని క్రమముగ తృతీయ గృహాత్ = మూడవలగ్నమువల్ల, తద్వత్ = ఆప్రకారముగానే, కనిష్ఠాన్ = తమ్ము లను, వదేత్ = చెప్పవలయును, స్వస్వాత్ = తమతమ, భావనవాంశకాత్ = భావముల యందుండెడి నవాంశ, మొదలుకొని, క్రమాత్ = క్రమముగ, గతనవాంశేభ్యః = గడచిన నవాంశలవల్లను, ఏష్యకైః = మిగిలిననవాంశలవల్లను, పుంస్త్రీభేదవిధిః = పురుష

స్త్రీవిభాగమును శుభాశుభబలాత్ శుభులయొక్క పాపులయొక్కయు బలమువలన, సంఖ్యయా= సంఖ్యచేత, వృద్ధిక్షయౌ= వద్ధిక్షయములను, వదేత్= చెప్పవలెను.

తా॥ సోదరభావమునుగురించి చెప్పమన్నాను. జన్మలగ్నము మొదలుకొని వెనుకకు మూడవలగ్నము లెక్కపెట్టగా ఏకాదశమగును. ఆఏకాదశమువల్లను అన్నగార్లను గురించి విచారించవలయును. లగ్నము మొదలుకొని మూడవరాశియగునవగా తృతీయభావము తమ్ములనుగురించి విచారించవలెను. పూర్వము చెప్పబడినభావసాధనములో నేదశభావ మెన్నవభాగమందున్నదో యాభాగము మొదలుకొని నవాంశ 1కి 3 భాగలు 20 విప్తల చొప్పున గడచిన నవాంశలవల్ల నన్నగార్లను లగ్నము మొదలుకొని తృతీయ భావాంశము మొదలుగా క్రమముగ ముందు నవాంశలవల్ల తమ్ములను విచారించి చెప్పవలయును. మరియు శుభగ్రహ పాపగ్రహ బలానుసారముగ ఆయా నవాంశ సంఖ్యచేతను జ్యేష్ఠకనిష్ఠ సోదరులయొక్క సంఖ్యను వారల వృద్ధిక్షయము లను చెప్పవలయును. మరియు పురుషగ్రహ స్త్రీగ్రహ బలానుసారముగాను స్త్రీపురుషులయొక్క సంఖ్యను ఆగ్రహములయొక్క శుభత్వ పాపత్వ సంబంధమునుబట్టి వారియొక్క వృద్ధిక్షయములనుకూడ విచారించి చెప్పవలెను.

## అథ అధికగ్రహ నిర్ణయం తత్ఫలంచాహ.

శ్లో॥ సూర్యాదిద్యుసదాం లవాధికఖగస్త జ్జాతకేసోధికః । ప్రోక్తస్తత్సహితోరవిర్నృపగృహే తంత్రాది నిర్వాహకః । పూర్ణేందా్వసుర పూజితౌ బహుధనీవిద్వాన్ మహాభోగవాన్ । భౌమస్త్వాయుధ భృచ్చమూపతి రపిస్యాద్ధాతు వాదీశఠః॥ ౨౭॥

టీ॥ సూర్యాదిద్యుసదాం= సూర్యుడు మొదలు శనివరకు నుండు యేడుగ్రహములలో, లవాధికఖగః= అధికభాగములగ్రహము, యః= ఎవడో సః= వాడు, తజ్జాతకే= ఆజాతకమునందు, అధికః= బలముగలగ్రహముఅని, ప్రోక్తః= చెప్పబడెను, తత్సహితః= అట్టిబలముగల గ్రహముతోగూడిన, రవిః= సూర్యుడు, నృపగృహే=రాజగృహమునందు, తంత్రాది నిర్వాకః=సమస్త కార్యములను నిర్వహించువాడగును, పూర్ణేందా్వసుర పూజితౌ= పూర్ణచంద్ర శుక్రులు కూడిరేని, బహుధనీ= విశేషధనవంతుడు, విద్వాన్= గొప్ప పండితుడును, మహాభోగవాన్= విశేష భోగియును నగును, భౌమస్తు= అంగారకుడు కూడెనేని, ఆయుధభృత్= అస్త్రవిద్య నేర్చినవాడును, చమూపతిః= సేనాధిపతియు, ధాతువాదీ= రసాయన శాస్త్రమును తెలిసినవాడును, శఠః= క్రూరుడును, స్యాత్= అగును.

తా॥ బలముగల గ్రహనిరూపణము వానివల్లకలుగు ఫలమును చెప్పుచున్నాను.

సూర్యుడు మొదలు శనివరకునుండు యేడుగ్రహములలో నెవ్వడధిక భాగములు కలవాడో వాడు ఆజాతకమునందు అన్నిగ్రహములలో నధికగ్రహమని చెప్పబడును. అట్టి యధికగ్రహముతో సూర్యుడు కూడెనేని రాజువద్ద ప్రధానోద్యోగముకలవాడై యాజాతకుడు సమస్తరాజకార్యములను నిర్వహించు సమర్థతకలవాడగును. పూర్ణచంద్ర శుక్రులు కూడినయెడల విశేషధనవంతుడు గొప్పపండితుడు విశేషభోగముల నొందువాడునగును. అంగారకుడు కూడినయెడల అస్త్రవిద్య నేర్చినవాడును సేనాధిపతియు రసాయన శాస్త్రమును తెలిసినవాడును (అనగా భాగములపరికారము లోహములను కూడిక చేసినవాటికి నూతనశక్తిని కలుగజేయుట.) కపట కుత్సిత క్రూరాదిస్వభావము కలవాడునగును.

శ్లో॥ సౌమ్యశ్శిల్పచమత్కృతౌ ఘటపటవ్యాపార దక్షోవణిక్ ।
జీవో వైదికకర్మకో ద్విజవర స్స్యాద్వేదవేదాంగవిత్ దీర్ఘాయుర్భృగు
జోంగనారతిపరో మందోఖిల వ్యాపకో । రాహుర్వాపితథాధ్వజో
విషభిషగ్లోహాది కార్యేపటుః ॥ ౪౫ ॥

టీ॥ సౌమ్యః=బుధుడుకూడెనేని, శిల్పచమత్కృతౌ=చిత్రపటములనువ్రాయుటయందును, ఘట= కలశములు మొదలగు పాత్రిసామానులు, పట=వస్త్రములు, మొదలగు, వ్యాపార=వ్యాపారమునందు, దక్షః= సమర్థుడును, వణిగ్జిశః = వర్తకవ్యాపారముచే జీవించువాడునగును, జీవః=బృహస్పతికూడెనేని, వేదవేదాంగవిత్= వేదశాస్త్రములను జదివినవాడును, వైదికకర్మకః=వేదోక్తకర్మలను జేయువాడునగు, ద్విజవరః= బ్రాహ్మణోత్తముడు, స్యాత్=అగును, భృగుజః =శుక్రుడుకూడెనేని, దీర్ఘాయుః= దీర్ఘాయుర్దాయముకలవాడును, అంగనారతిపరః= స్త్రీలతో సంభోగవాంఛకలవాడునగును. మందః = శనికూడెనేని, అఖిలవ్యాపకః = సమస్తవృత్తులయందు వ్యాపకుడగును. రాహుర్వాపి = రాహువుగాని, తథా= అప్రికారమే, ధ్వజః= కేతువుగాని కూడియుండినయెడల, విషభిషగ్లోహాదికార్యే= విషవైద్యము యితరవైద్యము లోహములు మొదలగువాటిని జేయుట, పటుః= సమర్థుడగును.

తా॥ అధికగ్రహముతో బుధుడుకూడెనేని చిత్రిపటములను వ్రాయుటయందు నేర్పుగలవాడును పాత్రసామానులను వస్త్రములను నిర్మించుట యందును సమర్థుడునగును. బృహస్పతికూడెనేని వేదశాస్త్రములను జదివి వేదోక్తకర్మలను జేయుటయందును చేయించుటయందును సమర్థతగల బ్రాహ్మణోత్తముడగును. శుక్రుడుకూడినయెడల దీర్ఘాయుర్దాయము కలవాడును స్త్రీలతో సంభోగవాంఛకలవాడగును. శని కూడెనేని సమస్తవ్యాపారములందు నేర్పుకలవాడగును. రాహువుగాని కేతువుగాని కూడినయెడల విషవైద్యము లోహవైద్యము మరియు నితరవైద్యము చేయుటయందు నేర్పుకలవాడగును.

శ్లో॥ తస్మాత్స్వం రవిభార్గవేక్షణయుతం స్యాద్రాజభృత్యో
నర । స్తార్తీయేతఖలే పరాక్రమయుత స్సౌమ్యేతి భీతో భవేత్ ।
తద్బంధౌ భృగుదృష్టియుగ్జలధిజే సస్స్యాన్మహానావిక । స్తస్మిన్నిందు
సితేక్షణ స్థితియుతే సౌధాధి సౌఖ్యాన్వితః ॥ ౮౬ ॥

టీ॥ తస్మాత్= ఆయధికగ్రహమున్న రాశికి, స్వం = ద్వితీయస్థానము, రవి
భార్గవేక్షణయుతం= సూర్యశుక్రుల చూపుకలిగినదియగునేని, నరః= మనుష్యుడు,
రాజభృత్యః=రాజసేవకుడు, స్యాత్=అగును. తార్తీయేతు=తృతీయస్థానమందు, ఖలే=
పాపగ్రహముండగా, పరాక్రమయుతః=పరాక్రమముతో కూడినవాడగును సౌమ్యే=
బుధుడుండిన, అతిభీతః=మిక్కిలి భయముకలవాడు, భవేత్= అగును, తద్బంధౌ=
ఆయధికగ్రహమునకు చతుర్థస్థానమందు, భృగుదృష్టియుక్= శుక్రుని దృష్టినితో కూ
డిన, జలధిజే= చంద్రుడుండిన, సః= ఆజాతకుడు మహానావికః= గొప్పయోడలు
కలవాడు, స్యాత్ = అగును, తస్మిన్ = ఆ చతుర్థస్థానమందు, ఇందుసితేక్షణస్థితి
యుతే = చంద్రశుక్రులయొక్క దృష్టిగాని కూడికగాని కలిగినయెడల సౌధాది,
సౌఖ్యాన్వితః= మేడలు మొదలగు సౌఖ్యములు కలవాడగును.

తా॥ ఆయధికగ్రహమునకు ద్వితీయస్థానము సూర్యునిచేతగాని శుక్రునిచేత
గాని చూడబడుచున్నయెడల రాజసేవకుడగును. తృతీయస్థానమందు పాపగ్రహ
మున్నయెడల పరాక్రమవంతుడగును. బుధుడున్నయెడల మిక్కిలి భయముగలవా
డగును ఆ యధికగ్రహమునకు నాల్గవస్థానమందు చంద్రుండుండి శుక్రునిచే జూడ
బడుచుండెనేని గొప్పయోడలవ్యాపారము చేయువాడగును. ఆచతుర్థస్థానమందే
చంద్ర శుక్రులుండుటగాని లేక వారి చూపుగాని కలిగినయెడల మేడలు మొదలగు
గొప్పభవనములు కలవాడై వాటి సౌఖ్యము ననుభవించును.

శ్లో॥ ఆరూఢాద్వదిబంధుగావపిదృశౌ సస్స్యాన్మహాసౌధవాన్
తస్మిన్నుచ్చఖగేపితద్వదితిచ శ్వేతాది కుడ్యార్థితః । ఏవంతద్గృహాత్తో
నవాం శకపశౌ త్తద్వాదశాంశాచ్చవా। తన్మాన్యానాం శగఖేచరాదపి
వదేద్వృత్తిం తథాపౌరుషం ॥ ౮౭ ॥

టీ॥ ఆరూఢాత్ = ఆరూఢలగ్నమునకు, బంధుగావపి= చతుర్థస్థానమం
దున్నను, దృశౌ= చూచుచున్నను. సః = ఆజాతకుడు, మహాసౌధవాన్ = గొప్ప
మేడలుగలవాడు, స్యాత్= అగును, తస్మిన్ = ఆచతుర్థస్థానమందు, ఉచ్చఖగేపి=
ఉచ్చగ్రహమున్నయెడల, తద్వత్= అప్రకారమేయగును. శ్వేతాది కుడ్యార్థితః=

తెల్లకుష్ఠు మొదలగు వ్యాధులచే పీడింపబడును. ఏవం= ఈప్రకారము, తద్గృహాత్= ఆయధికగ్రహమున్న రాశివల్లను, నవాంశకవశాత్ = నవాంశరాశివల్లను, తద్ద్వాదశాంశాచ్చవా= వానిద్వాదశాంశరాశివల్లనైనా, పైనచెప్పబడినఫలమును చెప్పవలయును. తన్న్యూనాంశగఖేచరాత్= తత్=ఆయధికగ్రహముకంటె, న్యూనాంశగః= తక్కువభాగలను పొందిన ఖేచరాదపి= గ్రహమువల్లనుంచియు, వృత్తిః= వృత్తిని, తథా= ఆప్రకారమే, పౌరుషం= వ్యాపారమును, వదేత్ చెప్పవలయును.

తా॥ ఆచంద్రశుక్రులు ఆరూఢలగ్నమునకు ౪ వ యింటియందుండినను లేక ౪ వ గృహమునుజూచినను గొప్ప మేడలుకలవాడగును. ఆ ౪ వ యింటియందు ఉచ్చగ్రహముండినయెడల అట్టిమేడల సౌఖ్యముకలవాడగును. మరియు కుష్ఠు మొదలగు రోగములచే పీడింపబడును. ఈప్రకారముగ అధిక గ్రహమున్నట్టి రాశివల్లను వాని నవాంశరాశివల్లను ద్వాదశాంశరాశివల్లను పైనచెప్పబడిన ఫలములను విచారించి చెప్పవలయును. మరియు అధికగ్రహమునకంటె తక్కువభాగములుగలగ్రహము వల్ల ఆజాతకుని జీవనవ్యాపారము పౌరుషము మొదలగు వాటిని విచారించి చెప్పవలయును. అయితే తక్కువ భాగములుకలిగి ఆయధికగ్రహమునకు మిక్కిలి సమీపములోనున్నవానినే విచారించి చెప్పవలయును.

ఇట్లు శ్రీ మహాకాళిదాసుచే రచింపబడిన యుత్తరకాలామృతములో
జాతకపద్ధతియందు గ్రహభావఫలాదులుగల చతుర్థ బిందువు
సమాప్తము.

## జాతకపద్ధతియందు కారకత్వ ఖండము చెప్పబడును.

శ్లో॥ దేహశ్చావయవస్సుఖాసుఖజరాస్తే జ్ఞానజన్మస్థలే। కీర్తి స్స్వప్నబలాయతీర్నృపనయాఖ్యాయూంషి శాంతిర్వయః। కేశాకృత్యభిమాన జీవనపరద్యూతాంకమాసత్వచో। నిద్రాజ్ఞాన ధనాపహార నృతిరస్త్కార స్వభావారుజః। వైరాగ్య ప్రకృతీచకార్యకరణం జీవ క్రియామాద్యమః। మరాదా ప్రవినాశనం త్వితిభవేద్వర్ణోపవాదస్తనోః ॥ ౪౮ ॥

టీ॥ దేహశ్చ= శరీరము, అవయవః= కాలుచెయ్యిమొదలగు నవయవములు, సుఖ=సుఖము, అసుఖ=కష్టము, జరా=ముదిమి, జ్ఞానజన్మస్థలే = జ్ఞానము జన్మస్థలము, కీర్తి=కీర్తియు, స్వప్న= స్వప్నము, బల= బలము, ఆయతీః= ఉత్తరకాలఫలము, నృపనయ=రాజనీతి, ఆయూంషి= ఆయుర్దాయము, శాంతిః= నిదానము,

వయః= వయస్సు. కేశా.....త్వచః, కేశ = వెంట్రుకలు, ఆకృతి= ఆకారము, అభిమాన - అభిమానము - జీవన - జీవనము - పర - ఇతరులనిమిత్తము - ద్యూత - జూదము - అంక = చిహ్నము, మాన = పౌరుషము, త్వచః = చర్మము, నిద్రా=...తుజః, నిద్రా = నిద్ర, అజ్ఞాన= అజ్ఞానము, ధనాపహార = ధనమును దొంగిలించుట, నృతిరస్కార = మనుష్యులను తిరస్కరించుట, స్వభావ= స్వభావము, అరుజః= రోగము లేకపోవుట, వైరాగ్య=వైరాగ్యము, ప్రకృతిచ= స్వభావము, కార్యకరణం= కార్యములను జేయుట, జీవక్రియాను= జీవకార్యముల యందు, ఉద్యమః=ప్రయత్నించుట, మర్యాదా ప్రవినాశనం= మర్యాదను పోగొట్టుకొనుట, వర్ణః=వర్ణము, అపవాదః= అపకీర్తి, ఇతి= ఈలాగునని, గుణములు, తనోః= తనుభావమువల్ల, భవేత్=అగును.

తా॥ భావము భావాధిపతి- కారకము మొదలగువానివలన ఆయా ఫలములను తెలిసికొనవలయునని పూర్వము గ్రహభావ ఫలఖండములో జెప్పబడినది. ఇప్పుడు కారకత్వమువలన ఫలమునుగురించి చెప్పబడుచున్నది. అయితే కారకత్వమనగా యెట్టిదో తెలియనిది దానిఫలమును జెప్పుటకూడ అసందర్భముకాబట్టియిప్పుడు కారకత్వమును వివరించి చెప్పుచున్నాను. భావమువల్లను కలిగినదియు గ్రహము వల్ల కలిగినదియు అని కారకత్వము రెండు విధములుగానున్నది ఇప్పుడు భావకారకత్వమును గురించి చెప్పుచున్నాను. ఇంతటినుంచి శ్లోకములకు విభక్తులు వచనములు సమాసములు సరిగానుండవు. కవీశ్వరునియొక్క భావముజ్యోతిషమును విశదీకరణము జేయుటయంచే తాత్పర్యమైయున్నది. కర్త కర్మ క్రియారూపమగు అన్వయము కూడ సంభవింపదు కాబట్టి శ్లోకములలోనుండు పదములకు నర్థములు సులభముగా దెలిసికొనదగిన వగుటవల్లను తాత్పర్యముమాత్రము వ్రాయబడును. అవుసరమగుచోట నర్థముకూడ వ్రాయబడును. ఈ శ్లోకములోమాత్రము అర్థము తాత్పర్యము వ్రాయబడినది. దేహము, కాళ్ళు మొదలగు నవయవములు, సుఖము, కష్టము, ముదిమి, జ్ఞానము, జన్మభూమి, కీర్తి, స్వప్నము, బలము, ఉత్తరకాలఫలము, రాజనీతి,ఆయుర్దాయము, శాంతి, వయస్సు, కేశములు, ఆకారము, అభిమానము, జీవనము, ఇతరవిషయము, జూదము, చిహ్నము, పౌరుషము, చర్మము, నిద్ర, అజ్ఞానము ధనమును దొంగలించుట, మనుష్యులను తిరస్కరించు స్వభావము, రోగములేకపోవుట వైరాగ్యము, ప్రకృతి, కార్యములను జేయుట, జీవకార్యములయందు ప్రయత్నించుట, మర్యాదను పోగొట్టుకొనుట, వర్ణము, అపవాదము, ఈ మొదలగు గుణములు తనుభావమువలన తెలిసికొనవలయును. ఇకముందు తాత్పర్యమాత్రము వ్రాయబడును.

## అథధన భావకారకత్వమాహ.

శ్లో॥ వాగ్విత్తాస్తిక పోషకత్వనఖ సంభోజ్యాని సత్యానృతే,

జిహ్వాక్ష్యంబర వస్త్రతామ్రమణయో ముక్తాగ్రహాః కృత్రిమః। కౌటుం
బం క్రయ విక్రియా మృదువచో దాతృత్వ విత్తోద్యమాః సాహాయ్యం
సఖ కాంతి విత్తకృపణ ప్రసన్నవాగ్వైభవాః । విద్యాస్వర్ణసురౌప్య
ధాన్య వినయానా సామనస్థైర్యకే। తత్పార్శ్వస్థనరోగమాగమ విధిర్జీ
వాఢ్యతా ద్రవ్యభాత్ ॥ 3 ॥

టీ॥ వాక్= మాట్లాడుట, విత్త= ధనము, ఆస్తిక= ఉన్నదనే స్వభావము, పోషకత్వ= పోషించుట, సఖ= స్నేహము, సంభోజ్యాని = చక్కగా భుజించుట, సత్య= నిజము, అనృతే= అబద్ధము, జిహ్వా= నాలుక, అక్షి= నేత్రము, అంబర = వస్త్రము, తామ్ర= రాగి, మణయః=మణులు, ముక్తా= ముత్యములు, ఆగ్రహా = ఆగ్రహము, కృత్రిమః= కపటము, కౌటుంబం=కుటుంబ సంబంధమగు వ్యాపారము, క్రయ=కొనుట విక్రియా=అమ్ముట, మృదువచః=సరసముగా మాట్లాడుట, దాతృత్వ=ఇచ్చుట, విత్త=ధనము, ఉద్యమా=ప్రయత్నము జేయుట, సాహాయ్యం=సాహాయముజేయుట, సఖ=స్నేహము, కాంతి=తేజస్సు విత్త = ధనము, కృపణ = కపటము, ప్రాసన్నవాగ్వైభవాః = అనుగ్రహముకల వాక్కులు కలుగుట, విద్యా = చదువు, స్వర్ణ=బంగారము, సురౌప్య=వెండి, ధాన్య=ధాన్యము, వినయ=వినయము, మనస్థైర్యకే= మనస్సు స్థిరముగానుండుట, సత్పార్శ్వస్థనర=సత్పురుషుని సహవాసముగానుండుట, గమాగమవిధిః= రాకపోకలవిధానము, జీవాఢ్యతా= ఏనుగులు గుఱ్ఱములు మొదలగు జంతువులు కలుగుట ఈ మొదలగు గుణములు, ద్రవ్యభాత్= ద్వితీయభావమువల్ల తెలిసికొనవలయును. పదములకు నర్థము తెలియుట ముఖ్యమైనందున అర్థము వ్రాయబడినది.

## అథతృతీయ భావకారకత్వ మాహ.

శ్లో॥ ధైర్యం సోదరయుద్ధ కర్ణచరణాధ్వక్షేత్రచిత్తభ్రమాః।
సామర్థ్యం సురసద్మతాప కరణం స్వప్నం భటో విక్రమః । స్వీయో
బంధుజనస్సు హృచ్ఛలన కంఠాదుష్ణభోజ్యాదికం। శక్తిర్దాయవిభాగ
భూషణగుణా విద్యావినోదాబలం । లాభో దేహసమృద్ధి సత్కుల
భవాభృత్యశ్చ పిత్ర్యస్థలం । దాసీస్వల్పసుయాన యాత్రఉరుకార్యం
స్వీయధర్మస్త్రిభాత్ ॥

టీ॥ ధైర్యం=ధైర్యము, సోదర=అన్నదమ్ములు, యుద్ధ=యుద్ధము, కర్ణ= చెవులు, చరణ= పాదములు, అధ్వ=మార్గము, క్షేత్ర= భూమి, చిత్తభ్రమ=మనస్సుచలించుట, సామర్థ్యం=సమర్థత, సురపద్మ= దేవాలయము= తాపకరణ= తపింపజేయుట,స్వప్నం=స్వప్నము, భటః=భృత్యుడు, విక్రమః=పరాక్రమము,స్వీయః బంధుజనః= స్వకీయమైనబంధువు, సుహృత్ = స్నేహితుడు, చలన = కదలుట, కంఠ= కంఠము, దుష్టభోజ్యాదికం= చెడుపదార్థమును భుజించుట, శక్తిః=సమర్థత, దాయవిభాగ= భాగమును పంచుకొనుట, భూషణ=అలంకారములు, గుణ= సుగుణములు విద్యా=చదువు, వినోద=విహారించుట, బలం=బలము, లాభః= లాభము, దేహసమృద్ధి = శరీరము దృఢముగా నుండుట, సత్కులభవ = మంచివంశమునందు బుట్టుట, భృత్య=నౌకరు, పిత్ర్యస్థలం=తండ్రియుండు ప్రదేశము, దాసీ=పరిచారకులు, స్వల్పసుయాన=కొంచమైన మంచివాహనము, యాత్ర=తీర్థయాత్ర, ఉరు కార్యం=గొప్పకార్యము, స్వీయధర్మః= తన సంబంధమైన ధర్మము, ఈ మొదలగు గుణములు, త్రిభాత్= తృతీయ భావమువల్ల తెలియబడును.

## అధచతుర్థభావ కారకత్వమాహ.

శ్లో॥ విద్యారాజ్య గృహప్రయాణ నరసన్నౌకాది సద్వాహనా । న్యభ్యంగోజననీచ బంధుసుహృదా జాత్యంబరేవాపికా । పానీయంచ వయస్సుగంధ సుఖవాక్ సన్నామదివ్యౌషధం । విశ్వాసోనృత వాదమంటపజయ స్వేదోద్భవాయాః కృషిః॥ క్షేత్రారామ తటాకకూప ఖననం తత్రప్రతిష్ఠాదయో। మాతుర్వర్గనిదానబుద్ధిజన కోదారస్వ నిక్షేపణం । సౌధశ్శిల్ప గృహప్రవేశ పరిణామాశ్శిల ధామచ్యుతీ । పిత్ర్యంస్వంసుర భోజనంచ మనసోమోహః ప్రదేశ క్రియా । వల్మీకశ్రుతి శాస్త్రవృద్ధి మహిషాగోవాజి మత్తద్విపా । ర్ద్రిక్షేత్రోద్ధను సస్యసంపద ఇమే వాచ్యాశ్చతుర్థాలయాత్ ॥ 2 ॥

టీ॥ విద్య= రాజ్య, గృహ= ప్రయాణ- నర= సన్నౌకాది, సద్వాహన= అభ్యంగ, జననీ=బంధు, సుహృత్= జాతి, అంబర= వాపికా, పానీయ= పయః సుగంధ=సుఖ, సన్నామ= దివ్యౌషధం= విశ్వాస, అనృతవాద= మంటప, జయితి స్వేదోద్భవ, ఆయః=కృషిః, క్షేత్ర = ఆరామ,తటాక = కూపఖననం. తత్రప్ర= ష్ఠాదయః- మాతుర్వర్గనిదాన= బుద్ధి, జనక= ఉదార, స్వనిక్షేపణం= సౌధః=శిల్ప, గృహప్రవేశ= పరిణామ, శిల= ధామచ్యుతీ, పిత్ర్యంస్వం= సురభోజనం=మనసో

మోహః= ప్రదేశక్రియా, వల్మీక= క్షుతి, శాస్త్ర= వృద్ధి, మహిష=గో-వాజి-మత్త ద్విప- ఆర్ద్ర క్షేత్రోత్థసునస్య సంపదః- ఈ మొదలగు విషయములు చతుర్థభావము వల్ల తెలిసికొనవలయును.

గూఢపదముల కర్థములు:- సన్మోకాది=మంచిమోడలు, సద్వాహన=మంచి వాహనములు అభ్యంగః= తలంటిపోసికొనుట అంబర= వస్త్రము, వాపిక= దిగుడు బావి, పయః=పాలు, సన్నాన్నము, మంచిపేరు తెచ్చికొనుట, అన్యతవాగ= అబద్ధ వాదము, స్వేదోద్భవ= చెమటపుట్టుట, ఆయః= సంపాదించుట, ఆరామ=తోట, కూప= నూయి, తత్ప్రతిష్ఠా= ఆయాదేశతలను ప్రతిష్ఠజేయుట, స్వనిక్షేపణం= ధనమును భూమియందు దాచుట, ధామచ్యుతి=స్థానభ్రష్టము, పిత్ర్యంస్వం=తండ్రి సంబంధమైన ధనము, సురభోజనం= కల్లుద్రాగుట, మనసోమోహః= మనస్సుమోసపోవుట వల్మీక= పుట్ట, మహిష= దున్నపోతు గేదెలు, వాజి= గుఱ్ఱము, మత్తద్విప మదించిన యేనుగు, ఆర్ద్రక్షేత్రోద్ధసుసస్య సంపదః= తడిసిన భూమివలన పుట్టిన మంచి వరి మొదలగు పైరులు.

## అథ పంచమభావ కారకత్వమాహ.

శ్లో॥ సంతానం పితృపుణ్య రాజసచివాస్సౌశీల్య శిల్పేమనో। విద్యాగర్భవివేక ఛత్రసుకథామాంగళ్య పత్రాంబరే । నానాకామ్య మహాపరియోగ పితృవిత్తే దూరచింతాక్రమా। త్కాంతామూలక లబ్ధభాగ్య విభవో వారాంగనా లింగనం ॥ ౮ ॥

శ్లో॥ గాంభీర్యం ఘనతారహస్యవినయా వృత్తాంతసంలేఖనం క్షేమస్నేహ పరిబంధకావ్యరచనా కార్యపరివేశోదరాః । మంత్రోపాసన సుప్రసన్నవిభవాశ్చాన్న పరిదానంచత॥త్పుణ్యాసత్ప్రవిచార మంత్రజపకాః ప్రజ్ఞా సమాలోచనే ॥ ౯ ॥

శ్లో॥ విత్తోపాయ మృదంగ వాద్యసుమహత్సంతోష పాండిత్యకాః। పారంపర్యసమాగతంతు సచివస్థానంభవేత్పంచమాత్ ॥౧౦॥

పదములు॥ సంతాన - పితృపుణ్య - రాజ- సచివ- సౌశీల్య- శిల్ప- మనః- విద్యా- గర్భ- వివేక ఛత్రసుకథా- మాంగళ్యపత్రః అంబర- నానాకామ్య-మహాపరియోగ- పితృవిత్త- దూరచింత- కాంతామూలక లబ్ధభాగ్యవిభవ- వారాంగనాలింగనం- గాంభీర్య- ఘనతా- రహస్య- వినయ- వృత్తాంతసంలేఖనం- క్షేమ- స్నేహ-

ప్రబంధ కావ్యరచన- కార్యప్రవేశ- ఉదర- మంత్రోపాసనసుప్రసన్న విభవ- అన్నప్రదానం- తత్పుణ్య- అసత్ప్రవిచార- మంత్రజపక- ప్రజ్ఞా- సమాలోచన- విత్త- ఉపాయ- మృదంగవాద్య- సుమహత్సంతోష- పాండిత్యకాః- పారంపర్య సమాగతంసచివస్థానం- ఈ మొదలగు విషయములు పంచమ భావమువల్ల తెలియబడును.

పదములకు అర్థములు:- సచివ=మంత్రి, సౌశీల్య=మంచిస్వభావము, ఛత్ర=గొడుగు, మాంగళ్యపత్ర= శుభలేఖ, అంబరం=వస్త్రము, నానాకామ్య=అనేక విధములగు కోరికలు, దూరచింతా= బాగా ఆలోచించుట, కాంతామూలక లబ్ధభాగ్య విభవః= భార్యవల్లను కొంతభాగ్యము సంభవించుట, అనగా అత్తవారితాలూకుఆస్తి వచ్చుట, వారాంగనాలింగనం= వేశ్యాస్త్రీలతో సంభోగించుట, ఘనతా= గొప్పతనము, వృత్తాంతసంలేఖనం= ఉత్తరములను వ్రాయునేర్పు ప్రబంధ కావ్యరచనా= నూతనముగ గ్రంథములను రచియించుట, మంత్రోపాసన సుప్రసన్న విభవ= మంత్రములను జపియించుటచే దేవతానుగ్రహము కలుగుట, పుణ్యాసత్ప్రవిచార= పుణ్యపాపములను తెలిసికొనుట, మృదంగవాద్య=మద్దెలను వాయించుట, పారంపర్యసమాగతం సచివస్థానం= రాజుగారివద్ద మంత్రిపదవి వంశపరంపరా వచ్చుట.

## అథషష్ఠ భావకారకత్వమాహ.

శ్లో॥ రోగోవిఘ్నరణాప్తి మాతులకఫ గ్రంథ్యుగ్ర కర్మో న్మాదస్ఫోటక శత్రువైర కృపణత్వా స్వాస్థ్యమేహావ్రణాః। అన్నాయాసరుణా పవాదరిపు సంతోష క్షయోష్ణక్షతా। శ్చిత్తక్లేశ బహువ్యథే బహుజనద్వేషో నిశంనేత్రరుక్ ॥ ౧౧ ॥

శ్లో॥ భిక్షాదాన మకాలభోజన కలాభ్రం శాస్సపిండారిభిః। లాభాయాస విషాతిశూల నిగళాస్స్వీయం యశోరక్షణం । మాతృవ్యాధ్యతిసార షడ్రస వినిందాదాసచోరా విపత్తా-రాగేహ సహోదరాది కలహాన్యుష్షష్ఠ భావాదిమే ॥ ౧౨ ॥

పదములు॥ రోగ- విఘ్న- రణాప్తి- మాతుల- కఫ- గ్రంథి- ఉగ్రకర్మ- ఉన్మాద- స్ఫోటక- శత్రువైర- కృపణత్వ - అస్వాస్థ్య - మేహావ్రణ - అన్న - ఆయాస- రుణ- అపవాద- రిపుసంతోష- క్షయ - ఉష్ణక్షతా - చిత్తక్లేశ - బహువ్యథా- బహుజనద్వేషః - నేత్రరుక్ - భిక్షాదానం - అకాలభోజన- కలాభ్రంశ సపిండారిభిః- లాభ- ఆయాస-విష-అతిశూల-నిగళ స్వీయంయశోరక్షణం- మాతృ

వ్యాధి- అతిసార- మదప్రస- వినింద-దాన-చోర- విపత్- కారాగేహ - సహోదరాది కలహము. ఈగుణములు షష్ఠభావమువల్ల తెలిసికొనబడుచున్నవి.

పదములకు అర్థములు:- రణాప్తి= యుద్ధప్రాప్తి, మాతుల=మేనమామ,కఫ= శ్లేష్మము, గ్రంధి= కురుపులు, ఉన్మాద= పిచ్చి, స్ఫోటక= మసూచికము, కృపణత్వ= కపటము, అస్వాస్థ్య- స్థిమితము లేకపోవుట, నేత్రరుక్ = కండ్లకు జబ్బుచేయుట, భిక్షాదాన=ముష్టియెత్తుకొనుట, కలాభ్రంశసపిండారిభిః = జ్ఞాతులవల్లనుగాని శత్రువులవల్లనుగాని కాంతితగ్గుట, నిగళ= సంకెళ్లు. కారాగేహ= చెరసాల, సహోదరాదికలహ=అన్నదమ్ములు మొదలగువారితో పోట్లాడుట.

## అథసప్తమ కారకత్వమాహ,

శ్లో॥ ఉద్వాహ వ్యభిచార కాముఖ జయానష్టాంగనాద్యేషతా మార్గభ్రంశ సుగంధగీత కుసుమామృష్టాన్న పానాదికం తాంబూలం చప్రయాణభంగ దధివిస్మృత్యంబరాద్యాగమో। రేతోభర్తృపవిత్ర దారయుగళం గుహ్యాంచ మూత్రం గుదః ॥ ౧౩ ॥

శ్లో॥ వాణిజ్యంచ తథాపయోమధురసౌఘసూపకాజ్యాశనం దానం శౌర్యవినష్ట శత్రువిజయా స్థానాంతర స్థంధనం । వాదోమైథున దత్తపుత్ర ఘృతజా స్త్రీయాన్య దేశౌతథా । జాయామాన్మధజంరహాన్యఖిలం చౌర్యం వదేత్సప్తమాత్ ॥ ౧౪ ॥

పదములు॥ ఉద్వాహ- వ్యభిచార- కాముక-జయ- నష్టాంగనా- ద్వేషతా- మార్గభ్రంశ- సుగంధ- గీత- కుసుమ- మృష్టాన్న పానాదికం- తాంబూలం-ప్రయాణభంగ- దధి- విస్మృతి- అంబరాద్యాగమ- రేతః- భర్తృ- దారయుగళం- గుహ్యం- మూత్రం- గుదః- వాణిజ్యం- పయః- మధురసౌఘ- సూపకాజ్యాశనం- దానం- శౌర్య- వినష్ట- శత్రు- విజయ- స్థానాంతరస్థంధనం- వాద- మైథున-దత్తపుత్ర= ఘృతజా- స్త్రీయాన్యదేశే- జాయా మాన్మధజం - అఖిలంరహస్యం - చౌర్యం- ఈ మొదలగు గుణములు సప్తమ భావమువల్ల తెలిసికొనబడును.

పదములకు అర్థములు-: ఉద్వాహ= వివాహము, నష్టాంగనా, కళత్రనష్టము, విస్మృతి= మరచిపోవుట, సూపకాజ్యాశనం=పప్పునెయ్యి మొదలగువానితో గూడిన భోజనము, స్థానాంతరస్థంధనం=మరియొకచోట నున్నట్టిధనము మాన్మధజం= మన్మథసంబంధమగు, చౌర్యం=దొంగతనము.

## అథాష్టమ భావకారకత్వమాహ.

శ్లో॥ ఆయుస్సౌఖ్య పరాభవా మృతధనం సంక్లేశ వక్త్రం మృతిః। క్లేశోమారణ కారణాన్నకలహా తస్మేహ జాడ్యం విపత్ । భ్రాతుశ్శత్రు కళత్రపీడన కలాపాశ్శత్రు దుర్గస్థలం। క్లేశశ్చాలసరాజ దండన భయదరిద్ర్యక్షయర్ణ ప్రదాః ॥ ౧౭ ॥

శ్లో॥ అజ్ఞానాప్త పరంధనం చిరధనం దుర్మార్గమర్త్యాగమః। పాపంజీవవధోంగ హీనకశిరచ్ఛేదోగ్ర దుఃఖానిచ । చిత్తాస్వాస్థ్య కథోపసర్గ పరివారోగ్ర క్రియాసూద్యమో। యుద్ధాత్యంతమనోవ్యథే చసతతం భావాద్వదేదష్టమాత్ ॥ ౧౮ ॥

పదములు॥ ఆయుః- సౌఖ్య- పరాభవ- మృతధనం- సంక్లేశవక్త్రం- మృతిః క్లేశ- మారణకారణాన్న- కలహ- మేహాజాడ్యం- విపత్- భ్రాతుశ్శత్రుః కళత్రపీడన- కలాప- శత్రుదుర్గస్థలం- క్లేశ- ఆలస- రాజదండన- భయ- దరిద్ర్య- క్షయ ఋణప్రద- అజ్ఞానాప్తపరంధనం- చిరధనం- దుర్మార్గమర్త్యాగమః- పాపం- జీవవధ అంగహీన- శిరశ్ఛేద- ఉగ్రదుఃఖాని- చిత్తాస్వాస్థ్యకథా- ఉపసర్గపరివార- ఉగ్ర క్రియాసూద్యమ- యుద్ధ- అత్యంతమనోవ్యథ- ఈచెప్పబడిన విషయములు అష్టమ భావమువల్ల తెలిసికొనబడుచున్నవి.

పదములకు అర్థములు:- మృతధనం=మరణము నొందినవారివలనను రాబడిన ధనము, సంక్లేశవక్త్రం = విచారముగల ముఖము, మారణకారణాన్న = చంపుటకు విషాదులను కలిపిపెట్టిన యన్నము, మేహాజాడ్య= మేహరోగము, భ్రాతుశ్శత్రు- సోదరునియొక్క శత్రువు, కళత్రపీడనకలాప=భార్యాయొక్క పీడ, శత్రుదుర్గస్థలం= శత్రువుయొక్క కోటప్రదేశము, అలస- మాంద్యము, అజ్ఞానాపరంధనం=తనకు తెలియకుండాను దైవవశముచే విశేషధనము లభించుట. దుర్మార్గమర్త్యాగమః-దుష్టుడగు మనుష్యుడువచ్చుట, అంగహీన- అవయవములేకపోవుట, ఉగ్రదుఃఖ= గొప్పదుఃఖము, చిత్తాస్వాస్థ్యకథా = మనస్సునకు స్థిమితములేని కథలు, ఉపసర్గ పరివార= తనను ఆశ్రయించి చుట్టుకొనిన జనము, ఉగ్రక్రియాసూద్యమః= కఠినమైనవ్యాపారములయందు ప్రవర్తించుట.

## అథనవమ భావకారకత్వమాహ.

శ్లో॥ దానం ధర్మసుతీర్థ సేవనతపో గుర్వాది భక్తోమథా । దారాశ్చిత్త విశుద్ధిదేవభజనే విద్యాశ్రమో వైభవః । యానభాగ్యం

నయప్రతాప సుకథాయాత్రాభిషేకాదయః। పుష్టిస్సజ్జన సంగతిశ్శుభపితృ స్వంపుత్రపుత్ర్యస్తథా ॥ ౧౭ ॥

శ్లో॥ అష్టైశ్వర్యతురంగ నాగమహిషాః పట్టాభిషేకాలయ బ్రహ్మస్థాపన వైదికక్రతు ధనక్షేపాస్స్యరం కర్మతః ॥

పదములు॥ దాన- ధర్మ- సుతీర్థసేవన- తప- గుర్వాదిభక్తి- ఔషధ-ఆచార- చిత్తవిశుద్ధి- దేవభజన- విద్యాశ్రమ- వైభవ- యానం- భాగ్య-నయ-ప్రతాప- సుకథా- యాత్ర- అభిషేక- పుష్టి- సజ్జనసంగతి- శుభ- పితృస్వం- పుత్రపుత్ర్యః అష్టైశ్వర్య- తురంగ- నాగ- మహిష- పట్టాభిషేక- ఆలయ-బ్రహ్మస్థాపన-వైదికక్రతు- ధనక్షేప- ఈ మొదలగు విషయములు తొమ్మిదవ భావమువల్ల తెలియబడును.

అర్థములు॥ పితృస్వం=తండ్రి సంబంధమగు ధనము, బ్రహ్మస్థాపన, బ్రాహ్మణునకు యిల్లు కట్టించి యిచ్చుట.

## అథదశమభావ కారకత్వమాహ.

శ్లో॥ వాణిజ్యం నృపమాన్యతా శ్వగమనం మల్లత్వ రాజ్యక్రియా। దాసత్వం కృషివైద్య కీర్తినిధి నిక్షేపాశ్చయజ్ఞాదయః । శ్రేష్ఠత్వంగురుయంత్ర మంత్రజననీ విస్తారపుణ్యౌషధో। రుస్థానామర మంత్రసిద్ధి విభవాస్స్యద్దత్తపుత్రః ప్రభుః మార్గోమానను జీవనేచ నృపరాట్ప్రఖ్యాతి శిక్షాదయా। ముద్రా ప్రాభవనిగ్రహాదశమాదాజ్ఞామతిస్స్యాది ॥ ౧౮ ॥

పదములు॥ వాణిజ్యం- నృపమాన్యతా- అశ్వగమనం- మల్లత్వ- రాజ్యక్రియా దాసత్వం- కృషి- వైద్య- కీర్తి- నిధినిక్షేప- యజ్ఞా- దయః- శ్రేష్ఠత్వం- గురు- యంత్ర-మంత్ర-జననీ- విస్తార పుణ్య ఔషధ ఉస్థాన అమరమంత్రసిద్ధిభవ దత్తపుత్ర- ప్రభుః- మార్గ- మాన- సుజీవన- నృపరాట్- ప్రఖ్యాతి- శిక్షా-దయా- ముద్రాప్రాభవ-నిగ్రహ- ఆజ్ఞామతి ఈ మొదలగు విషయములు దశమభావమువల్ల తెలిసికొనవలయును.

టీ॥ నృపమాన్యతా= రాజులచే గౌరవింపబడుట, అశ్వగమనం = గుఱ్ఱము నెక్కి తిరుగుట, మల్లత్వ= కుస్తీ పట్టుటయందు నేర్పుకలుగుట, అమరమంత్రసిద్ధివిభవ= దేవతా మంత్రములను జపించి దేవతలను ప్రత్యక్షము జేసికొనుట, ముద్రా

ప్రాభవ = ముద్రాధికారియగుట, ఆజ్ఞామతి = ఆజ్ఞయిచ్చుట.

అథ ఏకాదశభావ కారకత్వమాహ.

శ్లో॥ లాభస్సర్వవిధైర్దురాశ సకలాదాయా పరాధీనతా । జ్యేష్ఠభ్రాతృపితృవ్య నిర్జరగణార్చా సాత్వికోపాసనం । విద్యాహేమ ధనార్జనేతి పటుతాస్వం పూర్వపిత్ర్యంతథా । జానుస్థాన విశేషభూషణ మణిప్రీతీన విత్తానిచ ॥ ౨౦ ॥

శ్లో॥ నష్టద్రవ్య కలాంగనార్థ కనకస్వర్గాదికార్యాప్తయః । ప్రజ్ఞామాత్య ప దేతథాశ్వశుర జోలాభశ్చ భాగ్యోదయః।సిద్ధిశ్చాభిమతస్సులాభవచనే చాశాజననాయుషీ । కర్ణోజంఘ విచిత్రలేఖన కలానైపుణ్య మేకాదశాత్ । ౨౧ ॥

పదములు॥ లాభస్సర్వవిధైః- దురాశ - సకలాదాయ - పరాధీనతా - జ్యేష్ఠభ్రాతృ- పితృవ్య- నిర్జరగణార్చా- సాత్వికోపాసనం- విద్యాహేమధనార్జనేతిపటుతా- స్వంపూర్వపిత్ర్యం- జానుస్థాన- విశేషభూషణ- మణి- ప్రీతి- ఇనవిత్తానినష్టద్రవ్యకలా- అంగనా- అర్థ- కనక స్వర్గాదికార్య- ఆప్తయః- ప్రజ్ఞామాత్యపదే- శ్వశురజోలాభః- భాగ్యోదయః- సిద్ధిః- అభిమతః- సులాభవచనేఆశా- జననీ- ఆయుషీ- కర్ణః- జంఘ- విచిత్రలేఖన కలానైపుణ్యం॥

టీ॥ సర్వైః ధైర్లాభః= అన్ని విధములచేత లాభముకలుగుట, నిర్జరగణార్చా- దేవతులను పూజించుట, సాత్వికోపాసనం= సత్వగుణముగల దేవతులనారాధించుట విద్యాహేమధనార్జనేతిపటుతా= చదువు బంగారము ధనము మొదలగువాటినిసంపాదించుటయందు విశేషము నేర్పుగలుగుట, పూర్వపిత్ర్యంస్వం తాత ముత్తాతలసంబంధమగు ధనము, జానుస్థాన= మోకాలు, ఇనవిత్తాని= ప్రభుసంబంధమగు ధనము, స్వర్ణాదికార్య=బంగారు మొదలగువాటిని జేయుట, శ్వశురజోలాభః= మామగారి వల్ల లాభముపొందుట, జంఘ=పిక్క, విచిత్రలేఖన కలానైపుణ్యం= చిత్తరువులను వ్రాయుటయందు నేర్పు పైన చెప్పబడినవిషయములు ఏకాదశ భావమువల్ల తెలియబడును.

అథద్వాదశ భావకారకత్వమాహ.

శ్లో॥ నిద్రాభంగ మనోవ్యథేంఘ్రియుగళం శత్రోర్వ్యయంబంధనం। పీడాముక్తి ఋణప్రమోచన గజాశ్వాపిత్ర్య విత్తంరిపుః ।

స్వర్గారోహణ వామనేత్రజన విద్వేషాంగ వైకల్యతా। జారత్వంచ వివాహనష్టశయన త్యాగాధికార క్షయాః ॥ ౨౨ ॥

శ్లో॥ శత్రోశ్శృంఖల గేహచిత్త వికలాదీన స్వభావాసతా । పిత్రోస్సోదర సౌఖ్యచింతన హతిసోవాదరోషా క్రమాత్ । దేహార్తి ర్మృతికాన్య దేశగమనే సర్వప్రకారవ్యయో। భార్యాహానిరితిక్రమా న్నిగదితా స్తత్కార కారిష్ఫభాత్ ॥ ౨౩ ॥

పదములు : నిద్రాభంగ- మనోవ్యథ- అంఘ్రియుగళీ - శతోర్ధ్వయం-బంధనం- పీడా- ముక్తి- ఋణపరిమోచన- గజ- అశ్వాః- పిత్ర్యవిత్తం- రిపుః- స్వర్గారోహణ- వామనేత్ర- జనవిద్వేష- అంగవైకల్యత - జారత్వం - వివాహనష్ట - శయన త్యాగ- అధికారక్షయ- శత్రోశ్శృంఖల- గేహ - చిత్తవికల- దీనస్వభావ- అసతా - పిత్రోః- సోదరసౌఖ్య చింతనహతిః - వాద - రోష- దేహార్తిః- మృతికాన్య దేశ గమనే- సర్వప్రకారవ్యయః- భార్యాహానిః- ఈ మొదలగు విషయములు ద్వాదశ భావమువల్ల తెలిసికొనబడును

అర్థములు : అధికారక్షయ= ఉద్యోగముపోవుట, శత్రోశ్శృంఖల= శత్రువుల వల్ల కారాగృహప్రాప్తి=పిత్రోస్సోదర సౌఖ్యచింతనహతిః= తల్లిదండ్రులకు సోదరులకు సౌఖ్యములేకుండా జేయుటయందే ఆలోచన, అన్యదేశగమనే= ఇతరదేశమునకు వెళ్లుటచే మృతికా= మరణము, సర్వప్రకారవ్యయః= అన్నివిధముల ఖర్చు చేయుచుండుట.

ఇట్లు జాతకపద్ధతిలో అయిదవదియగు కారకత్వ ఖండములో భావకారకత్వ నిరూపణము సమాప్తము.

## అథాదౌరవి కారకత్వమాహ.

శ్లో॥ ఆత్మాశక్తి తీక్ష్ణదుర్గసుబలా శోష్ణపరిభావాగ్నయః। శైవోపాసన ధైర్యకంటకతరూ రాజాశ్రయత్వంకటుః । వృద్ధత్వం పశుదౌష్ట్య భూపితృరుచి జ్ఞానోదయవ్యోమదృగ్భీరూత్పన్న మనుష్య లోకచతుర శాస్త్రిప్రతాపా స్తృణం ॥ ౨౪ ॥

శ్లో॥ కుష్ఠుత్సాహవనా యనాక్షిగిరిసంచారాశ్చతుష్పానప్ప । స్వంచాసో వ్యవహారపిత్తత పనావృత్తాకృతిర్నేత్రరుక్। దేహోదారుమనశ్శుచి స్సకలదేశాధీశ్వర త్వంహ్యారు। క్సారాష్ట్రాధిపతిత్వ భూమణిరోవ్యాధి శ్చముక్తాఃకఫః । ౨౫ ।

శ్లో॥ హ్రాస్వః పూర్వదిగీశ తామ్రరుధిరే రాజ్యంచరక్తః పటః।
పాషాణప్రకట ప్రవర్తన నదీతీర ప్రవాళాభిధాః। మధ్యాహ్న ప్రబలత్వ
పూర్వవదన స్యాద్దీర్ఘ రోషారిపు। గ్రాహ్యసాత్వికరక్తచందన పర
త్వస్థూలతంతూరవేః ॥ ౨౬ ॥

పదములు : ఆత్మా- శక్తి- అతితీక్ష్ణ- దుర్గ- సుబల- ఉష్ణప్రభావ- అగ్ని- శైవోపాసన- ధైర్య- కంటకతరు- రాజాశ్రయత్వం- కటు- వృద్ధత్వం- పశునాస్థ్య భూ- పితృ- రుచి- జ్ఞానోదయ- వ్యోమదృక్- భీరూత్పన్న- మనుష్యలోక- చతురశ్ర- అస్థి- ప్రతాప- తృణ- కుక్షి- ఉత్సాహ- వనాయన- అక్షి- గిరిసంచార- చతుష్పాత్- నృప- సంచార- వ్యవహార- పిత్త- తపన- వృత్తాకృతి- నేత్రరుక్- దేహ- దారు- మనశ్శుచి- సకల దేశాధీశ్వరత్వం- అరుక్- సౌరాష్ట్రాధి- తిత్వం- భూషణ- శిరోవ్యాధి- ముక్తా- ఖప- హ్రస్వ- పూర్వదిగీశ - తామ్ర - రుధిర- రాజ్య- రక్త పట- పాషాణ- ప్రకట- ప్రవర్తన- నదీతీర- ప్రవాళ- మధ్యాహ్న ప్రబలత్వపూర్వ వదన- దీర్ఘరోష- రిపుగ్రాహ- సాత్విక- రక్తచందన - స్థూలతంతు - ఈ మొదలగు విషయములు సూర్యునివల్ల తెలిసికొనవలెను.

అర్థములు : శైవోపాసన=శివుని ధ్యానించుట, కంటకతరు= ముండ్లచెట్టు, కటు= కారము, వ్యోమదృక్- ఆకాశమువంక చూచుట, భీరూత్పన్న= భయము కలుగుట, చతురశ్ర= నలుచదరము, వనాయన=అడవికి వెళ్ళుట, గిరిసంచార=పర్వతమునందు తిరుగుట, పిత్త=పైత్యము, వృత్తాకృతి- గుండ్రని యాకారము, నేత్రరుక్= కంటిరోగము, అరుక్= అజీర్ణము, ముక్తా= ముత్యములు, ఖప= ఆకాశమునకు నధిపతి, హ్రస్వ= కురచ, ప్రవాళ-పవడము, స్థూలతంతు=లావుగా నుండునట్టి దారము.

అథచంద్ర కారకత్వమాహ.

శ్లో॥ బుద్ధిః పుష్పసుగంధ దుర్గగమనవ్యాధి ద్విజాలస్యక
శ్లేష్మాపస్మృతి గుల్మభావహృదయ స్త్రీసౌమ్యపాపాఙ్గకాః। నిద్రా
సౌఖ్యజలస్వరూప రజతస్థూలేక్షుశీతజ్వరా। యాత్రాకూప తటాక
మాతృ సమదృఙ్మధ్యాహ్న ముక్తాక్షయాః ॥ ౨౭ ॥

శ్లో॥ ధావళ్యం కటినూత్రకాంస్యలవణ హ్రస్వామనశ్శక్తయో।
వాసివజ్రశరన్ముహూర్త ముఖకాంతి శ్వేతవర్ణోదరాః। గౌరీభక్తిమధు

ప్రసాదపరిహాసాః పుష్టిగోధూమకాః। మోదాఃకాంతిముఖే మనోజవదధిప్రీతీ తపస్వీయశః ॥ ౨౮ ॥

శ్లో॥ లావణ్యం నిశివీర్యపశ్చిమముఖే విట్క్షారకారాప్తయః। ప్రత్యగ్దిక్ప్రియ మధ్యలోకనవరత్నా నీవామధ్యంవయః। జీవోభోజన దూరదేశగమనే లగ్నంచదోర్వ్యాధయ। ఛత్రాద్యంచిత రాజ చిహ్నసుఫలే సద్రక్తధాతుస్తథా ॥ ౨౯ ॥

శ్లో॥ మీనాద్యాజలజాస్సరీసృపదుకూలేసద్వికాసస్ఫురచ్ఛుద్ధస్తత్స్ఫటికస్తథో మృదులకం వస్త్రంత్వమీస్సుర్విధోః ॥ ౩౦ ॥

పదములు : బుద్ధి- పుష్ప- సుగంధ- దుర్గగమన- వ్యాధి- ద్విజ - ఆలస్య - శ్లేష్మ- అపస్మృతి-గుల్మ- భావ- హృదయ- స్త్రీ- సౌమ్య- పాప- అమ్ల- నిద్రా- సౌఖ్య- జల- స్వరూప- రజిత- స్థూల- ఇక్షు- శీతజ్వర- యాత్రా- కూప- తటాక- మాతృ- సమదృక్- మధ్యాహ్న- ముక్తా- క్షయ- ధావళ్యం- కటినూత్రం- కాంస్య లవణ- హాస్య- మనః- శక్తి- వాపీ- వజ్ర- శరత్- ముహూర్త- ముఖ - కాంతి- శ్వేతవర్ణ- ఉదర- గౌరీభక్తి- మధు- ప్రసాద- పరిహాస- పుష్టి- గోధూమ- మోద కాంతి- ముఖ- మనోజవ- దధిప్రీతి- తపస్వీ- యశః- లావణ్య- నిశివీర్య - పశ్చిమ ముఖ- విట్ - క్షార- కార్యాప్తి- ప్రత్యగ్దిక్ప్రియ- మధ్యలోక- నవరత్న - మధ్యవయః- జీవ- భోజన - దూరదేశగమన - లగ్న - దోర్వ్యాధి - ఛత్రాద్యంచితరాజ చిహ్న- సుఫల- సద్రక్త- ధాతు- మీనాద్యా- జలజా- సరీసృప- దుకూల-సద్వికాస- స్ఫురత్- శుద్ధస్ఫటిక- మృదులవస్త్రం ఈ మొదలగు విషయములు చంద్రుని వల్ల తెలిసికొనవలయును.

అర్థములు : దుర్గగమన=కోటయెక్కుట, అపస్మృతి= మరచిపోవుట, గుల్మ భావ= జలోదరరోగము, అమ్ల= పుల్లన, ఇక్షు= చెఱకు, సమదృక్ = సమదృష్టి, కటినూత్రం= మొలత్రాడు, కాంస్య= కంచు, శరత్=ఋతువు, మనోజవ= మనోవేగము, నిశివీర్య=రాత్రిబలము, విట్-మనుష్యుడు, ప్రత్యగ్దిక్ప్రియ=పడమటిదిక్కునందు ప్రేమ, మధ్యంవయః=నడివయస్సు, దోర్వ్యాధి=బాహుపీడ, ఛత్రాద్యంచిత రాజచిహ్న=గొడుగు వింజామరలు మొదలగు రాజచిహ్నములు, సద్రక్త= మంచి రక్తము, మీనాదిజలజా = చేపలు మొదలగు జలచరములు, సరీసృప = పాములు మొదలగునవి దుకూల= పట్టువస్త్రము, మృదులవస్త్రం= మెత్తనైన వస్త్రము.

## అథభౌమ కారకత్వమాహ.

శ్లో॥ శౌర్యంభూర్జలశస్త్ర ధారణజనాధీశత్వ వీర్యక్షయా । ఘోరోయుద్ధవిరోధ శత్రువఉదారారక్త వస్తుప్రియః। ఆరామాధిపతిత్వతూర్యరవ సంప్రీతీ చతుష్పాన్నృపో । మూర్ఖఃకోపవిదేశయాన ధృతయోధాత్రిగ్నివాగ్వాదతాః ॥ 30 ॥

శ్లో॥ పిత్తోష్ణవ్రణరాజసేవన దినవ్యోమేక్షణహ్రిస్వరుగ్విఖ్యాతత్రిపు ఖడ్గకుంతసచివాశ్చాంగ స్ఫుటత్వంమణిః । సుబ్రహ్మణ్యజపోయువాకటు నృపస్థానే కుజోపగ్రహో । మాంసాశీపరదూషణాం రిపుజయ స్తిక్తంనిశాంతేబలం । 32 ॥

శ్లో॥ హేమగ్రీష్మ పరాక్రమారిపుబలం గాంభీర్యశౌర్యేపుమాన్ । శీలంబ్రహ్మపరశ్వధా వనచరోగ్రామాధినాథత్వతో। రాజాలోకన మూత్రకృచ్ఛచతురశ్రి స్వర్ణకారాఃఖలో। దక్షస్థాన సుభోజనే కృశధనుర్విద్యా ప్రవీణత్వతే ॥ 33 ॥

శ్లో॥ రక్తంతామ్రవిచిత్ర వస్త్రయమదిగ్వ క్త్రేచతద్ద్రిక్ప్రియః కామక్రోధపరాపవాద గృహాసైన్యేశాః శతఘ్నిఃకుజః। సామభ్రాతృసతారమష్టమృగనేతృత్వ స్వతంత్రాగ్రహాః। క్షేత్రిందండ పతిత్వనాగభువనేవాక్చిత్త చాంచల్యతా ॥ 34 ॥

శ్లో॥ వాహారోహణ రక్తదర్శన అసృక్స్రంశోషణాన్యేనమ । న్యేచానేకనుసంజ్ఞ కాబుధవర్గైర్భ్య మస్యతూక్తాఅలం ॥ 35 ॥

పదములు : శౌర్య- భూ- జల- శస్త్ర- ధారణ- జనాధీశత్వ- వీర్య-క్షయ- ఘోర- యుద్ధవిరోధ- శత్రు- ఉదార- రక్తవస్తుప్రియ- ఆరామ- ఆధిపతిత్వ-తూర్యరవ- సంప్రీతి- చతుష్పాత్- నృప- మూర్ఖ- కోప - విదేశయాన - ధృతి - ధాత్రీ- అగ్ని - వాక్- వాదతాం పిత్త- ఉష్ణ - వ్రణ - రాజసేవన- దిన- వ్యోమేక్షణ- హ్రిస్వ- రుక్- విఖ్యాతి- త్రపు- ఖడ్గ-కుంత-సచివ- అంగస్ఫుటత్వం-మణి-సుబ్రహ్మణ్యజప- యువా- కటు- నృపస్థాన- కుజోపగ్రహః- మాంసాశీ-పరదూషణ-రిపుజయ- తిక్త- నిశాంతేబలం- హేమ-గ్రీష్మ-పరాక్రమ-రిపుబల- గాంభీర్య- శౌర్య-పుమాన్- శీలం- బ్రహ్మ- పరశ్వధ- వనచర- గ్రామాధినాథత్వతా- రాజాలోకన-మూత్రకృచ్ఛ్ర- చతురశ్రి- స్వర్ణకార- ఖల- దక్షస్థాన- సుభోజన- కృశ-ధనుర్విద్యా ప్రవీణత్వతా- రక్త- తామ్ర- విచిత్రవస్త్ర- యమదిక్- వక్త్ర - తద్ద్రిక్ప్రియ-కామ

క్రోధ- పరాపవాద- కృష- సైన్యేశ- శతఘ్ని- కుజ- సామ- భ్రాతృ- కుఠార- దుష్టమృగ- సేనాపతిత్వ- స్వతంత్ర- ఆగ్రహ- క్షేత్ర- దండపతిత్వ- నాగభువన- వాక్ చిత్తచాంచల్యతా- వాహారోహణ- రక్త- దర్శన- అసృక్- సంశోషణ- ఈ మొదలగు గుణములు అంగారకునివల్ల తెలిసికొనవలయును

అర్థములు : తూర్యరవ = వాద్యధ్వనులు, వ్యోమేక్షణ = ఆకాశమువంక చూచుట, త్రపు= సీసము, సుబ్రహ్మణ్యజప= ఆదిశేషునిగురించి జపముచేయుట, యువా= పడుచుతనము, కుజోగ్రహ= అంగారకుని సంబంధమగుపీడ, పరశ్వథ= రంపము, మూత్రకృఛ్ర= మూత్రకృఛ్రమను రోగము, శతఘ్ని = పిరంగి, కుఠార= గొడ్డలి, నాగభవన= పాతాళలోకము

## అథ బుధ కారకత్వమాహ.

శ్లో॥ విద్యాధీశతురంగ కోశగణితజ్ఞానాని వాక్చద్విజాః పాదాంతంలిపిలేఖ్య నూతనపట ప్రాసాదకారాహరిత్ । శిల్పిజ్యోతిష తీర్థయాత్రసువచ ప్రాసంగదేవాలయా। వాణిజ్యంపరభూషణం మృదువచో వేదాంతమాతామహః ॥ ౩౬ ॥

శ్లో॥ దుస్స్వప్నంచినపుంస కోత్తరముఖేచర్మార్ద్ర కాంస్యాదయో। వైరాగ్యర్తువిచిత్ర హర్మ్యభిషజః కంఠాభిచారాశిశుః । తిర్యగ్దృష్టి సువర్గలోకవినయా జ్ఞాతిర్భయోనర్తనం। భక్తిర్హాసమతి ప్రభాతబలహేమంతాః కసాణాశ్మమః ॥ ౩౭ ॥

శ్లో॥ నాభిర్గోత్రసమృద్ధి మిశ్రమపదార్థా న్యాంధ్రభాషాధిపో। విష్ణూపాసనశూద్రపక్షీ సహజాభాషా చమత్కారతా। కావ్యాథర్వణ కర్మగోపురరజాం స్యుద్యానగు హ్యాసమ।స్సామ్యోగ్రామచరస్సమ ప్రకృతికోవాయ వ్యకావ్యప్రియః ॥ ౩౮ ॥

శ్లో॥ సత్పౌరాణిక శబ్దశాస్త్రసుమహా రత్నాదిసంశోధకో । విద్వాన్మాతులమంత్రయంత్ర సుమహాతంత్రాదికాస్సామ్యతః ॥౩౯॥

పదములు : విద్యాధీశ- తురంగ- కోశ- గణితజ్ఞాన- వాక్- ద్విజ- పాదాతం- లిపి- లేఖ్య- నూతనపట- ప్రాసాదకార- హరిత్- శిల్పి- జ్యోతిష- తీర్థయాత్ర- సువచ- ప్రసంగ- దేవాలయ- వాణిజ్యం- పరభూషణం- మృదువచ- వేదాంత- మాతామహ- దుస్స్వప్నం- నపుంసక- ఉత్తరముఖ = చర్మ = ఆర్ద్ర - కాంస్యాది-

వైరాగ్య- బుతు- విచిత్ర- హార్మ్య- భిషజః కంఠ - అభిచార- శిశు- తిర్యగ్దృష్టి- సువర్గలోక- వినయ- జ్ఞాతి- భయ- నర్తనం - భక్తి-హాసమతి- ప్రభాతబల- హేమంత, కషాణ- శమ- నాభి- గోత్ర సమృద్ధి- మిశ్రమపదార్థాని- ఆంధ్రభాషాధిప- విష్ణూపాసన- శూద్ర- పక్షి-సహజాభాషా-చమత్కారతా- కాష్ఠ-అథర్వణ-కర్మ- గోపుర- రజాంసి- ఉద్యాన- గుహ్య- సమ- సౌమ్య- గ్రామచర- సమప్రకృతిక- వాయవ్యకాష్ఠాప్రియ - సత్పౌరాణిక - శబ్దశాస్త్ర - సుమహారత్నాదిసంశోధక- విద్యా- మాతుల- మంత్ర- యంత్ర- సుమహాతంత్రాది- ఈ మొదలగు గుణములు బుధునివల్ల తెలిసికొనవలయును.

టీ॥ పాదాతం = పాదచారి, ప్రాసాదకార = మేడకట్టుట, హరిత్ = ఆకుపచ్చరంగు, భిషజ= వైద్యుడు, తిర్యగ్దృష్టి= అడ్డముగ చూచుట, ప్రభాతబల=ప్రాతఃకాలబలము, కషాణ= కాషాయిరంగు, వాయవ్య కాష్ఠాప్రియ - వాయవ్యదిక్కునందు ప్రీతిగలవాడు, సత్పౌరాణిక= బాగాపురాణము చెప్పువాడు, శబ్దశాస్త్ర=వ్యాకరణ శాస్త్రము, రత్నాదిసంశోధక=రత్నములు మొదలగువాటిని బాగుచేయువాడు.

## అథగురు కారకత్వమాహ.

శ్లో॥ భూదేవస్వగురు స్వకర్మరథగో పాదాతనిక్షేపకా। మీమాంసోసిధివాజి మాహిమబృహద్ధాత ప్రతాపాయశః । తర్కజ్యోతిషశ్రుతిపౌత్ర జఠరవ్యాధ్యుపాత్సంపదో। వేదాంతప్రపితా మహాది పురుషప్రాసాదిగోమేధికాః ॥ ౪౦ ॥

శ్లో॥ జ్యేష్ఠభ్రాతృపితామహేంద్ర శిశిరర్తూగ్రాణి రత్నంవణి। గేహారోగ్య విచిత్రహార్మ్య నృపసన్మానోరు దేవాస్తపః । దానం ధర్మపరోపకార సమదృక్పౌరజుష్కభోనర్తులం । పీతంగ్రామచరోత్తర ప్రి సఖాందోళాది రాగ్యోరణీః ॥ ౪౧ ॥

శ్లో॥ మేదోమద్య పటానపీనగృహసౌఖ్యం వృద్ధమంత్రద్విజా స్త్రీస్థజానుసువర్గలోక సరణంసౌఖ్య ప్రధానంగృహం। ధీశ్రప్రజ్ఞాధిక కావ్యగోపుర సభాసనోద్యదసింహాసన । బ్రహ్మస్థాపన సార్వకాలబల మాసాఃపాత్రవైడూర్యకా ॥ ౪౨ ॥

శ్లో॥ అగ్నిష్టోమమహాఫలం మధురసస్నత్వం సుఖాసౌఖ్యకే। దీర్ఘంసౌమ్యపరేంగిత్చ్ఛ కనకాలంకార తంత్రాదిశ్లో। వాతశ్లేష్మసు

పుష్యారాగనిగమా భాసామృదుప్రిస్తరం। శైవోపాసన నైష్ఠికత్వ చతురంతాఖ్యప్రయాణంగురో: ॥ ౪౩ ॥

పదములు. భూ- దేవ- స్వగురు- స్వకర్మ- రథగో- పాదాత- నిక్షేప- మీమాంస- నిధి- వాజి- మహిమబృహద్గాత్రి- ప్రితాప- యశ: - తర్క- - జ్యోతిష- పుత్రి- పౌత్రి- జఠరవ్యాధి- ద్విపాత్సంపద:- వేదాంత- ప్రిపితామహాది- పురుష- ప్రాసాద- గోమేధిక- జ్యేష్ఠభ్రాత్రు- పితామహ - ఇంద్రి- శిశిరర్తు- ఉగ్రాణి- రత్నం- వణిక్- దేహారోగ్య- విచిత్రిహార్మ్య- నృపసన్మాన:- ఉరుదేవా- తప:- దానం- ధర్మ- పరోపకార - సమదృక్ - ఉదఙ్ముఖ - వర్తులం- పీతం గ్రామచరి - ఉత్తర- ప్రియసఖ- ఆందోళాది- వాగ్ధోరణీ:- మేద:- మద్యపట- నవీన గృహాసౌఖ్యం- వృద్ధ- మంత్రి- ద్విజతీర్థం- జాను - సువర్గలోకసరణం- సౌఖ్యప్రిధానం- గృహం- ధీ:- ప్రిజ్ఞా- అధిక- కావ్య - గోపుర - సభా - సన్మోద - సింహాసన - బ్రిహ్మస్థాపన- సర్వకాలబలమాసా:- పాత్ర - వైడూర్యక- అగ్నిష్టోమమహాఫలం- మధురస- సత్వం- సుఖ- అసౌఖ్యక- దీర్ఘం - సౌమ్య- పరేంగిత- కనక- అలంకార- తంత్రిదిక- వాత- శ్లేష్మ- సుపుష్యరాగ- నిగమ - ఆభాస - మృదుప్రిస్తరం- శైవోపాసన- నైష్ఠికత్వ- చతురంతాఖ్య ప్రియాణం- గురో:- ఈ మొదలగు గుణములు బృహస్పతివల్ల తెలిసికొనవలయును.

టీ॥ మీమాంస= పూర్వమీమాంస కర్మలను గురించిన శాస్త్రము, బృహద్గాత్రి= పెద్దశరీరము, జఠరవ్యాధి= కడుపులోనుండురోగము, ద్విపాత్సంపద:=విశేషబంధువులు కలుగుట, ఇంద్రి- ఇంద్రుడు, ఉరుదేవా= గొప్పదేవతులు, సమదృక్= అందరిని సమానముగా జూచుట ఉదఙ్ముట=ఉత్తరదిక్కువంకు ప్రేమకలిగియుండుట ఆందోళాది = సవారి మొదలగు యానములు. మేద: = మెదడు, మద్య = కల్లు, జాను= మోకాలు, సువర్గలోక సరణం= స్వర్గలోకమునకు వెళ్ళుట పరేంగిత= ఇతరులయొక్క అభిప్రాయమును తెలిసికొనుట, నిగమ= వేదములు, ఆభాస=కాంతి, మృదుప్రిస్తరం= మెత్తనిరాళ్లు, నైష్ఠికత్వ= ఆచారము కలిగియుండుట, చతురంతాఖ్యప్రియాం= సవారిపల్లకి మొదలగు వాహనములు.

## అథశుక్రి కారకత్వమాహ.

శ్లో॥ శ్వేతచ్ఛత్రిసుచామ రాంబరవివాహాయ ద్విపాత్రీస్త్రి ద్విజా। సౌమ్యశ్వేతకళత్ర కాముకసుఖప్రహస్వామ్ల పుష్పాజ్ఞకా: । కీర్తిర్యావనగర్వ యానరజతాగ్నేయ ప్రియత్సారకా:। తిర్యద్దృక్ మధ్వక్షరాజసదృధా ముక్తాయజుర్వైశ్యకా: ॥ ౪౪ ॥

శ్లో॥ సౌందర్యక్రియవిక్రియా స్వరససల్లాపో జలస్థానకం । మాతంగస్తురగో విచిత్రకవితా నృత్తంచమధ్యంవయః । గీతంభోగకళత్రసౌఖ్యమణయో హాస్యప్రియఃఖేచరో । భృత్యోభాగ్యవిచిత్రకాంతిసుకుమారారాజ్య గంధస్రజః ॥ ౪౫ ॥

శ్లో॥ వీణావేణువినోదచారు గమనాష్టైశ్వర్య చార్వంగతా । స్వల్పాహారవసంత భూషణబహుస్త్రీ సంగ్రహాప్రాఙ్ముఖాః । నేత్రం సత్యవచః కళానిపుణతా రేతోజలక్రీడితో । గాంభీర్యాతిశయ స్తతశ్చతురవాద్యం నాటకాలంకృతిః ॥ ౪౬ ॥

శ్లో॥ కేళీలోలకఖండదేహా మదనప్రాధాన్య సన్మాన్యతా । యుక్తశ్వేతపటప్రియో భరతశాస్త్రం రాజముద్రాప్రభుః । గౌరీశ్రీభజనేరతిర్మృదురతి క్లాంతోదివామాతృకః । కావ్యాదౌరచనాప్రబంధచతురస్స్యాన్నీలకేశశ్శుభం ॥ ౪౭ ॥

శ్లో॥ గుహ్యాంమూత్రసునాగలోకసరణేత్రాప రాష్ఠాంతథా। జామిత్రిస్థలజం రహస్యముదితం సర్వంవదేద్భార్గవాత్ ॥ ౪౮ ॥

పదములు : శ్వేతచ్ఛత్రి- సుచామర- అంబర- వివాహ-ఆయ-ద్విపాత్-స్త్రీ ద్విజాః- సౌమ్య- శ్వేతకళత్రి- కాయిసుఖ- హ్రిస్వ- అమ్ల- పుష్ప- అజ్ఞ- కీర్తి- యౌవన- గర్వ- యాన- రజత- ఆగ్నేయప్రియ - క్షార - తిర్యగ్దృక్- కమపక్ష- రాజస- ధృఢా- ముక్తా- యజుః- వైశ్యక- సౌందర్య- క్రియ- విక్రయ-సరససల్లాప- జలస్థాన- మాతంగ- తురగ- విచిత్రి- కవితా- నృత్తం- మధ్యంవయః- గీతం భోగ- కళత్రి- సౌఖ్య- మణి- హాస్యప్రియ- ఖేచర- భృత్య- భాగ్య - విచిత్రి కాంతి- సుకుమారా- రాజ్య- గంధ- స్రిజః - వీణా - వేణు - వినోద - చారు - గమన- అష్టైశ్వర్య- చార్వంగతా- స్వల్పాహార- వసంత- భూషణ-బహుస్త్రీసంగ్రహ- ప్రాఙ్ముఖ నేత్రం-సత్యవచః- కళానిపుణతా- రేతః-జలక్రీడిత-గాంభీర్య-అతిశయ- చతురవాద్యం- నాటకాలంకృతిః- కేళీలోల- ఖండదేహ- మదనప్రాధాన్య- సన్మాన్యతా, యుక్త, శ్వేతపటప్రియ, భరతశాస్త్రం, రాజముద్రా, ప్రభు, గౌరీశ్రీ భజనేరతి, మృదురతిక్లాంత, దివామాతృకః కావ్యాదౌ, రచనా, ప్రబంధచతుర నీలకేశ, శుభం, గుహ్యాం, మూత్రి, నాగలోకసరణ, అపకాష్ఠ, జామిత్రి, స్థలజ, రహస్యం, ఈ మొదలగు గుణములు శుక్రునివల్ల తెలిసికొనవలయును.

టీ॥ శ్వేతకళత్రి= తెల్లనిభార్య, కాయికసుఖ= శరీర సంబంధమైన సుఖము, ఆగ్నేయప్రియ= ఆగ్నేయదిక్కుయందు ప్రేమ, శమపక్ష= రాక్షసపక్షము యాజుః= యజుర్వేదము, మధ్యంవయః= నడివయస్సు, కేచర= జలమునందు సంచరించుట, చార్వంగతా= మంచి యవయవములు కలుగుట, కళానిపుణతా= విద్యలయందు నేర్పు కలుగుట, ఖండదేహా= దృఢశరీరము లేకపోవుట, భరతశాస్త్రం= అభినయశాస్త్రము గారీభజనేరతి= గౌరీలక్ష్మి దేవతులను సేవించుట, మృదురతిక్లాంతిః= స్వల్పసంభోగముచేతనే అలయుట, దివామాత్సికః= పగలు సంచరించుగ్రహములు, జామిత్రస్థలజంరహాస్యం= సప్తమ స్థానమందుగల సమస్తఫలముల నొసంగుట.

## అధ శనికారకత్వమాహ.

శ్లో॥ జాడ్యాది ప్రతిబంధ కాశ్వగచర్మాయుప్రమాణానిసం క్లేశో వ్యాధివిరోధ దుఃఖమరణస్త్రీ సౌఖ్యదాసిఖరాః। చండాలా వికృతాంగినోవనచరా భీభత్సదానేశ్వరా। వాయుర్దాయనపుంస కాంత్యజఖగా స్త్రైత్రాగ్నిదాసకిృయాః॥

శ్లో॥ ఆచారేతరరిక్తహా సమ మృషావాదిత్వదీర్ఘానిలా। వృద్ధ స్నాయుదినాంతవీర్యశిశిరద్వ్యత్యంతకోపశ్రమాః। కుక్షేశోద్భితకుండ గోళకజనిర్మాలిన్యవస్త్రంగృహం। తాదృగ్వస్తుమనోవిచారఖలమైత్రీ కృష్ణపాపానిచ॥

శ్లో॥ క్రౌర్యంభస్మచనీలధాన్యమణిలోహౌదార్యసంవత్సరా। శ్శూద్రోవిట్పితృకారకోఽన్యకుల విద్యాసంగ్రహః పంగుతా। తీక్ష్ణం కంబళవస్త్రపశ్చిమముఖే సంజీవనోపాయకా। ధోదృష్టికృషిజీవనా యుధగృహ జ్ఞాతిర్బహిస్థానకాః॥

శ్లో॥ ఈశాన్యప్రియ నాగలోకపతనే నంగ్రామసంచారితా। శల్యంసీసకదుష్టవిక్రమతురుష్కాజీర్ణతైలేపిచ। దారుబ్రాహ్మణతా మసేచ విషభూసంచారశాలిన్యకే। భీతిర్దీర్ఘనిషాద వైకృతశిరో జాస్సర్వరాజ్యం భయః। ఛాగాద్యాసుహేషాదయో రతిరతో వసా్ర దిశృంగారతా। మృత్యూపాసకసార మేయహరణాఃకాఠిన్యచిత్తంశనేః॥

పదములు: జాడ్యాది- ప్రతిబంధ- అశ్వ-గజ-చర్మ-ఆయుప్రమాణాణి-సంక్లేశ- వ్యాధి- విరోధ- దుఃఖ- మరణ - స్త్రీ - సౌఖ్య - ఖరాః - చండాలా - వికృతాంగినః- వనచరా- భీభత్స- దాన- ఈశ్వర- వాయు- దాయ- నపుంసక-అంత్యజ-

శ్లో॥ దుష్టగ్రంధిమహాటవీవిషమ సంచారాద్రిపీడాబహిస్థానం నైరృతిదిక్ప్రియానిలకఫక్లేశోహి నిణ్మారుతాః తీక్ష్ణం దీర్ఘసరీసృపా సకలసుప్తార్థాః ప్రయాణక్షణోవృద్ధో వాహననాగలోకజననీ తాతా మరుచ్ఛాలకాః కాసశ్వాసమహాప్రతాపవన దుర్గోపాసకా దుష్టతా సాంగత్యం పశుభిస్త్వసవ్యలిపిలేఖ్యం క్రూరభాషాత్వగోః.

పదములు : ఛత్రిం-చామర- రాష్ట్రిసంగ్రహ-కుతర్క- క్రూరవాక్య- అంత్యజ- పాపస్త్రీ- చతురంతయాన- వృషలా- ద్యూత-సంధ్యాబలం-దుష్టస్త్రీగమన- అన్యదేశగమన- అశౌచాప్తి- గుల్మ- అనృత- అధోదృక్- భ్రామిక- గారుడ- యమముఖ- మ్లేచ్ఛాదినీచాశ్రియాః- దుష్టగ్రంధి-మహాటవీ- విషమసంచార-అద్రి-పీడా బహిస్థానం- నైరృతిదిక్ప్రియ- అనిల- కఫక్లేశః- నిట్- మారుత- తీక్ష్ణం- దీర్ఘ- సరీసృప- సకలసుప్తార్థాః- ప్రయాణ - క్షణ - వృద్ధ- వాహన- నాగలోక- జననీ - తాత- మరుత్ - శూలక- కాస- శ్వాస- మహాప్రతాప- వనదుర్గోపాసక-దుష్టతా- సాంగత్యం- పశుభిః- అసవ్యలిపిలేఖ్యం- క్రూరభాషాత్వ- గోః ఈ మొదలగు గుణములు రాహువుయొక్క కారకత్వమువల్ల తెలియబడును.

టీ॥ కుతర్క= వ్యతిరేకముగ మాట్లాడుట, క్రూరవాక్య=కఠినముగ మాట్లాడుట, పాపస్త్రీ= దుర్మార్గురాలు, చతురంతయాన= సవారి, వృషలా=శూద్రస్త్రీ, ద్యూత=జూదము, గుల్మ= హృదయములోనుండురోగము, భ్రామిక = ఇంద్రజాలము, గారుడ=గారడి, నిట్=రాత్రి, సరీసృప=పాములు, సకలసుప్తార్థాః=స్వప్నములోకనపడు సమస్తవస్తువులు, వనదుర్గోపాసక= వనదుర్గయనెడు దేవతను ఆరాధించుట, సాంగత్యంపశుభిః=పశువులతో సాంగత్యముచేయుట, అసవ్యలిపిలేఖ్యం= ఎడమచేతితో వ్రాయుట.

## అథ కేతు కారకత్వమాహ.

శ్లో॥ చండీశేశ్వరవిఘ్నపాది సురబృందోపాసనా వైద్యకాశ్వాన। కుక్కుటగృధ్రమోక్ష సకలైశ్వర్యక్షయా త్రిజ్వరాః గంగాస్నాన మహాతపానిలనిషాదస్నేహభూతి ప్రదాః పాషాణోవ్రణమంత్రశాస్త్ర చపలత్వ బ్రహ్మవేత్తృత్వతా॥

శ్లో॥ కుక్షృత్యార్తిజడత్వకంటక మృగజ్ఞానాని మౌనవ్రతం వేదాంతోఖిలభోగభాగ్య రిపుపీడోత్పన్నతా పాల్పభుక్ వైరాగ్యంచ,

పితామహాత్క్షుదతిశూలస్ఫోటకాద్యారుజ శ్శృంగీభృంగి విరుద్ధబంధన కృతాజ్ఞాంశూద్రిగోష్ఠీర్ధ్వజాత్ ॥

పదములు : చండీశ- ఈశ్వర- విఘ్నపాది - సురబృందోపాసనా - వైద్య- శ్వాస- కుక్కుట- గృధ్రి- మోక్ష- సకలైశ్వర్య- క్షయ- ఆర్తి-జ్వర-గంగాస్నాన మహాతప- అనిల- నిషాద- స్నేహ- భూతిప్రద- పాషాణ- వర్ణ- మంత్రశాస్త్ర- చపలత్వ- బ్రహ్మవేత్తృత్వతా- కుక్షి- అక్షి- ఆర్తి- జడత్వ- కంటక-మృగ-జ్ఞానాని- మౌనవ్రతం- వేదాంత- అఖిలభోగ- భాగ్య- రిపుపీడోత్పన్నతాప-అల్పభుక్- వైరాగ్యం- పితామహ- క్షుత్- అతిశూల- స్ఫోటకాద్యా- రుజః- శృంగీ- భృంగి- విరుద్ధబంధన- కృతాజ్ఞా, శూద్రిగోష్ఠిః- ధ్వజాత్॥ ఈ మొదలగు గుణములు కేతువు యొక్క కారకత్వములగున తెలియబడును.

టీ॥ చండీశేశ్వర=పాసనా, చండీశ్వరుడు సాంబమూర్తి విఘ్నేశ్వరుడు మొదలగు దేవతులను సేవించుట, కుక్కుట= కోడి, గృధ్ర= గద్ద, నిషాద=కిరాతుడు, బ్రహ్మవేత్తృత్వతా బ్రహ్మజ్ఞానము కలుగుట, మౌనవ్రతం = మాట్లాడకపోవుట, రిపుపీడోత్పన్నతాప= శత్రువులు పీడించుటచే కలిగినబాధ, అల్పభుక్ = కొంచెముగ భుజించుట, క్షుత్ = ఆకలి॥

ఇట్లు జాతకపద్ధతియందు అయిదవదియగు కారకత్వఖండములో గ్రహకారకత్వ నిరూపణము సమాప్తము.
ఉత్తర కాలామృతములో నైదవబిందువు సమాప్తము.

## అథ షష్ఠబిందు ప్రారంభః.

శ్లో॥ తుంగే స్వీయగృహే ధిమిత్రభవనే మిత్రేసమేవైరిణే। త్యేవం పాపయుతే పరాజయయుతే ఖేచేర్కయుక్తేక్రమాత్ । దీప్తా స్వస్థిమితా తథాచ ముదితా శాంతాచహీనా తతో । దుఃఖాస్యాద్వికలా ఖలాస్యు రపిసాశ్రోపేత్యవస్థానవ॥

టీ॥ ఖేచే=గ్రహము, తుంగే=ఉచ్చయందుండగా, దీప్తా=దీప్తావస్థయనియు స్వీయగృహే= స్వక్షేత్రమందుండిన, స్థిమితా=స్థిమితావస్థయనియు, అధిమిత్రభవనే అధిమిత్రక్షేత్రమందుండిన, తథా=అప్రకారముగ, ముదితా = ముదితావస్థయనియు, మిత్రే=మిత్రక్షేత్రమందుండిన, శాంతాచ= శాంతావస్థయనియు, సమే= సమక్షేత్రమందుండిన, హీనా=హీనావస్థయనియు, తతః=అనంతరము, వైరిణి=శత్రుక్షేత్రమందుండిన, దుఃఖా=దుఃఖావస్థ, స్యాదితి= అగుననియు, పాపయుతే= పాపగ్రహము

తో గూడినయెడల, వికలా=వికలావస్థయనియు, పరాజయయుతే= పరాభవముతో గూడిన, ఖలా= ఖలావస్థయనియు, అర్కయుక్తే= సూర్యునితో గూడిన, సాఅది. కోపా=కోపావస్థయనియు, ఇత్యేవం=ఈప్రకారముగ, క్రిమాత్=వరుసగ, నవ= తొమ్మిగి, అవస్థాః= అవస్థలు, స్యుః= అగుచున్నవి.

తా॥ ఇప్పుడు దశాఫలఖండము వివరింపబడుచున్నది. దానిలో ముందుగ తొమ్మిది అవస్థలు చెప్పబడుచున్నవి. అవి యేవనగా ఏ గ్రహమైనను తనయొక్క యుచ్చక్షేత్రమందుండిన దీప్తావస్థయనియు, స్వక్షేత్రమందుండిన స్థితావస్థయనియు అధిమిత్రక్షేత్రమందుండిన ముదితావస్థయనియు, మిత్రక్షేత్రమందుండిన శాంతావస్థయనియు, సమక్షేత్రమందుండినహీనావస్థయనియు, శత్రుక్షేత్రమందుండినదుఃఖావస్థయనియు, పాపగ్రహముతో గూడినవికలావస్థయనియు, పరాజయమనగాయుద్ధములో నోడిపోవుట అటువంటిస్థితిలో గ్రహముండగా ఖలావస్థయనియు, సూర్యునితో గూడిన కోపావస్థయనియు నిట్లు గ్రహము ఉచ్చక్షేత్రాది స్థానమందుండుటవలన తొమ్మిది అవస్థలు తొమ్మిదివిధములుగ జెప్పబడినవిగాన దశాంతర్దశా ఫలములను విచారించునపుడు రాశిచక్రములోనుండు గ్రహములయొక్క స్థానములనుబట్టి ఫలములను విచారించి చెప్పవలయును.

## అథదశావిభాగస్యా వశ్యకత్వం తత్ఫలంచాహ.

శ్లో॥ పుణ్యంవా ప్యథపాపరూపమపివా కర్మార్జితం ప్రాగ్భవే॥ తత్పాకో త్రితుఖేచరస్య హిదశాభుక్త్యాదభి ర్జ్ఞాయతే॥ తస్మాత్ఖేటదశావిభాగఇహచా వశ్యం క్రిమాత్తత్ఫలం। జ్ఞేయం తత్తదనిష్టశాంతికరణా దీప్టం సుఖం ప్రాప్నుయాత్ ॥

టీ॥ పుణ్యంవాకర్మ= పుణ్యకర్మగాని, అథవా = అలాగుకానియెడల, పాపరూపమపివా= పాపస్వరూపమగు కర్మగాని, ప్రాక్= పూర్వజన్మమందుఆర్జితం సంపాదింపబడినదై, భవేత్= అగును, తత్పాకః= ఆపూర్వజన్మ కర్మఫలము,అత్రతు ఈజన్మమందు, ఖేచరస్య= గ్రహముయొక్క, దశాభుక్త్యాదిభిః= దశఅంతర్దశ మొదలగువానిచే, జ్ఞాయతే= తెలియబడుచున్నది. తస్మాత్=ఆ కారణమువలన, ఖేటదశా విభాగః= గ్రహములయొక్క దశలు అంతర్దశలు విభజింపవలయును. క్రిమాత్= క్రమముగ, అవశ్యం= ముఖ్యముగ, తత్ఫలం= ఆగ్రహములయొక్క ఫలము, జ్ఞేయం= తెలిసికొనవలయును, తత్తదనిష్టశాంతి కరణాత్=ఆయాగ్రహములకు శాంతిచేయుట వలన, ఇష్టం= తనకు ఇష్టమగు, సుఖం—సుఖమును, ప్రాప్నుయాత్ = పొందును-

మాలవరుస ప్రకారముగానే 6-10-7-18-16-19-17-7-20 ఇట్లు సూర్యాదిగ్రహ ములకు దశా సంవత్సరములుకూడ చెప్పబడినవి. అయితే యెవనియొక్క దశతత్కాల మందు కలదో విచారించుట యెట్లనగా శిశువు జనియించిన నక్షత్రమేదియో అనక్ష త్రమువరకు కృత్తిక మొదలుకొని లెక్కింపగావచ్చిన సంఖ్యను 9 చే భాగింపవలె యును. అట్లు భాగింపమిగిలిన 1 రవి, 2 మిగిలిన చంద్రుడు, 3 మిగి లిన కుజుడు, 4 మిగిలిన రాహువు, 5 మిగిలిన బృహస్పతి, 6 మిగి లిన శని, 7 మిగిలిన బుధుడు, 8 మిగిలిన కేతువు, 9 మిగిలినశుక్రుడు దశానాధులగుదురు. 9 చే భాగించినపుడు శేషములేక పోవుటయే 9 అనుకొనవలయును. ఇందుకు నుదాహరణము. జననకాలనక్షత్రము శతభిషము అనుకొందము. కృత్తిక మొదలు శతభిషమువరకు లెక్క పెట్టగా 22 సంఖ్యఅగును. దానిని 9 చే భాగింపగా రెండు తొమ్మి దులు 18 అగును దానిని 22 లో తీసివేయగా 4 మిగులును పూర్వ ము చెప్పబడిన దశానాధులవరుసప్రకారము లెక్కపెట్టగా నాల్గవదశ రాహుదశయగును. ఈప్రకారమే అన్నిగ్రహములకును చూచుకొన వలయును. ఏగ్రహమునకు నెన్ని దశాసంవత్సరములుపైన చెప్పబడి యున్నవో దానినిబట్టిదశాసంవత్సరములనువిచారించుకొనవలయును.

## ఇదానీం జన్మకాలిక మహాదశా శేషసాధనమాహ.

శ్లో॥ జన్మర్క్షాగమనాడికా విఘటికా స్తత్తద్దశాతాడితా । నా డ్యష్షష్టిహతాయుతా విఘటికా స్తచ్ఛేద్యరాశిర్భవేత్ । ఆద్యంతస్థిత నాడికా విఘటికాభిర్భాజితోవత్సరా । శేషంద్వాదశభిర్దినైః ఖరుతు భిర్నిఘ్నాచ్ఛమాసాదికం ॥

టీ॥ జన్మర్క్షాగమనాడికాః=జన్మర్క్ష = జన్మనక్షత్రముయొక్క, ఆగమనాడికాః=రాబోవుఘడియలు, విఘటికాః=విఘడియలు, తత్త ద్దశ= ఆయాగ్రహసంబంధమగు దశాసంవత్సరములచేత, తాడితాః హెచ్చింపవలయును, నాడ్యః=ఇట్లుహెచ్చింపగా వచ్చిన ఘడియలు షష్టిహతాః 60 చే గుణింపబడినవై, యుతావిఘటికాః= విఘడియల తో జేర్చవలయును, తత్= అది, ఛేద్యరాశిః = భాగింపబడురాశి, భవేత్=అగును, ఆద్యంత=కాభిః, ఆద్యంతస్థిత= నక్షత్రముప్రవేశించి

నదిమొదలు చివరవరకు నుండునట్టి, నాడికావిఘటికాభిః= ఘడియలచేత విఘడియల చేత, భాజితః= వెనుకటిరాశి భాగింపగా వచ్చినలబ్ధము, వత్సరాః = సంవత్సరములు, శేషం= మిగిలిన ఘడియలను, ద్వాదశభిః =పండ్రెండుచేతను, దినైః=ముప్పదిచేతను, ఖరతుభిః = అఱువదిచేతను, నిఘ్నాచ్చ = భాగించుటచేత, మాసాదికం = మాసము మొదలగునవి వచ్చును.

తా॥ జన్మకాలమందుండెడి మహాదశా శేషసంవత్సరములు మొదలగువానిని నిర్ణయించుటకు తగిన సాధనమును జెప్పబడును జననకాలమునకు యేనక్షత్రమో ఆ నక్షత్రము జన్మకాలమునకు గతించిన ఘడియలుగాక మిగిలియున్న ఘడియల విఘడియలను అప్పటి దశానాధుని సంబంధమగు సంవత్సరములచే గుణించి యాఘడియలను 60చే గుణించి విఘడియలను కలిపి మొత్తము విఘడియల స్వరూపముగారాశిగా జేసి యొకచోట నుంచవలెను. ఆరాశి భాగింపబడు రాశియగును. తర్వాత జనన కాల నక్షత్రము ప్రవేశించినదిమొదలు వెళ్ళునంతవఱకు నుండు ఘడియలు విఘడియలను విఘడియలనుగా మార్చి యొకరాశిగా నుంచవలెను. దీనికి భుక్తాద్యంతమని పేరు, ఈ భుక్తాద్యంతరాశిచే మొదట నుంచబడిన రాశిని భాగించిన లబ్ధముసంవత్సరములు, శేషమును 12చే గుణించి వెనుకటి భుక్తాద్యంతముచే భాగింపగావచ్చిన లబ్ధము, మాసములు, ఆశేషమును 30చే గుణించి పూర్వము భుక్తాద్యంత ఘడియలచే భాగింపగావచ్చిన లబ్ధము దినములు అప్పుడు మిగిలినశేషమును 60 చే గుణించి భుక్తాద్యంతముచేభాగించిన లబ్ధముఘడియలు, ఇట్లు సంవత్సరములు మొదలగువానినిసాధించవలయును.

## అథాంతర్దశాది సాధనమాహ సార్ధశ్లోకేన.

శ్లో॥ తత్తత్ఖేటదశాదశావినిహతా మాసాఃపురోంకస్త్వతస్త్వంత్యాంకస్త్రిగుణోదినాని సతతం త్వేవంహిచాంతర్దశాః తద్భుక్తిస్తు దినీ కృతాకరహృతా తత్తద్దశాతాడితా నాడ్యాద్యావిదశావిముద్రిశతం హృతాచేత్సాదినాడ్యభవేత్ తద్వత్సూక్ష్మదశాదయోపి గదితాశ్చైకో విశేషోస్తితద్ఘసాద్యా ఘటికాది రూపమిహా చాన్యోన్య వ్రిజంతిక్రమాత్ ॥

టీ॥ తత్తత్ఖేటదశా = ఆయాగ్రహముల మహాదశా సంవత్సరములు, దశావినిహతా= అంతర్దశను నిర్ణయించుటకు నేర్పడియున్న గ్రహదశా సంవత్సరములచే గుణింపగావచ్చిన సంఖ్యలో, పురోంకః= మొదటిసంఖ్య, మాసాః=మాసములు అతః అనంతరము,అంత్యాంకః= చివరసంఖ్య, త్రిగుణః= మూడింటిచే గుణింపగ,దినాని= దినములగును, ఏవంహి = ఈప్రకారము, సతతం = ఎల్లప్పుడు, అంతర్దశాః = అంతర్దశలగును,

లగును, తద్భుక్తిస్తు= ఆవిధముగా రాబడిన యంతర్దశ. దినీకృతా= దినములు మొదలైనవానినిగా జేయబడినదగుచు, కరహృతా= రెండుచే భాగింపబడినదై, తత్తదశా= ఆయావిదశచేత, తాడితా= గుణింపబడినదై నాడ్యాద్యా= ఘడియలు మొదలగు విదశా= విదశయగును. సా= ఆవిదశ, వియద్రసహృతాచేత్ =అఱువదిచేభాగింపగా దినాద్యా=దినములు మొదలగునవి, భవేత్= అగును. తద్వత్= ఆప్రకారమే, సూక్ష్మదశాదయోపి= సూక్ష్మదశ మొదలగునవియు గదితాః= చెప్పఁబడినవి. ఏకోవిశేషః= ఒక్కవిశేషము, అస్తి= కలదు. తద్దినాద్యాః=ఆదినములు మొదలగునవి ఇహ=ఇక్కడ, అధోధః= ఒకదానికింద నొకటి, క్రమాత్= వరుసగా, ఘటికాది రూపం= ఘడియలు మొదలగు రూపమును, వ్రజంతి= పొందుచున్నవి.

తా॥ అంతర్దశ మొదలగువానిని సాధించు విధానమును జెప్పబడును. ఎవని యొక్క మహాదశలో నెవని యంతర్దశ తీయవలసియున్నదో ఆమహాదశానాథుని యొక్క సంవత్సరములను అంతర్దశాధిపతియొక్క సంవత్సరములచేత గుణింపగావచ్చిన సంఖ్యలో మొదటియంకెను మాసములుగా నెఱుంగవలయును తర్వాత యంకెను 3 చే గుణింపగావచ్చిన సంఖ్య దినములుగా నెఱుంగవలయును. ఇట్లు అంతర్దశలను నిర్ణయింపవలయును. అది యేవిధముగానో యొక యుదాహరణమును జెప్పఁబడును. సూర్యమహాదశలో నంగారకాంతర్దశను తీయవలయునను కొనినయెడల సూర్యుని దశా సంవత్సరములగు 6 సంఖ్యను అంతర్దశాధిపతియగు నంగారకుని దశాసంవత్సరములైన 7 సంఖ్యచే గుణింపగా 42 సంఖ్యయగును. అప్పుడు చివరనున్న రెండుఅంకెను తీసివేయగా 4 నిలుచును కాబట్టి 4 మాసములనుకొనవలయును. తీసివేయబడిన 2ను 3చే గుణింపగా 6 అగును. అవి దినములనుకొనవలయును. ఇందువల్ల తేలినదియేమనగా సూర్యదశలో అంగారకాంతర్దశ 4 మాసములు 6 దినములు అని తెలిసికొనవలయును. ఈవిధముగానే అన్ని యంతర్దశలవిషయమై చూచుకొనవలయును (మఱియు నిక్కడ విదశసూక్ష్మదశ మొదలగువానిని గుఱించి మూలములో కొంత నుదహారణముగా వ్రాయఁబడినది కాబట్టి ఆగ్రంథమును మూలములో చూచుకొనవలయును.

## ౧ అథ రవిమహాదశా ఫలమాహ.

శ్లో॥ సూర్యోత్కృష్టదశాకరోతి సుతధీప్రజ్ఞాంధి కారోచ్ఛ్రియ
జ్ఞానార్థాగమకీర్తిపౌరుష సుఖప్రాప్తీశ్వరానుగ్రహాన్ భానోఃపాప
దశాతి కష్టవిఫలోద్యోగార్థహానివ్యామయోర రాతిక్షోభగ్నిమహీ
శకోప జనకారిష్టాదిఽబాధోదయాన్॥

టీ॥ సూర్యోత్కృష్టదశా= సూర్యునియొక్క శుభదశసుత...నుగ్రహాన్, సుత పుత్రులు, ధీ= బుద్ధి, ప్రజ్ఞ= తెలివి, అధికారోచ్ఛ్రయ= అధికారముయొక్క ఆధిక్య

ము, జ్ఞాన= జ్ఞానము, అర్థాగమ= ధనప్రాప్తి, కీర్తి= కీర్తి, పౌరుష= పౌరుషము, సుఖప్రాప్తి= సుఖమునుబొందుట, ఈశ్వరానుగ్రహాన్= భగవంతుని యనుగ్రహము మొదలగువానిని, కరోతి= చేయుచున్నది. భానోః= సూర్యునియొక్క, పాపదశా= పాపదశ, అతికష్ట...ధోదయాన్, అతికష్ట = విశేషకష్టము, విఫలోద్యోగ=చేయు ప్రయత్నము చెడిపోవుట, అర్థహాని = ధననాశనము, ఆమయ=పీడ, అరాతిక్షోభ = శతృపీడ, మహీశకోప= రాజుయొక్కకోపము, జనకారిష్టాది=తండ్రినశించుట మొదలగు, బాధోదయాన్= బాధలు కలుగుటను, కరోతి=చేయుచున్నది.

తా॥ ఇట్లు భావములకు గ్రహములకును శుభస్వరూపమునుపాపస్వరూపమును నిరూపించి బలముకలుగుటయు బలములేకపోవుటయుజెప్పి పూర్వముజెప్పబడినసమస్త ఫలములు ఆయాగ్రహములయొక్క దశలయందే పరిపక్వమౌను కాబట్టి నవగ్రహముల యొక్క దశాఫలములను జెప్పఁబడును. మఱియు గ్రహములకు శుభదశయనియుపాప దశయనియు రెండు విధములుగా నుండును.

శ్లో॥ శుభాశుభం యత్సదసద్విమిశ్రం। జన్మాంతరేకర్మపరైరి దానీం । హోరాగమాత్తస్య వినాశముచ్చై । ర్దశాక్రమేణ పటీకరోతి ॥

పూర్వజన్మమునందు జేయఁబడిన శుభకర్మగాని పాపకర్మగాని మిశ్రకర్మగాని ఆయాగ్రహములయొక్క దశలవలన శుభాశుభ ఫలములను ప్రకటన జేయుచున్న దని జ్యోతిషగ్రంథములయందు జెప్పఁబడియున్నది కాఁబట్టి దశాఫలములను జెప్పఁ బడును ప్రతుల, బుద్ధి, తెలివి, అధికారము, జ్ఞానము, ధనప్రాప్తి, కీర్తి, పౌరుష ము, సుఖమునొందుట, ఈశ్వరానుగ్రహము, మొదలగు మంచిగుణములను సూర్యుని యొక్క శుభదశ కలుగజేయుచున్నది. విశేషకష్టము, చేయుప్రయత్నము చెడిపో వుట, ధననాశనము, పీడ, శతృబాధ, రాజకోపము, తండ్రిగతించుట, మొదలగు దుష్టఫలములు సూర్యునియొక్క పాపదశవల్ల కలుగుచున్నవని తెలిసికొనవలయును.

## ౨ అథ చంద్రదశా ఫలమాహ.

శ్లో॥ చంద్రోత్కృష్ట దశాకరోతి జననీశ్రేయ స్తటాకాదిక క్షేత్రారామగృహావ సద్విజవరశ్రీశోభనాందోళికాన్ । ఇందోఃపాప దశాన్నహీన కృపణానందార్థనాశామయ। ప్రజ్ఞాహీనజుగుప్సమాతృ మారణక్రోధాదిశీతజ్వరాన్ ॥

పదములు॥ జననీశ్రేయస్సు; తటాకాదులు, క్షేత్రము, ఆరామ, గృహ ఆసనము, ద్విజవరశ్రీ, శోభన, ఆందోళికములు, ఈ మొదలగు మంచిఫలములను చంద్రుని శుభదశ కలుగజేయుచున్నది. అన్నహీన, కృపణ, అనందార్థనాశ, ఆమయ, ప్రజ్ఞాహీన, జుగుప్స, మాతృహరణ, క్రోధాది, శీతజ్వరాన్, ఈ మొదలగు చెడుఫలములు చంద్రునియొక్క పాపదశవల్లను కలుగుచున్నవి.

టీ॥ జననీశ్రేయః= తల్లియొక్క శ్రేయస్సు, ద్విజవశ్రీ= బ్రాహ్మణధర్మము కృపణ= కపటము, అనందార్థనాశ= సంతోషభంగము ధననాశనము, ఆమయ= రోగము, జుగుప్స= విచారము, మాతృహరణము= మాతృనాశనము.

3 అథ కుజదశాఫల మాహ

శ్లో॥ భౌమోత్కృష్టదశాకరోతి వసుధాప్రాప్తిం స్త్వవస్త్రాగమం ప్రజ్ఞాస్వచ్ఛమనఃపరాక్రమధన నారాతిక్షయాంశ్చానుజాన్ పాపాంగారదశానుజార్తి కలహక్షేత్రాగ్ని బాధవ్రణా 3 క్షిక్షీణాదిమహీశ పీడ సుజనక్రోధాసివేధా మయాన్॥

పదములు॥ భౌమోత్కృష్టదశా, కరోతి, వసుధాప్రాప్తి, ఇష్టవస్త్రాగమ, ప్రజ్ఞా, స్వచ్ఛమనః పరాక్రమ, ధన, ఆరాతిక్షయ, అనుజాన్, పాపాంగారదశా, అనుజార్తి, కలహ, క్షేత్ర అగ్నిబాధ, వ్రణ, అక్షిక్షీణా. ది, మహీశపీడ, సుజన క్రోధ, అసివేధ, ఆమయాన్, ఈ మొదలగు గుణములు పాపాంగారదశా, అనునది మొదలుకొని కుజునీ పాపత్వమువలన కలుగును. అంతకుపైన వసుధాప్రాప్తి మొదలు అనుజాన్ అనునంతవరకు అంగారకుని శుభత్వమువలన కలుగును.

అర్థములు॥ వసుధాప్రాప్తి= భూలాభము, స్వచ్ఛమనః= నిర్మలమైనమనస్సు, అరాతిక్షయ= శత్రువులువశించుట, అనుజాన్=తమ్ములుపుట్టుట, అనుజార్తి=తమ్ములకుపీడ, వ్రణ = పుండ్లు, అక్షిక్షీణ = నేత్రనాశనము, మహీశపీడ = రాజులు బాధించుట, అసివేధ= కత్తులచే గాయము పడుట.

౪ అథ బుధదశా ఫలమాహ.

శ్లో॥ సౌమ్యోత్కృష్టదశాకరోతి వసనానంతార్థ ధాన్యోచ్ఛ్రయ శ్రేయస్సౌఖ్యగృహస్వ బంధువిజయప్రాప్తిష్టవస్త్వాగమాన్ బౌధ్యాపాపదశావి దేశగమనక్రోధస్వబంధుక్షయ ప్రజ్ఞాహీనవణిగ్జనార్తి కలహక్షేత్రార్థనాశాపదః ॥

పదములు ॥ సౌమ్యోత్కృష్టదశా, కరోతి, వసన- అనంతార్థ- ధాన్యోచ్ఛ్రయ శ్రేయః- సౌఖ్య- గృహ- స్వబంధు- విజయప్రాప్తి- ఇష్టవస్త్వాగమాన్- ఈ మొద

లగు గుణములు బుధునియొక్క శుభదశవలన కలుగును, బౌధ్యా, పాపదశా, విదేశగమన- క్రోధ- స్వబంధుక్షయ- ప్రజ్ఞాహీన- వణిగ్జనార్తి- కలహ- క్షేత్రార్థనాశ- ఆపదః- ఈ మొదలగు గుణములు బుధునియొక్క పాపదశవలన కలుగుచున్నవి

టీ॥ వసన= వస్త్రము, అనంతార్థ= అనేకప్రయోజనములు, ధాన్యోత్పత్తి యు విశేషధాన్యము సంభవించుట, బౌధ్యా= బుధుని సంబంధమైనది. విదేశగమన=ఇతరదేశమునకు వెళ్లుట, స్వబంధుక్షయ= బంధువులు నశించుట, ప్రజ్ఞాహీన= జ్ఞానములేకపోవుట, వణిగ్జనార్తి= వర్తక జననాశనము, క్షేత్రార్థనాశ= క్షేత్రనాశనముధన నాశనము.

## ౫ అథ గురు గురుదశా ఫలమాహ.

శ్లో॥ జీవోత్కృష్టదశాకరోతి విపులగ్రామాధికారాత్మజ శ్రీసౌభాగ్యగుణాకరా శ్రితజనాశ్వాందోళికాన్వైభవాన్ జైవ్యాపాపదశా మహీశ్వరభయాఽధివ్యాధి ధైర్యచ్యుతాఽధాన్యాఽనర్థమహీసురార్తి జనకక్రోధాశనార్తిక్షయాన్ ॥

జీవోత్కృష్టదశా- కరోతి- విపులగ్రామాధికార- ఆత్మజ- శ్రీ- సౌభాగ్య- గుణాకర- ఆశ్రితజన- అశ్వాందోళికా- వైభవాన్- ఈ మొదలగు గుణములను, జీవోత్కృష్టదశా- బృహస్పతియొక్క- శుభదశ, కరోతి- చేయుచున్నది. జైవ్యా- పాపదశా- మహీశ్వరభయ- ఆధివ్యాధి- ధైర్యచ్యుత- అధాన్య- అనర్థ- మహీసురార్తి- జనకక్రోధ- అశనార్తి - క్షయాన్ - ఈ మొదలగు గుణములను జైవ్యా బృహస్పతి సంబంధమగు- పాపదశ చేయుచున్నది.

టీ॥ విపులగ్రామాధికార= విశేషగ్రామములకు నధిపతియగుట, గుణాకర = సుగుణములకు స్థానభూతుడు, జైవ్యా=బృహస్పతి సంబంధమైనది, ఆధి = మనోవ్యాధి, వ్యాధి= దేహమునందురోగము, అధాన్య= ధాన్యములేకపోవుట, మహీసురార్తి= బ్రాహ్మణులకుపీడ, జనకక్రోధ= తండ్రితో వైరము, అశనార్తి=ఆహారములేకపోవుట, క్షయ= నాశనము ఇవి బృహస్పతి దశాఫలములు.

## అథ శుక్రదశా ఫలమాహ.

శ్లో॥ శౌక్రీశ్రేష్ఠదశాకరోతి సుఖసౌభాగ్యే భ్రయాందోళికా ప్రైశ్వర్యాయత ధర్మబుద్ధికనకా రామాశ్వగీతోత్సవాన్ శౌక్రీపావదశాకళత్ర భయకృన్నిచార్థహానిప్రదా ఽత్యంతస్తేయ మహాప్రదోష ౩ విపులస్త్రీవర్గరోగోద్భవాన్ ॥

పదములు॥ శౌక్రీ- శ్రీప్రదశా- కరోతి- సుఖ- సౌభాగ్యోచ్ఛ్రియ- ఆందోళికా- అష్టైశ్వర్య- ఆయతధర్మబుద్ధి - నక - ఆరామ - అశ్వ- గీత- ఉత్సవాన్ - ఈ మొదలగు గుణములను, శౌక్రీ= శుక్రసంబంధమగు. శ్రీప్రదశా=శుభదశ, కరోతి=చేయుచున్నది. శౌక్రీ పాపదశా- కళత్ర- భయకృత్- నీచ - అర్థహానిప్రద - అత్యంతస్తేయ- మహాప్రదోష - విపులస్త్రీవర్గరోగోద్భవాన్- ఈ మొదలగు గుణములను శౌక్రీ- శుక్రసంబంధమగు పాపదశ చేయుచున్నది.

టీ॥ శౌక్రీ= శుక్రసంబంధమైనది, ఆయతధర్మబుద్ధి= విశేషముగ ధర్మమునందు బుద్ధికలుగుట, ఆరామ=తోటలు, కళత్ర భయకృత్ = భార్యకు భయమును చేయుట, అర్థహానిప్రద= ధననాశనము, అత్యంతస్తేయ = మిక్కిలి దొంగతనము, మహాప్రదోష= విశేషదోషము, విపులస్త్రీవర్గ రోగోద్భవ= అనేక స్త్రీలకు రోగములను కలిగించుట.

## ౭ అథ శనిదశా ఫలమాహ,

శ్లో॥ మందోత్కృష్టదశాకరోతి విభవప్రజ్ఞాదియజ్ఞాదిక క్షేత్రగ్రామపురాధినాయక బహువ్యాపారదక్షోత్సవాన్ మాందీపాపవిషప్రయోగ ధనహృద్దేహాద్యనర్థోదయాన్ రాజక్రోధ విరుద్ధకార్యవికలాన్ రోగాదిబాధోదయాన్।

పదములు॥ మందోత్కృష్టదశా- కరోతి- విభవ- ప్రజ్ఞాది- యజ్ఞాది- క్షేత్ర - గ్రామ- పురాధినాయక- బహువ్యాపారదక్ష- ఉత్సవాన్- ఈగుణములు శని శుభదశలవలన కలుగుచున్నవి. మాందీ- పాప- విషప్రయోగ- ధనహృత్- దేహాద్యనర్థోదయాన్- రాజక్రోధ - విరుద్ధకార్య - వికలాన్ - రోగాదిబాధోదయాన్ - ఈగుణములు శని పాపదశవలన కలుగుచున్నవి.

టీ॥ క్షేత్రగ్రామ పురాధినాయక= భూములకు గ్రామములకు పట్టణములకు నధిపతియగుట, బహువ్యాపారదక్ష=అనేక వ్యాపారముల జేయుటయందు సమర్థత్వము, విషప్రయోగ= విషమును బెట్టుట, ధనహృత్= ధనమును హరించుట, దేహాద్యనర్థోదయాన్= శరీరము మొదలగువానికి అనర్థముచేయుట, విరుద్ధకార్య = విరుద్ధమగు కార్యములు.

## ౮ అథ రాహుదశా ఫలమాహ.

శ్లో॥ రాహూత్కృష్టదశాకరరోతి సకలశ్రేయోమహద్రాజ్యకృద్ధర్మార్థాగమపుణ్యతీర్థచలన జ్ఞానప్రభావోదయాన్ రాహోః పాపదశా త్రిహీభీతి- విషజజ్వరాంగరోగార్తి కృచ్ఛ్రస్త్రీగ్లహయంత్ర విరోధవృక్షపతనారాతి ప్రపీడోదయాన్॥

పదములు : రాహూత్కృష్టదశా- కరోతి- సకలశ్రియః- మహారాజ్యకృత్ ధర్మ- అర్థాగమ- పుణ్యతీర్థగచలన- జాన- ప్రభావోదయాన్- ఈ మొదలగు గుణములను రాహువుయొక్క శుభదశ చేయుచున్నది- రాహోః- పాపదశా- అహిభీతి- విషజః- సర్వాంగరోగార్తికృత్- శస్త్ర- అగ్ని- అంత్య- విరోధ- వృక్షపతన-ఆరాతిప్రపీడోదయాన్- ఈ మొదలగు గుణములు రాహువుయొక్క పాపదశవలన కలుగుచున్నవి.

టీ॥ మహారాజ్యకృత్= గొప్పరాజ్యమును కలుగ జేయుట, అర్థాగమ=ధనప్రాప్తి, పుణ్యంతీర్థచలన= పుణ్యతీర్థములను సేవించుట, అహిభీతి = సర్పములవల్ల భయము, విషజః= విషమువల్ల పుట్టినభయము, సర్వాంగరోగార్తికృత్ =అన్ని యవయవములకు పీడను కలిగించుట, శస్త్రా...దయాన్= శస్త్రములచేతను, అగ్ని =అగ్నిహోత్రముచేతను బాధకలుగుట, అంత్యవిరోధ= చండాలురతో విరోధము, వృక్షపతన= చెట్టుమీదనుండి పడుట, ఆరాతిప్రపీడ= శతృవులవలన బాధ

## అథ కేతుదశా ఫలమాహ,

శ్లో॥ కేతూత్కృష్టదశాకరోతి విజయక్రూరక్రియార్థాగమ
మ్లేచ్ఛక్ష్మాపతిలబ్ధభాగ్యకవన ప్రారంభశతృక్షయాన్ కేతోఃపాప
దశాతి కష్టవిఫలానర్థక్రియోద్యోగ హృచ్ఛూలాస్థిజ్వరకంపన ద్విజ
జనద్వేషాతిమూర్ఖక్రియా॥

టీ॥ విజయ...శత్రుక్షయాన్, విజయ=విజయము, క్రూరక్రియా=క్రూరకార్యముచేత, అర్థాగమ=ధనమును పొందుట మ్లేచ్ఛక్ష్మాపతి = తురకప్రభువులచేత లబ్ధ= పొందబడిన, భాగ్య= భాగ్యము, కవనప్రారంభ- కవిత్వమునుజెప్పుట, శతృక్షయాన్ = శతృనాశనము, ఈగుణములను, కేతూత్కృష్టదశా = కేతువుయొక్క శుభదశ, కరోతి=చేయుచున్నది, అతికష్ట...మూర్ఖక్రియా- అతికష్ట= విశేషకష్టము, విఫల=ఫలములేకపోవుట. అనర్థక్రియోద్యోగ = చెడ్డకార్యములయందు ప్రవర్తించుట, హృచ్ఛూల-కడుపులో శూలపుట్టుట అస్థిజ్వర= ఎముకలయందు జ్వరము పుట్టుట, కంపన= దేహమునందు వణకుపుట్టుట, ద్విజజనద్వేష= బ్రాహ్మణులయందు విరోధముపెట్టుట, అతిమూర్ఖక్రియా=మిక్కిలి తెలివిహీనమగు కార్యములను జేయుట ఈ మొదలగు గుణములు, కేతోః= కేతువుయొక్క, పాపదశా- పాపదశ చేయును.

ఏవం న వానాంగ్రహాణాశుభత్వ పాపత్వభేదేన తత్తద్దశా ఫలాన్యుక్త్వా కేవల రాహుకేత్వోస్థితి సాహచర్యాది సంబంధవశాద్విశేషఫలమాహ,

శ్లో॥ లగ్నాత్కోణగతౌచవిత్త మదనస్థానేశ్వరాభ్యాంతమః
ఖేటౌసంయుతవీక్షితౌ నిజదశాకాలేహి మృత్యుప్రదౌ నేత్రద్యూనగ
తౌ త్రికోణపతియు గ్దృష్టౌ ధనాయుఃప్రదౌ తద్భావేశ్వరయుక్తపాప
ఖచరో మృత్యుంవిధత్తేనృణాం॥

టీ॥ తమఃఖేటౌ = రాహుకేతువులు, లగ్నాత్ = లగ్నమునుండి, కోణగతౌ = పంచమమందుగాని, నవమమందుగాని యున్నవారలై విత్తమదనస్థానేశ్వరాభ్యాం = ద్వితీయ సప్తమ స్థానాధిపతులతో, సంయుతవీక్షితౌ = కూడుకొనినవారుగాని చూడబడినవారుగాని యైనయెడల, నిజదశాకాలేహి = తమ దశాంతర్దశాకాలమందు, మృత్యుప్రదౌ = మరణమును కలుగజేతురు. నేత్రద్యూనగతౌ = ద్వితీయ సప్తమస్థానముల యందున్నవారై త్రికోణపతి యుగ్దృష్టౌ = పంచమ నవమాధిపతులతో కూడుటగాని చూచుటగాని కలిగియున్నయెడల, ధనాయుఃప్రదౌ = ధనము నాయుర్దాయము నిత్తురు తద్భా...ఖచరః తద్భావేశ్వర = ఆద్వితీయ సప్తమాధిపతులతో, యుక్త = కూడుకొనిన. పాపఖచరః = పాపగ్రహము, నృణాం = మనుష్యులకు, మృత్యుం = మరణమును విధత్తే చేయుచున్నారు.

తా॥ సూర్యుడు మొదలు తొమ్మిది గ్రహములకు శుభత్వ పాపత్వభేదముచే నాయాగ్రహములకు దశాఫలములనుజెప్పి ప్రత్యేకము రాహుకేతు లిరువురకునుండు రాశి సంబంధమును బట్టిగాని గ్రహసంబంధమును బట్టిగాని కలుగు ఫలవిశేషమును చెప్పబడును. రాహుగాని కేతువుగాని 5-9 స్థానములలో నెచ్చటనైననుండి ద్వితీయ సప్తమాధిపతులలో నెవరితోనైన కూడియుండుటగాని చూడబడుటగానికలిగియున్నయెడల వారి మహాదశలోనైనను అంతర్దశలోనైనను మృతిని కలుగజేయుదురు అయితే ఆ రాహుకేతులు ద్వితీయమందుగాని సప్తమమందుగానియుండినను పంచమ నవమాధిపతులలో నెవరితోనైన కూడుటగాని చూడబడుటగాని కలిగినయెడల ధనము నాయుర్దాయమును వృద్ధిచేయుదురు. మరియు ఆద్వితీయ సప్తమ స్థానాధిపతులతో కూడుకొనిన పాపగ్రహముకూడ తప్పక మారకమును చేయుననుట.

## తమోః రాహుకేత్వోరేవ యోగాంతరమాహ.

శ్లో॥ స్యాతాం కేతువిధుంతుదౌ ద్వితనుభే కేంద్రత్రికోణేశ్వ
రైర్యుక్తౌవాతదధీశ్వరౌ యదితయోఃపాకేర్థరాజ్యప్రదౌ తావేవ
వ్యయశత్రురంధ్రసదనాధీశైశ్చ యుక్తేక్షితౌ నృణామల్పఫలప్రదౌ
చజననీం తద్వర్గసంహారకౌ ॥

టీ॥ కేతువిధుంతుదౌ= రాహుకేతువులు, ద్వితనుభే= ద్విస్వభావరాశియందు న్నవారై, కేంద్రత్రికోణేశ్వరైః= కేంద్రాధిపతులతోగాని త్రికోణాధిపతులతోగాని, యుక్తౌవా= కూడికొనినవారైనను, తదధీశ్వరౌవాయది= లేక ఆకేంద్ర త్రికోణస్థానములకు నధిపతులైనవారైనను, తయోః= ఆ రాహుకేతువులయొక్క, పాకే = దశయందు, అర్థరాజ్యప్రదౌ=ధనమును రాజ్యము నిచ్చువారు, స్యాతాం= ఆగుచున్నారు, తావేవ= ఆరాహుకేతువులే, వ్యయ...ధీశైః, వ్యయ= (౧౨) పన్నెండు, శత్రు=ఆఱు, రంధ్ర=ఎనిమిది, సదనాధీశైః = స్థానాధిపతులతో, యుక్తేక్షితౌ= యుక్త =కూడుకొనినవారును, ఈక్షితౌ=చూడబడినవారు నైనయెడల, నృణాం= మనుష్యులకు, అల్పఫలప్రదౌ= స్వల్పఫలము నిచ్చువారును, జననీం= తల్లిని, తద్వర్గ సంహారకౌ= తద్వర్గ= మాతృవర్గమును, సంహారకౌ= నశింపజేయువారు.

తా॥ ఆ రాహుకేతువుల విషయమై మఱియొక యోగమును జెప్పఁబడును. రాహుకేతువులు ద్విస్వభావ రాశియందున్నవారై కేంద్రస్థానములగు 1-4-7-10 స్థానాధిపతులతోగాని కోణములగు 5-9 స్థానాధిపతులతోగాని కూడికొనినవారైనను లేక కేంద్ర త్రికోణస్థానములకు నాధిపత్యముకలవారైనను ఆరాహుకేతువులయొక్క దశలలోగాని యంతర్దశలలోగాని విశేషధనమును రాజ్యమునిచ్చు వారగుదురు. మఱియు నారాహుకేతువులు 12-6-8 స్థానాధిపతులతో కూడికొనినను చూడబడినను స్వల్పఫలము నిచ్చువారగుదురు, మఱియు తల్లికి తల్లివర్గమువారికి మారకము జేయుదురు.

## తయోరేవ పునర్విశేష మాహ,

శ్లో॥ తావేవస్థిరచంచలర్క్షసహితౌ కేంద్రత్రికోణాధిపై ర్యుక్తావప్యుభయోశ్చ యశ్శుభగృహే సస్యాన్మహాభాగ్యదః పాపర్క్షస్థితమోగ్రహౌ విఫలదౌ కేచిజ్జగుస్సౌఖ్యదౌ తౌద్వౌపాపగృహస్థితౌ శుభయుతౌ స్యాతాంమహామారకౌ॥

టీ॥ తావేవ= ఆ రాహుకేతువులే, స్థిరచంచలర్క్షసహితౌ =స్థిరరాసులయందుగాని చరరాసులయందుగాని యున్నవారై, కేంద్రాత్రికోణాధిపైః =కేంద్రాధిపతులతోగాని కోణాధిపతులతోగాని, యుక్తావపి=కూడుకొనినవారైనను, ఉభయోః= వారిద్దరిలో, యః= ఎవఁడు, శుభగృహే=శుభక్షేత్రమునందుండునో, సః= వాఁడు, మహాభాగ్యదః= విశేష భాగ్యమునిచ్చువాఁడు, స్యాత్=అగును, పాపర్క్షస్థితమోగ్రహౌ= పాపక్షేత్రమందుండిన రాహుకేతువులు, విఫలదౌ= ఫలమునిచ్చువారు కారు, సౌఖ్యదౌ=సౌఖ్యమునిచ్చువారని, కేచిత్ =కొందఱు, జగుః= చెప్పిరి, తౌద్వౌ=

ఆరాహుకేతులిరువురు, పాపగ్రహస్థితౌ పాపక్షేత్రములయందుండినను, అశుభయుతౌ= పాపగ్రహములతో కూడికొనినవారైనయెడల, మహాకారకౌ= విశేషమారకులై స్యాతాం=అగుచున్నారు.

తా॥ ఆ రాహుకేతువులకే తిరిగి విశేషము నిరూపించెదను. ఆరాహుకేతువులు స్థిరచరరాసులలోగానియుండి కేంద్రాధిపతులతోగాని కోణాధిపతులతోగాని కూడినవారలైయుండగా వారిలోనెవ్వడుశుభక్షేత్రమందుండునో ఆజాతకునకువిశేషభాగ్యమునిచ్చువాడగును.మఱి యు పాపక్షేత్రమందుండినరాహుకేతువులుఫలమునిచ్చువారుకారు. సౌఖ్యమునిత్తురని కొందరు చెప్పిరి ఆరాహుకేతువులిరువురు పాపక్షేత్రమందుండినవారై పాపగ్రహములతో కూడినయెడల మారకమును ముఖ్యముగా చేయువారగుదురు

## అథ రాహుకేత్వో రేవపునః అనిష్టయోగమాహ.

శ్లో॥ రిష్ఫాష్టారిగృహస్థితౌ తదధిపైర్యుక్తేక్షితౌ హింసకౌ స్యాతాంమారకసంయుతౌ తతధిపై స్తావేవమృత్యుప్రదౌ। తద్భావేషుచకేంద్రకోణపతిభిర్యుక్తాక్వచిత్సౌఖ్యదౌ । చేద్వ్యాధివ్రణదుఃఖఖడ్గసలిలాచ్చోద్బంధనాన్మృత్యుదౌ ॥

టీ॥ తావేవ= ఆ రాహుకేతువులే, రిష్ఫాష్టారిగృహస్థితౌ, రిష్ఫ= పండ్రెండు అష్ట= ఎనిమిది, అరి = ఆఱు, గృహస్థితౌ = రాసులయందున్నవారై, తదధిపైః = ఆస్థానాధిపతులతో, యుక్తేక్షితౌ=కూడుకొనినవారు, చూడఁబడినవారునైనయెడల హింసకౌ= మరణమును చేయువారు, స్యాతాం= అగుదురు. తదధిపైః= ఆస్థానాధిపతులతోటి, మారకసంయుతౌ= మారకులతోటి కూడియుండినవారైనయెడల, మృత్యుప్రదౌ= మరణమునిత్తురు. తద్భావేషుచ= ఆ పండ్రెండుయెనిమిది ఆఱుస్థానములయందుండి, కేంద్రకోణపతిభిః= కేంద్రాధిపతులతోటి కోణాధిపతులతోటి,యుక్తౌ కూడుకొనినవారై, క్వచిత్ = ఒకప్పుడు, సౌఖ్యదౌ చేత్ = సౌఖ్యము నిచ్చువారైనప్పటికి, వ్యాధి...సలిలాత్, వ్యాధి = రోగమువల్లను, వ్రణ = కురుపులవల్లను, దుఃఖ= దుఃఖమువల్లను, ఖడ్గ= కత్తివల్లను, సలిలాత్= ఉదకమువల్లను, ఉద్బంధనాత్= ఉరివల్లను, మృత్యుదౌ= మరణమునిత్తురు.

తా॥ రాహుకేతువులవల్ల కలిగే అనిష్టయోగమును మఱియొకదానిని చెప్పుచున్నాను. రాహుకేతువులు 6-8 12 స్థానములయందుండి 6-8-12 స్థానాధిపతులతో కూడుకొనినవారును చూడబడినవారు నైనయెడల మృత్యువును చేయుదురు. 6-8-12 స్థానాధిపతులతోటి మారకులతోటి కూడుకొనిన ఆరాహుకేతువులే మరణమునిత్తురు. 6-8-12 స్థానములయందుండి కేంద్రాధిపతులతోటి కోణాధిపతులతోటి

కూడుకొనిన యీ రాహుకేతువులు ఒకప్పుడు సౌఖ్యమునిత్తురు మఱియొకప్పుడురోగము కురుపులు దుఃఖము కత్తి జలము ఉరి మొదలగువానివలన మరణము నిత్తురు.

అథతయోః రాహుకేత్వోరేవ శుభస్థాన స్థితిశుభగ్రహసంబంధాద్యోగ కారకత్వంతా దృగ్ధర్మావచ్ఛిన్న యోరేవమారకసంబంధాన్మారకత్వంచాహ.

శ్లో॥ భ్రాతృప్రాప్తిచతుష్టయేషు బలిభిర్యోగగ్రహై రన్వితౌ సంపత్సౌఖ్యసుతార్థరాజ్యకరిణౌ యానోత్కటానిచ్ఛతః తావేవస్మ రాశిపేనయదినా విత్తాధిపేనాశ్రితౌ । తాభ్యాందృక్పథగౌతదా ధర హారౌస్యాతాం మహామారకౌ ॥

టీ॥ తావేవ=ఆరాహుకేతువులే, భ్రాతృ=తృతీయమందును, ప్రాప్తి=నవమస్థానమందును, చతుష్టయేషు=నాలుగు కేంద్రస్థానములయందు నున్నవారై, బలిభిః బలవంతులగు, యోగగ్రహైః=యోగమునిచ్చెడి గ్రహములతో, అన్వితౌ=కూడుకొనినవారైనయెడల, సంప...కరిణౌ, సంపత్=సంపత్తును, సౌఖ్య=సౌఖ్యమును, సుత=కుమాళ్ళను, అర్థ=ధనమును. రాజ్య=రాజ్యమును, కరిణౌ=చేయుదురు, ఇచ్ఛతః=కోరబడిన, యానోత్కటాన్=అధికమైన వాహనములనిత్తురు, తావేవ=ఆరాహుకేతువులే, స్మరరాశిపేః= యదివా ఆలాగుకానియెడల, విత్తాధిపేనవా=ద్వితీయాధిపతితోగాని, ఆశ్రితౌ=కూడుకొనినవారైనను, తాభ్యాం=ఆద్వితీయసప్తమాధిపతులచే, దృక్పథగౌ=చూడబడినవారైనను, తదా=అప్పుడు, ధనహారౌ=ధనమును నాశనము జేయువారును, మహామారకౌ=విశేషముగ మారకముజేయువారును, స్యాతాం=అగుచున్నారు.

తా॥ రాహుకేతువులకు శుభస్థానమందుండుట శుభగ్రహములతో కూడుట మొదలగు వానివలన యోగమునిచ్చుటయు అటువంటి సంబంధము కలిగియుండినను ఆ రాహుకేతువులకేమారక గ్రహసంబంధము కలిగినయెడల మారకమును జేయుటయు. జెప్పుచున్నాను. రాహుకేతువులు 3-9-1-4-7-10 స్థానములయందుండి బలముకలిగియుండిన శుభయోగకారక గ్రహములతో కూడినవారైనయెడల సంపత్తుసౌఖ్యము పుత్రులు ధనము రాజ్యము అధికమైన వాహనములు మొదలగువాని నిచ్చెదరు. ఆ రాహుకేతువులే సప్తమాధిపతితోగాని ద్వితీయాధిపతితోగాని కూడుకొనినను చూడబడినను ధననాశనమును జేయుదురు. తప్పకుండా మారకమును జేతురు.

పూర్వం తావత్తద ధీశ్వరావితి రాహుకేత్వోస్థానాధిపత్య మంగీకృతం తస్మాదిదానీమాధిపత్య తుంగాదయో వక్ష్యంతే.

శ్లో॥ తుంగంతద్వృషభశ్చవృశ్చిక ఇతిస్యాద్రాహు కేత్వోః గ్రహేకుంభోళీమిథునాంగనేతుభవతో మూలత్రికోణాభిధే సింహః కర్కటకోద్వయోరిపుగృహేతౌలీమృగోమిత్రభేఽజోదేవేజ్యగృహే సమేఖిలబలం తుంగాదిగౌతౌయది॥

టీ॥ రాహుకేత్వోః= రాహుకేతువులకు, వృషభశ్చ=వృషభము, వృశ్చికః= వృశ్చికము, ఇతి= ఈప్రకారము, క్రమముగా, తుంగం= ఉచ్ఛస్థానము, స్యాత్= అగును, కుంభః= కుంభము, అళీ=వృశ్చికము, గ్రుహే= స్వక్షేత్రములగును, మిథునాంగనేతు= మిథునకన్యారాసులైతే, మూలత్రికోణాభిధే = మూలత్రికోణములనే పేరుగలవి, సింహః=సింహము, కర్కటకః= కర్కాటకము, ద్వయోః=రాహుకేతువులకు, రిపుగ్రుహే=శత్రుక్షేత్రములు, భవతః=అగుచున్నవి, తౌలీ=తుల, మృగః మకరము, మిత్రభే=మిత్రక్షేత్రములగును, అజః= మేషము, దేవేజ్యగ్రుహే=బృహస్పతియొక్క క్షేత్రములగు ధనుర్మీనములు, సమే=సమక్షేత్రములు, తౌ=ఆరాహుకేతువులు, తుంగాదిగౌయది= ఉచ్ఛక్షేత్రము మొదలగువాని యందుండినయెడల అఖిలబలం= సంపూర్ణబలము, స్యాత్ = అగును.

తాంతసధీశ్వరౌ అని పూర్వము రాహుకేతువులకు స్థానాధిపత్యమున్నట్లు అంగీకరింపబడినది అందువలన నిప్పుడు స్థానము ఉచ్ఛస్వక్షేత్రనీచ మొదలగురాసులను జెప్పుచున్నాను. రాహుకేతువులకు వరుసగా వృషభము వృశ్చికము ఉచ్ఛరాసులు కుంభము వృశ్చికము స్వక్షేత్రములు. మిథునము కన్యమూల త్రికోణరాసులు. సింహము కర్కాటకము శత్రుక్షేత్రములు. తుల మకరము మిత్రక్షేత్రములు రాహువునకు మేషము కేతువునకు ధనుర్మీనములు సమక్షేత్రములు. ఈచెప్పబడిన రాసులలో మొదటిరాశిని రాహువునకును రెండవరాశిని కేతువునకును చూచుకొనవలయును. రాహుకేతువులుచ్చరాసులయొక్క మొదటి యంశయందుండినపుడే వారియుచ్చబలము సంపూర్ణముగానుండును. అనగా రాహువునకు నుచ్ఛయగు వృషభముయొక్క మొదటియందును కేతువునకు నుచ్ఛయగు వృశ్చికముయొక్క మొదటియంశయందు నుండునపుడు నుచ్ఛబలము సంపూర్ణముగానుండును. అనగా రాహుకేతువులకు నుచ్ఛక్షేత్రాదియందే పరమోచ్ఛస్థానము కలిగియుండును. అందువలన వారియుచ్ఛరాశికి ఏడవరాశియొక్క మొదటి యంశము పరమ నీచగాను గ్రంథము వలన తెలియబడుచున్నది.

అథ తయోరేవ రాహుకేత్వో స్సంబంధవశాత్ఫలమాహ,

శ్లో॥ యద్యద్భావగతౌ యదీశసహితౌ సాన్నిధ్యత్రిసంబంధగౌ

తద్దాయే దిశతోత్రి వీర్యసహితౌ ఖేటాన్నిరస్యేతరాన్ తౌద్వౌయస్య గృహే ఖగస్యవసతస్తద్వీర్యమేవానయో ర్భావస్యాప్యఖిలం శుభాశుభఫలం నాథానుసారాద్వదేత్ ॥

టీ॥ తౌ= ఆరాహుకేతువులు, యద్యత్ = ఏయే, భావ= భావమునందు, గతౌ= పొందియుండురో, యదీశ= భావాధిపతితో, సహితౌ= కూడియుందురో, ప్రాగ్వత్=పూర్వమువలెనే, త్రిసంబంధగౌ= మూడుసంబంధములను పొందియుండురో, అత్ర=ఇక్కడను, వీర్యసహితౌ= బలముతో కూడినవారై, ఇతరాన్- ఇతరమైన, ఖేటాన్= గ్రహములను, నిరస్య=విడిచిపెట్టి తద్దాయే= ఆ రాహుకేతువులయొక్క దశలయందు, శుభాశుభఫలం= శుభఫలమును అశుభఫలమును, దిశతః= ఇచ్చుచున్నారు. తౌద్వౌ= ఆరాహుకేతులిరువురు, యస్య= ఏ, ఖగస్య=గ్రహము యొక్క, గృహే= రాశియందు, వసతః=ఉండెదరో, తద్వీర్యమేవ=ఆ రాశ్యధిపతి యొక్క బలమునే, అనయోరపి= ఈరాహుకేతువులకును, వదేత్= చెప్పవలయును. భావస్య= భావముయొక్క, అఖిలం= సమస్తమైన, శుభాశుభఫలం=మంచిఫలమును చెడుఫలమును, నాథానుసారాత్= ఆయా భావములయొక్క యధిపతి ననుసరించి, వదేత్= చెప్పవలయును.

తా॥ ఆరాహుకేతువులకే యితర గ్రహసంబంధమువలన కలిగెడు ఫలమును జెప్పుచున్నారు. ఆ రాహుకేతులిరువురు యేభావమందుండినవారై యే భావాధిపతితో కూడియుండి- పూర్వము చెప్పినప్రకారము ఒకరినొకరు చూచుట మొదలగుమూడు సంబంధములు కలవారైనయెడల అట్టిసమయమందు తమతో సంబంధముగలయేగ్రహమును అపేక్షింపక నితర గ్రహములనన్నిటిని విడిచివేసి తామే బలవంతులైతమదశల యందే శుభఫలముగాని యశుభఫలముగాని యిత్తురు. అట్టి విశేషబలములేని సమయమందు రాహుకేతులిరువురు ఏగ్రహముయొక్క రాశియందుండెదరో ఆగ్రహము యొక్క ఫలమునే చెప్పవలయును. కాబట్టి స్వతంత్రాధిపత్యము లేనందువలన ఆ రాహుకేతువులుండు భావమునకు నధిపతి యెవడగునో వాని ననుసరించి సమస్త శుభాశుభఫలము చెప్పవలయును.

## అథ మహాదశాంతర్దశానాథయోః స్థితివశాత్ఫలమాహ.

శ్లో॥ దాయేశస్థగృహం ప్రకల్ప్యచతనుం తస్మాచ్ఛుభక్షేత్త్వశః స్థానాద్యంయుతి దృగ్భవంబలమపి హ్యాలోచ్యతచ్చోభయోః। నాన్యోన్యం యదిషష్ఠనైధన గృహస్థిత్యాదికంశోభనం। చేత్తైత్రవిశుద్ధ భావసహితౌ వీర్యానుసారద్వదేత్ ॥

టీ॥ దాయేశస్థగృహం, దాయేశస్థ= మహాదశానాధుడున్నట్టి, గృహం=రాశిని తనుం= లగ్నమునుగా, పరికల్ప్య = ఏర్పరచుకొని, తస్మాచ్చ= ఆరాశినిబట్టి భుక్తీశ్వర=అంతర్దశాధిపతియొక్క, ఉన్నలగ్నము ఆధిపత్యము మొదలగునది, యుతిదృగ్భవం=కూడియుండుట చూచుట మొదలగుదానివల్ల కలిగిన, బలమపి=బలమును, ఇహ ఇక్కడ, ఉభయోః=మహాదశాంతర్దశా నాథులవల్ల; తచ్చ = దానినంతయు, ఆలోచ్య= ఆలోచించి, అన్యోన్యం= వారిరువురకు పరస్పరము, మష్టనైధవ గృహస్థిత్యాదికం=మష్టాష్టకాదిరాసులయందుండుట మొదలగు దోషము నయది= లేనిచో డల శోభనం=శుభమగును, తత్ర=అచ్చట, తౌ = ఆరాహుకేతువులు, విరుద్ధ భావసహితౌచేత్= మష్టాష్టమాది విరుద్ధభావములతో గూడినయెడల, వీర్యానుసారాత్ = అప్పటి బలానుసారముగ, వదేత్= చెప్పవలెను.

తా॥ మహాదశానాధునియొక్కయు నంతర్దశానాధునియొక్కయు స్థితినిబట్టిఫలమును చెప్పుచున్నాను. మహాదశాధిపతి యున్నట్టిరాశిని లగ్నముగా నేర్పరచుకొని యారాశికి నంతర్దశాధిపతియొక్క యాధిపత్యము స్థితి దృష్టి మొదలగువానివల్ల కలిగెడి బలము నాలోచించి యా మహాదశాంతర్దశాధిపతు లిరువురకు మష్టాష్టమాదిదోషములు లేకుండినయెడల నంత దశాధిపతి శుభఫలము నొసగును. లేక ఆమహాదశాధిపతికి అంతర్దశాధిపతికి పరస్పరము మష్టాష్టమాది దోషములున్నయెడల వారుభయులలో నెవడు బలవంతుడో వానిబలము ననుసరించియే ఫలమును జెప్పవలయును.

అథ మహాదశాంతర్దశానాథ యోరాధిపత్యవశాచ్ఛుభాశుభ ఫలమాహ.

శ్లో॥ కేంద్రాధీశ్వరకోణనాయకదశా శ్చాంతర్దశాశ్శోభనాః సామాన్యాశ్చ ధనత్రిలాభభవనాధీశ గ్రహాణాందశాః। షష్ఠాష్టవ్యయభావనాయకదశాః కష్టాశ్శుభ వేయుస్సదా । నేతుర్లగ్నమపీక్ష్యతత్రిచవదేత్తద్దశాభుక్తిషు॥

టీ॥ కేంద్రాధీశ్వర= కేంద్రాధిపతులయొక్కయు, కోణనాయక=త్రికోణాధిపతులయొక్కయు, దశాః= మహాదశలును, అంతర్దశాశ్చ=అంతర్దశలును, శోభనాః= శుభప్రదములైనవి, ధన...గ్రహాణాం, ధన=ద్వితీయము, త్రి=మూడు, లాభ= పదకొండు, భవనాధీశ= ఈరాసులయొక్క యధిపతులైన, గ్రహాణాం= గ్రహములయొక్క, దశాః=దశలు, సామాన్యాః= సాధారణములైనవి, షష్ఠ...దశాః,షష్ఠ= ఆరు, అష్ట=యెనిమిది, వ్యయ=పండ్రెండు, భావనాయక= ఈరాసుల యధిపతుల

యొక్క, దశాః= దశలు, సదా=ఎల్లప్పుడు, కష్టాః=కష్టములనిచ్చునవి భవేయుః= అగును, తత్రిచ=అచ్చటను, నేతుః= దశాంతర్దశాధిపతులయొక్క, లగ్నమపి=లగ్నమునున్నూ, ఈక్ష్య=చూచి, తత్తద్దశాభుక్తిషు= వారి వారి దశలయొక్క భుక్తిదివములయందు, వదేత్= ఫలమును జెప్పవలయును.

తా॥ మహాదశాంతర్దశాధి పతులయొక్క యాధిపత్యమువలన కలిగెడుఫలమును జెప్పుచున్నాను. జన్మలగ్నమునకు కేంద్రములైన 1-4-7-10 రాసులకును త్రికోణములగు 5-9 రాసులకు నధిపతులైనవారియొక్క మహాదశలుగాని యంతర్దశలుగాని శుభమునిచ్చునవి యగును. 2-3-11 ఈరాసులకు నధిపతులైనవారి మహాదశలుగాని యంతర్దశలుగాని సాధారణఫలము నొసగును. 6-8-12 ఈరాసుల యధిపతులయొక్క దశాంతర్దశలు కష్టము నొసగును. మరియు మహాదశాధిపతియు నంతర్దశాధిపతియు నున్నట్టి లగ్నమునుకూడ విచారించి యా లగ్నాధిపతియొక్క మహాదశాంతర్దశా భుక్తులయందు ఫలములను కలుగజేతురని చెప్పవలెను.

అథమహాదశానాథ స్థితరాశేస్సకాశా దంతర్దశానాథ స్థితిఫ విశేషమాహ.

శ్లో॥ పాకేశాద్ధ్యుషితాంత్య శత్రునిధనే సంస్థోవిపాకేశ్వర। స్తచ్ఛత్రుర్భవతీహ లాభధనభే సోద్ధాత్మజే బంధుభే। భాగ్యేహాదశమే సమన్వితఖగ స్తచ్ఛోభనాఖ్యోమహాన్। తత్కామాన్వితఖేచర శ్చశుభదః పాకేశయుక్తోపిచ॥

టీ॥ పాకే...నిధనే పాకేశ= మహాదశానాథునిచే, అధ్యుషిత = అధిష్ఠించబడిన, అంత్య=పండ్రెండు, శత్రు=ఆరు, నిధనే = ఎనిమిదింటను, సంస్థః=ఉన్నట్టి విపాకేశ్వరః= అంతర్దశాధిపతి, తచ్ఛత్రుః= ఆ మహాదశాధిపతికి శత్రువై, భవతి= అగుచున్నాడు. ఇహ=ఇక్కడను, లాభధనభే= పదకొండు రెండుగృహములయందు సోద్ధాత్మజే = తృతీయ పంచమములయందును, బంధుభే = చతుర్థస్థానమందును, దశమే= దశమమందును, సమన్వితఖగః= కూడియుండినగ్రహము, మహాన్=అధికుడైన, తచ్ఛోభనాఖ్యః= ఆ మహాదశాధిపతికి శుభుడగును. తత్కామ=ఆమహాదశాధిపతికి నేడింటభాగ్యహా నవమమందును, అన్విత=కూడియుండిన, ఖేచరశ్చ-గ్రహము, పాకేశయుక్తోపిచ= మహాదశాధిపతితో కూడియుండిన గ్రహమును, శుభదః= శుభము నిచ్చువాడగును.

తా॥ మహాదశాధిపతియున్నట్టి రాశిననుసరించి మూలములో జెప్పబడినప్రకారము యంతర్దశాధిపతియొక్క ఫలమును జెప్పుచున్నాను. మహాదశాధిపతియున్నట్టి

రాశికి 12-6-8 గృహములయందున్న యంతర్దశాధిపతి మహాదశా నాథునకు శత్రువగుచున్నాడు. 11-2-3-5-4-9-10 ఈ గృహముల యందుండినయెడల మిత్రుడై విశేష శుభము నొసగును. మహాదశాధిపతికి సప్తమ మందున్నవాడును మహాదశానాథునితో గూడినవాడును శుభము నిచ్చువాడగును,

{ అథ దశాంతర్దశానాథయో స్సంబంధాసంబంధ
దశాద్భుక్తినాథ ఫలమాహ.

శ్లో॥ పాకేశస్తుఖలోఽయుతశ్శుభఖగః పాపంయుతశ్శోభనో। మిశ్రంచాయుతయోగకృద్దిశతి తత్పాపాదికం దీనతాం । యోగం చైవమృతిం యదాయుగపదే నైక స్తుదాతుంక్షమ । స్తస్యాదౌస్వ విపాక ఏవ సుమహద్యోగం ప్రకుర్యాదసౌ॥

టీ॥ పాకేశస్తు= మహాదశానాథుడైతే, ఖలః= పాపుడైయుండగా, అయుత:= ఆ మహాదశానాథునితో కూడియుండినట్టి, శుభఖగ, శుభుడైన యంతర్దశానాథుడు, పాపం= పాపఫలమును, దిశతి=ఇచ్చుచున్నాడు, యుతః= అపాపుడైన మహాదశానాథునితో సంబంధముగల, శోభనః= శుభుడగు నంతర్దశానాథుడు, మిశ్రం= మిశ్రఫలమును, దిశతి=ఇచ్చుచున్నాడు. అయుతయోగకృత్= ఆ దశానాథునితో సంబంధము లేనటువంటి, రాజయోగకారకుని యంతర్దశ, తత్పాపాధికం=అజాతకునకు విశేషపాపమును, దీనతాం= దైన్యమును, దిశతి=ఇచ్చుచున్నది, యదా=ఎప్పుడు,యోగంచైవ= యోగమును, మృతిం = మరణమును, ఏకస్తు= ఒక్క దశానాథుడు, యుగపదేవ=ఒక్క కాలమందే, దాతుం=ఇచ్చుటకొరకు, క్షమః=సమర్థమైయుండునో, అసౌ= ఇటువంటిదశానాథుడు, తస్య ఆమహాదశానాథునియొక్క, ప్రారంభమందు, స్వవిపాకఏవ= తనభుక్తియందే. సుమహత్ =విశేషమైన, యోగం=రాజయోగమును,ప్రకుర్యాత్= చేయును.

తా॥ మహాదశాధిపతికి నంతర్దశాధిపతికి సంబంధముండుట చేతను లేకుండుటచేతను భుక్త్యధిపతియొక్క ఫలమును జెప్పుచున్నాను. మహాదశాధిపతి పాపుడైయుండగా వానితో సంబంధము లేనటువంటి శుభుని యంతర్దశపాపఫలము నిచ్చును. అటువంటి మహాదశాధిపతితో సంబంధముగల శుభుని యంతర్దశ శుభపాపమిశ్రితమగు ఫలమునిచ్చును. అట్టిదశానాథునితో సంబంధము లేనటువంటి రాజయోగ

కారకుడగువాని యంతర్దశ విశేషమగు పాపఫలమును దైన్యమును ఇచ్చును. అయితే యింకొక విశేషముగలదు. ఏమహాదశాధిపతి యాధిపత్యాదులవలన విశేషపాపుడై మారక సంబంధము మొదలగువానివలన మారకుడై రాజయోగ సంబంధాదులవలన రాజయోగ చిహ్నములుకలవాడై యిట్లు మారకత్వ రాజయోగత్వాది రెండు మూడు లక్షణములు ఒక్కదశాధిపతికే కలిగియుండిన్నప్పుడు ఆ మహాదశానాధుడు తనదశ ప్రారంభించగానే ప్రారంభములో వచ్చెడు తన యంతర్దశయందే రాజయోగమును కలుగజేయును.

## {పూర్వోక్తమారకత్వయోగ కారకత్వద్వయ విశిష్ట మహాదశాయా ఏవవిశేషమాహ}

శ్లో॥ తాదృక్ఖేటమహాదశాసుఫలదా కృత్స్నాఽఖలాభుక్తయః స్తద్వచ్ఛోభనదా స్తదీయమరణం దూరాదపాస్యత్యసౌ। అన్యత్రద్యుచరశ్శుభాశుభఫలం కుత్రాపినోయచ్ఛతి। స్యాద్యచ్ఛేద్యది సర్వతోపిహిదశా సానిష్ఫలేత్యూచిరే॥

టీ॥ తాదృక్= అటువంటి, ఖేట=గ్రహముయొక్క, దశా=దశ, కృత్స్నా= అంతయు సుఫలదా=మంచిఫలమునిచ్చును. ఖలాభుక్తయః= పాపగ్రహ సంబంధమగు భుక్తులును, తద్వత్= ఆప్రకారముగానే, శోభనదాః = శుభఫలమునిచ్చును, తదీయ=ఆమహాదశాధిపతియొక్క దశయందు, మరణం=మరణమును, అసౌ=ఈగ్రహము, దురాత్=దూరముగ, అపాస్యతి=త్రోసివేయుచున్నాడు. ద్యుచరః=గ్రహము, అన్యత్ర=మరియొకచోటను, శుభాశుభఫలం= శుభఫలమునుగాని యశుభఫలమునుగాని, కుత్రాపి= యెచ్చటనైనను, నోయచ్ఛతి=ఇవ్వడు, యచ్ఛేత్ స్యాద్యది= ఇచ్చినట్లాయెనా, సా= ఆదశ, సర్వతోపిహి= అంతటను, నిష్ఫలా=ఫలమునివ్వదు ఇతి= ఈప్రకారము, ఊచిరే= చెప్పిరి.

తా॥ పూర్వశ్లోకములో జెప్పినప్రకారము నొకనికే మారకత్వము యోగకారకత్వము సంభవించియెడల వాని మహాదశలోగలుగు ఫలవిశేషమును జెప్పుచున్నాను. మారకత్వము యోగకారకత్వము రెండు నొకనికే కలిగియున్న పాపగ్రహ మహాదశలోవచ్చే యితర పాపగ్రహములయొక్క యంతర్దశలయందుకూడనారాజయోగమునే చేయుచుండును. ఆజాతకునియొక్క మారకమును మరియొకదశలోనికివిడిచివేయును. ఇందువలన వీనిమహాదశలో పాపులయొక్కయు శుభులయొక్కయు నంతర్దశలన్నియు శుభఫలమునే యిచ్చువట్లు తోచబడుచున్నది. ఇతనియొక్క మారకత్వ లక్షణము ఏకోడు కనుపించుననగా దూరముగా త్రోసివేయునని చెప్పుటచే నంశయందలిమార

కమును తనమహాదశలోజేయక మరియొక మహాదశలో జేయునని యభిప్రాయము. ఇటువంటి లక్షణములుగల గ్రహముయొక్క మహాదశయందే స్వభుక్తిసంబంధమైన యోగమునిచ్చునుగాని మరియేయితర మహాదశలయందును స్వభుక్తియందును శుభఫలమునుగాని అశుభఫలమునుగానియివ్వడు. లేక యిచ్చినయెడల నామహాదశయంతయు యోగమును భంగము జేయునని తెలిసికొనవలయును.

{ ఏవం దశాంతర్దశానాం సమష్టిఫల ముక్త్వేదానీం
దశాంతర్దశానాథయోర్గురుశుక్రయోరేవసార్థ
క్యేన శుభాశుభే వివృణోతి. }

శ్లో॥ దేవేజ్యోభృగుజే భృగుస్సురగురౌతౌ చేన్మిథోపాకగా
వన్యోన్యం శుభభావగౌ బలయుతౌ సత్ఖేటయుగ్వీక్షితౌ రాజాస్యాత్స
చివోథవా బహుధనీ స్త్రీపుత్రసౌఖ్యాన్వితో యజ్ఞాదిక్రతుకృత్సుతో
దయ వివాహోద్యుత్సవానందితః ॥

టీ॥ దేవేజ్యః= బృహస్పతి, భృగుజే= శుక్రుని మహాదశలోను, భృగుః= శుక్రుడు, సురగురౌ= బృహస్పతియొక్క మహాదశలోను, తౌ= ఆగురుశుక్రులుమిథోపాకగౌ= ఒకరిదశలో మరియొక రంతర్దశానాథులైనప్పుడు, అన్యోన్యం=పరస్పరము శుభభావగౌ= శుభస్థానములయందున్నవారై, బలయుతౌ= స్థానాదిషడ్బలములతో కూడినవారై, సత్ఖేట= శుభగ్రహములతో, యుగ్వీక్షితౌ= కూడినవారుచూడబడినవారునైనయెడల, రాజా= రాజుగాని అథవా= అలాగు కానియెడల, సచివః= మంత్రిగాని, స్యాత్= అగును, బహుధనీ= విశేషధనవంతుడును, స్త్రీపుత్ర= భార్యాపుత్రులతోటి, సౌఖ్యాన్వితః= సౌఖ్యముతో కూడినవాడును, యజ్ఞాది...నందితః, యజ్ఞాదిక్రతుకృత్=యజ్ఞముమొదలగువాటిని చేయువాడును, సుతోదయ= పుత్రులు కలగినవాడును, వివాహాది=వివాహము మొదలగు ఉత్సవ= మహోత్సవములతోటి, ఆనందితః= సంతోషించువాడును, స్యాత్ అగును.

తా॥ ఇట్లు మహాదశలకు నంతర్దశకు సమష్టిగా ఫలమునుజెప్పి యిప్పుడు గురుశుక్రుల దశాంతర్దశలకు వేరుగా శుభాశుభఫలమును ప్రత్యేకము వివరించి చెప్పబడును. శుక్రునిదశలో బృహస్పతి యంతర్దశయందును బృహస్పతిదశలో శుక్రుని యంతర్దశయందును వారిగువురిలో నొకరిదశలో నొకరియంతర్దశ కలిగినప్పుడు వారి రువురిలో నొకరికొకరు శుభస్థానమందుండినప్పుడును స్థానాది షడ్బలముకలవారై యుండినప్పుడును శుభగ్రహములతో కూడియున్నప్పుడును చూడబడినప్పుడును జని యించినవాడురాజుగాని మంత్రిగాని యగును లేక విశేషధనవంతుడును భార్యాపుత్ర

లవలన సౌఖ్యమునొందువాడును యజ్ఞాదిక్రతువులను జేయువాడును పుత్రాది సంతానముకలవాడును వివాహాది శుభకార్యములను జేయుచు సంతోషించువాడునగును.

శ్లో॥ తావన్యోన్య రిపువ్యయాష్టమగతౌ తద్భేశదృష్టౌయుతౌ తద్భేశత్వయుతౌ ఖలేక్షణయుతౌ స్థానాదివీర్యోనితౌ దారాపుత్రవినాశదౌ చబలవద్విప్రేంద్ర విద్వేషదౌ స్త్రీసంసర్గభవార్తిదౌ నృపభయాపస్మార భీతిప్రదౌ॥

టీ॥ తౌ= ఆగురుశుక్రులు, అన్యోన్య=ఒకనొకరు రిపు = ఆరు, వ్యయ = పండ్రెండు, అష్టమ=యెనిమిదిస్థానములను, గతౌ= పొందినవారగుచుండగాను తద్భేశదృష్టౌ= ఆ స్థానాధిపతులచేత చూడబడినవారును, యుతౌ=వారితో కూడినవారును, తద్భేశత్వయుతౌ= ఆస్థానములకు నధిపతులైనవారును, ఖల= పాపులయొక్క ఈక్షణయుతౌ= చూపుకూడికకలవారును, స్థానాదివీర్యోనితౌ = స్థానాదిబలములేనివారు నైనయెడల, దారాపుత్ర=భార్యాపుత్రులను, వినాశదౌ = నశింపజేయువారును, బలవత్ = బలవంతులతోడను, విప్రేంద్ర = బ్రాహ్మణోత్తములతోడను, విద్వేషదౌ= వైరమును కలిగించువారును, స్త్రీసంసర్గ= స్త్రీల సంభోగమువలన భవ పుట్టిన, ఆర్తిదౌ= పీడనిచ్చువారును, నృపభయ= రాజులవలన భయమును అపస్మార= మనోవికలత్వమును, భీతిప్రదౌ= భయమును కలిగించువారగుదురు.

తా॥ గురు శుక్రులు దుష్టస్థానమునందుండుటవలన కలిగెడుఫలమును జెప్పుచున్నాను. ఆగురుశుక్రులు దశాంతర్దశా నాథులైనప్పుడు ఆగురుశుక్రులొకరికొకరు 6-8-12 స్థానములయందుండినను,ఆస్థానాధిపతులచే జూడబడినను, వారితో కూడినను లేక 6-8-12 స్థానములకు ఆగురుశుక్రులే యధిపతులైనను, పాపగ్రహములయొక్క కలిసియుండుట చూడబడుట మొదలగు సంబంధములు కలిగియున్నను,స్థానాదిబలములలో నేదైన బలముతక్కువైనను ఆగురుశుక్రులు వారి మహాదశాంతర్దశాకాలములలో భార్యాపుత్రులను నశింపజేయుదురు. బలవంతులతోటి బ్రాహ్మణులతోటి విరోధమును కలిగింతురు. బహు స్త్రీసంభోగమువలన కలిగెడురోగములతో పీడింపబడుటయును మరియు రాజులవలన భయము పిచ్చియెత్తుట భయము మొదలగు చెడ్డగుణములను జేయును.

## అథద్వాభ్యాం శ్లోకాభ్యాం శనిశుక్రయోః పరస్పరదశాంతర్దశయోః ఫలమాహ.

శ్లో॥ భృగ్వార్కీయది తుంగభే స్వభవనే సర్గోత్తమద్రేష్కాణే తుల్యాయోగకరౌ తథైన బలినౌ తౌచే స్నిగ్ధోపాకగౌ భూపాలో

ధనదోపమోపి సతతం భిక్షాశనో నిష్ప్రభ స్తత్రైకస్తు బలీపరస్తు విబలశ్చే ద్వీర్యవాన్ యోగదః.

టీ॥ భృగ్వర్కి = శుక్రశనులు, తుంగభే = తమ యుచ్చస్థానమందుండగాను, స్వభవనే = స్వక్షేత్రమందుగాని, వర్గోత్తమాదౌ = వర్గోత్తమాంశ మొదలగువాని యందు గాని, స్థితౌ = ఉన్నవారైనను, తుల్యౌ = సమానమైన, యోగకరౌ = యోగకారకులైనను, తథైవ = ఆప్రకారముగానే, బలినౌ = బలవంతులైనను, తౌ = ఆశుక్రశనులు, మిథః = పరస్పరము, పాకగౌ = ఒకరిదశలో నొకరియంతర్దశ కలవారైనను, భూపాలః = రాజుగాని, ధనదోపమోపి = కుబేరునితో సమానుడగు భాగ్యముకలవాడుగాని, సతతం = ఎల్లప్పుడు, భిక్షాశనః = భిక్షము నెత్తుకొనువాడునగును, నిష్ప్రభః తేజస్సులేనివాడగును, తత్ర = వారియువురలో, ఏకస్తు = ఒకడు, బలీ = బలముకలవాడును, పరస్తు = రెండవవాడు, విబలశ్చేత్ = బలము లేనివాడైనయెడల, వీర్యవాన్ = వారిలో బలముకలవాడు, యోగదః = యోగము నిచ్చువాడగును.

తా॥ శని శుక్రులొకరి మహాదశలో నొకరీయంతర్దశ వచ్చినపుడు వారిచ్చుఫలము జెప్పుచున్నాను. శుక్రశనులు తమ యుచ్చక్షేత్రమందైనను స్వక్షేత్రమందైనను వర్గోత్తమాది యంశలయందైన నుండినవారగుదురేని లేక వారియువురు యోగకారకత్వములో సమానబలవంతులైయుండినను ఆశుక్రశనులలో నొకరి మహాదశలో నొకరియంతర్దశ వచ్చినపుడు రాజునైనను కుబేరునితో సమానభాగ్యవంతునైన నెల్లప్పుడు భిక్షమెత్తుకొనువానిగాను తేజస్సులేనివానిగాను జేయును. వారిలో నొకరు బలముకలవాడుగాను మరియొకరు బలములేనివాడుగాను నుండినయెడల వారిలో బలముకలవాడు యోగమునిచ్చును.

శ్లో॥ తౌ ద్వావప్యబలౌ వ్యయాష్టరిపుగౌ తద్భావపౌ వాపి తత్తద్భావేశయుతౌ తదాశుభకరౌ సౌఖ్యప్రదౌ భోగదౌ ఏకస్తద్భవనాధిపస్తదపరశ్చేద్దుష్టభావేశ్వర స్తావ ప్యత్రసుయోగదావతిఖలౌ తౌ చేన్మహాసౌఖ్యదౌ॥

టీ॥ తౌ ద్వావపి = ఆశుక్రశనులిద్దరును, అబలౌ = బలములేనివారును, వ్యయాష్టరిపుగౌ = పండ్రెండు యెనిమిది ఆరుస్థానములయందుండినవారును, తద్భావపౌ వాపి = ఆస్థానములకు నధిపతులైనవారును, తద్భావేశ = ఆస్థానాధిపతులతో, యుతౌ కూడినవారునైనయెడల, తదా = అప్పుడు, శుభకరౌ = శుభమును జేయువారును, సౌఖ్యప్రదౌ = సౌఖ్యమునిచ్చువారును, భోగదౌ = భోగము నిచ్చువారునగుదురు ఏకః = వారిలోనొకడు, సద్భవనాధిపః = శుభస్థానమునకు నధిపతియు, తదపరః = వానికంటె రెండవవాడు, దుష్టభావేశ్వరశ్చేత్ = పాపస్థానాధిపతియు నైనయెడల,

అత్ర= ఇట్టివిషయమునందు, తావపి= వారుభయులు, సుయోగదౌ= మంచియోగ మునిత్తురు. తౌ=వారిద్దరు, అతిఖలౌ చేత్=మిక్కిలి పాపులైనయెడల, మహాసౌఖ్యదౌ విశేష సౌఖ్యము నిత్తురు.

తా॥ ఆశుక్రశనులు బలహీనులైనను 6-8-12 ఈ స్థానములయందుండినను లేక ఈచెప్పబడిన స్థానములకు నధిపతులైనను లేక 6-8-12 స్థానాధిపతులతో కూడినను వారు శుభము సౌఖ్యము భోగము మొదలగువానిని కలుగజేతురు వారిలో నొకడు శుభక్షేత్రాధిపతియు మరియొకడు పాపక్షేత్రాధిపతియు నైనయెడల వారిరువురు మంచి యోగమునిత్తురు. వారిద్దరు మిక్కిలి పాపగ్రహములైనయెడల విశేషసౌఖ్యమును కలుగజేయుదురు.

అథ రవిశన్యోః పరస్పరదశాంతర్దశయో ర్విశేషమాహ.

శ్లో॥ శన్యర్కౌ నిజరాశితుంగభగయో స్తత్తన్నవాంశేపివా। సంస్థౌకోణ చతుష్టయాఖ్యగృహగౌ తద్భావనాథావపి । భుక్తౌతు ద్యుమణే స్సదానృపజనప్రీతించలాభాధికం। చేన్మందస్య సుఖం ధనం చ విజయంతౌ చేత్ఖలౌ హానిదౌ॥

టీ॥ శన్యర్కౌ= శని సూర్యులు, నిజరాశితుంగభగయోః= స్వక్షేత్ర ఉచ్చ క్షేత్రములయందుగాని, తత్తన్నవాంశేపివా= ఆయానవాంశలయందుగాని, సంస్థౌ= ఉన్నవారగుచుండగా, కోణ=త్రికోణ స్థానములయందుగాని, చతుష్టయాఖ్యగృహ గౌ=నాలుగుకేంద్రములయందుగాని యున్నవారైనను, తద్భావనాథావపి=ఆకేంద్ర కోణభావములకు నధిపతులైనను, ద్యుమణేః= సూర్యునియొక్క, భుక్తౌతు=అంతర్దశ యందు, సదా=ఎల్లప్పుడు, నృపజనప్రీతిం=రాజులచే గౌరవింపబడుటయును లాభా ధికం= విశేషలాభమును, దిశతి= ఇచ్చుచున్నాడు. మందస్య= శనియొక్క భుక్తౌ చేత్= అంతర్దశయందైతే, సుఖం= సుఖమును, ధనం=ధనమును, విజయం= విజయ మును ఇచ్చుచున్నాడు. తౌ= వారిద్దరు, ఖలౌ చేత్= పాపులైనయెడల, హానిదౌ= హానిని చేయుదురు.

తా॥ సూర్యశనులలో నొకరి మహాదశయందు నొకరియంతర్దశ వచ్చినపుడు కలిగెడు ఫలవిశేషమును జెప్పుచున్నాను. రవి శనులు తమ స్వక్షేత్రమందుగాని యుచ్చక్షేత్రమందుగాని యున్నవారగుచుండగాను లేక స్వక్షేత్ర ఉచ్చక్షేత్రనవాం శలయందైన నుండినవారైనను లేక కేంద్రములయందుగాని కోణములయందుగాని యుండినవారైనను లేక యా కేంద్రకోణ స్థానములకు నధిపతులైన నగుచుండగాశని మహాదశలో సూర్యుని యంతర్దశయందు రాజసన్మానము విశేష లాభముకలుగును. సూర్యమహాదశలో శన్యంతర్దశయందు సుఖముధనము విజయముకలుగును. ఆసూర్యం

శను లిరువురు పాపులైనయెడల హానిని కలుగజేయుదురు. మరియు వారిద్దరిలో నొకడు శుభుడు మరియొకడు పాపుడైనయెడల శుభుడు శుభఫలమును పాపుడుపాప ఫలము నొసగుదురని మరికొందరి మునులయొక్క యభిప్రాయము.

తత్రైవ కుజగుర్వోర్విశేషః

శ్లో॥ భౌమేజ్యావపి తాదృశౌ బలయుతౌ సుస్థానగావీక్షితౌ యుక్తౌవా శుభఖేచరై ర్బలయుతై స్తౌరాజయోగప్రదౌ। ఆనందా ఖిలభోగదౌ సుఖకరౌ జీవత్సుపుత్రప్రదౌ। ఉద్వాహాదిశుభప్రదౌ వితరథాచేద్వ్యత్యయం స్యాత్క్రమాత్ ॥

టీ॥ భౌమేజ్యావపి= అంగారక బృహస్పతులును, తాదృశౌ= అటువంటి బల యుతౌ= బలముతో కూడినవారగుచుండగాను, సుస్థానగౌ= శుభక్షేత్రములయందు న్నవారగుచుండగాను, బలయుతైః= బలముగల, శుభఖేచరైః = శుభగ్రహములచేత, వీక్షితౌ= చూడబడినవారుగాని, యుక్తౌ=కూడినవారుగాని, యైనయెడల తౌ=ఆగు రుకుజులు, రాజయోగప్రదౌ= రాజయోగమునిచ్చువారును, ఆనందాఖిలభోగదౌ= ఆనందమును సమస్తసుఖములనిచ్చువారును, సుఖకరౌ= సుఖమును జేయువారును, జీవత్= జీవించియుండెడి, సుపుత్రప్రదౌ= యోగ్యులగు పుత్రుల నొసగువారును, ఉద్వాహాది శుభప్రదౌ=వివాహము మొదలగు శుభకార్యములను కలిగించువారనగు దురు. ఇతరథాచేత్= ఈ చెప్పబడినదానికంటె వ్యతిరేకముగా నుండినయెడల, క్రమాత్= వరుసగా, వ్యత్యయం=పైనచెప్పబడినఫలములకు వ్యతిరేకముగ,స్యాత్= అగును.

తా॥ రవి శనులకు జెప్పినట్లుగానే కుజ గురువులవలన కలుగు ఫలవిశేషమును జెప్పుచున్నాను. ఉచ్చక్షేత్రి స్వక్షేత్రత్రితవ్యంవాంశాది స్థితియు కేంద్రకోణస్థితియు నా కేంద్రకోణాధిపత్యము మొదలగు బలములు రవిశనులకు జెప్పినట్లుగా నేకుజగురువు లకునుకలిగి బలవంతులైయుండినను శుభక్షేత్రములయుండినను బలవంతులగుశుభగ్రహ ములతోగూడినను చూడబడినను కుజగురువులు ఒకరి మహాదశలో నొకరి యంతర్దశ వచ్చినపుడు రాజయోగమును ఆనందమును సమస్తభోగములను సుఖమునుదీర్ఘాయు ష్మంతులగు పుత్రులను వివాహాది శుభకార్యములను కలుగజేయుదురు. పైన జెప్ప బడిన స్థానములకంటె వ్యతిరేకముగానుండిన (అనగా శత్రు క్షేత్రాదిస్థితి కలిగినయెడల) పైన చెప్పబడిన శుభఫలములు కలుగక పాపఫలములే కలుగును.

ఏవముక్త్వా అవశిష్టానాం గ్రహాణాం సంక్షేపతః ఫలమాహ.

శ్లో॥ దేవేజ్యేందుసుతౌ తథైవబలినౌ సత్కర్మవిద్యాయుతం వాణిజ్యాదిషు విక్రయక్రయపటుంస్త్రీపుత్రసౌఖ్యాన్వితం।శుక్రజ్ఞావ

పితద్వదిజ్యశశినౌ చంద్రాసురేజ్యౌ పున। ర్జీవార్కౌ రవిమంగళౌ రవిబుధౌ స్యాదిజ సౌమ్యోక్తివత్॥

టీ॥ దేవేజ్య= బృహస్పతి, ఇందుసుతౌ= బుధుడును, తథైవ=ఆప్రకారము గానే, బలినౌ= బలముకలవారైనయెడల, సత్కర్మ విద్యాయుతం = మంచికర్మలు విద్యలుకలవానిగాను, వాణిజ్యాదిషు= వర్తకము మొదలగువానియందు, విక్రయ క్రియపటుం=అమ్మటలోను కొనుటలోను సమర్థుడైనవానిగాను, స్త్రీపుత్రసౌఖ్యాన్వితం=భార్యాపుత్రుల సంబంధమైన సౌఖ్యముకలవానిగాను చేయుదురు తద్వత్= ఆప్రకారముగానే, శుక్రజ్ఞావపి= శుక్రబుధులును ఇజ్యశశినౌ= బృహస్పతిచంద్రులును, చంద్రాసురేజ్యౌ= చంద్రశుక్రులును పునఃమరియు జీవార్కౌ=బృహస్పతి సూర్యులును, రవిమంగళౌ= సూర్యాంగారకులును, రవిబుధౌ= సూర్యబుధులును, ఇజ్యసౌమ్యోక్తివత్= బృహస్పతి బుధులకు జెప్పబడిన ఫలములవలెనే స్యాత్= ఫలమునిచ్చువారని శాస్త్రముకలదు.

తా॥ ఇట్లుచెప్పి మిగిలినగ్రహములకుకూడ ఫలమును సంక్షేపముగా జెప్పుచున్నాను. బృహస్పతి బుధులును పూర్వశ్లోకములలో జెప్పబడినట్లు యుచ్చక్షేత్రాది స్థితికలిగి బలముగలవారై యుండిరేని వారిరువురు ఒకరిమహాదశలో నొకరి యంతర్దశ వచ్చినపుడు అజాతకుని మంచికర్మలను జేయువానిగాను వేదశాస్త్రాది విద్యలను చదివినవానిగాను వర్తకము మొదలగు వ్యాపారములయందు అమ్మటలోను కొనుటలోను సమర్థునిగాను భార్యాపుత్రులవలన సౌఖ్యము నొందువానిగాను జేయుదురు. మరియు శుక్రబుధులు, గురుచంద్రులు, చంద్రశుక్రులు, గురుసూర్యులు రవికుజులు, రవిబుధులు, ఇట్లు జంటగాజెప్పబడిన గ్రహములలో నొకరి మహాదశయందు నొకరియంతర్దశ కలిగినప్పుడు బృహస్పతి బుధులకు నొకరిమహాదశలో నొకరి యంతర్దశయందు జెప్పబడిన ఫలమురీతిగానే యిచ్చుటను ఒకరి మహాదశలో నొకరి యంతర్దశయందు ఫలము నిత్తురు.

## అథ ప్రతిసౌరవత్సరస్య వార్షికదశాక్రమః

శ్లో॥ జన్మార్కేణ నమో యదాస్ఫుటరవి ర్నాడ్యాదిభిస్స్యాదసౌ। సౌరాబ్దాదిరిహగ్రహం స్తనుముఖాః భావాం శ్చజన్మోక్తివత్ కృత్వాతన్మునివర్గసంభవబలం తస్మాత్ఫలంయోజయే। జ్జన్మర్క్షాది శరన్మఖేందుభ మజా (౬) స్తంశిష్టమర్కాద్దశా॥

టీ॥ జన్మ= జన్మకాలసంబంధమగు, అర్కేణ= సూర్యునితోటి, యదా= ఎప్పుడు, స్ఫుటరవిః=స్ఫుటసూర్యుడు, నాడ్యాదిభిః=ఘడియలు మొదలగువానితో

సమః= సమానుడై, స్యాత్ = అగునో, అసౌ= ఈకాలము, సౌరాబ్దాదిః=సౌరసంవత్సర ప్రారంభకాలమందు, గ్రహాన్=స్ఫుటగ్రహములను, తనుముఖాన్=లగ్నము మొదలైన ద్వాదశభావములను, జన్మోక్తవత్ = జన్మకాలమునకు జెప్పినట్లుగానే, కృత్వా= చేసి, తన్మూలవర్గ= పూర్వము జెప్పబడినట్లు సప్తవర్గములవల్ల, సంభవ= పుట్టినట్టి, బలం=బలమునుసాధించి, తస్మాత్= దానివలన, ఫలం=ఫలమును, యోజయేత్= విచారింపవలెను. జన్మర్క్షాది=జన్మనక్షత్రము మొదలు, శరన్ముఖ= సంవత్సర ప్రారంభకాలమునకు, ఇందుభం=చంద్రుడున్న నక్షత్రము పర్యంతము నెంతసంఖ్యయగునో యాసంఖ్యను, ఆజాప్తం = తొమ్మిదిచే భాగింపగా, శిష్టం = మిగిలినది, అర్కాత్= సూర్యుడు మొదలుగా, దశా= దశయగును.

తా॥ ప్రతి సౌరసంవత్సర సంబంధమగు దశాక్రమమును జెప్పుచున్నాను, ఏ సంవత్సరమునకు సంవత్సర దశాఫలమును దెలిసికొనవలయుననియున్నదో ఆసంవత్సరమునందు జన్మకాలస్ఫుటరవి నక్షత్రముయొక్క ఘడియలు విఘడియలతో సమానముగ నేదినమున నెన్నిఘడియల కంతస్ఫుటరవియగునో యాసమయమే యాజాతకుని యొక్క సౌరసంవత్సర ప్రారంభకాలమగును. ఆకాలమునకు జన్మకాలమునకు జెప్పినట్లుగానే స్ఫుటగ్రహములను తన్వాదిద్వాదశభావములనుసప్తవర్గబలమును సాధించి వానివల్ల ఫలము నాలోచింపవలయును. అనంతరము సౌరసంవత్సర దశలను కట్టవలయును, అది యేవిధముగాననగా జన్మనక్షత్రము మొదలుకొని వర్షప్రారంభకాలమువరకు నిత్యనక్షత్రమేదియగునో అంతవరకునైన సంఖ్యను 9 చే భాగించగా మిగిలినసంఖ్య సూర్యుడు మొదలగు రవి చంద్ర కుజబుధ గురు శుక్ర శని రాహువులయొక్క లగ్నములకు దశలగును. ఇందునుగురించి యుదాహరణము మూలములో వ్రాయబడినదిగాన దానిని చూచుకొనవలయును.

ఏవం దశాసాధన ముక్త్వా వార్షికదశామధ్యే వర్షప్రవేశకాలస్య
కియద్భుక్తం కియదవశిష్ట మిత్యాశంక్య వర్షప్రవేశ
కాలికదశా శేషసాధనం దశాప్రమాణం గ్రహ
క్రమం చాహ...

శ్లో॥ ఇందోర్భైభవ్యఘటీదశాదినహతా భాద్యంతనాడీహృతా
దాయైష్యంవినాడికాద్య మితితద్వర్షప్రవేశాదితః । ఖైకేలా ౧౧౦
ఖరసా ౬౦ స్తతస్తుదశనా ౩౨ శూన్యాబ్ధయో ౪౦।అహ్యాబ్ధయః౪౮
షడ్బాణా౫౬శ్రుతయ ౪శ్శరా౫ది౧౦గినచంద్రారజ్ఞజీవాభృగుః॥ ౩౬॥
మందాగూచతనుర్గ్రహక్రమఅయంబాణాంగరామై౩౬౫ర్దినైః। ప్రాగు
క్తైర్దినఖండకైః ఫలమథాగ్రేవార్షికంతూచ్యతే । తత్తత్ఖేటదశాఫలం
బలవద్వార్ష ప్రవేశోదయా ద్భావాద్యంస్థితిదృగ్భవంచసకలంవాచ్యం
శుభంవాశుభం ॥ ౩౭ ॥

టీ॥ ఇందోః= చంద్రునియొక్క, భైవ్యఘటీః=నక్షత్రవిఘడియలు,దశా
దినహతాః= దశాదినములచేత గుణింపఁబడినవై, భాద్యంతనాడీ= ఋక్షాద్యంత ఘడి
యలచేత, హృతాః= భాగింపఁబడినవగుచు, దినవాడికాద్యం= దినములు ఘడియలు
విఘడియలును, దాయైష్యం= దశాశేషమగును. ఇతి= ఈప్రకారము, తద్వర్షప్రవే
శాదితః = ఆసంవత్సర ప్రారంభసమయము మొదలుకొని, ఖైకేలాః = నూటపది,
ఖరసాః= అరవై, తతస్తు= తర్వాతనైతే, దశనాః=ముప్పదిరెండు, శూన్యాబ్ధయః=
నలభై, అహ్యాబ్ధయః = నలభైయెనిమిది, షడ్బాణాః = యాభైయారు, శ్రుతయః =
నాలుగు, శరాః = అయిదు, దిక్ = పది, ఇనచంద్రారజ్ఞ జీవాభృగుః= ఇన =
సూర్యుఁడు, చంద్ర = చంద్రుడు, ఆర = కుజుడు, జ్ఞ= బుధుడు, జీవాః =
బృహస్పతి, భృగుః = శుక్రుడు, మందాగూ = మంద = శని, అగు = రాహువు,
తనుః = లగ్నము, అయం= ఇది, గ్రహక్రమః= గ్రహములయొక్క వరుస, ప్రాగు
క్తైః= పూర్వము చెప్పఁబడిన, దినఖండకైః = దినఖండములచేతను, అథ = అనంత
రము, అగ్రే= ముందు, వార్షికం= వర్షసంబంధమైన, ఫలం=ఫలము, బాణాంగ
రామైః = మూడువందల అరువదియైదు, దినైః = దినములచేత, ఉచ్యతే = చెప్పఁ
బడుచున్నది. తత్తత్ఖేట= ఆయాగ్రహములయొక్క, దశాఫలం= దశలసంబంధమగు
ఫలము, బలవశాత్ = ఆయాగ్రహముల బలమువలన, వర్షప్రవేశోదయాత్ =
సంవత్సరప్రారంభకాల లగ్నమువలను, భావాద్యం= భావము మొదలగునవియు,
స్థితిదృగ్భవం= ఉండుట చూచుట మొదలగువానివలన కలిగిన, శుభంవా= శుభప్రద
మైనదిగాని, అశుభంవా= అశుభప్రదమైనదిగాని, సకలం = సమస్తమైన, ఫలం=
ఫలము, వక్తవ్యం = చెప్పవలయును.

తా॥ ఇట్లు దశలను సాధించుటను జెప్పి సంవత్సరదశలలో సంవత్సర ప్రవేశ
కాలమునకు నెంత గడిచినది యెంత మిగిలియున్నదని శంక కలిగినప్పుడు సంవత్సర

ప్రవేశ కాల సంబంధమగు దశాశేషమును దశాప్రమాణమును గ్రహముల వరుసను రెండు శ్లోకములచే జెప్పఁబడును సంవత్సర ప్రారంభ కాలమునకు చంద్రనక్షత్రము నఁబట్టి వెనుక జాతకప్రకరణములో సాధించిన ప్రకారముగానే దశాశేషమును తీయవలయును. దశలును అదశలకు దినముల సంఖ్యయు పూర్వము జెప్పఁబడియున్నది. వర్షప్రవేశ కాలమున కెవ్వనిదశయగుచున్నదో వానికి జెప్పఁబడిన దినసంఖ్యల ననుసరించి దశాశేషమును నిర్ణయించి యది మొదలుకొని వరుసగా నీగ్రహముల దశాక్రమముగా నాయాదశలకు జెప్పబోవు నాయాఫలములను జెప్పవలయును. ఫలమును జెప్పవప్పుడు సంవత్సర ప్రవేశకాలలగ్నమును గ్రహములును భావములును సాధించి వర్షప్రవేశకాల గ్రహచక్రమునుజేసి యాగ్రహముల బలానుసారముగ వారిస్థితి వీక్షణము మొదలగునవి బాగుగ నాలోచించి ఫలములను జెప్పవలయును. సప్తవర్గసంబంధమగు శుభాశుభ రూపమగు రెండుపంక్తులనుగూడ సాధింపవలయును గ్రహక్రమమువలన దినములసంఖ్య యెట్లనగా సూర్యునకు 110 దినములు, చంద్రునకు 60, అంగారకునకు 32, బుధునకు 40, బృహస్పతికి 48, శుక్రునకు 56, శనికి 4, రాహువునకు 5, లగ్నము 10 మొత్తము సౌర సంవత్సరము 1కి 365 దినములగును. ఈవిధముగానే యే సంవత్సరముకైనను ఒకసంవత్సరమునకు వార్షికదశాఫలమును దెలిసికొనవచ్చును. ఈప్రకారము ప్రతిసంవత్సరమునకు తెలిసికొనవలయును.

శ్లో॥ జన్మేంద్వృక్షవశాద్వి చింత్యఖచరైః స్తాత్కాలికైరుక్త
వ। ద్గోచారోదితవర్త్మనాతదుభయో ర్యోగార్థసంవాదతః । ఏకస్యై
వహాయనత్సరస్యచ తథా దాయేశ్వరైశ్చాఖిలం । వక్ష్యేత్యంతసులాఘ
వం స్ఫుటతరం చిత్రంఫలందాయజం ॥ ౩౮ ॥

టీ॥ జన్మేంద్వృక్షవశాత్ = జన్మకాలచంద్రనక్షత్రమువలన, విచింత్య=జన్మరాశిని దెలిసికొని, తాత్కాలికైః= ఆకాలసంబంధమగు, ఖచరైః= గ్రహములచేత, ఉక్తవత్ = చెప్పబడినట్లుగా, గోచార = గోచారమునకు, ఉదిత = చెప్పబడిన వర్త్మనా= మార్గముచేత, తథా = అప్రకారముగానే, దాయేశ్చ = వార్షికదశాధిపతులచేతను, తదుభయోః = ఆరెండింటియొక్క, యోగార్థసంవాదతః = ఏకీభావమును జేయుటవలన, ఆలోచ్య-ఆలోచించి, ఏకస్యైవహాయనత్సరస్య = ఒక్క సంవత్సరమునకు. అత్యంతసులాఘవం= మిక్కిలి సులభమైనట్టియు, స్ఫుటతరం=స్పష్టమైనట్టియు, చిత్రం=ఆశ్చర్యకరమైనట్టియు, దాయజం=దశాసంబంధమైన, ఫలం=ఫలమును, వక్ష్యే= చెప్పుచున్నాను.

తా॥ జన్మకాల చంద్రనక్షత్రము వలన జన్మరాశిని నిర్ణయించి దానిక తత్కాలమందు పంచాంగములో వ్రాసియున్న గ్రహములచేత జెప్పఁబడిన గోచా

మార్గమును వార్షికదశానాథుల ఫలమును విచారించి ఆరెండింటియొక్క ఫలములను సంబంధించినట్లు బాగుగా నాలోచించి, ఒక్కసంవత్సరమునకు మిక్కిలి సులభమైన దియు స్ఫుటమైనదియు నగు దశాఫలమును విశ్రమముగా జెప్పఁగడును.

## పూర్వోక్తవర్షదశానాం ఫలమగ్రే వక్ష్యతి.

శ్లో॥ వీర్యాఢ్యే దిననాయకే ధనచయం భూషాంబరం శ్రైషతే । వీర్యోనే కలిశత్రువృద్ధి మపి తద్విత్తక్షయంపీడనం । వీర్యాఢ్యే శశినీహా పూజ్యమనిశం విత్తాధికంగౌరవం । వీర్యోనేరిపువృద్ధి రోగచలనా సౌఖ్యం విరోధస్స్వకైః ॥ ౩౯ ॥

తా॥ పూర్వము జెప్పఁబడిన వర్షదశలకు ఫలమిప్పుడు చెప్పఁబడుచున్నది. సూర్యుడు బలముగలవాడైనయెడల ధనము ఆభరణములు వస్త్రములు మొదలగు వానిని వృద్ధిచేయును. బలహీనుడైన యెడల శత్రువృద్ధిధననాశనము పీడ మొదలగు ఫలములనిచ్చును, చంద్రుడు బలముకలవాడైనయెడల జనసన్మానము, ధనవృద్ధి గౌరవము, మొదలగు వానిని కలుగఁజేయును. బలహీనుడైన యెడల శత్రువృద్ధి చలనము రోగము సౌఖ్యము లేకపోవుట స్వజనములతో విరోధము మొదలగు వానిని కలుగఁజేయును. ఇక్కడ శ్లోకములో సూర్యుని గురించి మొదటి పాదములో బలము కలిగియుండగా నిచ్చునట్టి ఫలమును రెండవపాదములో బలములేని సమయమందు నిచ్చునట్టి ఫలము చెప్పబడినది. 3 వ పాదములో చంద్రునిగురించి బలము కలిగి యుండినప్పుడు ఫలమును ౪వ పాదములో బలములేని సమయమందు కలిగెడు ఫలము జెప్పబడినది. ఈవిధముగానే యిక ముందును ప్రతిశ్లోకములోను రెండేసి గ్రహములకు ఒకపాదములో బలముకలిగిన సమయమందు ఫలమును ఇంకొకపాదములో బలములేనిసమయమందు ఫలమును నాలుగుపాదములలో చెప్పబడినదిగా గ్రహించవలయును.

## అథ కుజబుధయోః బలాబలద్వివిధాంశయోః ఫలమాహ.

శ్లో॥ భూపుత్రే బలసంయుతే నృపజనప్రీతిర్జయస్స్యాత్సుఖం। వీర్యోనే ధృవభీతిపుత్రకలహ స్త్రీవైరవిత్తక్షయాః। సౌమ్యే పూర్ణగతే ప్రతాప శుభసౌఖ్యాధిక్యలాభకృత్ । వీర్యోనే సుహృదాదివైరకథాచ బ్రాహ్మణద్రోహకృత్ ॥౪౦॥

తా॥ కుజుడు బలము కలవాడై యుండినచో రాజులవలన సన్మానము జయము,

సుఖము కలుగును బలము లేకుండినేని రాజులవలన భయము పుత్రులతో కలహము స్త్రీలతో వైరము ధననాశము కలుగును బుధుడు సంపూర్ణబలము కలిగియుండిన క్షిప్రప్రాపము శుభము అధిక సౌఖ్యము లాభము మొదలగునవి కలుగును. బలము లేనియెడల సోదరులు మొదలగు వారితో వైరము కపటము బ్రాహ్మణద్రోహము చేయుట మొదలగు చెడుకార్యములు జేయుట మొదలగునవి సంభవించును

## అథ గురుశుక్రయోర్బలమాహ.

శ్లో॥ జీవేపూర్ణ బలేరథాశ్వ ధనస్యాద్బుద్ధివృద్ధిర్ధనం। హీనస్త్వేచలనంధనక్షయ మపిస్యాద్పాపదుస్సంగతీ। శుక్రేపూర్ణబలేధనాగమ యశశ్శుక్లాంబర స్త్రీ సుఖం । హీనేస్యాద్ధననాశనం రిపుభయం స్త్రీరోగకృచ్ఛాయశః ॥ ౮౧ ॥

తా॥ గురుశుక్రుల ఫలమును జెప్పబడును. బృహస్పతి బలము కలవాడై యున్నప్పుడు రథములు గుఱ్ఱములు ధనము విశేషమైన బుద్ధి మొదలగు ఫలముల నిచ్చును. బలములేనివాడైనయెడల చలనము ధననాశనము దుస్సాంగత్యము పాపము మొదలగు చెడ్డఫలముల నిచ్చును శుక్రుడు పూర్ణబలముకలవాడగునేని ధనప్రాప్తి కీర్తి తెల్లనివస్త్రములు స్త్రీసంబంధమగు సుఖము మొదలగు మంచిఫలములు కలుగును. బలములేనివాడగునేని ధననాశనము శత్రుభయము స్త్రీలకు రోగము అపకీర్తి మొదలగు చెడ్డఫలముల నిచ్చును.

## అథ శనిరాహ్వోః ఫలమాహ.

శ్లో॥ మందేపూర్ణబలేగృహాది సుఖకృద్భిల్లాధిపత్వంభవే। న్నానేవిత్తహరశ్శరీర కృశతారోగాపకీర్తిర్భవేత్ । రాహౌపూర్ణ్యా సుకర్మలాభ శుభకృచ్ఛేద్యోగవృద్ధిస్తథా । పాపత్వేసతిచాశుభం పితృమృతిర్నీచారిగోష్ఠిర్భవేత్ .

తా॥ శని రాహువుల దశాఫలమును జెప్పుచున్నాను. శని పూర్ణమైన బలముకలవాడగునేని గృహాదులు మొదలగువానివల్ల సౌఖ్యము అడవిప్రదేశమునకు నధిపతి యగుట మొదలగు ఫలములు కలుగును. బలములేనివాడగునేని ధనక్షయము శరీరము కృశించుట రోగము అపకీర్తి మొదలగు చెడ్డఫలములు కలుగును. రాహువు బలముకలవాడగునేని పుణ్యకార్యములను జేయుట శుభకార్యములను జేయుట చేయు ప్రయత్నములు వృద్ధినొందుట మొదలగు ఫలములు కలుగును. పాపుడగునేని అశుభము పితృమరణము నీచులతోటి శత్రువులతోటి సాంగత్యము మొదలగునవి కలుగును.

## అథ వార్షికలగ్న దశాఫలమాహ.

శ్లో॥ లగ్నే వార్షికకాలజే శుభఫలం మధ్యంచకష్టంభవే ద్రేక్కాణత్రితయేక్రమాత్త దధిపాత్సంబంధయోగాద్వదేత్ । ఏవంవార్షికజం దశాఫలమపిప్రోక్తం లఘుత్వంత్విదం । తత్రత్రైటబలాచ్ఛుభయుతే రూహ్యాంసుధీభిస్తదా ॥ ౪౨॥

తా॥ సంవత్సర సంబంధమగు లగ్నముయొక్క దశాఫలమును జెప్పబడును. లగ్నము సంవత్సర ప్రవేశకాల సంబంధమైనది యగునేని శుభఫలము నొసగును. మధ్యయందగునేని అధమఫలము నొసగును మూడు ద్రేక్కాణములను పరిశీలించి వాని రాశ్యాధిపత్యములవల్లను సంబంధాదులవల్లను చెప్పవలయును. అని ఈప్రకారము గ్రంథములో చెప్పబడినదికాబట్టి ఆయా గ్రహముల బలాబలమును శుభగ్రహములు కూడియుండుటకు తెలియదగునవి చక్కగా నాలోచించి విద్వాంసులు సంవత్సరప్రవేశకాలసంబంధమగు లగ్నముయొక్క దశమరూప విచారించి లగ్నదశాఫలమునూహలభముగ జెప్పవలెను.

ఇట్లు మహాకవి శ్రీ కాళిదాసునిచే రచియింపబడిన యుత్తరకాలామృతమను గ్రంథమునందు జాతకపద్ధతిలో నక్షత్రసంబంధమగు వార్షిక దశాఫలమును జెప్పినట్టి షష్ఠబిందువు సమాప్తము.

## అథ సప్తమబిందు ప్రారంభః.

### ఆదౌ ప్రశ్నానష్టజాతక సాధనమాహ.

శ్లో॥ ఏవంజన్మఖగోదయైః ఫలమిదం సర్వంవ తేజ్జాతకే తన్నోచేదథజన్మపత్రిమపివా తత్ప్రశ్నలగ్నాద్వదేత్ । ప్రశ్నేజాతకతుల్య ఏవనభవేద్భేదోథవామర్దినే । నష్టాతేఘటికాదికే గృహానవాంశాదీంశ్చ పృచ్ఛాద్వదేత్ ॥ ౧ ॥

టీ॥ ఏవం=ఈప్రకారము, జాతకే= జాతకమునందు, జన్మఖగోదయైః=జన్మకాల సంబంధమగు గ్రహస్థితులచేత, ఇదం= ఈచెప్పబడిన, సర్వం= సమస్తమైన, ఫలం=ఫలమును, వదేత్=చెప్పవలెను. జన్మపత్రమపివా = జన్మపత్రిక, తత్ = అది, నోచేత్=లేనియెడల, తత్ప్రశ్నలగ్నాత్ = అంనునుసరించి ప్రశ్నలగ్నమువల్లనైన, వదేత్= చెప్పవలయును. ప్రశ్నేః=ప్రశ్న చేయుట, జాతకతుల్యఏవ=జాతకముతో సమానమైనది. భేదః= భేదము, నభవేత్= లేదు, అథవా = అలాగుకాని

యెడల, దుర్దినే= మేఘముచే నావరింపఁబడినదగుచు, ఘటాకాదికే=ఘడియలు మొదలుగునవి, నష్టాతే= తెలియబడినవగుచుండఁగ, పృచ్ఛాత్= ప్రశ్నవలన, గ్రహనవాంశాదీన్= గ్రహసంబంధమైన నవాంశాదుల నాలోచించి, వదేత్= చెప్పవలెను.

తా॥ ప్రశ్నవలన నష్టజాతక సాధనమునుగురించి చెప్పఁబడును, జాతకముండినయెడల సారవళిందులో జెప్పఁబడినప్రకారము జన్మకాలమునందుండెడిగ్రహముల సంచారమునుబట్టి సమస్తమైన ఫలమును జెప్పవలయును. జన్మపత్రిక లేనప్పుడు ప్రశ్నలగ్నమువల్లనైన ఫలమును జెప్పవలయును. ప్రశ్నలగ్నము జాతకములో సమానమైనదేగాని భేదమేమియునులేదు. మేఘమావరించి సూర్యుడు కనపడనిసమయమందును రాత్రులయందును కాలనిర్ణయము తెలియనప్పుడు ప్రశ్నవలన నవాంశాదులను యోచించి ఫలమును జెప్పవలెను.

అథ ప్రశ్నోపయోగిత్వేన ధ్రువాంకసాధనమాహ.

శ్లో॥ ప్రశ్నార్థీఫలహేమపాణిరథవా కార్తాంతికస్యాంతికం । ప్రష్టాగత్యనవఘ్నభాస్కరమితాత్సంఖ్యామభీష్టాంవదేత్ । తామేవ ధ్రువకంప్రకల్ప్య సకలంత్రైకాలికందైవవి । ద్బ్రూయాదిష్టమనిష్టమత్రతుగురోః పాదంశరణ్యంభవేత్ ॥ ౧ ॥

టీ॥ అథవా=జాతకములేనప్పుడు, ప్రశ్నార్థీ=ప్రశ్నను జేయువాడై, ప్రష్టా=పృచ్ఛకుడు, ఫలహేమపాణిః= చేతిలో బంగారమునుగాని ఫలమునుగాని యుంచుకొని, కార్తాంతికస్య=జ్యోతిష్కునియొక్క, అంతికం= సమీపమునకు, ఆగత్య= వచ్చి, నవఘ్న= తొమ్మిదిచే గుణియింపఁబడిన భాస్కరమితాత్= పండ్రెండు పరిమితిగల సంఖ్యవలన, అనగా 9=12=108 ఈసంఖ్యలో, అభీష్టాం = ఇష్టమైన, సంఖ్యాం= సంఖ్యను, వదేత్= చెప్పవలయును. దైవవిత్=జ్యోతిష్కుఁడుతామేవ=పశ్న జేయువాడు జెప్పినట్టిసంఖ్యను, ధ్రువకం=ధ్రువకమునుగా నుంచుకొని, ఇష్టం= శుభమైనదిగాని, అనిష్టం=అశుభమైనదిగాని, త్రైకాలికం=భూతభవిష్యద్వర్తమాన కాలసంబంధమగు, సకలం = సమస్తఫలమును, బ్రూయాత్ = చెప్పవలయును. అత్రతు= ఈవిషయమై, గురోః= గురువుయొక్క, పాదం= పాదము, శరణ్యం = రక్షకమైనదగుచు, భవేత్= అగును.

తా॥ ప్రశ్న జేయువారు ఫలతాంబూల దక్షిణాదులను తీసికొని జ్యోతిష్కుని వద్దకువచ్చి నమస్కరించి యాదక్షిణతాంబూలాదులను సమర్పించి నూటయెనిమి దింటికిలోపుగా తనకిష్టమైన యొక సంఖ్యను జెప్పవలయును. సిద్ధాంతి యాసంఖ్యను ధ్రువముగా నుంచుకొని దానిబట్టి భూత భవిష్యద్వర్తమాన కాలములలో నాపృచ్ఛకునకు సంభవించునట్టి శుభఫలమునుగాని యశుభఫలమునుగాని యోచించిచెప్పవలెను.

## అథ ప్రశ్నలగ్న నవాంశ సాధనమాహ.

శ్లో॥ పూర్వోక్తాద్ధ్రువకాత్ఖగైః పరిహృతాల్లబ్ధం క్రియాద్యా
తభం। తచ్ఛేషస్త్వథవర్తమానభవనే స్యుస్తన్నవాంశాః క్రమాత్।
తత్కాలగ్రహచక్రభావవశతః ప్రష్టుశ్శుభంవాశుభం। ప్రాగ్వత్ఖేచ
రభావకారక గణాద్వీర్యాధికాత్సంవదేత్ ॥ 3 ॥

టీ॥ పూర్వోక్తాత్= పూర్వము చెప్పబడిన, ధ్రువకాత్= ధ్రువమువలన, ఖగైః= తొమ్మిదిచేత, పరిహృతాత్= భాగించుటవల్ల; లబ్ధం= లబ్ధము, క్రియాత్= మేషరాశి మొదలు, యాతభం= గడచినరాసులగును, అథ=అనంతరము తచ్ఛేషః= అప్పుడు భాగింపగా మిగిలిన శేషము, వర్తమానభవనే= అప్పుడు జరుగుచున్న రాశి యందు, తన్నవాంశాః= దానియొక్క నవాంశలు, స్యుః= అగుచున్నవి తత్కాల= అప్పటికాలమందైన, గ్రహ=గ్రహములవల్లను, చక్రభావశతః = చక్రములోనుండు రాసులవల్లను ప్రాగ్వత్=పూర్వమువలెనే, క్రమాత్=క్రమముగా, ఖేచర భావకారక గణాత్= ఖేచర=గ్రహములవల్లను, భావా=భావములవల్లను, కారకగణాత్= కారకులవల్లను, వీర్యాధికాత్= అధికబలము కలవానివల్ల, ప్రష్టుః= అడిగినవానియొక్క శుభంవా=శుభమునైన, అశుభం-అశుభమునైన, సంవదేత్=లెస్సగా చెప్పవలయును.

తా॥ పూర్వము చెప్పబడిన ధ్రువమువలన ప్రశ్నలగ్నమును దానినవాంశను సాధించుటనుగురించి చెప్పుచున్నాను అది యెట్లనగా ప్రశ్న నడుగవచ్చినవానిని 108 కి లోపుగా నీకిష్టమైనసంఖ్యను జెప్పుమనగా వానికిష్టమగు నొకసంఖ్యచెప్పును ఆసంఖ్యకే ధ్రువాంకమని పేరు ఆధ్రువాంకమును 9 చే భాగింపగా వచ్చినలబ్ధము మేషము మొదలుకొని, గడిచినరాసులగును. మిగిలిన శేషము యేసంఖ్యయగునో యన్నవనవాంశ తర్వాత రాశిలోనిదని తెలిసికొనవలయును. ఇట్లు తత్కాల లగ్నమును దానిలోని నవాంశములను నిర్ణయించి అప్పటి పంచాంగము ననుసరించి రాశి చక్ర అంశచక్రములను గ్రహములను వేసి, ఆచక్రములలోనుండు గ్రహములయొక్కయు భావములయొక్కయు కారకులయొక్కయు బలమును విచారించి దేనియొక్క బలమధికముగానుండునో దాని బలమునుబట్టి మంచి ఫలముగాని చెడ్డఫలముగాని యడుగవచ్చిన వానికి జెప్పవలయును.

ఉదాహరణము. ప్రశ్ననడుగ వచ్చినవానిని 108 లోపుగా నొక సంఖ్యను జెప్పుమనగా 79 సంఖ్యను చెప్పెనని మనము యనుకొందుము 79 ని 9చే భాగింపగా లబ్ధము (8) వచ్చెను. అప్పుడు మేషము మొదలు లెక్కపెట్టగా వృశ్చికరాశి, ఇంతవరకు గడిచిన రాసులగును తర్వాతరాశి ధనుస్సుఅగును. ఇట్లు లగ్నమును నిర్ణ

యించి పూర్వ్యధ్రువాంకమును భాగింపగా మిగిలిన శేషము 7వ సంఖ్యయగును. మేష సింహ ధనుస్సులకు మేషరాశియే నవాంశమును లెక్కపెట్టుటకు మొదలు కాబట్టి మేషము మొదలు యేడవరాశి తులయగును. కాబట్టి ధనుర్లగ్నములో తుల నవాంశ ఇట్లు లగ్నమును నవాంశమును నిర్ణయించి వాటినిబట్టి శుభాశుభ ఫలములను జెప్పవలెను.

{అథ ప్రశ్నవశా జ్జన్మకాలిక గురుస్థితిజ్ఞానం తస్మాద్వర్ష మాసాది జ్ఞానంచాహ.}

శ్లో॥ తత్ప్రష్టార్పితహేమపుష్పఫలజా సంఖ్యాధ్రువఘ్నార్క హృ। త్తచ్ఛేషోన్మితభేస్థితిస్సురగురో స్స్యాత్ప్రష్టుర్జన్మన్యథ తచ్చా రాత్తువయోనుమానభగణం సంచిత్యవర్షం పున ర్జన్మార్యాంశము ఖాచ్చమానవధ నాఢ్యార్కాచ్ఛమాసాదయః ॥ ౮ ॥

టీ॥ తత్ప్రష్టా= ప్రశ్నవడుగువానిచేత, అర్పిత = ఇవ్వబడిన, హేమ=సువర్ణము, పుష్ప=పుష్పములు, ఫలజా=ఫలములు మొదలగువానివల్లపుట్టిన, సంఖ్యా= సంఖ్య, ధ్రువఘ్న=ధ్రువాంకముచే గుణియించి. అర్కహృత్=పండ్రెండుచే భాగింపగా, తచ్ఛేష= దానియొక్క శేషముతో, ఉన్మితభే = సమానమగు రాశియందు, సురగురోః= బృహస్పతియొక్క, స్థితిః= ఉండుట, స్యాత్=అగును. అథ=అనంతరము తచ్చారాత్= ఆబృహస్పతియొక్క చారవలన, వయోనుమాన భగణాన్ = వయః = వయస్సుయొక్క, అనుమాన = ఊహించుటచేతనైన, భగణాః = రాశిగణములను, వర్షంచ = సంవత్సరమును, సంచిత్య = ఆలోచించి, పునః = తిరిగి, ఆర్యాంశముఖాత్ = బృహస్పతియొక్క అంశము మొదలగు దానివల్ల, మానవ = మనుష్యునియొక్క, దిన=దినములవల్లను, ఆఢ్య=కూర్చబడిన, అర్కాచ్ఛ=సూర్యునివల్లన, మాసాదయః= మాసములు మొదలగునవి యగును.

తా॥ ప్రశ్నకాలమువలన జన్మకాలమునందుబృహస్పతియుండురాశిని తెలిసికొనుటయు దానివల్లనే సంవత్సరముమాసము మొదలగువాని తెలిసికొనుటయును జెప్పబడును. ప్రశ్నవడుగ వచ్చినవాడు సమర్పించిన దక్షిణతాంబూలము ఫలములుపుష్పములు మొదలగువానిని మొత్తముచేయగా నాసంఖ్యయెంతయగునో యాసంఖ్యను పూర్వము జెప్పబడిన ధ్రువాంకసంఖ్యచే గుణియించి (12)చేభాగింపగా మిగిలినసంఖ్య యెంతయుండునో యాసంఖ్యను మేషము మొదలుకొని లెక్కబెట్టగా నన్నవరాశి జన్మకాలమునకుబృహస్పతియున్న

అథమేషాది తత్కాలలగ్న నవాంశరాశి వశాచ్చింతా జ్ఞానమాహ॥

శ్లో॥ మేషేపాదయుగం వృషేతు పశవస్స్యాద్గర్భచింతాయుగే రాశౌకర్కటకే భవేద్వ్యవహృతిస్స్యాద్రాజ చింతాహరౌ ॥

శ్లో॥ కన్యాయాంతువరాంగనాథట గృహేవాణిజ్యకం వృశ్చికే లగ్నేదుష్టభయం ధనుష్యపి ధనంనష్టం కవిర్నక్రిభే । కుంభేకర్మమచింతనంత్వనిమిషే స్థానస్యచింతాభవే। దేవంవీర్యయుతాద్గృహాన్న వలవాత్రోప్పచుర్జటాధారిణః ॥

తా॥ మేషము మొదలు తత్కాల జన్మరాసులవలన నవాంశ రాసులవల్లను చింతాజ్ఞానమును వివరించెదను. మేషములో ప్రశ్న వేయుట సంభవించెనేని రెండు పాదములుగల మనుష్యుల సంబంధమైనదనియు వృషభములో నైనయెడల నాలుగు కాళ్ళుగల పశువుల సంబంధమైనదనియు మిథునములో ప్రశ్న వేయబడిన గర్భచింత యనియు కర్కాటకములోనైన వ్యవహార చింతయనియు సింహములోనైన రాజచింత యనియు కన్యారాశిలోనైన పరస్త్రీసంబంధమగు చింతయు తులారాశియందైనవర్తకసంబంధమైనదనియు, వృశ్చిక రాశియైనయెడల దుష్టుల సంబంధమగు భయమును గురించియనియు, ధనుర్లగ్నమైన పోయిన ధనమును గురించియనియు, మకరమైన పాపమును గురించియనియు, కుంభలగ్నమైనయెడల కర్మలనుగురించి చింతయనియు మీనమైనయెడల స్థానచింతయనియు, నిట్లు బలముగల రాశివల్లనుగాని నవాంశము వల్లనుగాని ఫలమును విచారించి చెప్పవలెనని మునీశ్వరుల మతము.

అథస్వక్షేత్ర గతగ్రహాచ్చింతా జ్ఞానమాహ.

శ్లో॥ స్వక్షేర్కే నృపరాజ్యచింతన మథోచంద్రే తటాకాదయో । భౌమేవహ్ని నృపారిభీర్విధుసుతే వాణిజ్యకృష్యాదయః । జీవేమిత్రనృపాదయో భృగుసుతే సౌఖ్యాధికత్వర్కజే । సంస్థేమానుషచింతనం స్థిరధనం స్వక్షేత్రతోంశాదపి ॥

టీ॥ అర్కే = సూర్యుడు, స్వక్షే = స్వక్షేత్రమందుండిన, నృపరాజ్యచింతనం - రాజులు రాజ్యము మొదలగువానిగురించిన చింత, అథః = అటుతర్వాత, చంద్రే = చంద్రుడు, స్వక్షేత్రమందుండిన, తటాకాదయః = చెరువులు మొదలగునవి, భౌమే = అంగారకుడుండిన, వహ్నినృపారిభిః = అగ్నిహోత్రము రాజులు శత్రువులు మొదలగు వాటిని గురించిన భయము, విధుసుతే = బుధుడుండిన; వాణిజ్యకృష్యాదయః = వర్తక మువ్యవసాయము మొదలగునవి, జీవే = బృహస్పతియుండిన, మిత్రనృపాదయః =

స్నేహితులు రాజులు మొదలగువారు, భృగుసుతే= శుక్రుడుండిన, సౌఖ్యాధికం= విశేషసౌఖ్యము, అర్కజే= శనియుండిన, స్థిరధనం= స్థిరమగు ధనమునుగుఱించియు మానుషచింతనం= మనుష్యులనుగురించియు, విచారించుట, ఇత్థం = ఈప్రకారము స్వక్షేత్రతః= స్వక్షేత్రమువల్లను, అంశాదపి = అంశవల్లను, వక్తవ్యం=చెప్పవలెను.

తా॥ స్వక్షేత్రమందుండిన గ్రహములవలన పృచ్ఛకునియొక్క ప్రశ్నఫలమును చెప్పఁబడును. ప్రశ్నకాలమందు సూర్యుడు స్వక్షేత్రమందుండిన రాజులు రాజ్యమునుగురించియనియు, చంద్రుడుండిన చెరువులు నూతులు మొదలగువాని గురించియనియు, అంగారకుడుండిన రాజులు అగ్నిహోత్రము శత్రువులు మొదలగువాని సంబంధమగు భయమును గురించియనియు, బుధుడుండిన వర్తకము వ్యవసాయము మొదలగువాని గురించియనియు, బృహస్పతియుండిన స్నేహితులు రాజులుగురించియనియు, శుక్రుడుండిన విశేషసౌఖ్యమును గురించియనియు, శనియుండిన స్థిరమగు ధనము మనుష్యుల గురించియనియు, ప్రశ్నచేసినవానియొక్క మనోగతమగు కార్యములను తెలిసికొనవలయును. ఇట్లు సూర్యాది గ్రహములు స్వక్షేత్రమందుండుట వల్లను లేక స్వక్షేత్రాంశ యందుండుటవల్లనైనను విచారించి చెప్పవలయును. స్వక్షేత్రమందు నిద్దరు మగ్గురుండినయెడల స్వక్షేత్రము స్వాంశము రెండింటియందునున్న వాని బలమును విచారించి చెప్పవలయును.

అథస్వోచ్చాదిస్థానస్థితివశాత్ఫల భేదమాహ.

శ్లో॥ ఏవంస్వోచ్చగతే ఖగేద్విగుణితం నీచేతుశూన్యంఫలం। మిత్రర్క్షేర్ధమితం ఫలంప్రభవతి స్యాద్భేసమేహీనతః। ద్వావచ్చర్క్షగతౌతథాస్వగృహగౌతద్వర్గ వీర్యాధికా। త్సంజ్ఞాకారకభావయోగజవశాత్ప్రశ్నంవదేద్బుద్ధిమాన్॥

టీ॥ ఏవం= ఈప్రకారము, ఖగే=గ్రహము, స్వోచ్చగతే= తన యుచ్చక్షేత్రమందుండిన, ద్విగుణితం= రెండురెట్లు ఫలముకలుగును. నీచేతు=నీచరాశియందుండిన, ఫలము శూన్యమ=లేకపోవును. మిత్రర్క్షే= మిత్రక్షేత్రమందుండిన, ఫలం= ఫలము, అర్ధమితం=సగము కలుగును. సమేభే= సమక్షేత్రమందుండిన, హీనతః= స్వల్పఫలము, స్యాత్= అగును, ద్వౌ= రెండుగ్రహములు, ఉచ్చర్క్షగతౌ = ఉచ్చరాశియందుండినను, తథా= ఆప్రకారమే, స్వగృహగౌ = స్వక్షేత్రమందుండినను, తద్వర్గవీర్యాధికాత్= సప్తవర్గము కలవారిలో బలమధికముగా నుండువాని విచారించి చెప్పవలయును. ఇత్థం= ఈప్రకారము, సంజ్ఞా= సంజ్ఞలవల్లను, కారక=కారకముల వల్లన, భావ=భావములవల్లను, యోగజవశాత్ = యోగమువల్లను, బుద్ధిమాన్=బుద్ధిమంతుడైనవాడు, ప్రశ్నం= ప్రశ్నఫలమును, వదేత్= చెప్పవలెను.

తా॥ ప్రశ్నకాలమునకు నేగ్రహము బలిష్ఠముగానుండునో యాగ్రహమే

ఫలమునిచ్చును కాఁబట్టి యట్టి గ్రహముచ్చరాశి యందుండిన తలచినకార్యము రెండు రెట్లు ఫలముగలదియగును, నీచరాశియందుండిన ఫలము శూన్యమగును. మిత్రక్షేత్రమందుండిన సగమే ఫలము కలుగును. సమక్షేత్రమందుండిన తక్కువఫలముకలుగును. మరియు రెండుగ్రహము లుచ్చరాసుల యందుండినను స్వక్షేత్రమందుండినను ఆగ్రహములయొక్క సప్తవర్గబలమును విచారించి వారిలో నధికబలము కలవానినిబట్టి యేఫలమును చెప్పవలయును. ఇట్లు గ్రహములయొక్కయు రాసులయొక్కయు సంజ్ఞ కారకము భావము యోగము మొదలగువానిని విచారించి వాటికి ననుగుణముగా బుద్ధిమంతుడగు జ్యోతిష్కుఁడు ఫలమును విచారించి చెప్పవలయును.

## అథ ఉచ్చాదిస్థితి వశాదవధి జ్ఞానమాహ.

శ్లో॥ తత్కాలేఖచరే స్వతుంగ భవనేతన్నాడికాభిర్భవే । త్కార్యంస్వగృగతేది నైరపి సుహృద్భేమాస కోబ్దోన్యథా। కార్యం నేతరథాఖలేక్షణయుతే లగ్నేశనాతుంగగే । చేచ్ఛీఘ్రింబలవచ్ఛుభేక్షణయుతే లగ్నేశకార్యేశ్వరా ॥

టీ॥ తత్కాలే= ఆప్రశ్న కాల సంబంధమైన, ఖచరే= గ్రహము, స్వతుంగ భవనే= తన యుచ్చరాశియందుండిన, తత్= ఆకార్యము, నాడికాభిః= ఘడియల చేత, భవేత్= అగును. స్వగృగతే = స్వక్షేత్రమందుండిన, కార్యం = కార్యము, దినైరపి= దినములచేత నగును. సుహృద్భే=మిత్రక్షేత్రమందుండిన మాసకః = నెల లమీదనగును, అన్యథా= సమక్షేత్రమందుండిన, కార్యం=కార్యము, అబ్దః=సంవత్సరము గడువుగలది, ఇతరథా= మరియొకవిధముగా, ఖలేక్షణయుతే=పాపగ్రహముల యొక్క చూపుకూడిక యుండినయెడల, కార్యం = కార్యము, నస్యాత్= కాదు, శనా= శని, లగ్నగే=లగ్నమందున్న వాడగుచుండగా, తుంగగే=ఉచ్చరాశియందుం డె వేని, శీఘ్రం= కార్యము త్వరగానగును, లగ్నేశ=లగ్నాధిపతియు,కార్యేశ్వరా= కార్యాధిపతియు, బలవత్=బలముగల, శుభ = శుభగ్రహములయొక్క, ఈక్షణ యుతే= చూపుకూడిక కలవారగునేని, శీఘ్రం= త్వరగానగును.

తా॥ ప్రశ్న కార్యాధిపతి యుచ్చాదిరాసుల యందుండినపుడెంత కాలమునకు కార్యమగునదియు జెప్పుచున్నాడు. ప్రశ్నఫలకర్త ప్రశ్నకాలమునకు తనయుచ్చక్షేత్రమందుండిన కొన్ని ఘడియలలోనే కార్యమగును. స్వక్షేత్రమందుండిన కొన్ని దినములకు కార్యమగును. మిత్రక్షేత్రమందుండిన కొన్నిమాసములకు కార్యమగును. సమక్షేత్రమందుండిన సంవత్సరము పిమ్మట కార్యమగును. ఇదిగాక పాపుల దృష్టి కూడిక మొదలగునవి కలిగియుండినయెడల కార్యముకాదు. మరియు శని పాపగ్రహమైనను లగ్నమందుండి యాలగ్నము వానికి నుచ్చక్షేత్రమై యుండినను లగ్నాధి

పతియు కార్యాధిపతియు బలవంతులగు శుభగ్రహముల దృష్టి కూడిక సంబంధము కలిగియుండినను ప్రశ్న కార్యము శీఘ్రముగా నగునని చెప్పవలయును.

## అథదిగారూఢచక్రం నిరూపయతి.

శ్లో॥ ఖాంగాజ్యాశలవాత్మకం కుపలయం తద్ద్వాదశారంభవేత్। తత్రతస్యుర్నవమాంశ జావసువియచ్చంద్రా స్థిరాకుండలీ। తద్దిక్షుద్వితయావిదిక్షుచ భవేదేకైకకం మేషతః। ప్రాగాద్యాః క్రమతఃఖగాన్ గణితజాన్ రాశ్యంశగాంత్సంలిఖేత్॥

టీ॥ ఖాంగాజ్యాశలవాత్మకం, ఖ= సున్న, అంగ= ఆరు, అజ్యాశ=మూడు, లవాత్మకం= భాగములు కలిగిన. కుపలయం= భూవృత్తమగును, అనగా అక్షరములతో చెప్పబడిన యంకెలను ఎడమవైపుగా లిఖింపవలయును కాబట్టి పైనచెప్పబడిన యక్షరములవలన 360 అను సంఖ్యయగును తత్= ఆమూడువందల అరువై భాగములుగల చక్రము, ద్వాదశారం= పండ్రెండు గళ్లుకలది, భవేత్=అగును, తత్ర=ఆచక్రమునందు, పండ్రెండు రాసులుకలవై యున్నందున, నవమాంశకాః = రాశికి తొమ్మిది యంశలు చొప్పున, వసువియచ్చంద్రాః, వసు = యెనిమిది, వియత్ = సున్న, చంద్రాః= ఒకటి, అనగా 108 అంశలు, స్యుః= అగుచున్నవి, ఇయం=ఇది స్థిరాకుండలీ= స్థిరచక్రము, తద్దిక్షు= ఆచక్రములో దిక్కులందు, ద్వితయం= రెండేసియు, విదిక్షు= విదిక్కులందు, ఏకైకకం= ఒక్కొక్కటియు, మేషతః= మేషము మొదలు, ప్రాగాద్యాః=తూర్పుదిక్కు మొదలిడి రాసులను, లిఖించవలయును క్రమతః= వరుసగా, గణితజాన్= గణితమువలన వచ్చిన, రాశ్యంశగాన్ = రాసులను అంశలను పొందిన, ఖగాన్= గ్రహములను, సంలిఖేత్= వ్రాయవలెను.

తా॥ దిక్కుల ననుసరించి యారూఢచక్రమునునిరూపించుచున్నాను. పీఠాలి భూప్రదేశమందు వృత్తాకారముగా నొక చక్రమునువేసి దానిలో మేషము మొదలు పండ్రెండు రాసులకును పండ్రెండు గళ్ళను గీయవలయును. ఒక్కొక్కగదికి 9 నవాంశములు చొప్పున 108 నవాంశములును 30 భాగములు చొప్పున 360 భాగములునుగల యొక చక్రమగును. ఒక్కొక్క గదియనగా పండ్రెండుగదులును మేషము మొదలు పండ్రెండు రాసులని తెలిసికొనవలయును ఆచక్రములో తూర్పు మొదలగు దిక్కులయందు మేషము మొదలుకొని రెండేసి రాసులను ఆగ్నేయము మొదలగు నవి దిక్కులయందు నొక్కొక్కరాశిని అనగా తూర్పు దక్షిణము పడమర ఉత్తరంబను నాలుగు దిక్కులందు యెనిమిది రాసులను ఆగ్నేయము నైఋతి వాయవ్యము యీశాన్యము ఈవిదిక్కులందు యెనిమిది రాసులను ఆగ్నేయము నైఋతి వాయవ్యము యీశాన్యము ఈవిదిక్కులందు నొక్కొక్కరాశిని వ్రాసి యారాసులలో పంచాంగ

సిద్ధాంత ప్రకారము నేర్పడిన గ్రహములను వాని యంశములను లిఖించి వాటివల్లా ఫలాఫలములను జెప్పవలయును.

అథ పూర్వోక్తదిగారూఢ చక్రవశాత్ప్రశ్న ఫలస్యాహ.

శ్లో॥ యోవైపుష్పఫలాది పాణిలసితో మర్త్యోహియస్మిన్ గృహే । తిష్ఠన్ పృచ్ఛతితద్గృహంత్వభిహితం కోష్ఠందిగారూఢకం । తస్మాత్ఖేచరదృష్టియోగవశతః ప్రశ్నం శుభంవాశుభం । ప్రశ్నేష్వప్యఖిలేషుకార్యపతను స్థానేశ్వరాభ్యాం వదేత్ ॥

టీ॥ పుష్పఫలాది పాణిలసితః, పుష్పములు ఫలములు మొదలగునవి చేతియందుంచుకొనిన, యోవై= ఏ, మర్త్యః=మనుష్యుడు, యస్మిన్‌గృహే=ఏగృహమందు తిష్ఠన్= ఉన్నవాడగుచు, ప్రిచ్ఛతి=ప్రశ్న నడుగుచున్నాడో, తద్గృహం= ఆగృహము, దిగారూఢకం= దిగారూఢమను, కోష్ఠకం=గదియని, అభిహితం= చెప్పబడినది. తస్మాత్= ఆదిగారూఢగదివల్ల, ఖేచర= గ్రహములయొక్క దృష్టియోగవశతః చూపుకూడికవల్లను, ప్రశ్నే=ప్రశ్నయందు, శుభంవా= శుభఫలమునైనా, అశుభంవా= అశుభఫలమునైనా, వదేత్= చెప్పవలయును. అఖిలేషు=సమస్తమైన, ప్రశ్నేష్వపి= ప్రశ్నలయందును, కార్యప= కార్యాధిపతివల్లను, తనుస్థానేశ్వరాభ్యాం= లగ్నాధిపతివల్లను, వదేత్ = చెప్పవలయును.

తా॥ పూర్వము చెప్పబడిన దిగారూఢచక్రమువలన ప్రశ్నయొక్క ఫలమును చెప్పువిధానమును జెప్పుచున్నాను. ప్రశ్న నడుగువాడు చేతిలో పుష్పములు ఫలములు దక్షిణ మొదలగువాని నుంచుకొని భూమియందు పండ్రెండు రాసులుంగల దానిగా గీయబడిన చక్రమునకు నేరాశివైపునుండి ప్రశ్న జేయునో యారాశియే దిగారూఢమను రాశియని చెప్పబడినది కాబట్టి అట్టి దిగారూఢరాశివల్లను గ్రహములుండుట చూచుట మొదలగువానివల్లను శుభఫలమునుగాని యశుభఫలమునుగాని విచారించి చెప్పవలయును. మరియు నేవిషయమై ప్రశ్న జేసినప్పటికిని లగ్నాధిపతియొక్కయు బలమును విచారించి చెప్పవలయును. కార్యాధిపతియనగా ప్రశ్న జేయువా డేకార్యమునుగురించి యడుగునో పూర్వము చెప్పబడిన ప్రకారమాయాకార్యములకు నాయాస్థానములు చెప్పబడినవి కాబట్టి అట్టి స్థానమునకు కారకత్వముగల గ్రహము కార్యాధిపతియని చెప్పబడును. దేహమునుగురించి లగ్నము ధనమునుగురించి ద్వితీయము సోదరులనుగురించి తృతీయము వాహనమాతాదులను గురించి చతుర్థము సంతానాదులగురించి పంచమము. ఈవిధముగా పండ్రెండు రాసులను ఆయా కార్యస్థానములుగా చెప్పబడినవి కాబట్టి అట్టి స్థానాధిపతి బలమును విచారించి చెప్పవలయునని భావము.

అథప్రశ్నోపయోగి తత్కాలచంద్ర సాధనమాహ.

శ్లో॥ అంకఘ్నానఖభాజితాశ్చ ఘటికాసూర్యోదయాత్ప్రా

శ్నికే । తల్లబ్ధంభఘటీముఖం స్ఫుటవిధుః ప్రశ్నోపయోగీ భవేత్ । పంచాంగస్థ విధుస్ఫుటశ్చ భగటీవక్త్రైస్తు సంజ్ఞాతయో । స్థూలసూక్ష్మ ఇతీరితా తదుభయోర్గ్రాహ్యంనవాంశాదికం.

టీ॥ ప్రాశ్నికే= ప్రశ్న జేయు సమయమందు, సూర్యోదయాత్= సూర్యోదయము మొదలుకొని, ఘటికాః= తత్కాలఘడియలు, అంకఘ్నాః=తొమ్మిదిచేగుణింపబడినవై, నఖభాజితాశ్చ= యిరువైచే భాగింపబడగా, తల్లబ్ధం= అప్పుడు రాబడిన లబ్ధము భఘటీముఖం= నక్షత్రముయొక్క ఘడియలు విఘడియలు, స్ఫుటవిధుః= స్ఫుటచంద్రుడై, ప్రశ్నోపయోగ= ప్రశ్నకు నుపయోగించువాడు, భవేత్=అగును, పంచాంగస్థ= పంచాంగములోనుండు, విధుస్ఫుటశ్చ = స్ఫుటచంద్రుడును, భఘటీవక్త్రైః= నక్షత్ర ఘడియలుగల చంద్రుడు, స్ఫుటః= స్ఫుటమైనవాడు, భవేత్= అగును. తయోః= ఆ యుభయులకును, స్థూలఇతి=స్థూలచంద్రుడనియు, సూక్ష్మఇతి సూక్ష్మచంద్రుడనియు, సంజ్ఞా=గుర్తు. ఈరితా= చెప్పబడినది. తదుభయోః= ఆచంద్రులిరువురకు, నవాంశాదికం= నవాంశ మొదలగునవి, గ్రాహ్యం= గ్రహించతగియుండును.

తా॥ ప్రశ్నకు నుపయోగమైనందున తత్కాలమునందు చంద్రుని సాధించు విషయము జెప్పుచున్నాను. సూర్యోదయము మొదలు ప్రశ్న చేయు సమయమువరకు గడచిన ఘడియలు విఘడియలు నెన్నియగునో వాటిని తొమ్మిదిచే గుణించి యిరువైచే భాగింపగావచ్చిన లబ్ధఘటికా విఘటికలు ప్రశ్నకు నుపయోగియగు చంద్రుడగును. ఈతడు స్థూలచంద్రుడని చెప్పబడెను. మరియు ప్రశ్నకాలమువరకు పంచాంగ సిద్ధాంతప్రకారము అశ్విని మొదలు అప్పుడు జరుగుచుండు నక్షత్రములో తత్కాలమునకు గతించిన ఘటికా విఘటికలవరకు నెన్ని ఘడియలగునో యాసంఖ్య స్ఫుట చంద్రుడగును. ఈతడు సూక్ష్మచంద్రుడని చెప్పబడెను. ఇట్లు స్థూల సూక్ష్మచంద్రులను నిర్ణయించి వారుభయులకు నవాంశ ద్వాదశాంశాదులను స్థిరపరచుకొనిదాంవలన ఫలాఫలములను చెప్పవలయును.

అథస్థూలచంద్రోపరిగ్రహాద్దృష్టివశాత్తదీయ నవాంశవశాచ్చ
పృచ్ఛక చింతాజ్ఞానమాహ.

శ్లో॥ స్థూలేందౌత్వప కేంద్ర సౌమ్యగురుదృష్టే జీవచింతాభవే
ద్ధాతుర్భూమిజసైంహికేయ రవిజైర్మూలం సితార్కేక్షితే । మిశ్రం

జీవసితాగుభిస్త్వథ పునశ్చేద్వ్యంఘ్రి చింతాతులా । కన్యాయుగ్మ
నవాంశకేంఘ్రి బహుళంకర్కాళి మీనాంశకే ॥

తా॥ స్థూలేందౌ- స్థూలచంద్రుడు, అపరేందు- సూక్ష్మచంద్రునిచేతను సౌమ్య= బుధునిచేతను, గురు=బృహస్పతిచేతను, దృష్టే= చూడబడినవాడగుచుండగా, జీవచింతా= జీవచింత, భవేత్=అగును, భూమిజ= అంగారకునిచేతను, సైంహికేయ= రాహుచేతను, రవిజైః= శనిచేతను, దృష్టే= చూడబడగా, ధాతుః= ధాతుచింతయగును, సిత= శుక్రునిచేతను, అర్క= సూర్యునిచేతను, ఈక్షితే= చూడబడుచుండగా, మూలం=మూలచింతయగును. జీవ=బృహస్పతిచేతను, సిత = శుక్రునిచేతను, అగుభిః= రాహువుచేతను, దృష్టే= చూడబడుచుండగా, మిశ్రం=మిశ్రమమగు చింతయగును, అథపునః= అటుపిమ్మట, తులాకన్యా యుగ్మనవాంశకే = తుల కన్య మిధున నవాంశములయందు స్థూలచంద్రుడుండినయెడల, ద్వ్యంఘ్రిచింతా = ద్విపాద చింతయగును. కర్కాళిమీనాంశకే= కర్కటకము వృశ్చికము మీనముల నవాంశలయందుండెనేని, అంఘ్రిబహుళం= బహుపాదములుగల జంతువిషతామగు చింతయగును.

తా॥ స్థూలచంద్రుని నితరగ్రహములు చూచుటవల్లను సూలచంద్రుని సంబంధమగు నవాంశవల్లను ప్రశ్న జేయువానియొక్క మనోగతవిషయమును తెలిసికొనుటను చెప్పుచున్నాను. స్థూలచంద్రుని స్థూలచంద్రుడు బుధుడు బృహస్పతియు చూచుచుండిన జీవచింతయనియు అంగారకుడు రాహువు శని చూచుచుండిన ధాతుచింతయనియు శుక్రుడు సూర్యుడు చూచుచుండిన మూలచింతయనియు బృహస్పతిశుక్రుడు రాహువులచేత చూడబడుచుండగా జీవధాతు మూలములయొక్క మిశ్రమమగుచింతయనియు నెఱుంగవలయును. మరియు స్థూలచంద్రుడు తుల కన్య మిధున నవాంశములయందుండెనేని రెండుపాదములుగల జంతుసంబంధమగు చింతయనియు కర్కాటకము వృశ్చికము మీనము నవాంశలయందుండెనేని బహుపాదజంతుసంబంధమగు చింతయనియు నెఱుంగవలయును. ఇక్కడ చింతయనగా నడుగదలచిన మనోగతమగు నభిప్రాయము.

శ్లో॥ చాపాంశేచఘటాంశకే చరణహీనామేష సింహాంశకే ।
నక్రోక్షాంశగతేచతుష్పద ఇహస్థూలేందు నందాంశకాత్। ద్రేక్కా
ణత్రితయే క్రిమాత్రపతిగృహే బాలాతథాయౌవనా । వృద్ధాచేతి
వదంతి పూర్వమున యోవస్థాత్రియం ప్రశ్నకే ॥

టీ॥ చాపాంశేచ= ధనురంశయందును, ఘటాంశకే= కుంభాంశయందునుండిన యెడల, చరణహీనా= పాదములులేని పదార్థములు, మేషసింహాంశకే= మేషసింహాంశలయందును, నక్ర= మకరాంశయందును, ఉక్షాంశే= వృషభాంశయందును, గతేన= నూలచంద్రుడుండగా, చతుష్పదః=నాలుగు కాళ్ళుగల జంతువులు. ఇహ=ఈప్రశ్న కార్యవిషయమై, మూలేందు= స్థూలచంద్రునియొక్క, నవాంశకాత్ = నవాంశములవల్ల కలుగును. ప్రతిగృహే= ప్రతి రాశియందును, క్రమాత్= వరుసగా, ద్రేక్కాణత్రితయే=మూడు ద్రేక్కాణములయందును బాలా = బాలావస్థయనియు తథా- ఆప్రకారముగానే, యౌవనా=యౌవనావస్థయనియు, వృద్ధాచ= వృద్ధావస్థయనియు, ఇతి=ఈప్రకారము, ప్రశ్నకే=ప్రశ్నకార్యవిషయమై, అవస్థాత్రయం= మూడు అవస్థలని, పూర్వమునయః= పూర్వమునీశ్వరులు, వదంతి= చెప్పుచున్నారు.

తా॥ ధనురంశయందు కుంభాంశయందు మూలచంద్రుడుండెనేని పాదములులేని వస్తువుల విషయమై ప్రశ్న జేయబడెననియు మేష సింహ మకర వృషభాంశలయందుండెనేని నాలుగు పాదములుగల జంతువుల విషయమై ప్రశ్న జేయబడెననియు నెరుంగవలయును. ఈప్రకారము మూలచంద్రుని నవాంశమువలన కలుగునని తెలిసికొనవలయును. మరియు పూర్వ మునీశ్వరులు ప్రశ్నకార్య విషయమై చెప్పిన దేమనగా ప్రతి రాశియందును మూడు ద్రేక్కాణములుండును కాబట్టి మొదటి ద్రేక్కాణమునందు ప్రశ్న జేయబడెనేని బాల్యావస్థయనియు రెండవ ద్రేక్కాణమందగునేని యౌవనావస్థయనియు మూడవద్రేక్కాణమందగునేని వృద్ధావస్థయనియు ప్రశ్నకార్య విషయమై మూడవస్థలని చెప్పిరి

## అథముష్టిగతస్యవస్తునో రూపాదిజ్ఞానమాహ.

శ్లో॥ మేషాదేశ్చరభం స్థిరంద్వితను భంగర్భాహ్వయాన్యశ్చరా । ద్వారాస్స్యు స్థిరరాశయో ద్వితనుగా బాహ్యాఃక్రమాద్రాశయః । గర్భద్వార భయోస్తతస్త్వితర భేస్యాద్దక్షిణే వామకే । హస్తేవస్తు వినిర్దిశేన్ముహురితిస్యాన్ముష్టి చింతావిధౌ ॥

టీ॥ మేషాదేః=మేషరాశి మొదలుకొని, చరభం=చరరాశియనియు, స్థిరం= స్థిరరాశియనియు, ద్వితనుభం= ద్విస్వభావ రాశియనియు, ముహుః= మాటిమాటికి, చెప్పబడినవి. చరాః= చరరాసులు, గర్భాహ్వయాః= గర్భసంజ్ఞ కలవియనియు, స్థిరరాశయః= స్థిరరాసులు, ద్వారాః= ద్వారసంజ్ఞ కలవియనియు, ద్వితనుగాః = ద్విస్వభావరాలు, బాహ్యాః = బాహ్యసంజ్ఞకలవియనియు, క్రమాత్ = వరుసగా, రాశయః= పండ్రెండు రాసులును, స్యుః=అగుచున్నవి. గర్భద్వారభయోః=గర్భద్వార రాసులయందు, దక్షిణేహస్తే= కుడిచేతియందనియు, ఇతరః=అటు పిమ్మట

రభే= ద్విస్వభావ రాసులయందు, వామే=యెడమ హస్తమునందనియు, వస్తువును, వినిర్దిశేత్ = నిశ్చయించి చెప్పవలయును, ఇతి= ఈప్రకారము, ముష్టిచింతావిదో= పిడికిటిలోనుండు వస్తువును తెలిసికొనుటయందు, స్యాత్ = అగును.

తా॥ పిడికిలోనుండు వస్తువును తెలిసికొనేవిషయము జెప్పుచున్నాను మేషము మొదలుమీనపర్యంతము చరరాశియనియు స్థిరరాశియనియు ద్విస్వభావరాశియనియు మాటిమాటికి జెప్పబడినవి. అనగా మేషముకర్కటము తుల మకరరాసులు చరరాసులనియు వృషభము సింహము వృశ్చికము కుంభము స్థిరరాసులనియు మిథునము కన్య ధనుస్సు మీనము ద్విస్వభావ రాసులనియు నెఱుంగవలయును. ఇట్లు చెప్పబడిన చరరాసులు గర్భసంజ్ఞ కలవియనియు స్థిరరాసులద్వార సంజ్ఞ కలవియనియుద్విస్వభావరాసులు బాహ్యరాసులనియు తెలిసికొనవలయును. గర్భద్వార రాసులగు కాలములో ప్రశ్న జేసినయెడల వస్తువు కుడిహస్తములో నున్నదనియు బాహ్యరాసులగు కాలములో ప్రశ్న జేసిన వస్తువు యెడమచేతిలో నున్నదనియు తెలిసికొనవలయునని పిడికిటిలోనుండు వస్తువును తెలిసికొనేవిషయము చెప్పిరి.

శ్లో॥ ఏవంముష్టిగతస్య వస్తునఇహ స్యాత్ప్రస్వ దీర్ఘాదికం। రాశేర్మానవశాద్భవేయు రథతద్రూపాద యస్తంశతః। రాశిస్థగ్రహసౌమ్యపాప వశత స్తత్సౌమ్యపాపత్వకే। భూమ్యాకాశ జలాదిషు ప్రసరణం తద్ఘాతుకత్వాదికం॥

టీ॥ ఇహ=ఇప్పుడు, ఏవం= ఈప్రకారము, ముష్టిగతస్య= పిడికిటనున్నట్టి, వస్తునః= వస్తువుయొక్క, ప్రస్వదీర్ఘాదికం= పొట్టిపొడుగు మొదలగునది, రాశేః= రాశియొక్క, మానవశాత్ = ప్రమాణమువలన, స్యాత్=అగును, అథ= అనంతరము తద్రూపాదయస్తు= రూపము మొదలగునవి, అంశతః= నవాంశవల్లను, భవేయుః= అగుచున్నవి. రాశిస్థ= రాసులయందుండినట్టి, గ్రహ= గ్రహములయొక్క, సౌమ్యపాపవశతః= శుభత్వము పాపత్వమునుబట్టి, తత్ = ఆవస్తువుయొక్క, సౌమ్యపాపత్వకే= శుభత్వ పాపత్వములు తెలియబడును. భూమ్యాకాశజలాదిషు = భూమి ఆకాశము జలము మొదలగువాటియందు, ప్రసరణం= సంచరించుట, తత్=ఆజంతువులయొక్క, ఘాతుకత్వాదికం= క్రూరత్వము మొదలగునవి, జ్ఞాయంతే = తెలియబడుచున్నవి.

తా॥ ఇట్లు రాసులయొక్క ఘటికా ప్రమాణమువలన చేతిలోనుండు వస్తువుయొక్క పొట్టి పొడుగులను నిర్ణయించవలయును. మరియు రాసులయొక్క నవాంశలవల్లను ఆరాసులయందుండు గ్రహములయొక్క క్రూరత్వము సాధుత్వము శుభత్వముదుష్టత్వము మొదలగువానివలన జీవములనుగురించిన ప్రశ్నయగునేని ఆజంతువులు

కూడ దుష్ట సాధుస్వభావములు కలవియగునని కాని వాటివర్ణములు గురించి కాని భూమ్యాకాశ జలాదులయందు సంచరించు విషయమైగాని తెలిసికొనవలయును.

## అథావధి జ్ఞానమాహ.

శ్లో॥ పూర్వోక్తం ధ్రువమక్షహృత్యు నయనాగ్న్యబ్ధ్యక్షశేషే క్రమాత్ నాడీవాసర ఘస్రమాసశరద స్తల్లబ్ధ యుక్పంచధా। స్థాప్యాస్తా ధ్రువకః ఖతర్క ఖగుణాశ్వ్యార్క భమద్భిర్హృతః తత్ర ప్రస్తుత కాలావధిర్భవతి తత్సర్వేషు కార్యేష్వపి॥

టీ॥ పూర్వోక్తం=పూర్వము చెప్పబడిన, ధ్రువం=ధ్రువము, అక్షహృత్ = అయిదుచేత భాగింపబడినదై, కునయనాగ్న్యబ్ధ్యక్షశేషే, కు= ఒకటి, నయన=రెండు అగ్ని= మూడు, అబ్ధి= నాలుగు, అక్ష= అయిదు, శేషే= మిగులు కలుగుచుండగా, క్రమాత్= వరుసగా, నాడీవాసర ఘస్రమాసశరదః, నాడీ= ఘడియలు, వాసర= తిథులు, ఘస్ర=వారములు, మాస= నెలలు, శరదః= సంవత్సరములు, భవేయుః= అగును, తల్లబ్ధయుక్= దానియొక్క లబ్ధముతో కూడిన, అసౌ=ఈ, ధ్రువకః=ధ్రువము, పంచధా= అయిదుచోట్ల, స్థాప్యః= ఉంచబడినదై ఖతర్క= అరువైచేతను ఖగుణ= ముప్పైచేతను, అశ్వ= ఏడింటిచేతను, అర్క పండ్రెండుచేతను, భమద్భిః అరువైచేతను, హృతః= భాగింపబడినదై, తత్=అది, సర్వేషు=సమస్తమైన, కార్యేష్వపి= కార్యములయందును, తత్రైత్=అయా, ప్రస్తుతకాలావధిః= ప్రస్తుత కార్యములకు గడువు, ఉక్తః= చెప్పబడినది.

తా॥ ఎంతకాలమునకు ప్రశ్నకార్యమగునదియు జెప్పుచున్నాను. ప్రశ్న భాగములో ధ్రువక విషయములో జెప్పబడినప్రకారము ధ్రువాంకము నొకచోటుబెట్టు కొని దానిని 5 చే భాగింపగా శేషము 1-2-3-4-0 ఈ యంకెలలో నేదోయొకటి మిగులునుకాబట్టి 1 మిగిలిన ప్రశ్న జేయబడిన కార్యము కొన్ని ఘడియలలో నగు ననియును 2మిగిలిన కొన్ని దినములలో నగుననియు 3మిగిలిన కొన్ని వారములలోనగు ననియు 4 మిగిలిన కొన్ని మాసములలోననియు 0 అనగా 5 మిగిలిన సంవత్సరము మైగా నగుననియు చెప్పవలయును. మరియు నిట్లుభాగింపగా ఘడియలు తిథులు వారములు మాసములు సంవత్సరములు అను అయిదింటిలో నేది ప్రస్తుతాంశమగు అంకె మిగిలినదో యాయంకెను నొకచోట నుంచుకొనవలయును. మరియు 5 చే భాగింపగా వచ్చినలబ్ధమును పూర్వము జెప్పబడిన ధ్రువాంకములో కలుపవలయును. తర్వాత పూర్వము ప్రస్తుతాంశముగా రాబడి వ్రాసియుంచుకొనబడిన యంకె ఘడి యల సంబంధమైనది యగునేని 60 చేతను తిథులగునేని 30 చేతను వారమగునేని 7

చేతను మాసమగునేని 12 చేతను సంవత్సరమగునేని 60 చేతను లబ్ధముతో జేర్చబడిన పూర్వోక్త ధ్రువాంకమును భాగింపగా నెంతశేషము మిగులునో ఆ శేషమునుబట్టి అన్నిగడియలలోను విఘులలోను వారములలోను మాసములకు సంవత్సరములకు ప్రశ్న జేయబడిన కార్యమగునని వానివాని భాగారింపగా మిగిలిన శేషమునుబట్టి కాలము యొక్క అవధినికూడ తెలిసికొనవలయును.

{ అథలగ్నప కార్య పయోస్సంబంధవశాత్సకల ప్రశ్నసాధార ణ్యేన ప్రశ్నఫల జ్ఞానమాహ. }

శ్లో॥ ప్రాగ్వల్లగ్నపకార్యపౌ శుభఖగౌ సుస్థానగౌచేన్మిథో। దృష్టౌతౌతుకయాచి దర్కలనతో దృష్ట్వాధికారత్రయాత్ । భావం భావపతించ కారకమపీహాలోచ్య తత్తాదృశం । పూర్వోక్తావధితః ఫలంతుకథయేద్వా మధ్యవర్తీ వశాత్ ॥

టీ॥ ప్రాగ్వత్ = పూర్వమువలెనే, లగ్నపకార్యపౌ=లగ్నాధిపతి కార్యాధిపతులు, శుభకగౌ=శుభగ్రహములై, సుస్థానగౌ= శుభక్షేత్రమందున్న వారలగుచు అర్కలవతః= పండ్రెండు భాగములలో, కయాచిత్= ఏదోనొకటియగు, దృష్ట్యా= దృష్టిచేత, మిథః=ఒకరినొకరు, దృష్టౌచేత్=చూడబడుచుండు వారగునేని, తౌతు = ఆలగ్నాధిపతి కార్యాధిపతులు, అధికారత్రయాత్= ఉత్తమమధ్యమాధమాధికార భేదమువలన, భావం=భావమును, భావపతించ= భావాధిపతిని, కారకమపి= కారకత్వమును, ఇహ=ఇచ్చటను, ఆలోచ్య= ఆలోచించి, తత్=ఆప్రశ్నను, తాదృశం అటువంటి గుణముకలదానిగా, కథయేత్= చెప్పవలయును, ఫలంతు = ఫలమునైతే, పూర్వోక్తావధితః=పూర్వము చెప్పబడిన అవధివల్లనుంచియైనను. మధ్యవర్తివశాద్వా మధ్యనుండు గ్రహమువల్లనుంచియైనను, కథయేత్ = చెప్పవలయును.

తా॥ లగ్నాధిపతి కార్యాధిపతులయొక్క సంబంధమువలన సమస్తమైన ప్రశ్నములకుసాధారణముగాఫలమునుజెప్పుచున్నాను. లగ్నాధిపతియును కార్యాధిపతియును స్వతహాగాశుభగ్రహములై శుభస్థానమందున్న వారలగుచు నాయిరువురు 12 భాగములకులోపుగానుండి యేదోయొక దృష్టిచే నొకరినొకరుచూచుకొనుచు నుత్తమమధ్యమ అథమాధికారములలో నేదోయొక యధికారము గలవారలైయుండగా భావమును భావాధిపతిని కారకత్వము నాలోచించి యాప్రశ్నకు ననుగుణముగా ఫలమునుచెప్పవలయును. పూర్వము జెప్పబడినప్రకారము కాలమునకు నవధియునుజెప్పవలయును. ఫలమును జెప్పునప్పుడు మధ్యవర్తియగు గ్రహమువలన గానివివరమును చెప్పవలయును. మధ్యవర్తి గ్రహవిషయము నెరుంగుట యేవిధమనగా లగ్నాధిపతి కార్యా

పతులకు జెప్పబడిన లక్షణములన్నియును నుండిన మరియొక శీఘ్రగ్రహముగాని లగ్నా
పతిని కార్యాధిపతినిజూచుచు వారిరువురకును 12 భాగములకులోబడి యొకయధి
కారము కలిగియుండి శుభగ్రహమైనయెడల అటువంటి గ్రహము మధ్యవర్తియని
చెప్పబడును. ఆమధ్యవర్తియగు గ్రహమునుబట్టి యాకార్యము ననుసరించిన వాని
యొక్క రూపము ఆకారము వయస్సు జాతి మొదలగువాని నన్నింటిని చెప్పవల
యును. అనగా మధ్యవర్తిగ్రహముతో రూపాదులకు సమానమైన మనుష్యునివలన
ప్రశ్న జేసినవానియొక్క కార్యము సానుకూలమగునని చెప్పవలయును.

ఇట్లు శ్రీకాళిదాసు కవిచేరచింపబడిన యుత్తర కాలామృతములోనిజాతకపద్ధ
తియందు ప్రశ్నఖండము సమాప్తము.

---

## అష్టమఖండ ప్రారంభః

## వివిధఫల పద్ధతౌ ప్రకీర్ణ ఖండః

### అథాగర్భాధాన యోగ్యకాలమాహ.

శ్లో॥ గర్భాధానమతీవ పుత్రశుభదం బ్రహ్మేందు పూర్వా
త్రయే । రౌద్రత్రీణికరాది పంచకహరి త్రీణ్యుత్తరాఖ్యత్రయే ।
భద్రాపూర్ణజయా సుశోభన గృహేస్వష్టమ్యమా పూర్ణిమా ।
హిత్వార్క్యేందు జయోర్భృగోశ్శశదినే స్యాల్లగ్నశుద్ధౌ తదా ॥

టీ॥ బ్రహ్మ = రోహిణి, ఇందు = మృగశిర, పూర్వత్రయే = పుబ్బ పూర్వా
షాఢ పూర్వాభాద్రలయందును, రౌద్రత్రీణి = ఆర్ద్ర పునర్వసు పుష్యమీ నక్షత్ర
ములయందును, కరాదిపంచక = హస్త చిత్త స్వాతి విశాఖ అనూరాధలయందును, హరి
త్రీణి = శ్రవణ ధనిష్ఠ శతభిషముల యందును, ఉత్తరాఖ్యత్రయే = ఉత్తర ఉత్తరాషాఢ
ఉత్తరాభాద్రలయందును, అష్టమీ = అష్టమియు, అమా = అమావాస్యయు, పూర్ణి
మా = పౌర్ణమయు, హిత్వా = ఈతిథులను విడిచిపెట్టి, భద్రాపూర్ణజయాసు = భద్ర
తిథులు పూర్ణతిథులు జయతిథులయందును, అర్క్య = బృహస్పతియొక్కయు, ఇందు
జయోః = బుధునియొక్కయు, భృగోః = శుక్రునియొక్కయు దినేషు = దినములయం
దును, శశిదినే = చంద్రుని దినమందును, లగ్నశుద్ధౌ = లగ్నమందు గ్రహములు
లేకుండగాను, తదా = అప్పుడు, గర్భాధానం = గర్భాధానము. అతీవ = మిక్కిలి,
పుత్రప్రదం = పుత్రులు శుభము. స్యాత్ = అగును.

తా॥ గర్భాధానమునకు తగిన కాలమును జెప్పుచున్నాడు. రోహిణి, మృగశిర ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, పుబ్బ, ఉత్తర, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణ- ధనిష్ఠ- శతతార- పూర్వాభాద్ర- ఉత్తరాభాద్ర యీ 19 నక్షత్రములయందును అష్టమి పౌర్ణమి అమావాస్య యీతిథులు గాక మిగిలిన భద్రతిథులు పూర్ణతిథులయందును సోమ బుధ గురు శుక్రవారములయందును శుభగ్రహ రాశియందును లగ్నమువందు పాపగ్రహములు లేకుండగా నట్టి సమయమందు జేయబడిన గర్భాధానము మిక్కిలి శుభప్రదమై పుత్రసంతానాది శుభము కలుగును.

## అథనిషేకకాలనిర్ణయం గర్భాధాననిషేకయోర్భేదంచాహ.

శ్లో॥ స్త్రీపుంసోః ప్రథమోనిషేక ఉదితస్సంభోగ ఆద్యార్తవే। గర్భాధానమితిబ్రువంతివిబుధా స్తన్మాసిమాస్యేవహి। హస్త స్వాత్యనురాధ మూలవరుణ శ్రీశప్రశోత్తరా । స్వంత్యేచైవనిషేక ఉత్తమఇతి ప్రాగ్వచ్ఛుద్ధ్యాదికం ॥

టీ॥ ఆద్యార్తవే= మొదటి రజస్వలయందు, స్త్రీపుంసోః= స్త్రీపురుషుల యొక్క, ప్రథమః= మొదటిదియగు, సంభోగః=సంభోగము, నిషేకః=నిషేకమని ఉదితః= చెప్పబడినది, మాసిమాస్యేవ= ప్రతిమాసమునందు, జరుగునట్టి, తత్= ఆ సంభోగమును, గర్భాధానమితి= గర్భాధానమని, విబుధాః= పెద్దలు, బ్రువంతి= చెప్పుచున్నారు, హస్త= శోత్తరాసు, హస్త- స్వాతి - అనూరాధ - మూల - శతభిష - శ్రవణ - రోహిణి - ఉత్తర - ఉత్తరాషాఢ- ఉత్తరాభాద్రయందును, అంత్యే= రేవతియందును, నిషేకః=నిషేకము, ఉత్తమః= శ్రేష్ఠము, శుద్ధ్యాదికం= లగ్నశుద్ధి మొదలగు విషయములు, ప్రాగ్వత్=పూర్వమువలెనే, ఇతి=ఈలాగునని, బ్రువంతి= చెప్పుచున్నారు.

తా॥ నిషేకమునకు తగినకాలమును గర్భాధాన నిషేకములుగల భేదమును జెప్పుచున్నాను. ప్రథమ రజస్వలైనపిమ్మట స్త్రీ పురుషులకు జరిగినట్టి సంభోగము నిషేకమనియు తర్వాత ప్రతి మాసమందు ఋతుదినములలో జరుగునట్టి సంభోగము గర్భాధానమనియు పెద్దలుచెప్పిరి. కాబట్టి హస్త- స్వాతి-అనూరాధ-మూల- శతభిషము- శ్రవణము- రోహిణి- ఉత్తర-ఉత్తరాషాఢ-ఉభా- రేవతి-ఈనక్షత్రములు నిషేకమునకు శ్రేష్ఠమనిరి. మరియు తిథివార లగ్నాదులనుగురించి గర్భాధానమునకు జెప్పినట్లుగానే తెలిసికొనవలెను. మరియు రజస్వలకుపూర్వము జేయబడునది

నిషేకమనియు రజస్వలానంతరము జరుగునది గర్భాధానమనియు మరికొందరుచెప్పిరి గాని రజస్వలకుపూర్వము సంభోగమునకు తగినకాలముకానందున నిషేకగర్భాధానములు రెండును రజస్వలానంతరమే జరుగునట్లుగా నీకవిగారు చెప్పియున్నారు. లగ్నశుద్ధియని చెప్పుటచే లగ్నమునందే గ్రహములుండగూడదని కొందరు చెప్పినప్పటికిని లగ్న పంచమ నవమ స్థానములయందు బృహస్పతియుండిన పుత్రప్రదమని కొందరి యభిప్రాయములు ఇతర గ్రంథములయందు కలదుకాబట్టి బృహస్పతిమాత్రము లగ్నమందుకూడ నుండవచ్చునని యిందువలన తెలుచున్నది.

## అథప్రతినిధి రజోనిర్ణయమాహ.

శ్లో॥ యానారీసుతనుః కుచోన్నతయుతాప్యాషోడశాబ్దంరజోదృష్టంనోయదిశోభనే చదివసేతాం సన్నివేశ్యాదరాత్। రమ్యేచాస్తరణేసితాంబరయుతాం స్వర్ణాదిభిర్భూషితాం । పన్నీరాదిమిళత్సుకుంకుమరజోలిప్తాంగ జాతాలయాం॥

శ్లో॥ కృత్వాపుష్పవతీ మివాత్రిదివసం నీత్వాచతుర్థేదినే । స్నాతాంతాంపరయేత్పతి శ్శుభగృహే శుద్ధేసుతే పూర్వవత్। ఏవం చేదచిరాత్సతీన సుఖకృత్స్యా త్పుష్పిణీపుత్రిణీ। సంభోగాఖిలదైవపైతృక మహాకర్మార్హతాం సాత్వియాత్ ॥

టీ॥ యానారీ= ఏస్త్రీ, సుతనుః= యోగ్యమయిన శరీరముకలదియై, కుచోన్నతయుతాపి = ఉన్నతమగు స్తనములు కలదియైనను, అషోడశాబ్దం = పదియారు సంవత్సరముల పర్యంతము, రజః = రజస్సు, దృష్టం నోయది = కనపడకపోయిన యెడల, ఆదరాత్= త్వరపడుటచే, శోభనే=శుభప్రదమైన, దివసే= దినమునందు, సితాంబరయుతాం= తెల్లని వస్త్రమును ధరించినదియు స్వర్ణాదిభిః= బంగారపువస్తువులు మొదలగువానిచే, భూషితాం = అలంకరింపబడిన, తాం = ఆ చిన్నదానిని, రమ్యే= మనోహరమగు, ఆస్తరణే= చాపయందు, సన్నివేశ్య = కూర్చుంచబెట్టి, పన్నీరాది...తాలయాం, పన్నీరాది=పన్నీరు మొదలగువానితో, మిళత్= కలిపిన, సుకుంకుమరజః= మంచికుంకుమతో, లిప్త=పూయబడిన, అంగజాతాలయాం=మన్మథగృహము కలదానిగా, (అంగజాతాలయమనగా యోని) కృత్వా=చేసి, పుష్పవతీమివ= రజస్వలైన స్త్రీనివలెనే, అత్రిదివసం=మూడుదినముల పర్యంతము, నీత్వా= వెళ్లబుచ్చి, చతుర్థేదినే= నాల్గవ దినమునందు, స్నాతాం = స్నానముజేసిన, తాం=

ఆస్త్రీని, శుభలగ్నమందు, పూర్వవత్= పూర్వమువలెనే, సుతే= పంచమస్థానము శుద్ధే=శుద్ధిగలదగుచుండగా, పతిః=పెనిమిటి, వరయేత్=కోరవలెను. ఏవంచేత్ = ఈప్రకారముచేసినయెడల, అచిరాత్=శీఘ్రముగ, సతీ= ఆకన్యక, ఇనసుఖకృత్— పెనిమిటిని సుఖపెట్టునదియు, పుష్టిణీ=రజస్సుగలదియు, పుత్రిణీ=పుత్రులుకలదియు స్యాత్=అగును. సాతు=ఆచిన్నదియు, సంభోగ = సంభోగము, అఖిల= సమస్తమైన, దైవ=దేవతల సంబంధమైనవియు, పైత్రిక= పితృదేవతుల సంబంధమైనవియు నగు, కర్మ= కర్మలకు, అర్హతాం=యోగ్యతను, ఇయాత్= పొందును.

తా॥ ఎంతకాలమునకు రజస్వలకాని స్త్రీలకు రజోప్రతినిధిగా జేయువిధానమును జెప్పుచున్నాడు. ఏ స్త్రీ యౌవనముకలిగి దృఢమైన శరీరము ఉన్నతమగు కుచములు మొదలగు నవయవస్ఫూర్తి కలదియగుచు పదియారు సంవత్సరముల పర్యంతము రజస్వల కాకయుండునో ఆ చిన్నదానిని పంచాంగశుద్ధిగల శుభదినమునందు తెల్లనివస్త్రమును ధరింపజేసి బంగారపు ఆభరణములచే నలంకరించి యోగ్యమగు చాపయందు కూర్చుండబెట్టి పన్నీరులో కుంకుమనుకలిపి యాకుంకుమనుయోనియందు పూసి క్రమముగా రజస్వలైన స్త్రీలకువలెనే మూడుదినముల పర్యంతము సువాసినీ స్త్రీలనుబిలచి మూడుదినములపర్యంతము జరిగించునట్టి యుత్సవములను జరిపి నాల్గవ దినమునందు స్నానముజేయించి పూర్వమువలెనే శుభప్రదమగుదినమునఅయిదవస్థానమునందు గ్రహములులేనట్టి శుభలగ్నమందు ఆస్త్రీతో పెనిమిటి సంభోగించినయెడల వెంటనే రజస్వలై పుత్రులుకలిగి పెనిమిటిని సుఖపెట్టునదియగును మరియు సంభోగమునకు సమస్తమగు దైవసంబంధమైనవియు పితృదేవతా సంబంధమైనవియునగుసమస్తకర్మలు చేయుటకును యోగ్యురాలగును.

అథనక్షత్రగండాంతదోషం తచ్ఛాంతించాహవృత్తత్రయేణ.

శ్లో॥ సార్పేతత్పిత్రిభేథవేద్య దిజనిస్సంప్రోచ్యతే తత్ఫలం। భౌజంగేధనసోదరాంబ జనకారిష్టం తదంతేశిశోః। రుద్రంకాలమథాంతకంచవిధివన్మృత్యుం సమభ్యర్చ్యయేదేకద్విత్రిచతుర్ధశేషుపిత్రుభేవస్తంసమస్తం భవేత్ ॥

టీ॥ సార్పే= ఆశ్రేషయందును, తత్పిదృభే= ఆ ప్రసిద్ధమగు మఖయందును, జనిః=పుట్టుక. భవేద్యది= అయినట్లాయెనా, తత్ఫలం దానియొక్క-ఫలము, సంప్రోచ్యతే = చెప్పబడుచున్నది. భౌదంగే= ఆశ్రేషయందు. ఏకద్విత్రి చతుష్పదేషు = ఒకటి రెండు మూడు నాలుగుపాదములయందు, వరుసగా, ధన=ధనమునకు—సోదర=అన్నదమ్ములకును, అంబ=తల్లికిని, జనకా,=తండ్రికిని, అరిష్టం=నాశనము తదంతే=ఆయాశ్రేషయొక్క-చివరయందుజననమైతే=శిశోః=శిశువున

శ్రేష్టము, రుద్రం= సాంబమూర్తిని, కాలం= కాలుని, అంతకం=యముని, మృత్యుం చ= మృత్యుదేవతను, విధివత్= యథాశాస్త్రముగా, సమభ్యర్చయేత్=పూజచేయవలయును, పిత్ర్యభే=మఖయందు, సమస్తం=చెప్పబడినవన్నియు, వ్యస్తం=వ్యతిరేకముగానగును.

తా॥ ఆశ్రేష మఖా నక్షత్రములయందు జననమైనయెడల గండదోషమును దానియొక్క శాంతియును జెప్పుచున్నాను. ఆశ్రేషయొక్క మొదటిపాదమందు జననమైనయెడల ధననాశనము రెండవపాదమందైన భ్రాతృనాశనము మూడవపాదమందైన మాతృనాశనము నాల్గవపాదమందైన పితృనాశనము కలుగును. కాబట్టి తత్పరిహారము నిమిత్తము 1-2-3-4 పాదములలో జననమైనప్పుడు రుద్రుని యముని మృత్యుదేవతను పూజింపవలయునని క్రమముగా నాలుగు పాదములకు నలుగురుదేవతలు చెప్పబడిరిగాన యేపాదమందు జననమైతే దానికి జెప్పబడిన దేవత నారాధింపవలయును. మరియు ఆశ్రేషయొక్క చివరఘడియందు జననమైతే శిశువునకుగండము మరియు మఖానక్షత్రమందు జననమైతే 4వ పాదమందు ధననాశనము 3వ పాదమందైతే సోదరనాశనము 2వ పాదమందైతే మాతృనాశనము 1వ పాదమందైతే పితృనాశనము మఖయొక్క మొదటిఘడియయందు శిశుగండమనియు సమస్తఫలములు ఆశ్రేషానక్షత్రమునకు వ్యతిరేకముగా చెప్పబడినవి. తచ్ఛాంతికొరకు పూజింపవలసిన దేవతలనుకూడ మృత్యువు యముడు రుద్రుడు అని 1-2-3-4 పాదములకు వ్యతిరేకముగానే చెప్పబడినది. ఇట్లు యేనక్షత్రములో నేపాదమునకు నేదేవత చెప్పబడియున్నదో యాదేవతను శాస్త్రప్రకారముగా పూజించిన తద్దోషపరిహారమగును, (ముందునుంచి తాత్పర్యము వ్రాసినాను)

శ్లో॥ తద్వచ్ఛక్రిసురద్విషోః ఫలమిదం పూషాశ్వినోరవ్యధో।
యుగ్మేషుత్రిషు చాంతిమాదిమఘటీ గండాంతరాశాభిధా। తత్రస్యా
ద్యది జన్మకాలసదనం గచ్ఛేచ్ఛిశుస్సత్వరం । నోచేత్స్యాదసమాన
వీర్యనృపతిర్నిశ్శేష భూపాలకః ॥

తా॥ పూర్వమాశ్రేష మఖలకుజెప్పినట్లుగానే జ్యేష్ఠమూలలకు రేవత్యశ్వినులకు ఫలము సమానముగానే చెప్పబడినది. అది యెట్లనగా ఆశ్రేష నక్షత్రమునకు నాలుగుపాదములకు జెప్పినట్లుగానే జ్యేష్ఠ రేవతీ నక్షత్రములయొక్క నాలుగు పాదములకును దోషము తచ్ఛాంతియు సమానముగానే చెప్పబడినది మఖా నక్షత్రమునకు జెప్పగానే మూల అశ్వినీ నక్షత్రములయొక్క నాలుగు పాదములకును దోషము శాంతియు సమానముగా జెప్పంబడినది. మరియు ఆశ్రేష మఘలు, జ్యేష్ఠమూలలు

రేవత్యశ్వినులు అని యారు నక్షత్రములను, మూడు జంటలుగా జెప్పి వీటిని గండాంత రాశి నక్షత్రములనియు నీజంటలలో మొదటి నక్షత్రముయొక్క చివరఘడియలోను రెండవ నక్షత్రముయొక్క మొదటి ఘడియలోను జననమగునేని శిశువునకు నష్టము నియుజెప్పిరి లేక తచ్ఛాంతిని జేసికొనుటచే దైవవశమువలన బ్రతికియుండెనేని అట్టివాడు విశేష పరాక్రమవంతుడై చతురంగ బలసమేతుడగు ప్రభువగుచు భూమి నంతయూ పాలించెడు చక్రవర్తిగానగును.

శ్లో॥ గండాంతేచయ భవే ద్వైధవ్యమాప్నోత్యరం।సాపత్యార్థసుఖాంబరై ర్విరహితా పిత్రోశ్చకులఘ్నీ ఖిలా । కల్పోక్త్యాజపహోమఖేచరముఖాద్యా దేవదేవార్చనా। చ్ఛాంతింయాత్యచిరాత్సమస్త సుఖకృత్సా భాగ్యపుత్రాన్వితా ॥

తా॥ గండాంతరాశి నక్షత్రములయందు రజస్వలైన స్త్రీ వైధవ్యమునొందు నదియు సంతానమధనము సుఖము వస్త్రములు ఆభరణములు మొదలగునవిలేనిదియు తల్లిదండ్రుల వంశనాశనము జేయునదియూ, దుర్మార్గురాలునగును. కాబట్టి శాంతి కల్పములో జెప్పబడినప్రకారము జపము తర్పణము గ్రహహోమము దానములు బ్రాహ్మణులను దేవతలను పూజించుట మొదలగునవి జేయించిన శీఘ్రముగానే భాగ్యమును సంతానమును కలదియగుచు సమస్త సుఖములనొందును.

అథరజోజన్మనో స్త్యాజ్యకాలదోష తచ్ఛాంతించాహ.

శ్లో॥ త్యాజ్యోత్పన్న ఘటీ చతుష్టయఫలం వక్ష్యేరజోజన్మనో। స్తాతఘ్నం జననీ హరంధనహరం చాత్మక్షయంయచ్ఛతి।సుద్రంచాంత కమగ్నిహోత్ర మథతంమృత్యుంచ సంపూజయే । త్సూర్యేందుగ్రహణోద్భవోయది పితుర్మాతుర్వినాశంక్రమాత్ ॥

తా॥ వర్జ్యములో రజస్వలగాని జననముగానియైనయెడల దానిదోషమును తద్దోషశాంతియును చెప్పబడును. వర్జ్యకాలము ఒకప్పుడు 4ఘడియలనియు నొకప్పుడంతకు తక్కువగాను ఒకప్పుడు నెక్కువగానుండునని చెప్పబడినది కాబట్టివర్జ్యకాలములో రజస్వలగాని జననముగానియైనయెడల తత్కాలవర్జ్య ప్రమాణమును నాలుగు భాగములుచేయుగా మొదటిభాగములో పితృనాశనమును, రెండవభాగములో మాతృనాశనమును, మూడవభాగములో ధననాశనమును, నాల్గవభాగములో శిశునాశనమును జెప్పిరి. కాబట్టి దానియొక్క శాంతికొరకు సాంబమూర్తిని యముని అగ్నిహోత్రుని మృత్యు దేవతను 4భాగములయందు వరుసగా నలుగురు దేవతలను పూజింపవలయును. మరియు

సూర్యగ్రహణమందు రజస్వలగాని జననముగాని యైనయెడల పితృనాశనమనియు చంద్రగ్రహణ కాలమందైన మాతృనాశనమనియు జెప్పిరి.

అథఅమృత ఘటీఫలమాహ.

శ్లో॥ శస్తంచామృతనాడి కాసురచితం దివ్యౌషధం ప్రాశితం తత్పీయూషసమంజరామ యహరం దోష త్రయఘ్నం తదా। ఆరోగ్య ప్రదమింద్రియ స్ఫుటకరం చాయుః ప్రదం భేషజం। కార్యం తద్భవహాభజద భగవాన్ ధన్వంతరిశ్చాబ్ధిజః॥

తా॥ అమృతఘడియలలో జేయఁబడిన కార్యఫలమును జెప్పుచున్నాడు. అమృతఘడియలలో శ్రేష్ఠమగు నౌషధముచేయఁబడినను లేక లోపలికిపుచ్చుకొన్నను ఆయౌషధము అమృతముతో సమానమైనదగుచు జ్వరము మొదలగు రోగములను పోగొట్టునదియు, వాత పైత్య శ్లేష్మములనెడు- మూడువిధములగు దోషములనుపోగొట్టునదియు, ఆరోగ్యమును ఇంద్రియములకు బలమునుఆయుస్సును వృద్ధిచేయునదియు నగును కాబట్టి సముద్రములో జనియించి స్వర్గలోకములో నివసించు సమస్త దేవతలకు వైద్యుడగు ధన్వంతరి ముఖ్యముగా వైద్యమునుజేయించుకొనవలయుననిచెప్పెను

అథశ్లోకద్వయేన దత్తపుత్రస్వీకరణవిధానమాహ.

శ్లో॥ ఆషష్ట్యబ్దమ పుత్రకో యది తదాతజ్జన్మపత్రాదిభి। శ్చేద ల్పాయురితిస్వజన్మ ఖచరైర్జ్ఞాతే తదిచ్ఛాబ్ధకే। ఆయుష్మంతమపీహ కీర్తితనయప్రజ్ఞాది వృద్ధ్యన్వితం। జ్ఞాత్వాసర్వవిధైన్సుతం శుభదినే ప్రాహ్ణేచసౌమ్యాయనే ॥

శ్లో॥ నాడీకూటముఖార్వణాది సహితంతం స్వీయగోత్రోద్భవం స్వీకుర్యాదనిలా దితీజ్యశశిధి మిత్రార్క్యం త్యభేషాధభే। దైత్యారితి యభోత్తరాసుచఖ వైర్లగ్నేసుతే వర్జితే। తారాచంద్రబలాన్వితే శుభఖగైర్యుక్తేక్షితే చోదయే ॥

తా॥ దత్తపుత్రస్వీకారవిధానమును జెప్పుచున్నాను. అరువది సంవత్సరముల వరకు తనకు సంతానము కలుగకుండెనేని తన జాతకము మొదలగువానిఁచూచి దానిలోని చరాదులయందుండు గ్రహాదులచే తనకు నెక్కువకాల మాయుర్దాయము లేదని తోచెనేని తన కిష్టమైనప్పుడు తన వంశములో బుట్టినవాడును వానియొక్క జాతకమువలన దీర్ఘాయుష్మంతుడని తెలియబడు లక్షణములుగలవానిని కీర్తిపుత్రులు జ్ఞానము మొదలగు సుగుణములుగల యొక పిల్లవానిని దత్తతస్వీకారము జేసికొన

వలయును. అది యెప్పుడనగా ఉత్తరాయణములోను స్వాతి పునర్వసు పుష్యమి రోహిణి అనూరాధ, హస్త, రేవతి, అశ్విని, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర నక్షత్రములయందును శుభగ్రహములతో కూడినట్టియు చూడబడినట్టియు తారా చంద్రబలములతో గూడినట్టి శుభలగ్నమందు నేకవింశతి మహాదోషములు లేకుండునట్లుగాను (8) ఎనిమిదవస్థానమందు నేపాపగ్రహములు లేకుండునట్లుగాను విచారించి నాడీకూటము యోనికూటము మొదలగు వర్గములచే వర్ణచక్రమువలన శుద్ధిగలిగినట్టి పిల్లవానిని దత్తత చేసికొనవలయును.

## అథోద్వాహాభి ముఖక్రియామాహ.

శ్లో॥ ఉద్వాహాభిముఖక్రియామదితి భేతిష్యేతథాదస్రభే। మైత్రేర్కత్రయ వైష్ణవత్రయయుతే పణ్యాంగనాభిస్తదా। భృగ్వార్కోజ్ఝితవాసరేసుత నవస్థానేచశుద్ధేశుభే లగ్నే ఖేటమఖాదికం త్వపిచరేత్తద్గీతవాద్యాదిభిః॥

తా॥ వివాహమునకు అభిముఖమగు కార్యమును జేయుటనుగురించి చెప్పబడును పునర్వసు, పుష్యమి, అశ్విని, అనూరాధ, హస్త, చిత్ర, స్వాతి, శ్రవణ, ధనిష్ఠ, శతభిష, ఈనక్షత్రములతోను శుక్రమంగళవారములుగాక మిగిలిన ఆది సోమ బుధ గురు శనివారములతోనుగూడిన యోగ్యమగు తిథులయందును పంచమ నవమ స్థానములయందు పాపగ్రహములు లేకుండినట్టి శుభలగ్నమందు నృత్యగీత వాద్య నాట్యాదులను జరిపించుచు దేవతలకు గ్రహములకు పూజహోమాదులను జేయించి సువాసినీ స్త్రీలచే వివాహాభిముఖక్రియను అనగా పెండ్లికూతురు పెండ్లికుమారులను జేయుట మొదలగు పనులను జేయవలయును.

## అథ మంగళ పత్రిలేఖనమాహ.

శ్లో॥ పూర్ణేందోరఖలేందుజస్యచ గురోశ్శుక్రస్యవారేతథా। భద్రాపూర్ణాతిథౌజయాహ్వయతిథావృక్షేచరేక్షిప్రభే। లగ్నేవిద్గురుశుక్రవీక్షితయుతే శుద్ధేసుతేతల్లిఖే। దాహ్వానార్థమిదం మృదూక్షేఘటితం మాంగళ్యపత్రింశుభమ్॥

తా॥ శుభలేఖను వ్రాయుటనుగురించిచెప్పబడును. పూర్ణచంద్రునియొక్కయు పాపుడుగాని బుధునియొక్కయు గురు శుక్రులయొక్క వారములయందును భద్రపూర్ణజయ సంజ్ఞగల తిథులయందును చరక్షిప్రసంజ్ఞగల నక్షత్రములయందును లగ్నమం

నను నైదవ స్థానమునందు పాపగ్రహములు లేకుండగాను బుధ గురు శుక్రులచేజూడ బడినదిగాని కూడియుండినదిగానియగు లగ్నమునందు వివాహోపనయనాదిశుభ కార్యములకొరకు బంధుమిత్రాదులను పిలుచునిమిత్తమై శుభలేఖను మంచిమృదువగు వాక్యములతో వ్రాయవలెను.

అథ వివిధఫలషద్ధతౌ ప్రకీర్ణఖండే చక్రకదంబః.

{ఆదౌ శంకుస్థాపన స్తంభప్రతిష్ఠాదిషు కూర్మ చక్రోద్ధార స్తత్ఫలంచాహ.}

శ్లో॥ శంకుస్థాపనజాతిథిశ్శరగుణా త్రాతానలాద్యంయుతం। యో జ్యందాద్వాదశభిః పునర్నవ హ్రృతంశిష్టంనగాబ్ధీందవః। కీలాలేహిశ రేషవో భువితతోగ్న్యం కర్తవ్యఃఖేభవే। ల్లాభోహానిమృతీక్రమా త్ఫలమిదం కూర్మేతుచ కీర్తితమ్॥

తా॥ అనేకవిధములగు ఫలములనుజెప్పెడి ప్రకీర్ణఖండమందు చక్రకదంబమును జెప్పుచు నిప్పుడు ముందుగా శంకుస్థాపన స్తంభప్రతిష్ఠ మొదలగువానిగురించికూర్మ చక్రోద్ధారము దానిఫలమును జెప్పబడును. శంకుస్థాపన కాలమందైనతిథియొక్క సంఖ్యను అయిదుచేగుణించి దానిలో కృత్తిక మొదలుకొని శతాబ్దనక్షత్రమువరకు లెక్కింపగావచ్చిన సంఖ్యను పూర్వోక్తసంఖ్యలో గలిపి తిరిగి దానిలో 12 జేర్చి యా మొత్తమును 9 చే గుణింపగా శేషము 7-4-1 ఈసంఖ్యలలో నేదిమిగిలినను కూర్మము జలము నందుండునవియు 8-2-5 మిగిలిన భూమియందుండుననియు 3-9-6 మిగిలిన ఆకాశమందుండుననియుజెప్పి జలమునందుండిన లాభమనియు భూమియందుండిన హానియనియు నాకాశమందుండిన మరణమనియు, ఫలముల జెప్పబడినవిగాన శంకుస్థాపనాది కార్యములను జేయునపుడీ కూర్మచక్రమును వేసి పరిశీలించిపూర్వముజెప్పబడిన గణితప్రకారము జలస్థితి కలిగినప్పుడు శంకుస్థాపనాది కార్యములను జేయవలెను.

అథ గృహారంభే గృహకర్ణికాచక్రమాహ.

శ్లో॥ నిర్మాణేనవసద్మనఃప్రథమతో లింగత్రయంసంలిఖే। త్తిర్యక్కాచ్ఛకళకాశ్చతస్ర అపిచాద్యేవామరేఖాంతః। ఆకోహాదపిదన్రభాచ్ఛుభకరంచారోహభంమస్తగం। రేఖాయాంఖలఖేచరేయది మృతిర్నేతుశ్శుభేశోభనం॥

తా॥ గృహముకట్టబోవునపుడుగృహకర్ణికాచక్రమునుపరిశీలనజేయవలయును. యెట్లనగా లింగాకారముగా నిలువుగా మూడు రేఖలనువ్రాసి యాలింగములయందు

ప్రతిదానియందు నాలుగు 4 అడ్డరేఖలను గీయవలయును. తర్వాత లింగాకారముగా నుండు యెడమవైపు రేఖయందు అడ్డముగా వ్రాయబడిన నాలుగు రేఖలలో క్రింది రేఖనుండి పైకి ఆరోహణముగా వ్రాసి, తిరిగి దానికి కుడిభాగమందు దిగువగా వ్రాయవలయును. ఈవిధముగానే రెండవలింగమందును పిమ్మట మూడవలింగాకార రేఖయందును, వ్రాయవలయును. ఇట్లు వ్రాయగా ఒక్కొక్క రేఖను (౯) నక్షత్రములచొప్పున (౨౭) నక్షత్రములగును. లింగమునకు నెడమప్రక్క నారోహణముగా వ్రాయఁబడిన నక్షత్రములును శిరస్సునందు వ్రాయఁబడిన నక్షత్రమును శుభకరమైనవి. మరియు నడ్డముగా వ్రాయఁబడిన రేఖలలో దేనియందైనను పాపగ్రహముండెనేని శుభప్రదముకాదు, శుభగ్రహముండినచో శుభప్రదమగును. ఇందును గురించి మాటలతో నెంతజెప్పినను చక్రములో వ్రాసి జూపించినంత స్పష్టముగానుండదు. కాబట్టి మూలశ్లోకములో క్రమము వ్రాయబడినది కాబట్టి దానిని చూచుకొనవలయును.

అథ సర్వవిధ ప్రవేశాదిషు వృషభకలశచక్రే దర్శయతి.

శ్లో॥ ఉక్తాఖ్యే ఫలమేవముక్త మభిజిత్సార్కం ప్రవేశేర్కభా చ్చంద్రర్క్షం గిరివేద రామసురవాశ్చా సచ్ఛుభాసచ్ఛుభం। తద్వత్ప్రో క్తమిదంఫలంతు కలశే బాణాహినాగారయ । స్సంవేశే సుఖదం శుభ ప్రదమపిస్యాచ్చక్రయుగ్మం లఘు॥

తా॥ అన్నివిధములగు ప్రవేశములయందు వృషభచక్ర కలశచక్రములు రెండును నిరూపించుచున్నాను. సూర్యుడున్న నక్షత్రము మొదలుకొని చంద్రుడున్న నక్షత్రమువరకు అభిజిత్తుతోకూడ లెక్కపెట్టుచురాగా ౭ నక్షత్రములు అయిన అశుభము. తర్వాత ౪ నక్షత్రములు శుభము. పిమ్మట ౩ నక్షత్రములు అశుభము. అటుపిమ్మట ౧౪ నక్షత్రములు అయిన శుభము. ఈప్రకారము వృషభచక్రఫలము చెప్పబడినది. మరియు కలశచక్రవిషయమెట్లనగా వృషభచక్రమునకు జెప్పినట్లుగానే సూర్యుడున్న నక్షత్రము మొదలు చంద్రుడున్న నక్షత్రమువరకు లెక్కపెట్టగా ౫ పర్యంతము అశుభము. పిమ్మట ౮ పర్యంతము శుభము. తర్వాత ౮ పర్యంతము అశుభము తర్వాత ౬ నక్షత్రముల పర్యంతము శుభము. ఇట్లు కలశచక్రఫలము చెప్పబడినది. ఈప్రకారము వృషభ కలశచక్రములు రెండును సమస్తప్రవేశముల విషయమై సులభమార్గముగా చెప్పబడెను. కాబట్టి వాటిని విచారించి శుభఫలములనిచ్చు నక్షత్రములయందు ప్రవేశించవలయును.

## అథ దాసదాసీచక్రే తత్ఫలంచాహ.

శ్లో॥ చక్రేమానుషరూపకేహిశిరసి త్రీణ్యర్థలాభోముఖే। వా
త్రీణిహృద్యపిషట్ ధనచయోనిస్థం షడంఘ్ర్యోర్ద్వయం । పృష్ఠే
హానిభయం తతశ్శుభకరం వస్వాకృతాద్విగ్గణే । భీతిర్దక్షిణవామ
యోస్తుకరయో శ్శేకైకకంస్యాన్మృతిః॥

శ్లో॥ భృత్యర్క్షాదినభాంతకంభవతి తద్దాసాఖ్యచక్రంత్విదం। దాసీ
చక్రమపీహతద్వదితి తచ్ఛీర్షేత్రయంలాభదం । హానిస్త్రీణిముఖేద్వ
యం ప్రభుమృతిస్స్కంధేచపృష్ఠేశ్వరా । హృత్పద్మేతుపగాశ్చహాని
రితిభూరోర్యైనాతిరస్కాలతా॥

శ్లో॥ త్రీణిత్రీణ్యథపాదయోశ్చభవతి స్వాద్దక్షిణేవామకేతద్ద్వి
వ్యక్షయమాదిశేదితి విభోర్భృత్యస్యయోజ్యంసదా ।

తా॥ దాసదాసీచక్రములను వాని ఫలములను జెప్పుచున్నాను. ప్రభువు సేవకుని నౌకరిగా నుంచుకొనదలచినప్పుడు స్త్రీని దాసిగా నుంచుకొనదలచినప్పుడుమనుష్యాకారమగు చక్రమును వేసి దాని ప్రతియవయవమునందు శ్లోకములో జెప్పినప్రకారము నక్షత్రములనువ్రాసి యర్వాణమును జూడవలయును అది యెట్లనగా మనుష్యాకారముగా నొక చక్రమువ్రాసి శిరస్సునందు 3 నక్షత్రములు ముఖమునందు 3 హృదయమందు 5 కుడిపాదమునందు 3 యెడమపాదమునందు 3 వీపునందు 2 నాభియందు 4 అపానమందు 2 కుడిచేతియందు 1 యెడమచేతియందు 1 నక్షత్రములను వ్రాయవలయును పిమ్మట సేవకుని నక్షత్రముమొదలు ప్రభువు నక్షత్రపర్యంతము లెక్కపెట్టగా శిరస్సునందలి నక్షత్రములలోనైన యెడల ధనలాభము ముఖమునందలి నక్షత్రములోనున్న నాశనము హృదయమందునున్న నక్షత్రములోనైన విశేషధనము రెండు పాదములలోనుండిన దారిద్ర్యము వీపునందుండెడి నక్షత్రములలోనైన ప్రాణభయము. నాభియందుండెడి నక్షత్రములోనైనశుభము. అపానస్థానమందుండెడి నక్షత్రములలోనైన భయము కుడిచేతియందుండెడి నక్షత్రములకు ధనము యెడమచేతి నక్షత్రములకు మరణము అని యీప్రకారము ఫలములు చెప్పబడినవిగాన పురుషుని సేవకునిగా నుంచుకొనదలచినప్పుడు చక్రము వేసి యర్వాణమును జూచుకొనవలయును. ఇక స్త్రీని నౌకరిగా నుంచుకొనదలచినప్పుడుకూడ ఇదేప్రకారము చక్రమును వేసి శిరస్సునందు 3 నక్షత్రములు లాభము ముఖమునందు 3 నక్షత్రములుహాని వీపునందు 2 నక్షత్రములు యజమానికి నష్టము భుజమునందు 5 నక్షత్రములు బలకరము హృదయమందు

7 నక్షత్రములు హాని యోనియందు 1 నక్షత్రము తిరస్కారము కుడిపాదమునందు 3 నక్షత్రములు యెడమపాదమునందు 3 నక్షత్రములు వాటికి ఫలము ద్రవ్యనాశనము ఇట్లు ఆయా అవయవములనందు నక్షత్రములకు ఫలము జెప్పబడినదిగాన సేవకుడు వెళ్లదలచినప్పుడు తన నక్షత్రము మొదలు ప్రభునక్షత్ర పర్యంతము ప్రభువు నౌకరిని నుంచుకొనదలచినప్పుడు తననక్షత్రము మొదలు సేవకుని నక్షత్రపర్యంతము లెక్క పెట్టవలయును, ఇట్లు దాసదాసీజనమును నౌకరిగా నుంచుకొనునప్పుడు చక్రమును వేసి యర్పణమును జూచుకొనవలెను.

అథగోవృషమహిష్యాది స్వీకారచక్రశుద్ధిరూహ.

శ్లో॥ స్వీకారేమహిషీగవాం గుణకరాష్టౌబాణ నాగేందవో ।
లాభోహానిరథోస్వలాభ సుఖకృల్లాభో మహాభీతికృత్ ।మూర్ధాస్యాం
ఘ్రిషుహృత్స్తనేషుచ భగేత్వర్యమ్ణఆదిత్యాభం। గృహ్ణీయాచ్చ చతు
ష్పదాన్ వృషముఖాన్ సంచిత్యచక్రాదిదమ్ ॥

తా॥ గోవులు ఎద్లు గేదెలు మొదలగువానిని తీసికొనినప్పుడు చూడవలసిన చక్రశుద్ధిని జెప్పుచున్నాను. ఆవులు గేదెలు మొదలగు పశువులను కొనునప్పుడుగాని యుచితముగా నిచ్చినప్పుడుగాని యుత్తరనక్షత్రము మొదలుకొని పశువును తాను తోలుకొని వెళ్ళదలచిన దినమువందుగల నక్షత్రపర్యంతము లెక్కపెట్టవలయును. ఏపశువును తీసికొని వెళ్లదలచెనో ఆపశువుయొక్క ఆకారముగా నొకచక్రమును వ్రాసి దాని యవయవములగు శిరస్సునందు నక్షత్రములు 3 ముఖమునందు 2 పాదములు నాలుగింటియందు 8 హృదయమందు 5 స్తనములు నాలుగింటియందు 8 యోనియందు 1 ఈప్రకారము వేసుక యుత్తర మొదలు నిత్యనక్షత్రపర్యంతము లెక్కపెట్టగావచ్చిన సంఖ్యను పైనచెప్పబడిన యవయవములందుగల సంఖ్యలప్రకారము వ్రాయవలయును పైన చెప్పబడిన యంకెలకు వరుసగా ఫలమెట్లనగా లాభము, హాని, ధనలాభము, సుఖమును జేయుట, లాభము,మహాభయము, అని చెప్పబడినదిగాన మంచిఫలమునిచ్చునట్టి దినమందుగల నక్షత్రము నాలోచించి పశువులనింటికి తోలుకొని రావలయును.

అథ అశ్వారోహణే అశ్వచక్రమాహ.

శ్లో॥ అర్కక్షాన్నిజభాంతమేవ గణయేత్ స్కంధేశరాః పృష్ఠ
తో। దిక్పుచ్ఛేద్వితయం చతుష్వపిపదే ష్వబ్ధిశ్శరాస్తూదరే। వక్త్రేతు
ద్వితయంక్రమాత్సుభగకృల్లాభోంగ నానాశకృ । ద్భంగోనాశఇహార్థ
లాభ ఇతిచాశ్వాదే స్సమారోహణే ॥

తా॥ గుఱ్ఱము నెక్కినపుడశ్వచక్రశుద్ధిని జెప్పుచున్నాను. గుఱ్ఱము మొదలగువాని నెక్కదలచినప్పుడు అశ్వాకారమగు చక్రమును వేసి సూర్యుడుండెడినక్షత్రము మొదలు తననక్షత్రపర్యంతము లెక్కపెట్టగావచ్చిన నక్షత్రసంఖ్యనుమూపునందు నక్షత్రములు 5 వీపులందు 10 తోకయందు 2, నాలుగు పాదములయందు 4, ఉదర

మందు 5, ముఖమునందు 2, నక్షత్రములను వ్రాయవలయును. ఇట్లు వ్రాయబడిన పైన జెప్పబడిన సంఖ్యలకు వరుసగా ఫలమును సౌభాగ్యము, లాభము, స్త్రీనాశనము భంగము, నాశనము, ధనలాభము, అని ఫలములు చెప్పబడినవి. ఇట్లు వ్రాయగా సూర్యుడుండెడి నక్షత్రము మొదలు తన నక్షత్రము పర్యంతమువచ్చిన సంఖ్య పైన చెప్పబడిన అవయవములయందుగల సంఖ్యల ప్రకారము నేఅవయవములోనుండునో దానిఫలమును విచారించి మంచి ఫలమునిచ్చునట్టి దినమునందు వస్త్రారోహణము జేయవలయునని జెప్పిరి.

## అథగజ చక్రమాహ.

శ్లో॥ సూర్యర్క్షాన్నిజ భాంతకంకర కరాశ్వ్యక్ష్యక్షి వేదాబ్ధయో। వేదాంగాన్యథకర్ణ మస్తకరదే పుచ్ఛేకరే పృష్ఠకే। హృద్వక్త్రాంఘ్రిషు లాభలాభక మహాలాభశ్చ హానిశ్శుభం। సంపద్రోగసమాయకాస్త్వపిగజారోహేతు సంచింతయేత్ ॥

తా॥ గజచక్రమునుగురించి చెప్పుచున్నాను. గజాకారమగు చక్రమును వేసి దాని అవయవములగు చెవులయందు 2 శిరస్సునందు 2 దంతములయందు 2 తోకయందు 2 తుండమునందు 2 వీపునందు 4 హృదయమందు 4 ముఖమునందు 4 పాదములయందు 6 అంకెలను వ్రాయవలయును. తర్వాత సూర్యుడుండెడి నక్షత్రము మొదలు తన నక్షత్రపర్యంతము లెక్కపెట్టగా వచ్చిన మొత్తమును పైనచెప్పబడిన అవయవములలో నుంచబడిన యంకెలప్రకారము చూచుకొనగా నే అవయవమునందుండునో దానిఫలమును తెలిసికొనవలయును. ఆ అవయవములలోనుండు నక్షత్రములకు పైనచెప్పబడిన యంకెలవరుస ప్రకారము వరుసగా చెప్పబడిన ఫలములెవ్వియనగా లాభము, మహాలాభము, హాని, శుభము, సంపత్తు, రోగము, సమానఫలము, ఆదాయము అని ఫలములు చెప్పబడినవిగాన గజారోహణ సమయమందు ఈచక్రములువేసి ఫలమును విచారించి మంచి ఫలముగల దినమందు గజారోహణము చేయవలయును.

## అథశిబికారోహణచక్రం.

శ్లో॥ ఆరోహేశిబికాందినే శ్వరభత స్తత్కాల భాంతంక్రమా। త్పూర్వాశాదిషు పంచపంచచలిఖేద్వృత్తానిసప్తాంతరే।ఆరోగ్యంత్వతికష్టతాంచకృశతాం వ్యాధింక్రమాన్మధ్యమే। కల్యాణందిశతీహచక్రముదితం చాయుశ్చపుష్టిం సుఖం॥

తా॥ శిబికారోహణమును గురించి చెప్పుచున్నాను. పల్లకిగాని సవారీని గాని యెక్కదలచినప్పుడు వానియాకారముగా నొక చక్రమునువేసి దానికి తూర్పు మొదలుగ నాలుగు దిక్కులందును అయిదైదు నక్షత్రముల చొప్పున యిరువైనక్షత్రములును మధ్యప్రదేశ మందేడు నక్షత్రములును వ్రాయవలయును. వాటికి ఫలమేమనగా ఆరోగ్యము. మిక్కిలికష్టము క్షీణించుట వ్యాధి అని నాలుగుదిక్కులనక్షత్రములకును తూర్పు మొదలుకొని ఫలము చెప్పబడినది. మధ్యనుండు నక్షత్రములకు శుభఫలము చెప్పబడినది. కాబట్టి సూర్యుడుండెడి నక్షత్రము మొదలు తానెక్కదలచిన దినమునందుండు నక్షత్రమువరకు లెక్కపెట్టి పూర్వము చెప్పినప్రకారము తూర్పు మొదలైదైదు నక్షత్రములచొప్పునచూచుకొనుచురాగా నేదిక్కునకుపూర్వము లెక్కపెట్టిన నక్షత్రసంఖ్య సరిపోవునో యాదిక్కునకు జెప్పినఫలమును జూచుకొనవలయును. ఇట్లు చెప్పబడినది కాబట్టి మంచిఫలము నేదినమందుగల నక్షత్రమువలన గణితప్రకారము కలుగునని తెలియబడునో ఆదినమునందు శిబికారోహణము జేయవలెను.

## అథచత్ర చక్రమాహ.

శ్లో॥ ఛత్రత్యగ్రహణే శివోత్తరవిధీజ్యా శీశభంవాసవం। వారుణ్యాంచసదాశుభం త్వధపునశ్చక్రస్య మూలేత్రయం। నాశస్స్వత్తు దండకేధనహరం కంఠేనృపానుగ్రహం। పంచాంతర్వసవోమహోన్నృప వరంచాగ్రేభ్యభత్కీర్తిదం।ఛత్రాఖ్యంత్విదముత్తమంశుభకరంచక్రంతు ఛత్రాకృతిం। సంలిఖ్యైవమథో స్వభార్ధినకరర్క్షాంతం క్రమాద్విన్యసేత్ ॥

తా॥ ఛత్రాకారమగు చక్రమునుగురించి చెప్పుచున్నాను. ఛత్రాకారముగా చక్రమునులిఖించి దానికర్రయొక్క మొదట మూడునక్షత్రములుమధ్యను ఏడునక్షత్రములుమధ్య కెనిమిదినక్షత్రములు కంఠమందైదునక్షత్రములు చివరను నాలుగు నక్షత్రములు ఇట్లు కర్రను పుచ్చుకొనునట్టి ప్రదేశము మొదలు గొడుగునకు పైగానుండు కర్రయొక్క చివరవరకు లిఖించవలయును. వీటికి ఫలమేమనగా దండము మొదటనుండెడి నక్షత్రములు నాశనముజేయును. దండమునందుండెడివి ధననాశనముజేయును కంఠమునందుండెడివి రాజానుగ్రహము నిచ్చును. గొడుగులోపలను లిఖింపబడినవి గొప్ప రాజునుగాజేయును. చివరనుండెడి 4 నక్షత్రములు కీర్తినిచ్చును. ఇట్లుఛత్రా

కారముగా లిఖింపబడిన చక్రము నందుంచబడినట్టి నక్షత్రములకు ఫలముచెప్పబడినది. మరియు ఛత్రమును ధరించునట్టి దినమునందు ఆర్ద్ర, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రోహిణి, పుష్యమి, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము ఈ నక్షత్రములు ఛత్రధారణమునకు మంచివిగా చెప్పబడినందున వీటిలోనేదైన నుండవలయును. తర్వాత తన నక్షత్రము మొదలు సూర్యుడుండు నక్షత్రమువరకు లెక్కపెట్టి యాసంఖ్యను ఛత్రాకార చక్రములో జెప్పబడిన సంఖ్యప్రకారము లిఖించగా నెచ్చటికిసరిపోవునో అచ్చట చెప్పబడిన ఫలముకలుగును. శ్లోకములో జెప్పబడిన నక్షత్రములను ఛత్రాకార చక్రమును విచారించి రెండుకు శుభఫలము నిచ్చునట్టి దినమునందు ఛత్రమును ధరించవలయును.

## అథమంచ చక్రమాహ.

శ్లో॥ సూర్యర్క్షాద్విధుభాంత మేవగణయేచ్చత్వారిచత్వారిత। న్మూర్ధేశ్వత్రలిఖేచ్చ తుర్ష్వపితథాగాత్రేషు చైత్రికభం।మధ్యేసప్త వివిర్దిశేదతి సుఖంమూలేషు గాత్రేషుచే। ద్భీతింసత్సుతభాగ్యదం నిగదితంమంచాఖ్య చక్రంత్విదం ॥

తా॥ మంచాకార చక్రమునుగురించి చెప్పుచున్నాను. మంచఅనగా తెలుగున మంచము అనిచెప్పుదురు. చతురశ్రముగా మంచాకార చక్రమునులిఖించి దానికి నాలుగు మూలలనుండు కోళ్ళయొక్క దిగువభాగమందు నాలుగు నక్షత్రములను కోళ్ళకు పైభాగమందొక్కొక నక్షత్రమును మంచముయొక్కనడిమి ప్రదేశమందేడు నక్షత్రములు నుంచవలయును ఇట్లు మధ్యమ లిఖింపబడిన యేడునక్షత్రములకు ఫలమువిశేషసుఖము. నాలుగుకోళ్ళయొక్క దిగువభాగమందు లిఖింపబడిన పదహారు నక్షత్రములకు ఫలముభయము. శిరోభాగమందుగల నక్షత్రములకు ఫలము సత్పుత్రలాభము ఈప్రకారము మంచాకార చక్రముయొక్క ఫలము చెప్పబడినది కాబట్టి సూర్యుడుండెడి నక్షత్రముమొదలు నిత్యనక్షత్రమువరకు లెక్కపెట్టగావచ్చిన సంఖ్యను శ్లోకములో జెప్పబడిన సంఖ్యల వరుసప్రకారము లిఖించగా తానేర్పరచుకొనిన దినమునందుగల నక్షత్ర మెచ్చటనున్నదో విచారించి దానిఫలమును చూచుకొనవలయును. ఇట్లు చెప్పబడినదికాబట్టి తనకు మంచిఫలము నిచ్చునట్టి నక్షత్రమేదినమందు కలుగునో యాదినమందు మంచారోహణము జేయవలయును.

## అథనశర ధనుశ్చక్రమాహ.

శ్లో॥ జన్మర్క్షాంతమధార్క భాశ్చరముఖేషం చైవలాభశ్శరా। శ్చాబాణాజయమావి శన్శరధినుస్సంధి విష్వక్శ్నౌర్యకృత్। మందేభ

ద్వితయంతు భంగమితి తచ్చాపాగ్రయోఃపంచకం । హానిస్స్యాదితి చాపమనంతినశరం చాపాఖ్య చక్రంత్విదం ॥

తా॥ బాణముతోఁగూడిన ధనుశ్చక్రమును జెప్పుచున్నాను. బాణమునుసంధించియున్నట్టి ధనురాకారముగ చక్రమును లిఖించి యాచక్రములో బాణముయొక్కములికి యందైదునక్షత్రము లుంచవలయును ఫలము లాభము బాణముయొక్కమొదట నైదునక్షత్రము లుంచవలయును. ఫలము జయము ధనుస్సు బాణము కలిగిన సంధియందైదు నక్షత్రములుంచవలయును. ఫలము పరాక్రమమునిచ్చును ధనస్సుయొక్క దండమునందు రెండునక్షత్రము లుంచవలయును. ఫలము భంగము. ధనుస్సుయొక్క రెండు కొసలయందు అయిదైదు నక్షత్రములుంచవలయును. ఫలముహాని. ఇట్లు ఆయా సంఖ్యగల నక్షత్రములు ఆయా ప్రదేశములయందు లిఖింపబడినవగుచు నాయాఫలములు చెప్పబడినవి. కాబట్టి సూర్యనక్షత్ర మమొదలు జన్మనక్షత్రము పర్యంతము లెక్కపెట్టి యాసంఖ్యను శ్లోకములో చెప్పబడినప్రకారము అంకెలనుంచుమరాగా నేప్రదేశమునకు నామొత్తమునకు సరిపోవునో యచ్చటిఫలమును చూచుకొనవలయును. ఇట్లు లెక్కప్రకార మేమాసములో సూర్యస్థిత నక్షత్రమాదిగా లెక్కించుటవలన తనకు శుభఫలమగునని తెలియబడునో యామాసములోనే ధనుర్బాణములను ధరించి [illegible]విద్యను నేర్చుకొనవలయును.

## అథరథ చక్రమాహ.

శ్లో॥ తండేమధ్యగతేచ చక్రశిఖరాధోస్త్యం దనాగ్రేయుగే । సర్వత్రాగ్నిషడగ్ని షడ్గుణగుణాగ్ని స్సిద్ధిక్రీర్తిమృతిః। కల్యాణం ధనలాభభంగ సుఖదంచక్రేరథాభ్యేభవే । త్సాలేయారిగతోడుతస్స్వాజసనక్షాంతం సుధీర్విన్యసేత్ ॥

తా॥ రథచక్రమునుగురించి చెప్పుచున్నాను. రథము నెక్కతలచినవాడు తనకు శుభఫలము కలుగునట్టి దినమునందే యెక్కవలయును. అది యెట్లనగాముందు గారథాకారమగు చక్రమునువేసి రథములో మధ్యగానుండు స్తంభమునందుమూడు నక్షత్రములును చక్రముల యందారునక్షత్రములును శిఖరమందు మూడు నక్షత్రములును రథమునకు క్రిందిప్రదేశ మందారునక్షత్రములును రథముయొక్క పైయంతస్తునందు మూడునక్షత్రములును కాడియందు మూడు నక్షత్రములును రథము చుట్టును మూడు నక్షత్రములును లిఖింపవలయును. పిమ్మట సూర్యుడుండు నక్షత్రము మొదలు తన నక్షత్రమువరకు లెక్కపెట్టి యామొత్తమును పైనచెప్పబడిన సంఖ్యల [illegible]

ప్రకారము చూచుకొనగా నే ప్రదేశములో మొత్తము సరిపోవునో దానిఫలమును చూచుకొనవలయును. వాటికి ఫలమేమనగా 3-6-3-6-3-3-3 ఇట్లు సంఖ్యలవరుస ప్రకారము సిద్ధి, కీర్తి, మృతి, శుభము, ధనలాభము, భంగము,సుఖము అని ఫలములు వరుసగా చెప్పబడినవి. కాబట్టి యేదినము తనకు మంచిఫలము కలవియగునో విచారించి యాదినమునందు రథారోహణము జేయవలయును.

అణతిలసర్షపనారికేళాదీనాంఘూణా చక్రమాహ.

శ్లో॥ చంద్రదర్క్షాంత మినర్క్ష తోఽహి గణయేన్నందత్రికానిస్యురి। త్యేవంహానిమథోవిభూతి మరుజంనాశనం ధనాయంతతః।రాజోపద్రవ నిర్ధనత్వ మృతిదంసౌఖ్యం క్రమాత్తత్ఫలం । ఘూణాచక్రమిదంతిలాది మధనేస్యాన్నారికేళాదిషు ॥

తా॥ గానుగచక్రమునుగురించి చెప్పుచున్నాను. నువ్వులు కొబ్బరి ఆవాలు మొదలగువాటినితొక్కి నూనె తీయుటనుగురించి గానుగాడెదరు కాబట్టి మంచి చూచు విషయమెట్లనగా ఇరువదేడు నక్షత్రములను మూడు మూడుచొప్పున చూచుకొనగా తొమ్మిది మూడులుండును. వాటికిఫలము. హాని, ఐశ్వర్యము, ఆరోగ్యము, నాశనము, ధనలాభము, రాజభయము, దరిద్రము, మరణము, సౌఖ్యము, అని ప్రతి మూడు నక్షత్రములకు వరుసగా చెప్పబడినది. కాబట్టి సూర్యుడుండు నక్షత్రము మొదలు చంద్రస్థిత నక్షత్రముపర్యంతము అనగా నిత్యనక్షత్రమువరకు లెక్కపెట్టి యామొత్తమును మూడు మూడుచొప్పున చూచుకొనగా నేమూడింటిలోనుండునో దానిఫలమును విచారించుకొనవలయును. కాబట్టి మంచిఫలము కలుగునట్టి నక్షత్రము గల దినమందు గానుగను ప్రారంభించవలయును.

అథఇక్షుఘూణా చక్రమాహ.

శ్లో॥ సూర్యర్క్షాద్విధుభాంత మేవగణయేద్వేదాశ్వి నేత్రేం దవో। బాణేష్వశ్విరసాః క్రమాత్ఫలమథోశ్రీ హానిలాభోత్కటాన్। నాశంమృత్యు శుభేచదేహ కృశతాంవిత్తాధికం చోద్యతే । ఘూణా చక్రమిదం శుభర్క్ష సహితం చేక్షుద్రవేయోజయేత్ ॥

తా॥ చెఱకుగానుగవిషయమై చెప్పుచున్నాను చెఱకు గానుగనుగురించి4-2-2-1-5-5-2-6 అని యీ సంఖ్యలప్రకారము ఇరువదేడు నక్షత్రములను చూచుకొనవలయుననియు వాటికి ఫలము, సంపత్తు, హాని, విశేషలాభము, నాశనము,మృత్యువు, శుభము, శరీరక్షీణము, ధనాతిశయము, అనెడు ఫలములను పైచెప్పబడిన సంఖ్యలను

వరుసగా ఫలములను చూచుకొనవలయునని యున్నదికాబట్టి చెఱకురసమునుదీయుటా నుగురించి మంచిది చూచేవిషయములో సూర్యనక్షత్రమునుమొదలు నిత్యనక్షత్రము పర్యంతము లెక్కపెట్టి మంచిఫలము గలుగునట్టి దినమునందు చెఱకు గానుగాడుట ప్రారంభించవలయును.

## అథహల చక్రమాహః

శ్లో॥ సూర్యాధిష్ఠిత భాద్యుభాంతగణ నాత్రిత్ర్యగ్ని బాణా గ్నయో। బాణాగ్న్యగ్నిమితేష్వ సచ్ఛుభమ సద్భందాసతో సత్త్వ సత్। కల్యాణం క్రమతోహలాహ్వయ మిదంచక్రం స్మృతంశోభనం బీజావాపనకే తథానవకృషౌ యుక్తే శుభేతూక్తవత్ ॥

తా॥ హలచక్రమునుగురించి చెప్పుచున్నాను. అనగా నాగలి పూర్వము చెప్పినట్లుగానే సూర్యనక్షత్రము మొదలు నిత్యనక్షత్రము పర్యంతము లెక్కపెట్టవలయును 3-3-3-5-3-5-3-2 ఈసంఖ్యలు చెప్పబడినవి. అశుభము, శుభము, అశుభము, శుభము, అశుభము, శుభము, అశుభము, శుభము, ఇట్లు యెనిమిదిసంఖ్యలకు వరుసగా ఫలములు చెప్పబడినవి కాబట్టి విత్తులు జల్లునప్పుడును నూతనముగా వ్యవసాయ ప్రారంభమందును ఈహలచక్రమును పరిశీలించి మంచినక్షత్రముగానుండునట్టి దినమునందు ప్రారంభించవలెను.

## అథనౌకా చక్రమాహ.

శ్లో॥ అర్కాక్రాంత్రరణేరు పర్యరిమితం స్తంభేచనాళ్యాంత్రయం। వృష్ఠైకం త్వథపార్శ్వయో రసమితం శుక్కాణికేతుత్రయం। షణ్ణౌ కాంతరగంత్విదంహిగదితం నౌకాయాననిర్మాణయో।రూర్ధ్వాంతస్థిత భంద్విషట్ఛుభకరం త్వన్యత్త్వసత్స్యాభిజిత్ ॥

తా॥ సూర్యుడుండు నక్షత్రము మొదలు ఓడపైభాగమందు ఆరు నక్షత్రములును స్తంభమందు మూడు నక్షత్రములును పీఠవయందు 3 నక్షత్రములును ఓడకు వెనుకప్రక్కను 1 నక్షత్రమును రెండుప్రక్కలను మూడు మూడుచొప్పున 6 నక్షత్రములును చుక్కానియందు 3 నక్షత్రములును ఓడ లోపలిభాగమందు 6 నక్షత్రములును లిఖింపవలయును. ఓడపైభాగమందు 6 నక్షత్రములును ఓడలోపలభాగమందు 6 నక్షత్రములును శుభప్రదమైనవి. మిగిలిన నక్షత్రములు శుభకరమైనవి కావు. అభిజిత్తుతోకూడ 28 నక్షత్రములను లిఖింపవలయును. ఇట్లు నౌకాచక్రము చెప్పబడినదికాబట్టి యోడప్రయాణము జేయుటయందుగాని ఓడనునిర్మించుటయందు గాని మంచిఫలమునిచ్చునట్టి నక్షత్రముగల దినమందు ప్రారంభించవలయును.

## అథదీపికా చక్రమాహ,

శ్లో॥ వహ్న్యృక్షాద్దినభాంతకంఠగణనేబాణాముఖేపూజ్యతా కంఠేస్యుర్నవలాభదాః ప్రభుమృతేర్మధ్యే గజాదండకే। బాణారాజ్యకరాఃక్రమాత్ఫల మిదంస్యాద్దీపి కాఖ్యంస్మృతం। చక్రంనూతనదీప భాజన వినిక్షేపేత్వవశ్యం శుభం॥

తా॥ దీపికాచక్రమునుగురించి చెప్పుచున్నాను. దీపస్తంభాకారముగ చక్రమునువేసి చివరను ౫ నక్షత్రములును కంఠమందు ౯ నక్షత్రములును మధ్యప్రదేశమందు ౮ నక్షత్రములును దండమందు ౫ నక్షత్రములును లిఖింపవలయును. వాటికి ఫలము గౌరవము. లాభము యజమానుని మరణము రాజ్యప్రాప్తిఅని పైనచెప్పబడిన సంఖ్యలకు వరుసగా ఫలముచెప్పబడినది. కాబట్టి క్రొత్తగా దీపస్తంభముమీద దీపము పెట్టదలచి మంచి ఫలమునిచ్చునట్టి నక్షత్రముగలదినమునందు ప్రారంభించవలయును. కృత్తికా నక్షత్రము మొదలుకొని నిత్యనక్షత్రము పర్యంతము లెక్కపెట్టవలయును. అభిజితు ఈచక్రమునందు చెప్పబడలేదు.

## అథకూపవాప్యాది చక్రమాహ.

శ్లో॥ చక్రాంతర్విధి భాత్త్రిభంతు విలిఖేత్తస్వచ్ఛ పూర్వాదిషు। త్వేవంసంగణితేతి శీఘ్రజలదంత నిర్జలంమధ్యమం। నీరాభావ జలాధికామృత జలక్షారోదనీరాన్వితం । మధ్యంస్యాద్విధు భాత్ఫలం భవతి తత్కూపస్య వాప్యాశ్చవా ॥

తా॥ నూతులు దిగుడుభావులు మొదలగువాటినిగురించి చెప్పుచున్నాను. నూతులు మొదలగువాటిని త్రవ్వించదలచికొనినప్పుడు మంచినీరు పడుటనుగురించి విచారింపవలయును కాబట్టి తదాకారముగ చక్రమునువేసి యాచక్రములో మధ్యను ౩ నక్షత్రములును తర్వాత తూర్పు మొదలు విదిక్కులతోగూడ నెనిమిది దిక్కులందును మూడుమూడు చొప్పున మధ్యనున్న నక్షత్రములతోగూడ నిరువదేడు నక్షత్రములను లిఖింపవలయును. వాటికి ఫలమెట్లనగా చక్రములోవేయబడిన నక్షత్రములు మొదలుకొని యీశాన్యదిక్కునందుండెడి నక్షత్రములు చివరలెక్కగా నుండునట్లు ప్రతి మూడునక్షత్రములకును దిగువ చెప్పబోవు ఫలములను చూచుకొనవలయును. శీఘ్రముగా జలముపడుట, జలము లేకపోవుట, సామాన్యజలము, జలములేకపోవుట విశేష జలముపడుట, తియ్యని నీరుపడుట, ఉప్పునీరుపడుట, మంచినీరుపడుట,

సామాన్యజలము అని యీప్రకారము ఫలములు చెప్పబడినవి. కాబట్టి చంద్రుడున్న నక్షత్రము మొదలుకొని లెక్కపెట్టుచు మంచిఫలము నొసగునట్టి నక్షత్రము వచ్చునట్టి దినమునందు ప్రారంభించవలెను.

అథ స్తంభ చక్రమాహ.

శ్లో॥ స్తంభాగ్రేరసభం మృతింత్వణసఖామధ్యేయశస్సంపదం। తన్మూలేభయుగం ధనక్షయ మపీనక్షాద్విధోర్భాంతకం। గేహారంభ తటాకవాపిఖనసేచా రామసంస్థాపనే। స్తంభస్థాపన మత్రకీర్తిసుఖదం వంశాభివృద్ధిం దిశేత్ ॥

తా॥ స్తంభప్రతిష్ఠనుగురించి చెప్పుచున్నాను. స్తంభప్రతిష్ఠను జేయునప్పుడు మంచివి విచారించవలయును కాబట్టి స్తంభాకారచక్ర మందు చివరను 6 నక్షత్రములను వ్రాయవలయును, ఫలము,మృతి మధ్యయందు 20 నక్షత్రములను వ్రాయవలయును. ఫలము, కీర్తిని సంపత్తునిచ్చును. స్తంభము మొదట రెండునక్షత్రములనువ్రాయ వలయును. ఫలము, ధనక్షయము. సూర్యనక్షత్రము మొదలుచంద్రు డుండు నక్షత్రమువరకు అభిజిత్తుతో కూడ లెక్కపెట్టవలయును. గృహమును కట్టబోవు సమయమందును చెరువులు దిగుడుబావులు త్రవ్వినప్పుడును తోటలు వేసినప్పుడును స్తంభప్రతిష్ఠను జేసినయెడల కీర్తియు సమస్తసంపత్తులు కలుగును వంశము వృద్ధినొందును.

అథద్వార చక్రమాహ.

శ్లో॥ ద్వారోర్ధ్వేభ చతుష్టయందిశతి తదాజ్యంతదంతస్త్రి యం। రాజ్యంకోణచతుష్టయేవసుమితం చోద్వాసకంశాఖయోః॥ అష్టావష్టవిభూతయో జలధయో మృత్యుంతుథో చక్రితో। ద్వారా ఖ్యంరవిభాద్దినోడుగదితం స్యాద్దేహళీస్థాపనే॥

తా॥ ద్వారచక్రమునుగురించి చెప్పుచున్నాను. ద్వారము యొక్క పైగుమ్మమందు అనగా ఊర్ధ్వభాగమందు నాలుగు నక్షత్ర ములనుంచవలయును. ఫలము రాజ్యము ద్వారముయొక్క నాలుగు కమ్ములలోపల 3 నక్షత్రములు నుంచవలెను. ఫలము రాజ్యము.

ద్వారముయొక్క నాలుగు కూసములయందును కూసమునకు రెండు చొప్పున 8 నక్షత్రముల నుంచవలయును. ఫలము కాపురము లేకుండ జేయును. ద్వారముయొక్క నిలువుకమ్ములు రెండింటియందును రెండు 4 గురు 4 నక్షత్రముల నుంచవలయును. ఫలము అష్టైశ్వర్యములు కలుగును. చక్రమునకు క్రిందిభాగమందు అనగా క్రిందిగుమ్మమందు నాలుగునక్షత్రములను వ్రాయవలయును. ఫలము మరణము నొసగును. ఈప్రకారము ద్వారచక్రము చెప్పబడినది. క్రొత్తగా ద్వారమెత్తుకొను సమయమందు ఈద్వారచక్రమును వేసి ఫలమును చూచుకొనవలయును. సూర్యనక్షత్రము మొదలు నిత్యనక్షత్రము వరకు లెక్కపెట్టవలయును.

## అగ్నిచక్ర శుద్ధిక్రమమ్

శ్లో॥ సైకాతార యుతాతిథిః కృతహృతా శేషేఽగ్ని భూనే సుఖం। భూనేత్రేధనవినాశనం రవిభతశ్చాచంద్ర భంత్రిత్రిభం। సూర్యజ్ఞాస్ఫుజిదార్కి చంద్రకుజ గుర్వగ్వంత్యాగై స్సచ్ఛుభే। పాపేసన్నవ చుల్లికాగ్రహ మఖాదిష్వగ్ని సంస్థాపనే ॥

తా॥ క్రొత్తగా పొయ్యి వేసినప్పుడు శాంతిసంబంధమగు హోమము జేయబోవునప్పుడును యజ్ఞములు మొదలగునవి జేయబోవునప్పుడును అగ్నిప్రతిష్ఠ నుజేసెదమయనైన చెప్పబడును. కాబట్టి తత్కాల తిథిసంఖ్యలో నొకటిజేర్చి దానిలో ఆదినమందు గలవార సంఖ్యనుకూడ కలిపి యామొత్తమును 4 చే భాగింపగా 3 గాని సున్నగాని (అనగా శేషము లేకపోవుట) మిగిలినేని సుఖముకలుగును. 1 గాని 2 గాని మిగిలినయెడల ధననాశనమగును. మరిఒకవిధ మెట్లనగా ఒక్కొక్క గ్రహమునకు మూడు మూడు నక్షత్రములచొప్పున 27 నక్షత్రములు 9 గ్రహములకు చూచుకొనవలయును ఆ గ్రహములయొక్క వరుస యేవిధమవగా సూర్య, బుధ, శుక్ర, శని, చంద్ర, కుజ, గురు, రాహు, కేతు, అని యీవిధముగా గ్రహములకు వరుస చెప్పబడినది. కాబట్టి సూర్యుడుండు నక్షత్రము మొదలు చంద్రుడుండెడి నక్షత్రము పర్యంతము లెక్కపెట్టి యామొత్తమును మూడుమూడు చొప్పున పైన చెప్పబడిన గ్రహముల వరుసప్రకారము చూచుకొనగా నేగ్రహమునకు సరిపోవునో యా గ్రహఫలమును చూచుకొనవలెను. శుభగ్రహమైనయెడల శుభఫలమగును. పాపగ్రహమైనయెడల పాపఫలమగును. ఇట్లు నూతనముగా నగ్నిప్రతిష్ఠను జేయునప్పుడు చూడదగును.

## అథపేటికా చక్రశుద్ధిః

శ్లో॥ పేట్యాయామ విశాలయోర్వి నిహతిర్భక్తాఖగైశ్శేష కే। త్వేకాదాతుఖగ త్రిమాత్రవిముఖా స్స్యుఃఖేచరా స్తత్ఫలం।సౌమ్యా సౌమ్యవశాచ్ఛుభాశుభమితి స్యాదంగుళాద్యేనవై । యత్రస్యాద్ద్వియవాధికంధ్వజ ఇహోష్టాస్స్యుర్యవా అంగుళే ॥

తా॥ పేటికా చక్రమునుగురించి చెప్పఁబడును 'పేటికయనగా పెట్టె' పెట్టె యొక్క పొడవును వెడల్పుచేగుణించి 9చే భాగింపగా 1 మొదలుకొని 9వరకునేదో యొకటి శేషము మిగులును. కాబట్టి సూర్యుని మొదలు కేతువుపర్యంతము తొమ్మిది గ్రహములలో నేదోయొక గ్రహమగును. రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని, రాహు కేతువులు గ్రహముల వరుసప్రకారము చూచుకొనవలయును. శుభ గ్రహమైనయెడల శుభమగును. పాపగ్రహమైనయెడల దుష్టఫలమగును. ఇక్కడ గణితమువిషయమై అంగుళములచే గుణించవలయును గాని గజములు అడుగులు ప్రకారముకాదు. ఇట్లు గుణింపగా రెండు యవలధికముగానుండి నేని ధ్వజాయమగును. అంగుళమునకు 8 యవలనిచెప్పిరి.

## అథగ్రామార్వణ చక్రమ్.

శ్లో॥ చక్రంసావయవం నరాకంతమిదం సంలిఖ్యతద్గ్రామభా। త్స్వర్క్షాంతంశిరసీషవో చసచయం తన్నాశమాస్యేత్రయం । హృద్యష్టాథనదారసాయదిపదోర్నిస్వం విధుఃపృష్ఠగః। ప్రాణాపాయమధో శ్రియం జలధయో వస్త్రాతుగుహ్యేద్వయం ॥

శ్లో॥ పీడాంచైవభియం దిశేదథకరేసాద్ధక్షిణేవాహకే। త్వేకైకంబహులాభకృద్భవతి తద్దారిద్ర్యమేవం క్రమాత్ । కస్మింశ్చిన్నగరేథవాజనపదే వస్తుంయదీచ్ఛేన్నర । స్సంపీక్ష్యైవ మథోవిశేద్యదిసుతార్థాయశ్రియశ్చాప్నుయాత్ ॥

తా॥ గ్రామార్వణ చక్రమునుగురించి చెప్పఁబడును- మనుష్యునకు కలిగినట్టి యవయవములతోగూడ నున్నట్టి నరాకారమగు చక్రమునులిఖించి శిరస్సునందుర్ నక్షత్రములును ముఖమునందు 3 నక్షత్రములును హృదయమందు 5 నక్షత్రములును ఒక్కొక్కపాదమందు 3 నక్షత్రములు చొప్పున రెండు పాదములయందు 6 నక్షత్రములును పృష్ఠభాగమందు 1 నక్షత్రమును నాభియందు 4నక్షత్రములును గుహ్యమందు 2 నక్షత్రములును కుడిచేతియందు 1 నక్షత్రమును ఎడమచేతియందు 1 నక్షత్రమును

లిఖించవలయును. వీటికి ఫలము పైనచెప్పబడిన సంఖ్యల వరుసప్రకారము చూచు కొనవలయును. 5 ధనవృద్ధి, 3 ధననాశనము, 5 ధనము, 6 దారిద్ర్యము, 1 ప్రాణాపాయము, 4 సంపత్తు, 2 పీడ, భయము, 1 బహులాభము, 1 దారిద్ర్యము, ఇట్లుఫలములు పైనచెప్పబడిన అవయవములందు లిఖించబడిన నక్షత్రములకు వరుసగాచూచు కొనవలయును. గ్రామనక్షత్రముమొదలు తన నక్షత్రమువరకు అభిజిత్తుతోకూడ లెక్కపెట్టవలయును. ఇట్లు గ్రామార్వణమునుగురించి చెప్పబడినది కాబట్టి యేమనుష్యుడైనను క్రొత్తవా వేరొకగ్రామమునందుగాని పట్టణమందుగాని కాపురము చేయదలచినయెడల ముందుగా నర్వణమును విచారించి తనకు నర్వణప్రకారము మంచిఫలము నొసగునదియగునేని యాగ్రామములో కాపురము చేయనగును. అందువలన పుత్రులు ధనము ఆయుర్దాయము సంపత్తుమొదలగు సమస్తశుభఫలములు కలుగునని విద్వాంసులు చెప్పిరి.

## అథఉపనయన చక్రశుద్ధిః

శ్లో॥ జన్మర్క్షాద్గురుభాంతకం హిగణయేచ్ఛ్రకేతువట్వాకృతౌ। మూర్ధ్నిషుస్సుఖనం ముఖేత్రియ మపిస్వాచారహీనంవటుం। హృద్యేకం పిశునంకరోతి పదయోరష్టౌరుగార్తంక్రమా। ద్దండేభద్వితయం సువర్చస మథాష్టౌచాజినేపండితమ్ ॥

తా॥ ఉపనయన చక్రమునుగురించి చెప్పబడును. ఉపనయనము చేయదలచిన పిల్లవాని యాకారముగ నొకచక్రమునువేసి యాచక్రములో శిరస్సునందు 5 నక్షత్రములు, ముఖమునందు 3 నక్షత్రములు హృదయమందు 1 నక్షత్రము పాదములు రెండింటియందు రెండు నాలుగులు యెనిమిది నక్షత్రములు దండమునందు 2 నక్షత్రములు కృష్ణాజినమందు 8 నక్షత్రములును లిఖించవలయును. వీటికి ఫలములు పయిన చెప్పబడిన వరుసప్రకారము 5 నక్షత్రములు సుఖముకలవానిగాను 3 నక్షత్రములు తన కులాచార ధర్మమును విడచినవానిగాను 1 నక్షత్రము కుటిలస్వభావముకలవానిగాను 8 నక్షత్రములు రోగముచే పీడింపబడువానిగాను 2 నక్షత్రములు మంచి బ్రహ్మవర్చస్సుకలవానిగాను 8 నక్షత్రములు పండితునిగాను ఉపనయనవటువునకు ఫలము జెప్పవలయును. ఇట్లు పయిన చెప్పబడిన అవయవములందుగల సంఖ్యలవరుసప్రాకారము క్రమముగ ఫలములను చూచుకొనవలయును. ఉపనయన వటువుయొక్క నక్షత్రముమొదలు గురువు నక్షత్రపర్యంతము లెక్కపెట్టవలయును.

## అథభూగత ధనశల్యాదులు నిర్ణయించు క్రమవిధిః

శ్లో॥ గేహాద్యేమపి భూగతం మణిధనాఢ్యాద్యం కిమస్తీతితత। ల్సద్య ప్రత్యయకారకం నిగతంచక్రింతు నిధ్యాహ్వాయం త్ర్యక్సం

చతధోర్ధ్వగావ సుమిత రేఖాలిఖేత్సాభిజి । త్వష్టావింశతి కోష్టకేషు లిఖతేష్వృక్షేషు తత్ప్రచ్ఛయా ॥

తా॥ భూమిలో రత్నములు ధనము శల్యములు మొదలగువాటిని తెలిసికొను టనుగురించి యెనిమిది శ్లోకములతో జెప్పుచు ముందుగా మూడు శ్లోకములతో చక్రము ను వేయుటనుగురించి చెప్పఁబడును. ఎవడైనను వచ్చి తనగృహము లోపలగాని మరియొకచోటగాని ధనము రత్నములు రాళ్లుశల్యములు మొదలగునవి యేవైనను న్నవాయని ప్రశ్న చేయగా నప్పుడు సిద్ధాంతి చక్రమునువేసి చూడవలయును. అదియెట్లనగా అడ్డముగా 5 రేఖలును నిలువుగా 8 రేఖలునుగీయగా 28 గళ్లుగల చక్రమగును ఆగళ్ళలో అభిజిత్తుతో కూడ లిఖింపవలయును. ఇట్లు లిఖింపగా ప్రత్యక్షముగా తెలిసికొనతగిన నిధిచక్రమని చెప్పలకుమన్నది.

## అధనక్షత్ర విన్యాసక్రమవిధిః

శ్లో॥ అంత్యాద్యేయమ వహ్నిభేపిత్ర్య భగాతాంచోత్తరా ఫల్గునీం। సప్తస్వేవభసప్తకం ప్రవిలిఖేత్తతాద్రిది పంక్త్యాంతతః।ఆహిర్బుధ్న్యమదైక పాచ్ఛతభిషగ్బ్రహ్మో రగేజ్యాఃకరో। ధోపంక్త్యామభిజిద్ధరిర్వసు మృగార్ద్రాదిత్య చిత్రాస్త్వథః॥

చాతుర్ధ్యామపి విశ్వతోయ దనుజజ్యేష్ఠాఖ్య మైత్రాఖ్యభేం। ద్రాక్షిస్వాతయవవ చక్రవశతస్సంచిత్య వస్త్వాదిశేత్। యామ్యాగ్న్యశ్విశివాదితీ గురుమఖాశ్రోషాభిజిద్రేవతీ। శ్రోణావిశ్వజలాజపాదితిమనూడుప్యేవచంద్రోవిభుః। శేషేష్వేవమనూడుష్వాష్ట కిరణోనాథోథతాత్కాలికా । సూర్యేందూనిధికారక కౌతుసవతస్త్వావక్ష్య మాణక్రమాత్ ॥

తా॥ పూర్వము చెప్పబడిన 28 గళ్ళ చక్రమునందు నక్షత్రములనుంచుక్రమము ను జెప్పబడును. పూర్వము చెప్పబడిన రేఖలప్రకారము నాలుగు పంక్తులుగా నేర్పడును కాబట్టి మొదటిపంక్తిలో 7 గళ్ళలోను రేవతి, అశ్వని, భరణి, కృత్తిక, మఖ, పుబ్బ, ఉత్తర, అను నీయేడు నక్షత్రములును లిఖించవలయును. రెండవ పంక్తిలో 7 గళ్లలోను ఉత్తరాభాద్ర, పూర్వాభాద్ర, శతభిషము రోహిణి, ఆశ్లేష, పుష్యమి, హస్త ఈ 7 నక్షత్రములను లిఖించవలయును. మూడవపంక్తిలో 7 గళ్ళలోను అభిజిత్తు, శ్రవణము, ధనిష్ఠ, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, చిత్ర, ఈ నక్షత్రములను లిఖించవలయును. నాల్గవ పంక్తిలో 7 గళ్ళలోను ఉత్తరాషాఢ,

పూర్వాషాఢ, మూల, జ్యేష్ఠ, అనూరాధ, విశాఖ, స్వాతి, ఈ 7 నక్షత్రములను లిఖించవలయును. ఇట్లు లిఖింపబడిన చక్రమునుబట్టి ప్రశ్న జేయబడిన వస్తువునుజెప్ప వలయును. మరియు భరణి, కృత్తిక, అశ్వని, ఆర్ద్ర, పునర్వసు. పుష్యమి, మఖ, ఆశ్రేష, అభిజిత్తు, రేవతి, శ్రవణము, ఉత్తరాషాఢ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర ఈ14 నక్షత్రములకు చంద్రుడధిపతియనియు మిగిలిన 14 నక్షత్రములకు సూర్యుడధిపతి యనియు నిట్లు తాత్కాలిక సూర్యచంద్రులను నిధికర్తలనుగా జెప్పిరి కాబట్టి ముందు చెప్పబోవు ప్రకారము తాత్కాలిక రవి చంద్రులను సాధించి దానివలన ప్రశ్న జేయ బడిన విషయమును నిర్ణయించి చెప్పవలయును. (ఇందునుగురించి చక్రము వేయ వలయును.

## అథ తాత్కాలిక రవిచంద్ర సాధనమాహ.

శ్లో॥ ఆద్యంతం రవిభస్యహారక ఇతి స్యాత్తత్ప్రవేశాదిత । శ్చేష్టాంతం ఘటికావియద్రిద గుణాహారాప్త లబ్ధంతుభం । తచ్ఛేషాద్ఘటికావగాశ్వినిహతాష్షష్ట్యాప్త లబ్ధంహిభం । తద్యాతంత్వథ వర్తమానభగతం తాత్కాలికోర్కోభవేత్ । తత్కాలేందు రిహైవమిష్ట ఘటికాస్సప్తాశ్వి నిఘ్నాఃఖష । డ్భక్తాలబ్ధమిహోడవశ్చ ఘటికా శ్శేషోవినాడ్యః క్రమాత్ ॥

తా॥ తాత్కాలిక రవిచంద్రులను సాధించుటనుగురించి చెప్పబడును. సూర్యుడున్న నక్షత్రముయొక్క యాద్యంతఘడియలు. హారకమగును. సూర్యుడు నక్షత్రమందు ప్రవేశించినది మొదలు తమకు నవుసరమగు కాలమువరకునైన ఘడియను విఘడియలను 60చే గుణించి వెనుకటిహారమును దానిచే భాగింపగావచ్చు లబ్ధము నక్షత్రమగును. ఆమిగిలిన శేషమువల ఘడియలు 27చే గుణింపబడినవై 60చేత భాగింపగా వచ్చినలబ్ధము గతించిన నక్షత్రమగును. మిగిలినది జరుగుచున్న నక్షత్రములో గతించినదగును. యీనక్షత్ర ఘటికావిఘడియలు తాత్కాలిక సూర్యుడగును. తాత్కాలికచంద్ర విషయమెట్లనగా పూర్వప్రకారముగానే చంద్రుని నక్షత్రముయొక్క తమకు నవుసరమగు కాలమువరకు గతించిన ఘడియలు విఘడియలు 27 చే గుణించి 60చే భాగింపబడగా వచ్చిన లబ్ధము నక్షత్రములగును. ఇక్కడ శేషము క్రమముగ ఘడియలు విఘడియలు తత్కాల చంద్రుడగును.

## అథతత్కాల చంద్రోపరిరవ్యాదిగ్రహ దృష్టివశాన్ని ర్దిష్ట ద్రవ్యజ్ఞానమాహ.

శ్లో॥ తత్కాలేందురినాది దృష్టఇవ తద్ధేమంచ తారంతథా । తామ్రంపిత్తళకం సువర్ణమథతత్కాంస్యంచ లోహాంత్రపుః స్సీసం

యద్యపిఖేచరైస్తు బహుభిర్దృష్టో బహూన్యేవచే । దేకేనాపినవీక్షితః కిమపినాస్త్యేవేతివాచ్యంనిధౌ ॥

తా॥ తత్కాలచంద్రుడు సూర్యుడు మొదలగు నవగ్రహములచేత చూడబడుటవలన నిధిలోనుండు ద్రవ్యమును తెలిసికొనుటనుగురించి చెప్పుచున్నాడు. తత్కాల చంద్రుని సూర్యుడు చూచుచున్నయెడల బంగారము, చంద్రుడువలన వెండి, అంగారకుడు చూచెనేని రాగి, బుధుడు చూచెనేని యిత్తడి, బృహస్పతి చూచెనేనిబంగారము, శుక్రుడుచూచెనేని కంచు, శని చూచెనేని యినుము, రాహువు చూచెనేని తగరము, కేతువు చూచెనేని సీసము, యీ వస్తువులుండును. మరియు ననేక గ్రహములచే జూడబడెనేని నిధిలో ననేకవస్తువులుండునవియు నొక్కగ్రహమైనను జూడకుండినయెడల నొక్కటినైన నుండదనియు జెప్పవలయును.

## అథద్రవ్యాధార భాండస్వరూపజ్ఞానమ్.

శ్లో॥ చంద్రేసర్వ ఖగేక్షితేతు సుమహాభాండంలభేచ్ఛ్రీకరం । సూర్యక్షేయది హేమజంరజితజం స్థూలేందురాశౌస్థితే । భౌమక్షే యదితామ్రిజం బుధగృహేరత్నాఢ్యకంజీవభే । శైలంశుక్రిగృహే తుమృణ్మయమిదం తల్లోహజంమందభే ॥

తా॥ ద్రవ్యముండునట్టి భాండమును తెలిసికొన విషయములు చెప్పబడును. భాండమనగా కలశము, లేక కాగు తత్కాల చంద్రుడన్ని గ్రహములచేత జూడబడుచుండెనేని శోభస్కరమగునుంచి కాగుయుండును. తత్కాలచంద్రుడుసూర్యుని రాశియగు సింహముందుండినయెడల బంగారపు కాగనియు స్థూలచంద్రుని రాశియగు కర్కటకమందుండిన వెండికాగనియు మేష వృశ్చికములలోనుండిన రాగికాగనియు మిధున కన్యారాసులలోనుండిన రత్నఖచితమగు కాగనియు ధనుర్మీనములలోనుండిన రాతికాగనియు తులా వృషభ రాసులలోనుండిన మట్టికలశమనియు మకర కుంభములలోనుండిన యినుముతోజేయబడిన కలశమనియు నిట్లు తత్కాల చంద్రుడున్న రాశి యధిపతియొక్క స్వభావవర్ణగుణాదులనుబట్టి నిధిలోనుండు ద్రవ్యముతో గూడియున్న భాండమును తెలిసికొనవలయును.

## అథపృచ్ఛకోద్దిష్టభూమా నిధిద్రవ్యప్రశ్న.

శ్లో॥ భేతత్కాలవిధోస్థితౌ శశిరవీచేదస్తి చార్ధంరవేశ్చేచ్ఛాల్యంపరివర్తనే నతుతయోర్నావ్యత్రి కింవిద్యతే । చంద్రేకూ్రిరఖ

న్వితేయది నిధౌస్యంనోల భేతాన్యధా। చేదస్త్రత్రిశశాంక భుక్తల తఃఖాతం శరాద్యంభవేత్ ॥

తా॥ ప్రశ్న చేసినవాడు అడిగినట్టి ప్రదేశమందు ధనమున్నదా దేదాయని తెలిసికొనదగిన విషయమున్నా ఉన్నయెడల ఎంతలోతువ నుండినది చెప్పబడును. స్థూల చంద్రునియొక్క నక్షత్రమందు సూర్యచంద్రులున్నయెడల ధనముండును సూర్యుని నక్షత్రమందుండినయెడల శల్యములుండును సూర్యచంద్రులొకరి నక్షత్రములో నొకరు వ్యత్యయముగ నున్నయెడల నిచ్చటనేమియు లేదనిచెప్పవలయును. చంద్రుడు పాపగ్రహములతో కూడియుండినయెడల నిధిలోనుండు ధనము లభింపదనియు శుభగ్రహములతో కూడియుండినయెడల ధనము దొరకునని యును జెప్పవలయును. స్థూలచంద్రుడు తానున్నట్టిరాశిలో నెన్ని భాగములు భుక్తమైయుండునో అన్నిమూరలు జానలు మొదలగు ప్రమాణముగ నంతలోతున దొరకునని గోతియొక్క లోతునుకూడ తెలిసికొనవలయును.

## అథవివాహ చక్రశుద్ధిః

శ్లో॥ రేఖాస్సూర్ధ్వము ఖాశ్చతస్రిఃదితా స్తద్వచ్చతిర్యఙ్ముఖా। శ్చక్రంస్యాన్నవకోష్ఠకం పరిణయేర్కర్క్షాద్విధోర్భాంతకం। మధ్యేప్రాగనలాది దిక్షువిలిఖేత్త్రీణిక్రమాత్త్రీణివై। తన్మధ్యస్థితకోష్ఠగత్రిభమిదంహంత్యాశుతౌదంపతీ ॥

ప్రాగాద్యష్ట సుతత్రమాదతిశుభం తద్వంశహానింతతోవైధవ్యంకులవర్ధనం బహుఋణ వ్యాధీస్త్రియం జారిణీం। ఖాన్యాద్రేఖల సంవదశ్చకురుతే వైవాహీకంచాంద్రిభం। చైవం చక్రకదంబమద్రిపతినాశ్రనందినే భాషితం ॥

తా॥ వివాహచక్రమునుగురించి చెప్పబడును. నిలువుగా 4 రేఖలున్నూ అడ్డముగా 4 రేఖలున్నూ గీయగా 9 గళ్ళుగల చక్రముగును ఇది వివాహమునకుగురించి చెప్పిరి. మధ్యగడిలో 3 నక్షత్రములును తర్వాత తూర్పు మొదలు ఈశాన్యమువరకు గలనిమిదిగళ్లలోను యిరువైనాలుగు నక్షత్రములను మొత్తము 8 నక్షత్రములు చొ॥ 27 నక్షత్రములను వ్రాయవలయును. సూర్యుడుండు నక్షత్రము మొదలు వివాహము నిమిత్తమై యేర్పరచుకున్న చంద్ర నక్షత్రపర్యంతము లెక్కపెట్టి యీ మొత్తమును మూడు మూడు నక్షత్రముల చొప్పున మధ్యగది మొదలు ఈశాన్యపర్యంతము చూచుకొనవలయును. ఆగదులలోగల నక్షత్రములకు ఫలము. మధ్యగది దంపతులకుహాని. తూర్పు విశేషశుభము. ఆగ్నేయము దంపతుల వంశ

నాశనము, దక్షిణము, వైధవ్యము, నైరృతి, వంశవృద్ధి, పశ్చిమము విశేమరణమునొసగ మునుజేయును. వాయవ్యము, పెండ్లికూతురును వ్యభిచారిణిగాజేయును. ఉత్తరము ధాన్యము ధనమును కలిగించును. ఈశాన్యము సమస్తసంపత్తుల నొసగును. ఇట్లు 9 గదులయందు ఫలములు చెప్పబడినవి. కాబట్టి వివాహసంబంధమగు నక్షత్రము మంచి ఫలము నొసగునట్టి గదియందు కలదానిగా నాలోచించి సుముహూర్తము నేర్పరచుకొనవలయును. ఇట్లు సుముహూర్తములను గురించిన సమస్త చక్రములను సాంబమూర్తి నందీశ్వరునికొఱకు చెప్పెను.

అథవివాహ యోగ్యాయోగ్య సంబంధనిర్ణయః.

శ్లో॥ శ్వశురాణాంగణనేచ మాతులసతీం కుమారీగణే । తత్పుత్రాశ్చసుతాన్నపా వరిగణేపుత్రస్య తత్పుత్రికాం । దౌహిత్రీంనిజ సోదరస్యగురవేవా గర్పితాంకన్యకాం। ఆచార్యస్యసుతాం వివాహమఖిలాక్రితాంనకుర్యాత్ క్షితౌ ॥

శ్లో॥ భార్యాసహోదరసృపుతాంత ద్రైవభగినీ మాతుస్సవత్నాస్స్సుతా। స్తత్పుత్రీంచ పితృవ్యదా భగినీం తత్పుత్రికాంనోద్వహేత్ మాతుస్స్వసృసపత్ని పుత్రికసుతాం జ్యేష్ఠస్యభార్యాస్వసా। నోద్వాహ్యాధనసత్ని మాతృ విషయేత్రైపూరుషం నోద్వహేత్ ॥

తా॥ మామగారి వరుసగలవారిలో మేనమామయొక్క కూతురు, కుమార్తెలనే వరసగలవారిలో సోదరునియొక్క కూతురు, సోదరునియొక్క దౌహిత్రులు తనకుమార్తెను కోడండ్రుఅనే వరసగలవారియొక్క కూతురునితనపుత్రుడు,తనకూతురుయొక్క కుమార్తెను తనసోదరుడు, గురువునకు నిచ్చెదనని వాగ్దానము చేయబడిన కన్యకను, గురువుయొక్క కుమార్తెను, ఏప్రకారముగనైనను శుల్కముతీసుకుని యివ్వబడినకన్యకను వివాహము చేసికొనకూడదు. మరియు భార్యతోబుట్టువుయొక్క కూతురుతనకును, తల్లియొక్క తోబుట్టువును తనతల్లియొక్క సవతికుమాళ్ళకును, మరియువారికే తనతల్లియొక్క తోబుట్టువకుమార్తెలును, పినతండ్రి పెత్తండ్రులయొక్క భార్యతోబుట్టువు తనకును ఆమెయొక్క కూతురును పినతల్లి పెత్తల్లులయొక్క సవతికూతురును అన్నయొక్క భార్యతోబుట్టువు, వివాహము చేసికొనకూడదు. మరియు సవతితల్లియొక్క పితృవంశములో మూడుతరముల పర్యంతము వారిసంబంధమగు కన్యకను వివాహము చేసికొనకూడదు. ఇట్లు వివాహవిషయమై కూడని సంబంధములు చెప్పబడినవి.

ఇట్లు శ్రీ మహాకవి కాళిదాసుగారిచే రచియింపబడిన
జ్యోతిష సంబంధమగు నుత్తర కాలామృతము సంపూర్ణము.

శు. ల. కు. సు.